





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# సుజ్ఞాన బోధిని-నీతి కథలు



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

**గమనిక:** భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సుజ్ఞాన బోధిని

## (నీతి కథలు)



మూలము :

**శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి**

సరళీకరణ :

**ఎడ్ల బాలకృష్ణారెడ్డి**

2008

# సుజ్ఞాన బోధిని
(నీతి కథలు)

మూలము : శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి

సరళీకరణ : డా॥ ఎడ్ల బాలకృష్ణారెడ్డి
శ్రీమతి డా॥ జి. ఉషారాణి

ముద్రణ : మార్చి 2008

మూల్యము : రూ॥ 80-00

ప్రతులు : 1000

సర్వహక్కులు : ప్రకాశకులవి

వివరములకు : శ్రీ పూతలపట్టు నరోత్తమరెడ్డి,
4-1905/2, దుర్గానగర్ కాలని, చిత్తూరు.
ఫోన్ : 09440711784

ముద్రణాలయము : స్టూడెంట్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, తిరుపతి



ఈ పుస్తకము తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహకారంతో ముద్రించబడినది

**డా॥ ఎడ్ల బాలకృష్ణారెడ్డి**
**M.A., M.Phil., Ph.D.,**
**లెక్చరర్**

తెలుగు అధ్యయనశాఖ
ఎస్.పి.యస్. ప్రభుత్వ మహిళా కళాశాల
**చిత్తూరు - 517 002, (ఆం.ప్ర.)**

# ప్రవేశిక

శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు బహుముఖ ప్రజ్ఞాశాలురు. బహుగ్రంథకర్తలు. బహుభాషావేత్తలు. వారు విద్యార్థుల జ్ఞానవికాసానికి, నీతిబోధకు ఉపయుక్తంగా సుజ్ఞాన బోధిని అనే పేరుతో ఐదు సంపుటాలను వెలువరించినారు. బాలవినోదిని అనే పేరుతో మరో ఐదు సంపుటాలు నీతి కథలు రచించారు. అందులో 'సుజ్ఞాన బోధిని' నాలుగు భాగాలుగా 'బాలవినోదిని' ఒక భాగం మాత్రం లభ్యమైనాయి. గ్రాంథికంలో నున్న వాటిని సరళీకరించి, నేటు కాలానుగుణంగా రూపొందించమని శ్రీ పి. నరోత్తమరెడ్డి గారు (ట్రస్టు కార్యదర్శి) కోరినారు. అదృష్టంగా భావించి, లభ్యమైన భాగాలన్నింటిని ఒకే సంపుటిగా అందిస్తున్నాం.

ఇందలి ప్రతి వ్యాసం, ప్రతికథ ఒక ఆణిముత్యం. ఆంధ్రభాషామ తల్లికి చక్కటి మణిహారం. ప్రతి వ్యాసం విజ్ఞానంతోపాటు వినోదాన్ని అందిస్తాయి. మానవతా విలువలను పెంపొందించే నీతులను ప్రబోధిస్తాయి. మానవతా విలువలతోపాటు, మన సంస్కృతి, సాంప్రదాయాలను తెలుసుకోడానికి ఈ 'సుజ్ఞానబోధిని' ఎంతో ప్రయోజనకారి. జీవితానికి పనికి వచ్చే పలు అంశాలు దృష్టాంతాలతో వివరించబడ్డాయి. అవసరమైన చోట్ల నీతి పద్యాలు కూడా చేర్చియున్నారు. ఇందలి వ్యాసాలన్ని ప్రామాణికమైనవి. సారస్వత దృష్టితో కూడా విశిష్టమైనవి. పాఠశాల విద్యార్థులకు పాఠ్యాంశాలుగా కూడా పనికి వస్తాయి. ఆంధ్రేతర ప్రాంతాలలోనున్న తెలుగు వారికి కూడా ఎంతో ఉపయోగకారి. విద్యార్థినీ విద్యార్థులను ఆదర్శంగా తీర్చిదిద్ది ప్రగతి పథంలో నడపడానికి ప్రయోజనకారి. అందరూ చదవదగిన గ్రంథరాజమిది.

ఈ వ్యాసాలను సరళీకరించి ఎడిటింగ్ చేసే అవకాశం కల్పించిన శ్రీ పి. నరోత్తమరెడ్డి గారికి కృతజ్ఞతలు. ఈ యజ్ఞంలో నాతో పాటు పాలు పంచుకొని 'సుజ్ఞానబోధిని' ఒక భాగాన్ని సరళీకరించి త్వరగా పూర్తి చేయడానికి సహకరించిన శ్రీమతి డా॥ జి. ఉషారాణి గారికి ధన్యవాదములు

రసజ్ఞలోకానికి సవినయ సమర్పణమిది.

**- ఎడ్ల బాలకృష్ణారెడ్డి**

# సుజ్ఞాన బోధిని

విద్యార్థులకు బడియే గుడి. గురువు దైవంతో సమానం. విద్యార్థులు గురువు ద్వారా పాఠ్యాంశాలను అభ్యసించుటయేకాక వారి భావి జీవితాన్ని తీర్చిదిద్దుకొనే అంశాలన్నెంటినో నేర్చుకుంటారు. విద్యార్థులకు పాఠ్యాంశాలు బ్రతుకు తెరువునకుపకరించునవి కాగా తల్లిదండ్రులు, గురువులు, పెద్దల ద్వారా నేర్చుకొనే, తెలుసుకొనే అంశాలు వారి జీవితాన్ని తీర్చిదిద్దుతాయి. ముఖ్యంగా పిల్లలు బాల్యదశ నుండి నిబద్ధతతో, క్రమశిక్షణ, సత్ప్రవర్తన, భక్తితత్పరతలతో మెలగుచు ఎదగవలసిన ఆవశ్యకత ఎంతేని వుంది. విద్యతో పాటు జీవితం మహోన్నతంగా సాగుటకు వుపకరించే అంశాలు విద్యార్థి దశ నుండి పిల్లలకు నేర్పాలి. అందుకు తగిన మార్గాలను తల్లిదండ్రులు, గురువులు ఏర్పరచి వారికి సులభంగా అవగాహన కలుగునట్లు తెలియజెప్పాలి. ఇందుకు పిల్లలకు మన సంస్కృతికి ఆలవాలమైన పురాణాలు, నీతి శతకాలు, కథల ద్వారా మార్గదర్శకత్వం ఏర్పరచాలి. ముఖ్యంగా పిల్లలకు కథల ద్వారా చెప్పే సందేశం మనస్సుకు హత్తుకుంటుంది. పిల్లలు వారి భవిష్యత్తుకు ఉపయోగపడే విధంగా కథల్లోని సందేశాల ద్వారా మనలుకొని మనగలుగు తారు. అందుకే తల్లి ఒడి నుండి బడికి వెళ్ళేలోపే పిల్లలు కథలు, మంచి మాటలు వినడం ద్వారా నిర్మల మనస్కులుగా ఎదుగుతారు. కథలకు అంతటి బలం వున్నది.

నేటి ఆధునికయుగంలో కాలానుగుణంగా ఏర్పడిన మార్పులు, జీవన ప్రమాణాల వల్ల విద్యాభ్యాసం ఎంతో బాధ్యతాయుతంగాను, శ్రమతో కూడుకొని వుంటున్నది. ఈ సందర్భంగా (పిల్లలు) విద్యార్థులు చదువుకే పరిమితమై మన సంస్కృతిలోని విలువలపట్ల అవగాహన కోల్పోవుచున్నారు. సమాజం పోకడ గూర్చి, వారిని వారు ఎలా తీర్చిదిద్దుకోవాలనే అంశాల గూర్చి తెలియచెప్పేవారు, పరిస్థితులు తక్కువై ఇబ్బందులకు గురి అవుతున్నారు. ఈ పరిస్థితిని గమనించిన వారెందరో పెద్దలు తమవంతు కృషిగా పిల్లలకు పుస్తకాల ద్వారా సద్బోధనలు చేయుటకు ప్రయత్నిస్తూనే వున్నారు.

ఇలాంటి ప్రయత్నంలో భాగంగా పూతలపట్టు వాస్తవ్యులైన శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు రచించి "సుజ్ఞాన బోధిని" అనే గ్రంథం ద్వారా

విద్యార్థులకు వుపకరించే కథలను వెలువరించారు. ఇందులో 95 శీర్షికలతో సుగ్రాహ్యమైన అంశాలతో కథలను రచించి పిల్లలకు మానసికోల్లాసంతో పాటు, ఉపయుక్తమైన విషయాలను కథలుగా రచించారు. ఈ గ్రంథం గతంలో వెలునడి పాఠకలోకంలో విశేష ఆదరణను పొందినది. ప్రస్తుతం శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి మెమోరియల్ ట్రస్టు ద్వారా ప్రకటితమైన ఈ గ్రంథాన్ని తి.తి.దే. వారి ఆర్థిక భాగస్వామ్యంతో పునః ప్రకటించడానికి శ్రీ పూతలపట్టు సరోత్తమరెడ్డి గారు సంకల్పించడం ముదావహం.

ఈ "సుజ్ఞాన బోధిని" అనే గ్రంథ శీర్షికలోనే ఈ పుస్తకం యొక్క ప్రచురణలోని ముఖ్య వుద్దేశ్యం వెల్లడి అవుతున్నది. మొదటి కథా శీర్షికనే "తెలివి గలిగి మనుము" అనే కథతోనే పిల్లలకు ఆసక్తి కలిగించే విధంగా వున్నది. ప్రతి కథా శీర్షిక సూక్తులవలె విద్యార్థులకు కథలు చదవడంలో ఆసక్తిని కలిగించి, వారిలో నిబడీకృతమై వుండే ప్రతిభాపాటవాలను పదును పెట్టుకోవడానికి ఉపకరించునవే!

కొన్ని కథలకు వారు క్రోడీకరించిన పద్యాలు, శ్లోకాలు కూడా సందర్భోచితంగా, మనోజ్ఞంగా వున్నాయి. విద్యార్థులకు కథలు సులభంగా అర్థమయ్యే రీతిలో సరళశైలిలో రచించడం అభినందనీయ విషయం.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానమే పరమావధిగా భావిస్తున్న నేటి తరుణంలో ఇలాంటి గ్రంథాలను వెలువరించి విద్యార్థుల మానసిక వికాసానికి, అభివృద్ధికి తోడ్పడుచున్న శ్రీ పూతలపట్టు నరోత్తమరెడ్డి గారు అభినందనీయులు. ఉపాధ్యాయులుగా విద్యార్థుల పట్ల, సమాజం పట్ల బాధ్యతతో మెలగాలనే వారి సంకల్పం మరిన్ని సద్గ్రంథాలు వెలువరించడానికి నాంది కావాలని మా ఆశంస.

శుభాభినందనలతో
మేడసాని మోహన్
5/3/2002

**(డా॥ మేడసాని మోహన్)**
పంచసహస్ర అవధాని, తిరుపతి

**బి.యస్. రెడ్డి (భూమన్)**
సంచాలకులు

శ్వేత / శ్రీ వే.కే.గ్రం. మరియు
పరిశోధన కేంద్రం & శ్రీ వేంకటేశ్వర
డిజిటల్ లైబ్రరీ
**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**తిరుపతి - 517 502**

పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు మహామనీషి. ఉత్తమ రచయిత. పండితుడు. అంతటివారి పుస్తకాలకు ముందు మాటలు, పీఠికలు, అభిప్రాయాలు ఎబ్బెట్టుగా ఉంటాయి.

జీవితాన్ని దగ్గరగా చూసిన పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు ఇన్ని నీతి కథలు పోగుచేసి రాయటం ఆశ్చర్యంగానూ, అబ్బురపాటుగాను ఉంది. మనదేశపు సొత్తు నీతికథలు. అనాదిగా వాటికి ఎంతో ప్రాచుర్యం ఉంది. వాటి ద్వారా ఎందరో తమ జీవితాన్ని పరిపూర్ణం చేసుకున్నారు. సమాజంలో ఆదర్శప్రాయులుగా జీవించగలిగినారు.

పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు ఈ నీతి కథలు ప్రతి ఒక్కరికి ఎంతగానో ఉపకరిస్తాయి. ఇందులోని ప్రతి అంశం ఆలోచనాత్మకంగా వుంది. విజ్ఞానదాయకంగా ఉంది.

మా చిన్నపుడు ఎప్పుడో నేర్చుకన్న "ఆరోగ్యమే మహాభాగ్యము", 'పరోపకారి పాపన్న', 'పెద్దలను గౌరవించవలయును', 'సత్యమునే పలుక వలెను' - ఇలాంటి వెన్నో ఇప్పటికీ మాకు వెలుగు ప్రసాదిస్తున్నాయి.

వ్యక్తిత్వ వికాసం గురించి ఇవ్వాళ మనం పాశ్చత్య పండితుల వైపు మొగ్గుచూపటం చాలా విచారకరం. మన సుమతి శతకం, వేమన పద్యము, భర్తృహరి శతకంలాంటి వాటిల్లో లేని వ్యక్తిత్వ వికాసం ఇంకెక్కడన్నా ఉంటిందా. వ్యక్తిత్వ వికాసానికి ఈ 'సుజ్ఞాన బోధిని' నీతి కథలు బాగా ఉపకరిస్తాయని నా ప్రగాఢ విశ్వాసం.

ప్రతి ఒక్కరూ వీటిని చదివి ప్రయోజకులు కావాలని అకాంక్షిస్తున్నాను.

భూమన్
3/3/08.

# స్ఫూర్తి ప్రదాతలు

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
శ్రీమతి పి. విమల & శ్రీ కీ.శే. విజయశంకరరెడ్డి, పూతలపట్టు
శ్రీమతి పి. సుజాతమ్మ & శ్రీ కీ.శే. బి. భీమేశ్వరరెడ్డి, పూతలపట్టు
శ్రీమతి ఆర్. రేణుక & శ్రీ ఆర్. రామమూర్తిరెడ్డి, ముత్తిరేవుల
శ్రీమతి యమ్. రాధిక & శ్రీ యమ్. విజయకుమార్, హైదరాబాదు
శ్రీమతి కె. దేవకి & శ్రీ డా. భాస్కర్‌రెడ్డి, తిరుపతి
విద్యా విహార్ పాఠశాల, చిత్తూరు
శ్రీమతి పి. కల్పన & శ్రీ పి. వేణుగోపాల్, హైదరాబాదు
శ్రీమతి పి. శశికళ, శ్రీ పి. రవికుమార్‌రెడ్డి & బ్రదర్స్, పూతలపట్టు
శ్రీమతి జి. సుశీలమ్మ & శ్రీ జి. శ్రీరాములుశెట్టి, పూతలపట్టు
శ్రీమతి టి. భాగ్యలక్ష్మి, శ్రీ టి. సత్యనారాయణశెట్టి, పూతలపట్టు
శ్రీమతి యమ్. శైలజ & శ్రీ యమ్. తేజోమూర్తి, విజయం డిగ్రీ కాలేజి
శ్రీమతి వి. నందిని & శ్రీ వి. సతీష్‌బాబు, చిత్తూరు
శ్రీమతి యస్. రెడ్డెమ్మ & శ్రీ యస్. కృష్ణమూర్తిరెడ్డి, చిత్తూరు
శ్రీమతి యల్. గీత & శ్రీ సి. గుణశేఖర్‌రెడ్డి, చిత్తూరు
శ్రీమతి పి. సుకన్య & శ్రీ సి. సుబ్రమణ్యం, చిత్తూరు
శ్రీమతి యమ్.డి. వైదేహి & శ్రీ ఎ. కిరణ్‌కుమార్, పూతలపట్టు
శ్రీమతి పి. వసంత & శ్రీ పి. పట్టాభిరామస్వామిరెడ్డి, చిత్తూరు
శ్రీమతి కే.జి. పార్వతి & మ కె. నాగరాజు, వివేకానంద బి.ఇడి. కళాశాల
శ్రీమతి కె. ధనలక్ష్మి & శ్రీ కె. వెంకటరమణారెడ్డి, తిరుపతి
శ్రీమతి యస్. భారతి & శ్రీ పి. మధుసూదనరెడ్డి, చిత్తూరు
శ్రీమతి కె. జయంతి & శ్రీ యస్. నారాయణరెడ్డి, చిత్తూరు
శ్రీమతి యమ్. అంబుజ & శ్రీ యమ్. రూపశేఖర్‌రెడ్డి, తేనేపల్లి మిట్టూరు
శ్రీమతి యన్. సరోజ & శ్రీ యన్. చంద్రశేఖర్ రెడ్డి, చిత్తూరు
శ్రీమతి కె. రాజ్యలక్ష్మి & శ్రీ కీ.శే. కె. పార్థసారథిపిళ్ళై, చిత్తూరు
శ్రీమతి కె. నర్మద & శ్రీ కే. వాసుదేవరెడ్డి, చిత్తూరు
శ్రీమతి కె. హేమలత & శ్రీ యస్.ఏ. జయకుమార్, చిత్తూరు
శ్రీమతి ఎ. స్వరూప & శ్రీ ఎ. సుబ్రమణ్యంరెడ్డి బ్రదర్స్, పూతలపట్టు
శ్రీమతి ఎ. జ్యోతి & శ్రీ ఎ. రామమూర్తిరెడ్డి, పూతలపట్టు
శ్రీమతి ఎ. లలిత & శ్రీ ఎ. రామలింగారెడ్డి, పూతలపట్టు
శ్రీమతి యం. కళ్యాణసుందరి & శ్రీ యం. ఆంజనేయులు, చిత్తూరు
శ్రీమతి బి. జ్యోతి & బి. వెంకటరమణ, చిత్తూరు.

# 1. తెలివి గలిగి మనుము

ఒకనాడు ఒక పిల్లి ఒక గబ్బిలమును పట్టుకొనెను. నన్ను చంపకుము అని ఆ గబ్బిలము పిల్లిని వేడుకొనెను. నేను పక్షులను చంపక విడుచుటలేదు అని పిల్లి చెప్పెన.

నేను పక్షిని కాను. నన్ను బాగుగా చూడుము. నేను ఎలుకజాతిలో చేరిన మృగమును. నేను పక్షులవలె గ్రుడ్లు పెట్టను. పిల్లలను కందును. పాలిచ్చి పెంతును. నాకు పైనను క్రిందను రెండు వరుసలు పండ్లున్నవి చూడుము. అని గబ్బిలము పలికెను. పిల్లి దానిని విడిచిపెట్టెను.

మఱునాడు ఒక గుడ్లగూబ ఆ గబ్బిలమును పట్టుకొనెను. నన్ను చంపవలదు. విడిచిపెట్టుము. అని ఆ గబ్బిలము గూబను వేడెను. నేను మృగములను చంపక విడువను అని గూబ పలికెను.

నేను మృగము కాదు. నా ఱెక్కలను కనుగొనుము. మృగములకు ఱెక్కలు ఉండునా? నేను పక్షిని. మీ జాతిలో చేరినవాడను. నన్ను విడువుము. అని గబ్బిలము అడుగుకొనెను. గూబ దానిని విడిచిపెట్టెను.

ఈ విధముగా తెలివిగల గబ్బిలము పిల్లినోట పడక గూబనోట పడక తప్పించుకొనెను. బుద్ధి గలవారు ఇట్లే కష్టముల నుండి తప్పించుకొందురు.

## 2. కష్టపడువాఁడు సుఖించును

రంగఁడు ప్రతి దినము కోడి కొక్కొరొకో-కో అని కూయఁగానే లేచును. తన యజమానుని పొలమునకు పోవును. పగలంతయు సోమరిగా ఉండఁడు. కష్టపడి పనిచేయును. ఎంత గాలి వీచినను ఎంత ఎండ కాచినను రంగఁడు తన పని విడువఁడు. నీడకు పోయి కూర్చుండఁడు.

భోజనము వేళకు రంగనికి పరపర ఆఁకలి అగును. స్నానము చేయక ఎన్నఁడును రంగఁడు భుజింపఁడు. కష్టపడి అలసి ఉండుట చేత అతనికి రాత్రులలో హాయిగా నిద్ర వచ్చుచుండెను. రంగనికి ఏనాఁడును తలనొప్పి గాని జ్వరము కాని మఱి యేరోగము గాని రాలేదు. అతఁడు దేహమున బలము చాల కలిగియుండెను. అతని జీవితము నెమ్మదిగ జరుగుచుండెను.

రంగని యజమానుఁడు రామయ్య. రామయ్యకు తండ్రి సంపాదించిన ఆస్తి రెండు లక్షలు ఉన్నది. అతఁడు ఎక్కడకైన పోవలసినప్పుడు బండిలోనే పోవును. నడచి పోవఁడు. ఏపనియు చేయఁడు. ఎండలో తిరుగఁడు. సేద్యము చేయుటకు పనివాండ్రు కలరు. లెక్కలు చూచుకొనుటకును జాబులు వ్రాయుటకును గుమాస్తాలు కలరు. కాఁబట్టి అతఁడు కష్టపడి పనిచేయవలసిన అవసరము లేకపోయెను.

కష్టపడకపోవుటచేత రామయ్యకు తినిన అన్నము అఱుగుటలేదు. అఱుగకపోవుటచేత కడుపునొప్పి తలనొప్పి మొదలగు రోగములు వచ్చెను. నిద్ర రాలేదు. దేహము చెడిపోయెను.

తుదకు రామయ్య రంగని ఆరోగ్యమును చూచి కారణము తెలిసికొనెను. తానును కష్టపడి పనిచేయుటకు మొదలు పెట్టెను. రోగములు పోయెను. ఆరోగ్యము కలిగెను.

మనము కష్టపడి పనిచేయు చుండిన రోగములు రావు. సుఖపడుదుము.

# 3. పెద్దలమాట వినవలయును

అమ్మా! 'నాకు తినుటకు చిన్న వెన్నముద్ద తెచ్చిపెట్టుము. అని ఒకనాఁడు ఒక ఎలుక పిల్ల తన తల్లిని అడిగెను. ఈ దినము దొరకలేదు. రేపు తెచ్చి ఇచ్చెదను. అని తల్లి ఎలుక చెప్పెను. ఊహూఁ! నాకు ఇప్పుడే కావలయును. నీవు తెచ్చి ఈయవా? ఈయకున్న నేనే పోయి వెదకి తెచ్చుకొందును. అని చిన్న ఎలుక బయలుదేఱెను.

బిడ్డా! ఇంటి యజమానులు మనలను పట్టుకొనుటకు అక్కడక్కడ బోనులు ఉంచియుందురు. భద్రము. అని తల్లి చెప్పెను.

నాకు అంత తెలివిలేదా? అని నవ్వుచు చిన్నఎలుక వెన్నను వెదకుటకు పోయెను. ఇల్లంతయు వెదకెను. ఒకచోట వెన్నముద్ద కనఁబడెను. దానికి చాల ఆనందము కలిగెను. గంతులు వేసెను.

ఔరా! ఈ ఇంటివారు వెన్నముద్దను ఎక్కడదాఁచినారో చూడు. ఇనుప కమ్ములతో చిన్న ఇల్లు కట్టినారు. దానికి ఒక చిన్న తలుపు పెట్టినారు. ఆ ఇంటిలో వెన్నముద్దను భద్రముగా ఉంచినారు. అని దగ్గరకు పోయెను. ఓహో! తలుపును తెఱచి ఉంచినారే! మఱచిరేమో! అని ఎలుక పిల్ల లోపల దూఱెను. దూఱిన వెంటనే తలుపు మూసికొనెను. మరల ఎలుక పిల్ల బయటికి వచ్చుటకు చూచెను. ఆ చిన్న యింటిలో చుట్టి చుట్టి తిరిగెను. కాని లాభము లేకపోయెను.

ఆ చిన్న ఇల్లు ఏది? అదియే బోను.

పెద్దవారి మాటలు విననివారికి కష్టములు వచ్చును.

# 4. పాతిక సోమరి, అర సోమరి, నిండు సోమరి

సుబ్బరాయఁడు అను వానికి ముగ్గురు కొడుకులు ఉండిరి. వారు వేళకు బడికి పోరు. పోయినను చదువరు. ఇంటిలో కూడ వారు ఏదో ఒకటి కావలెను అని పోరుపెట్టుచుందురు. వారికి రెండు పనులే బాగుగా తెలియును. ఒకటి కడుపు నిండుగ తినుట. రెండు పండుకొని నిద్రపోవుట.

ఈ తూఁగుఁబోతు పెద్దమ్మలలో ఎవ్వఁడు మేటి సోమరి? తెలిసి కొనుము. అని సుబ్బరాయఁడు ఒకనాఁడు భార్యతో చెప్పెను.

మీలో మేటిసోమరిపోతు ఎవఁడో వాఁడు వచ్చి ఈ లడ్డును తీసికొన వచ్చును. అని తల్లి కొడుకులను పిలిచెను.

నేను అని పెద్దవాఁడు వెంటనే లేచి వచ్చెను.

నేను అని రెండవవాఁడు పండుకొనియే చెప్పెను.

మూఁడవవాఁడు ఏమియు పలుకలేదు.

ఏమిరా నాయనా! నీవు ఊరకున్నావు! నీకు వలదా లడ్డు? అని తల్లి వానిని అడిగెను.

అమ్మా! మాటిమాటికి నేను మాటలాడను. లేవను. నీకు ఇష్టమున్న ఇక్కడకు తెమ్ము. నా నోటపెట్టి పొమ్ము. అని చిన్నవాఁడు అనెను.

తల్లి వాని నోట లడ్డుండను పెట్టెను.

# 5. సోమరితనము పోయినకొలంది సుఖము కలుగును

ఒక కాంపువానికి ఐదుగురు కొడుకులు ఉండిరి. వారు ఎప్పుడు చూచినను పనిచేయక తిరుగుచుండిరి. వారి సోమరితనమును పొంఅందోల వలయును అని ఆ కాంపువాండు అనుకొనెను. ఒకనాండు అతండు కొడుకులను పిలిచి ఇట్లనెను.

నేను ముసలివాండను. పని చేయలేను. నేండో రేపో చనిపోవుదును. నేను చాల ధనము సంపాదించితిని. ఆ డబ్బును ఒక మామిడిచెట్టు క్రింద పూడ్చి పెట్టితిని. దానిని త్రవ్వి తెచ్చుకొనుండు. సుఖముగా జీవింపుండు. అని చెప్పెను.

ఏ చెట్టుక్రింద! ఏ చెట్టుక్రింద! అని కొడుకులు ఆత్రముతో అడిగిరి.

ఆ సంగతి నాకు సరిగా జ్ఞప్తిలేదు. ఏల అనంగా ధనము పూడ్చిపెట్టి చాలకాలము అయినది. మనకు ఉన్నవి డెబ్బది మామిడి చెట్లే. ఆ చెట్లు చెడకుండ వాని క్రింద త్రవ్వి చూడుండు. దొరకంగలదు. అని తండ్రి చెప్పెను.

ఆ కాంపువాని కొడుకులు సంతోషముతో మామిడి తోంటకు పోయిరి. అన్ని చెట్ల క్రిందను బాగుగా ఐదాఱు దినములు త్రవ్వి చూచిరి. ధనము కనంబడలేదు. మరలి వచ్చి ఆ సంగతి తండ్రితో చెప్పిరి. మఱియొకసారి చూడవచ్చును. అని తండ్రి వారికి సమాధానము చెప్పెను.

బాగుగా చుట్టును త్రవ్వుట వలన ఆ సంవత్సరమున మామిడిచెట్లు దండిగా కాచెను. ఆ కాయల వలన వారికి డబ్బు ఎక్కువగా వచ్చెను.

ఈ రీతిగా మూండేండ్లు ఆ కాంపువాండు కొడుకులకు ఆశ చూపి చెట్ల క్రింద త్రవ్వించెను. మామిడిచెట్లు బాగుగా పెరింగి దండిగా కాయలు కాచెను. ధనము కూడ ఎక్కువగా చేరెను. తండ్రి చేసిన ఉపాయమును కుమారులు తెలిసికొనిరి. సోమరితనము విడిచి పనిచేసిరి. ధనవంతులైరి.

# 6. మంచి మాటలు పలుకుము

ఒకనాఁడు కృష్ణుఁడు ఆటలాడుటకు వీథిలోనికి పోయెను. ఒక్కఁడే కొంతసేపు ఆడుకొనెను. చెండును నేలకు వేసి కొట్టెను. అది నేలకు తగిలి పైకి ఎగిరెను. దానితోడ కృష్ణుఁడు కూడ ఎగిరెను. హే! అని కేక వేసెను. హే! అని మఱొక కేక కృష్ణునికి వినఁబడెను. హేహేహేహే! అని కృష్ణుఁడు అఱచెను. హేహేహేహే! అని మరల వినవచ్చెను.

ఎవఁడో ఈ దేవళములో దాఁగినాఁడు. నన్ను బెదరించుటకు ఇట్లు పలుకుచున్నాఁడు. అని కృష్ణుఁడు అనుకొనెను. ఎవఁడురా నీవు? అని అఱచెను. ఎవఁడురా నీవు? అను శబ్దము మరల వినఁబడెను.

నీవు పోకిరివి. అని కృష్ణుఁడు అనెను.

నీవు పోకిరివి. అని వెంటనే వినవచ్చెను.

కృష్ణునకు కోపము వచ్చెను.

నిన్ను తన్నెదను. రా అని చెప్పెను.

నిన్ను తన్నెదను రా. అని మరల వినఁబడెను.

కృష్ణునకు భయము కలిగెను.

అతఁడు పరుఁగున ఇంటికి పోయెను. జరిగినది అంతయు తండ్రితో చెప్పెను. అతఁడు నవ్వెను. కుమారా! అది ప్రతిధ్వని. నీ మాటలే మరల నీకు వినవచ్చును. దేవళముల నుండి, కొండల నుండి, పెద్ద గుహలనుండి, కోనలనుండి అట్టి ధ్వని పుట్టును. అవి మన మాటలేకాని వేఱుకావు అనెను.

నాయనా! ఎవ్వఁడో నన్ను తిట్టినాఁడు. కొట్టెదను రా! అనినాఁడు. అని కృష్ణుఁడు ఏడ్చుచు చెప్పెను.

కృష్ణా! అది నిజముగా ప్రతిధ్వనియే. నీవు మొదట చెడుమాటలు చెప్పితివి. కాఁబట్టి నీకు చెడుమాటలు వినవచ్చెను. నీవు మంచిమాటలే పలుకుచుండుము. మంచి మాటలే నీకు వినవచ్చుచుండును. మంచిమాటలు మంచిని తెచ్చును. చెడుపలుకులు చెడుగును తెచ్చును. అని తండ్రి చెప్పెను.

అప్పటినుండి కృష్ణుఁడు ఎన్నఁడును తప్పు మాటలు పలుకలేదు. అతనికి తప్పు మాటలు వినరాలేదు.

# 7. పెద్దవారికి చేటు కలుగును

ఒక గొల్లవాని యింట ఒక కుక్క ఉండెను. దాని పేరు భైరవుఁడు అది రాత్రులలో గొఱ్ఱెలమందను కాచును. పగటిపూట కొంతసేపు నిద్ర పోవును. కొంతసేపు గొఱ్ఱెపిల్లలతో చెరలాట లాడుచుండును.

ఒకనాఁడు గొఱ్ఱెపిల్లను తినవలయును అని ఆసతో ఒక తోఁడేలు ఆ గొల్లవాని ఇంటి దగ్గఱకు వచ్చెను. అప్పుడు ఒక గొఱ్ఱెపిల్ల ఇంటికప్పు మీఁద ఉండెను. అది తోఁడేలును చూచెను.

ఇచ్చట ఉండకుము. నీవు దుష్టుఁడవు. పాఱిపొమ్ము. ఉంటివేని నిన్ను పొడిచి చంపెదను. అని గొఱ్ఱెపిల్ల చెప్పెను. ఆ మాటలకు తోఁడేలు నవ్వెను. కప్పుమీఁద ఉంటినికదా అని ఇట్లు పలుకుచున్నావా? ఏదీ దిగివచ్చి పొడువుము చూతము! అనెను.

నీకు మంచి మాటలు చెప్పుచున్నాను. నా మిత్రుఁడు నిన్ను చూచెనా ఇంతసేపు మాటలాడఁడు వెంటనే చంపి వేయును. పో. అని గొఱ్ఱెపిల్ల చెప్పెను.

ఓహో! నాకు నేఁడు రెండు గొఱ్ఱెపిల్లలు దొరకినవి. అని తోఁడేలు సంతోషించెను. నీ మిత్రుడు ఎక్కడ ఉన్నాడు? అని అడిగెను.

అదిగో! ఆ చెట్టుమొదట తొఱ్ఱలో నిద్ర పోవుచున్నాఁడు. అని గొఱ్ఱెపిల్ల పలికెను.

తోఁడేలు ఆనందముతో ఆ చెట్టుకడకు పోయెను. తొఱ్ఱ లోపల తల ఉంచెను. మిత్రుడా! రమ్ము అని పిలిచెను.

నిద్రపోవుచుండిన కుక్క వెంటనే లేచెను. తోఁడేలిని చూచెను. దాని మూతిని కఱచెను. తోఁడేలు చావు పరుగున, బ్రతికితినిరా దేవుఁడా! అనుచు పాఱిపోయెను.

# 8. మోసగాండ్రతోడ పొత్తు తగదు

ఒకప్పుడు ఒక నక్క ఒక ఎలుఁగుబంటి కలిసి ఒక పొలమును బాగుగా దున్నినవి. గింజలు చల్లుటకు తయారు చేసినవి. పండిన గింజలు మనము ఎట్లు పంచుకొందము? అని ఎలుఁగుబంటి అడిగెను.

ఇద్దఱము సమముగా పంచుకొందము. ఈసారి భూమికి పైభాగమున పండినది. నేను తీసికొనెదను. భూమి లోపలి భాగమున పండినది నీవు తీసికొనుము. రెండవసారి భూమికి లోపలి భాగమున పండినది నేను తీసికొనెదను. పైభాగమున పండినది నీవు తీసుకొనుము. అని నక్క చెప్పెను. ఎలుఁగుగొడ్డు సరే అని ఒప్పుకొనెను.

మొదటిసారి అవి జొన్నలు చల్లినవి. పంట పండినది. భూమికి పైభాగమునఉన్న పైరును వెన్నులను నక్క కోసికొని పోయెను. ఎలుఁగుబంటికి జొన్న వేళ్లు తప్ప మఱేమియు దొరకలేదు. అది చాల చింతించెను.

మఱుచటిసారి ఏమిపైరు చేయుదము అని అవి ఆలోచించినవి. ఈసారి వేఱుసెనగలు నాటుదము. అని నక్క చెప్పినది. సరే అని ఎలుఁగు ఒప్పుకొనినది.

వేఱుసెనగలు నాటినవి. కాయలు బాగుగా ఊరెను. భూమికి పైభాగమున ఉన్న కాఁడలు ఆకులు ఎలుఁగుబంటి తీసికొనెను. లోపల వుండిన కాయలన్నియు నక్క తీసికొనెను.

రెండు సారులును నక్కకే లాభము కలిగెను. ఎలుఁగుబంటి ఇట్లనెను. నీవు జిత్తులమారివి. నీతో పైరు చేసిన నాకు లాభము లేదు. కష్టము ఇద్దఱిది! ఫలము ఒక్కరిదా? నేను నీతో కూడి పనిచేయను అని చెప్పి టక్కర నక్క పొత్తు వదలెను.

# 9. నక్కజిత్తు

ఒకనాఁడు ఒక తోఁడేలు మేఁతకొఱకు తిరిగెను. ఒక నక్కను పట్టుకొనెను. ఓహో! మీరా! నక్కరాజుగారా! మహాబుద్ధిమంతులే మీరు! ఎట్లు నాచేత చిక్కితిరి! అని తోఁడేలు నవ్వుచు పలికెను. నక్క ఇట్లనియె.

నాచావునకై నేను చింతపడలేదు. నా బిడ్డలకు వెన్నముద్ద తెచ్చి యిచ్చెదను అని చెప్పి వచ్చితిని. వారు నాకొఱకు ఎదురుచూచుచుందురు. నేను పోకుండిన ఏడ్తురు. అని నాకు దుఃఖము అగుచున్నది.

వెన్నముద్దయా! ఎక్కడ ఉన్నది? ఎక్కడ ఉన్నది? అని తోఁడేలు అడిగెను.

ఏమీ! వెన్నముద్ద మీకును చాల ఇష్టమా? అని నక్క పలికెను.

ఔను. అది నాకు చాల ఇష్టమైన పదార్థము. ఇంత వరకు నేను దానిని వినినదేగాని, తినినదిలేదు. ఎక్కడ ఉన్నది వెన్న? అని తోఁడేలు ఆత్రముతో అడిగెను. కాఁపులు దానిని బావులలో దాఁచి ఉంచెదరు. నేను పోయి తెత్తునా? అని నక్క చెప్పెను.

ఓ! నన్ను మోసగించెదవా? నేను అంత తెలివిలేని వాఁడను కాను. నీవెంట నేవచ్చెదను పద. అని తోఁడేలు నక్క వెంట పోయెను.

రెండును ఒక బావియొద్ద చేరినవి. తొంగి చూచినవి. చంద్రబింబము నీటిలో అగపడెను. అదియే వెన్నముద్ద అని నక్క చూపెను. శీఘ్రముగా నాకు తెచ్చి ఇమ్ము అని తోఁడేలు నక్కను తొందఱపెట్టెను.

ఆ బావికి ఒక రాట్నము ఉండెను. అందలి చేఁత్రాడునకు రెండు కొనలయందును రెండు చేఁదలు (బక్కెట్టులు) కట్టఁబడియుండెను. ఒక చేఁదలో నక్క కూర్చుండఁగానే అది సరసర లోనికిపోయెను.

ఈ వెన్నముద్ద చాల పెద్దది. నేను ఎత్తలేను. నీవు వచ్చి నాకు సాహాయ్యము చేయుము. ఆ రెండవ చేఁదలో కూర్చుండుము. సులభముగా రాఁగలవు. అని నక్క తోఁడేలును పిలిచెను. తోఁడేలు రెండవ చేఁదలోనికి దుమికెను. వెంటనే సరసర బావి లోపలికి పోయెను. అది బావి లోపలికి పోవఁగా నక్క బయటికి వచ్చెను. వెలుపలికి దుమికెను. పాపము! తోఁడేలు బావిలోనే చచ్చెను.

# 10. పేరాశ కూడదు

ఒక ఊరిలో సుబ్బయ్య అని ఒకఁడు ఉండెను. అతఁడు చాల ధనము కలవాఁడు. ఆఁకలి అని వచ్చిన బిచ్చగాండ్రకు అన్నము కొంచెము కూడ పెట్టఁడు.

సుబ్బయ్య అప్పుడప్పుడు ఒక చీకటి గదిలో కూర్చుండును. ధనమును ఎత్తి ముందఱ పెట్టుకొనును. ఎంచుకొనును. మరల పెట్టిలో భద్రము చేయును. నాకు ఇప్పుడు ఒక లక్ష రూపాయలు ఉన్నవి. ఇంకొక లక్ష రూపాయలు ఉండిన బాగుగ ఉండును. అని అనుకొనుచుండును.

ఒకనాఁడు సుబ్బయ్య ఎప్పటివలెనే చీఁకటిగదిలో కూర్చుండెను. ధనమును ఎంచుకొనుచు ఉండెను. రెండు లక్షలు చేరలేదే అనుకొనుచు ఉండెను. అప్పుడు ధనదేవత అతనికి కనఁబడెను. సుబ్బయ్యా! నీకు ఎంత ధనము కావలెను. చెప్పుము ఇచ్చెదను. అనెను.

రెండు లక్షలు అడుగుదునా? కాదు కాదు. మూఁడు లక్షలు అడిగెదను. ఊహూఁ! చాలదు. ఐదు లక్షలు అడుగుదును. అనుకొనెను. కాని అతనికి ఆస యెక్కువ అయ్యెను. అతనికి అప్పుడు ఒక ఉపాయము తోఁచెను. మనస్సు కూడ దానికి సమ్మతించెను.

సుబ్బయ్య ధనదేవత కాళ్లమీఁద పడెను. లేచి నిలువఁబడెను. నేను దేని తాఁకిన అది బంగారము కావలెను. అని అడిగెను. అట్లే అగును అని చెప్పి ఆ దేవత మాయమై పోయెను.

సుబ్బయ్య సంతోషముతో ఉబ్బి గంతులు వేసెను. గోడలను తాఁకెను. అవి బంగారము అయిపోయెను. అతని ఆనందమునకు మితి లేకపోయెను. స్తంభములను తాఁకెను. అవియును బంగారు స్తంభములు అయ్యెను. ఇట్లే అతఁడు తన ఇంటిలో ఉన్న అన్ని వస్తువులను తాఁకెను. అన్నియును బంగారము అయినవి. ఆనందముతో అతఁడు ఒడలు మఱచి పోయెను.

భోజనము వేళ అయ్యెను. భార్య భోజనము చేయుటకు పిలిచెను. సుబ్బయ్య పీఁటమీఁద కూర్చుండి అన్నము మీఁద చేయి పెట్టెను. పీఁటయును అన్నమును బంగారై పోయినవి. వానికి చింత కలిగెను. త్రాగుటకు నీరు తీసుకొనెను. నోటిలో పోసికొనెను. ఆనీరు నోటిలోనే బంగారై గడ్డ కట్టెను.

ఇంక అతని నోటిలోనికి ఆహారము పోవుట ఎట్లు? తాను తాఁకినది తనకు తగిలినది కూడ బంగారు అగుచున్నది. అన్నము లేదు. నీరు లేదు. నాలుగు దినములు మలమల మాడెను. ధనదేవతను తలంచుకొని ఏడ్చెను. నాకు ఈవరము వలదు అని మొఱపెట్టెను. దేవత ఆవరమును తీసివేసెను. తరువాత సుబ్బయ్య సుఖపడెను.



# 11. ఉపాయముతో పనిచేయవలయును

ఒక బాటసారి ఎండలో నడచుచుండెను. అతఁడు మిక్కిలి దప్పిగొనెను. ఒక టెంకాయ తోఁటలోకి పోయెను. ఒక ఎలనీరుకాయ దొరకిన యెడల దప్పి తీర్చకొనవచ్చును. అని అనుకొనెను. ఒక చెట్టు మీఁదికి ఎగఁజూచెను.

ఆ చెట్లలో కొన్ని కోఁతులు ఉండినవి. వానిని చూడఁగానే ఆ బాటసారికి ఒక ఉపాయము తోఁచెను. ఒక ఱాయి ఎత్తుకొనెను. కోఁతుల మీఁద వేసెను. అవి అతనిని కోపముతో ఉఱిమి చూచినవి. గుఱ్ఱుమనినవి. అతఁడు మరల రెండు సారులు కోఁతుల మీఁద ఱాళ్లు విసరివేసెను.

కోఁతులకు కోపము హెచ్చెను. టెంకాయలను ఊడఁదీసెను. బాటసారి మీఁదికి విసరివేసెను. నాలుగు ఐదు నిముసములలో పది టెంకాయలు క్రిందఁబడినవి. బాటసారి సంతోషముతో రెండు టెంకాయలను కొట్టి నీరు త్రాగెను. దప్పి తీర్చుకొనెను. తన దారిని పోయెను.

# 12. న్యాయము తప్పిన నష్టమే అగును

నారాయణసెట్టి చాల యుక్తి కలవాఁడు. పిసినారి. చెప్పినమాట తప్పువాఁడు. అతఁడు ఒకనాఁడు పొరుగూరి నుండి ఇంటికి వచ్చుచుండెను. దారిలో ఆయన ఒక చెట్టు క్రింద కూర్చుండెను. ప్రక్కన నూఱు రూపాయల సంచిని ఉంచెను. మరల లేచునపుడు దానిని మఱచిపోయెను.

సెట్టి ఇంటికి వచ్చి చేరెను. సంచిని చూచుకొనెను. లేదు. మనసు అల్లాడెను. చెట్టు దగ్గఱకు పరుగెత్తి పోయెను. అక్కడ అది అగపడలేదు. ఇంక ఏమి చేయఁగలఁడు? అయ్యో! నా ధనమా! పోయితివా! అని ఏడ్చెను.

మరల ఆ సెట్టికి ఒక యుక్తి తోఁచెను. ఒక తోఁటి వానిని పిలిచెను. వానికి రెండు అణాలు ఇచ్చెను. తాను చెప్పినట్లు దండోరా వేయుమనెను. సెట్టిగారి రూపాయల సంచిని తెచ్చి యిచ్చిన వారికి పది రూపాయలు బహుమతి. అని తోఁటివాఁడు డప్పు వాయించుచు చాటించెను.

ఒక కాఁపువాఁడు ఆ సంచిని తెచ్చి సెట్టికి ఇచ్చెను. బహుమతి ఇమ్ము అనెను. సెట్టి ఈయలేదు. నా సంచిలో నూటపది రూపాయలు ఉండెను. ఇందు నూఱు రూపాయలే వున్నవి. పది రూపాయలు నీవే ఎత్తుకొన్నావు. పోపో అనెను.

ఇద్దఱును న్యాయాధికారి దగ్గరకు పోయిరి. అతఁడు వారి తగవును చక్కఁగా విచారించెను. సెట్టి తంత్రమును తెలిసికొనెను. కాఁపువాని గొప్ప బుద్ధిని గమనించెను. రూపాయల సంచిని తెప్పించెను. ఇది నూఱు రూపాయల సంచి. నీది కాదు. అని ఆసంచిని కాఁపువానికే యిప్పించెను.

అసలునకే మోసము వచ్చెనే అని ఏడ్చుచు నారాయణసెట్టి ఇంటికి పోయెను.



# 13. మంచికి మంచి, చెడ్డకు చెడ్డ

ఒకనాఁడు ఒక చెఱువుగట్టు మీఁద ఒక్క గొఱ్ఱె మేయుచుండెను. ఒక నక్క ఆ త్రోవను పోవుచుండెను. అది గొఱ్ఱెను చూడలేదు. తటాలున డీకొట్టెను. ఆ దెబ్బతో గొఱ్ఱె బెదరెను. చెఱువులో పడిపోయెను. ఆ చెఱువులో నీరు లేదు. బురద ఉండెను. ఆ బురదలో గొఱ్ఱె దిగఁబడిపోయెను. నక్క కూడా బురదలోనికి దొరలిపోయెను. దిగఁబడిపోయెను. అవి మరల బయటికి రాలేకపోయినవి. తలలు మాత్రము పైకి ఎత్తుకొనినవి.

అత్తా! నేఁడు మనకు చెడ్డదినము. ఇట్లు తగులుకొంటిమి. ఇంక పస్తుపడి యిట్లే చావవలసినదేకదా! అని నక్క చెప్పెను.

అల్లుఁడా! నీకువలె నాకు ఈ దినము అంత చెడ్డదినము కాదు. బురదలో దిగఁబడిపోవుట చేతనే నేను బ్రతికితిని. అని గొఱ్ఱె చెప్పెను.

ఇది ఎట్లు నీకు మంచిదినము? ఎట్లు నీవు గట్టు చేరగలవు? అని నక్క అడిగెను.

బురదలో పడుటచేత నీవు చంపలేవు. నా ప్రాణము దక్కెను. కొంతసేపటికి మా యజమానుఁడు నన్ను వెదకుకొని వచ్చును. నన్ను చూచి గట్టునకు ఈడ్చివేయును. కాని, నిన్ను మాత్రము చంపక విడువఁడు. అని గొఱ్ఱె బదులు చెప్పెను.

నాఁడు సాయంకాలము గొఱ్ఱెలకాఁపరి గొఱ్ఱెను వెదకుచు వచ్చెను. బురదలో దిగఁబడిన గొఱ్ఱెను చూచెను. బయటికి ఈడ్చివేసెను. నక్కను కూడ బయటికి ఈడ్చి వేసెను. కాని వెంటనే కఱ్ఱతో ఒక మంచి దెబ్బ కొట్టెను. ఆ దెబ్బతో ఒక కాలు విఱిగెను. కుంటుచు కుంటుచు నక్క పాఱిపోయెను.



# 14. కోపము విడిచిన కోనేటయ్య

పుణ్యస్థలములకు పోవుట అనిన కోనేటయ్యకు మిక్కిలి ఆశ. అతఁడు తిరుపతి, శ్రీకాళహస్తి, శ్రీశైలము, పండరీపురము, కాశి, ప్రయాగ, జగన్నాథము, కంచి, మధుర, రామేశ్వరము మొదలగు స్థలములకు పోయి దేవుని దర్శించి పూజించి అచ్చటి వేడుకలు చూచి మరలివచ్చెను.

కోనేటయ్య చూచివచ్చిన వింతలను తన స్నేహితుఁడైన సాంబయ్యతో చెప్పెను ప్రయాగకు పోయినవారు అచట ఏదైన ఒకటి వదలిపెట్టుట వాడుక. నీవు ఏది వదలితివి? అని సాంబయ్య అడిగెను.

కోనేటయ్య: కోపమును వదలితిని.

సాంబయ్య: ఏమేమి? కోపమునా?

కోనేటయ్య: అవును. కోపమునే.

సాంబయ్య: అది నిజమా? ఈ సారి చెప్పుము.

కోనేటయ్య: నా మాట నమ్మవా? నిజముగా కోపమునే విడిచితిని. నక్కజిత్తుల నారాయణయ్యవలె నేను రామ ములకకాయ విడిచితినను కొంటివా?

సాంబయ్య: నిజము నిజము! నీ సంగతి నాకు తెలియిదా? ఈ సారి చెప్పుము.

కోనేటయ్య: నీకు చెవుడా?

సాంబయ్య: ఆఁ! (అని మూతిని చిట్లించెను)

కోనేటయ్య: ఉన్నట్టుండి ఈ చెవుడు నీకు ఎక్కడనుండి వచ్చెను?

సాంబయ్య: దయచేసి కొంచెము బిగ్గఱగా చెప్పుము.

కోనేటయ్య: ఓరి చెవిటిమెగమా? కోపమును (అని అఱచెను)

సాంబయ్య: ఆఁ! ఏమంటివి? ఈ సారి మఱికొంచెము గట్టిగా చెప్పుము.

కోనేటయ్య: నీ పీక నులిమెదను. నా గొంతు నొచ్చుచున్నది. ఇఁక నేను చెప్పను.

సాంబయ్య: ఏమియు వినరాదా! కోపమునా? వదలితివా? నా మీఁదనా? నిజమే చెప్పుచున్నావు. నమ్మితిని.

కోనేటయ్య ఆ మాటలు విని సిగ్గుపడెను. మఱెప్పుడును కోపము విడిచితిని అని చెప్పలేదు



# 15. తెలివితక్కువ తిరుమలయ్య

తిరుమలయ్య చాల దైవభక్తి కలవాఁడు. ఒకప్పుడు ఆయన అడవికి పోయి తపస్సు చేసెను.

కొన్నాళ్లకు అతనికి దేవుఁడు కనఁబడెను. నీకు ఏమి వరము కావలయును అని అడిగెను. తిరుమలయ్య ఆనందముతో దేవునికి నమస్కారము చేసెను. నేను తాఁకిన ఎడల చచ్చినది బ్రతుకవలయును. అని కోరెను. అట్లే అగును అని దేవుఁడు వరమిచ్చెను.

తిరుమలయ్య ఆ వరము తీసికొని సంతోషముతో ఇంటికి మరలెను. దారిలో అతనికి ఒక చచ్చిన పులి కనఁబడెను. దేవుఁడు మనకిచ్చిన వరము నిజమా? అబద్ధమా? కనుఁగొనవలయును. అని తలంచి అతఁడు ఆ చచ్చిన పులిని తాఁకెను.

నిద్ర నుండి లేచినట్లు ఆ పులి గాండ్రించుచు లేచెను. తిరుమలయ్యను పట్టుకొని చంపివేసెను. పాపము! తిరుమలయ్య తెలివిలేని పని చేసెను. చనిపోయెను.

# 16. భయము కలుగు చోటికి పోరాదు

ఒక సింహము ముసలిది అయ్యెను. అందుతే అడవిలో తిరుగలేక పోయెను. కాఁబట్టి మృగములు దొరకకపోయెను. దానివలన పస్తుపడవలసి వచ్చెను. అట్లే కొన్ని దినములు పస్తుపడెను. తుదకు ఒక ఉపాయము పన్నెను.

సింహము గుహలో పండుకొని రోగపడిన దానివలె మూలుగుచుండెను. ఆ త్రోవలో పోవుచుండిన ఒక కుందేలు ఆ మూలుగును వినెను. గుహ దగ్గఱకు వచ్చెను. తొంగి చూచెను. సింహము కుందేలును చూచెను. పుణ్యాత్మా! రమ్ము. నా ప్రాణము పోవుచున్నది. కాపాడుము. అని వేడెను. అయ్యో! పాపము! అని కుందేలు దగ్గఱకు పోయెను. సింహము దానిని పట్టుకొనెను. చంపి తినివేసెను.

మఱునాఁడు ఒక గొఱ్ఱె ఆ త్రోవను పోయెను. సింహము మూలుగును వినెను. గుహలోనికి తొంగిచూచెను. లేవలేను. ప్రాణము పోవుచున్నది. లోనికివచ్చి నన్ను కాపాడుము. నీకు పుణ్యము వచ్చును. అని సింహము పిలిచెను. గొఱ్ఱె దాని మాటలు నమ్మి దగ్గఱకు పోయెను. సింహము దానిని చంపి తినివేసెను.

ఆ మఱుచటి దినమున ఒక నక్క ఆ త్రోవను వచ్చెను. మూలుగు వినెను. తొంగిచూచెను. వచ్చి నన్ను కాపాడుము. అని సింహము పిలిచెను. నక్క అటుఇటు చూచెను. నేను లేవఁజాలను. భయపడకు. రమ్ము. అని సింహము మరల పిలిచెను.

కుందేలును, గొఱ్ఱెయును గుహ లోనికి వచ్చిన అడుగుల జాడలు ఉన్నవి. కాని, మరల బయటికి వచ్చిన జాడలు లేవు. కాఁబట్టి నేను దూరముగా ఉండుటయే మంచిది. అని నక్క చెప్పుచు వెనుకకు మరలి పోయెను.



# 17. దూరాలోచన లేని దుర్వాసులు సెట్టి

దుర్వాసులుసెట్టి మోసగాఁడు. మంచి నూనెలో సెనగనూనె కలుపును. నేతిలో నూనె కలుపును. కొత్త సరకులో పాత సరకు కలుపును. ఒకనాఁడు అతఁడు రాజుగారికి ఒక వీసెఁడు నేయి యిచ్చెను. అందు సగము పాతనేయి కలిసి ఉండెను. కాఁబట్టి నేయి మంచి వాసనగా లేదు.

సెట్టి చేసిన మోసము రాజు తెలిసికొనెను. వెంటనే సెట్టిని పిలిపించెను. కోపముతో ఇట్లనెను. నీకు నూఱు రూపాయలు అపరాధము వేసితిని. ఈయలేని యెడల ఏఁబది కొఱడా దెబ్బలు తీసుకొనుము. అదియు తీసికోలేనియెడల నీవు ఇచ్చిన వీసెఁడు నేతిని త్రాగివేయుము. విడిచిపెట్టెదను, అనెను.

నూఱు రూపాయలు ఈయను. కొఱడా దెబ్బలు తినలేను. ఎట్లైన కష్టపడి నేయి త్రాగెదను. లాభమేకదా అని సెట్టి అనుకొనెను. నేయి త్రాగుటకే పూనుకొనెను.

ఎట్లెట్లో అఱవీసె నేయి త్రాగివేసెను. తరువాత ఒక్క చుక్కయైనను త్రాగలేకపోయెను. రూపాయలు ఇచ్చుటకు మనసు రాలేదు. దెబ్బలకే ఒప్పుకొనెను.

రాజు సేవకుఁడు కొఱడా తీసికొని పది దెబ్బలు కొట్టెను. ఎట్లో సెట్టి అంతవఱకు ఓర్చెను. మఱి తాళలేక పోయెను. ఓయబ్బా! వద్దురా తండ్రీ! నూఱు రూపాయలు ఇచ్చెదను దెబ్బలు తినలేను. అని మొఱపెట్టెను. నూఱు రూపాయలు అపరాధము చెల్లించి వేసెను.

పాపము! ఆ మూర్ఖుడు మూఁడు విధముల నష్టపడెను.



# 18. ఉన్నదానితో తృప్తి పడవలయును

గోపాలుడు అను బాలుఁడు ఒకనాఁడు మామిడి తోఁటలకు పోయెను. అక్కడ ఒక చెట్టు క్రింద ఒక మామిడిపండు పడి ఉండెను. సంతోషముతో గోపాలుఁడు దానిని ఎత్తుకొనెను చెట్టుపైకి ఎగఁజూచెను. కొనకొమ్మలో మఱియొక పండు కనఁబడెను.

రెండవపండుమీఁద గోపాలునకు ఆస కలిగెను. అతఁడు చెట్టు ఎక్క లేఁడు. ఎట్లు అది దొరుకును? అని చాలసేపు ఆలోచించెను. అపుడు అతనికి ఒక యుక్తి తోఁచెను.

క్రింద ఇటు అటు చూచెను. ఒక ఱాయి ఐనను అగపడలేదు. కడకు తన చేతిలో ఉన్న పండుతో చెట్టులో ఉండిన పండును గుఱిచూచి కొట్టెను. గుఱి తప్పిపోయెను. పండు పడలేదు. విసరివేసిన పండు దూరమున ఉండు ఒక ముండ్లపొదలో పడెను.

మరల కొన్ని మట్టిగడ్డలతో ఆ పండును కొట్టెను. దానికి తగులలేదు. చేతులు నొచ్చెను. గోపాలుఁడు అలసిపోయెను. చెట్టులోని పండు పడలేదు. చేతిలోని పండు పొదలో పడిపోయెను.

దొరకినదానితో దృప్తిపడి ఉండిన ఇంత కష్టము లేక పోవునుకదా! అందినదాఇని పాఱవైచి అందనిదానికి ఆసపడితిని. ఉన్నది కూడ పోయెను, అని చింతపడుచు గోపాలుఁడు ఇంటికి పోయెను.



# 19. పరుల నమ్మవలదు

రెండు బంగారు పిచ్చుకలు ఒక వరిపొలములో గూఁడు కట్టుకొనినవి. ఆ గూఁటిలో అవి గ్రుడ్లుపెట్టి పిల్లలు చేసినవి. ప్రతి దినము మేత తెచ్చి పిల్లలకు పెట్టుచుండినవి.

ఒకనాఁడు సాయంకాలమున పొలముకాఁపరి చెంగన్న అతని కొడుకులు ముగ్గురును పొలమును చూడవచ్చిరి. పొలము బాగుగా పండినది. రేపటికి కోయవచ్చును. అని చెంగన్న కొడుకులతో చెప్పెను. అట్లే కానిండు. రేపు కూలివాంద్రను పిలుచుకొని వచ్చి కోయింతము. అని కొడుకులు చెప్పిరి. తరువాత అందఱును ఇంటికి పోయిరి.

ప్రొద్దుపోయెను. పక్షులు గూఁటికి వచ్చెను. పిల్లలు ఆత్రముతో - అమ్మా అమ్మా! పొలము కాఁపులు వచ్చిరి. పైరు చూచిరి. రేపు తెల్లవాఱి కూలివాంద్రను పిలుచుకొనివచ్చి కోయించెదరఁట! మనము మఱెక్కడికైన పోదమా? అని చెప్పినవి. ఆ మాటలు పెద్దపిచుకలు వినినవి. భయములేదు. రేపు మరల వారు వచ్చి ఏమి మాటలాడుకొందురో విని చెప్పుడు అని చెప్పినవి.

మఱునాడు కాఁపులు పొలముకడకు వచ్చిరి. నేఁడు కూలివాంద్రు దొరకలేదు. రేపు ఎట్లైనను పిలుచుకొని రావలయును. అని మాటలాడు కొనుచు పోయిరి, పిచ్చుకపిల్లలు వారి మాటలను తమ తల్లిదండ్రులకు చెప్పినవి. భయములేదు. అని చెప్పి పెద్దపిచుకలు మఱునాడు బయటఁ మేఁతకై పోయినవి.

ఆ నాఁడు చెంగన్నయు కొడుకులును అచ్చటికి వచ్చిరి. కూలివాంద్రు దొరకుట కష్టముగా ఉన్నది. ఇంక పైరును నిలిపిన నష్టమగును. రేపు మనమే కొడవంద్రు తెచ్చి కోయుదము. అనుకొనుచు పోయిరి. ఆ మాటలు పిల్లలు చెప్పగా విని ఆ నాఁడే పిచ్చుకలు పిల్లలతో మఱొకచోటికి పోయినవి.



# 20. చెడుసావాసము చేయరాదు

ఒక రాజు కూఁతురు ఒక హంసను ముద్దుగా పెంచుచుండెను. అప్పుడప్పుడు ఒక కాకి ఆ హంస దగ్గఱకు వచ్చుచు పోవుచు ఉండెను. కొన్నాళ్లు జరుగఁగా రెంటికిని స్నేహము కుదిరెను.

నీవు ఎప్పుడును నగరి విడిచి బయటరావు. దేశము చూడకున్న మనకు బుద్ధి ఎట్లు ఎక్కువఅగును? నా తోడ రమ్ము. దగ్గఱగా ఉన్న ఒక వనమునకు పోయి వత్తము. అని కాకి హంసను పిలిచెను.

నేను రాను. నేను కనఁబడకున్న రాజకుమార్తె నా కొఱకు వెదకుచుండును. అని హంస చెప్పెను.

ప్రతిదినము కాకి అట్లే చెప్పుచుండుట చేత హంసకు ఒకనాఁడు కాకితో పోవ బుద్ధి పుట్టెను. అంచయు కాకియు కలిసి ఎగిరిపోయినవి. ఊరు దాఁటినవి. బాటప్రక్కను ఒక పెద్ద మఱ్ఱిచెట్టు కనఁబడఁగా దానిమీఁద వ్రాలినవి.

ఒక బాటసారి ఆ చెట్టుక్రింద చల్లని నిడను పరుండి నిద్రించుచుండెను. కాకి వానిని చూచి వానితలకు సూటిగా ఉండు కొమ్మమీఁదికి దాఁటెను. వెంటనే హంస - వలదు వలదు! నీవు చేయు పని నాకు తెలియును. అది పాపకార్యము. దానివలన మనకు ఆపదయు వచ్చును - అని చెప్పెను.

కాకి ఆ మాటలు వినలేదు. ఒక పుల్లను విఱిచి బాటసారి మొగముపై వేసెను. అతఁడు కన్నులు తెఱచి ఆవులించెను. అంతలో కాకి రెట్టవైచి ఎగిరిపోయెను. బాటసారి కోపముతో ఒక ఱాతిని ఎత్తుకొని విసరివైచెను. చుఱుకైన కాకి పాఱిపోయినది. ఱాతి దెబ్బ హంసకు తగిలినది. పాపము! దానికి ఒక కాలు విఱిగినది. హంస నొప్పితో నగరు చేరెను. అప్పటినుండి హంస కాకితో చేరలేదు.



# 21. ముఖస్తుతికి మోసపోకుము

రామకృష్ణయ్య చాల డబ్బు కలవాఁడు. డంబాచారి. అందఱును తన్ను మెచ్చుకొనవలెను అని తలంచువాఁడు.

వీరయ్య అను బీదకాఁపు రామకృష్ణయ్యకు నూఱు రూపాయలు ఇయ్యవలసి ఉండెను. అప్పు తీసికొని చాల కాల మైనది. తెచ్చి ఇమ్ము. అని రామకృష్ణయ్య వీరయ్యను తొందఱ చేయుచుండెను.

వీరయ్య అతని కంటికి అగుపడకుండ కొన్ని నాళ్లు తప్పించుకొని తిరుగుచుండెను.

ఒకనాఁడు వీరయ్య పెరటిత్రోవను బయలుదేఱి పొలమునకు పోయెను. అపుడు ఒక పశువు అతని పొలమున మేయుచుండెను. వీరయ్య పరుగుపరుగున పోయెను. ఆ పశువును చాల దూరము వఱకు తఱిమెను. అది బాటమీఁదుగా పరుగెత్తినది.

ఆ సమయమున రామకృష్ణయ్య గుఱ్ఱముపై సవారి చేయుచు ఆ బాటమీఁద వచ్చెను. అతనిని చూచి వీరయ్య చాల భయపడెను. తప్పించుకొనుటకు వీలులేదు. కడకు ఒక యుక్తి చేసెను.

దేవరవారు గుఱ్ఱపు సవారి యందు ఆరితేరినవారు. తమ గుఱ్ఱము మేలైన జాతిగుఱ్ఱము. చాల అందమైనది. గాలి కంటే వేగముగా పోఁగలదు. తమ గుఱ్ఱపు నేర్పును తమ సామర్థ్యమును నేను చూచి ఆనందించునట్లు తాము సవారి చేయవలయును. అని వీరయ్య రెండు చేతులు పేకెత్తి కేఁకలు వేయుచు చెప్పెను.

ఆ పొగడ్తలకు బేలుపోయి రామకృష్ణయ్య దుమ్ము మాత్రమే అగపడునట్లుగా గుఱ్ఱమును తఱిమెను. అప్పుల వాని పోరు తప్పెనని వీరయ్య ఇంటికి పోయెను.



# 22. చిన్ననాఁటి చదువు చెడదు

ఒక అడవిలో ఒక శ్రీగంధపు చెట్టు ఉండెను. ఒక చిలుక ఆ చెట్టులో గూఁడు కట్టుకొని ఉండెను. ఆ చిలుకకు రెండు పిల్లలు కలవు. ఆ పిల్లలను అది ప్రేమతో పెంచుచుండినది.

ఒకనాఁడు ఒక వేఁటకాఁడు ఆ చిలుక పిల్లలను పట్టుకొనెను. పాపము! తల్లి చిలుక చాల ఏడ్చినది! అయినను వాఁడు పిల్లలను విడువలేదు. వేఁటకానికి పక్షులమీఁద దయ కలుగునా?

వేఁటరి ఆ రెండు పిల్లలను చంపలేదు. ఒక పట్టణమునకు తీసికొని పోయెను. కసాయివానికి ఎనిమిది అణాలకు అమ్మెను. చిక్కములో నుండి బయటికి తీయునపుడు ఒక చిలుకపిల్ల ఱెక్కలు ఱెపఱెప కొట్టుకొనెను. ఎట్లో వేఁటకాని చేతినుండి తప్పించుకొని తుఱ్ఱుమని ఎగిరిపోయెను. వాఁడు పేద మొగముతో ఒకదానిని నాలుగు అణాలకు ఇచ్చి ఇంటికి పోయెను. కసాయివాఁడు ఆ పిట్టను పంజరములో పెట్టి సాకుచుండెను. తప్పించుకొన్న పిట్ట అడవికి పాఱిపోయెను. అక్కడ ఒక ఋషి ఉండిన తోఁటలో చేరినది.

కొన్నాళ్లకు తరువాత రాజశేఖరుడు అను విద్యార్థి వీథి వెంబడి పోవుచుండెను. అపుడు కసాయివాని చిలుక – సేరు ఆఱణాలు. డబ్బిచ్చిపో. లేకున్న మూతిమీఁద కొట్టెదను. ఇది కొవ్విన పొటేలు మాంసము! రా రా! – అని పలుకుచుండెను. మఱునాడే రాజశేఖరుఁడు ఋషి వనమునకు పోయెను. అక్కడి చిలుక అతనిని చూచి – దయచేయుఁడు. దప్పి తీర్చికొనుఁడు. సత్యము పలుక వలయును. ధర్మము విడువకూడదు. మోసము చేయరాదు. ఇతరులను బాధింప రాదు – అని పలికెను.

ఆ రెండు చిలుకలు అట్లు మాట్లాడుటకు కారణమేమి? అని రాజశేఖరుడు ఋషిని అడిగెను. నీవు చూచినవి రెండును ఒక తల్లి పిల్లలే. అయినను చిన్నతనమందే ఒకటి కసాయి వానియొద్ద చేరి వాని మాటలు నేర్చికొనినది. రెండవది ఈ వనములో చేరి మా మాటలు నేర్చికొనినది. బాలురు కూడ ఇట్లే మంచివారితో సావాసము చేసిన మంచి వారగుదురు. చెడ్డవారితో సావాసము చేసిన చెడ్డవారు అగుదురు. అని మునీశ్వరుడు చెప్పెను.

# 23. తల్లిదండ్రుల మాట వినాలి

**"తల్లిదండ్రుల నుడివిను తనయునకును**
**ముదము కీర్తియు సౌఖ్యము లొదవుచుండు**
**నెల్లవిధముల సద్గుణముల్లసిల్ల**
**వారికడగి వర్తింపంగ వలయు సుతుడు".**

తల్లిదండ్రులు పిల్లలకు ప్రత్యక్షదేవతలు. వారి మాటలను పిల్లలు వినాలి. తమ మాటలు వినే పిల్లలపై తల్లిదండ్రులకు ప్రీతి మెండు. తల్లిదండ్రుల ప్రేమను పొందిన బాలబాలికలకు ఏ కొరతా ఉండదు. కీర్తి, సంపద, సుఖ సంతోషాలు పెంపొందుతాయి. సకల సద్గుణ సంపన్నులవుతారు. అందుకు అయోధ్యరాముడే దృష్టాంతం.

పూర్వం అయోధ్యను దశరధుడనే రాజు పరిపాలిస్తుండేవారు. ఆ రాజుకు కౌసల్య, సుమిత్ర, కైకేయి అనే ముప్పురు భార్యలు, శ్రీరాముడు, భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడనే నల్గురు కుమారులున్నారు. చిన్న భార్య కైకేయి దశరధుని రెండు వరాలు కోరింది. ఒకటి పట్టాభిషిక్తుడు కానున్న శ్రీరాముని పదునాలుగేండ్లు అరణ్యానికి పంపడం, రెండోది తన కుమారుడైన భరతునికి పట్టాభిషేకం చేయడం. తమ గారాలపట్టి శ్రీరాముని కానలకు పంపడం ఇష్టంలేక దశరధులవారు మిక్కిలి దుఃఖించారు. ఇచ్చిన వరం కాదనలేక, చివరకు శ్రీరాముల వారిని అడవులకు పొమ్మని ఆజ్ఞాపించారు.

తల్లిదండ్రుల ఆజ్ఞను పాటించడమే ప్రధానమని తలంచిన శ్రీరాముడు, రాజ్యాధికారాన్ని వదలి, సంతోషంతో వెంటనే అరణ్యవాసానికి వెళ్ళినాడు. అక్కడ దుష్టరాక్షసులను చంపి, రావణ సంహారం చేసి, లోకానికి మహోపకారం చేశారు. అరణ్యవాసం పూర్తికాగానే అయోధ్యకు తిరిగి వచ్చి జనపాలకంగా రాజ్యాన్ని పరిపాలించి ఆదర్శపురుషుడుగా సత్కీర్తి పొందినాడు.

పిల్లలూ! మీరు కూడా శ్రీరాముని వలె తల్లిదండ్రుల మాట వినాలి. సకల సద్గుణ సంపన్నులై ఆదర్శపౌరులుగా వన్నెకెక్కాలి.



# 24. రానున్నవి రాకమానవు

'మొదట సుఖియింప కష్టంబు పిదపగలుగు
మొదట గష్టించిన సుఖము పిదపగలుగు
కాలచక్రానకీ రెండు గలవు మొనలు
గుండునైనను వీడవీ రెండు మొనలు'.

కాలచక్రంలో ప్రతి ప్రాణికి రోగాలు, కష్టాలు, సుఖాలు, పేదరికం, ఐశ్వర్యం వారివారి ప్రారబ్ధకర్మను అనుసరించి వచ్చి పోతుంటాయి. తొలుత కష్టపడ్డవానికి సుఖం, మొదట సుఖపడ్డవానికి కష్టం వెన్నంటి ఉంటాయి. కొన్ని కష్టాలు, సుఖాలు కోరకనే వచ్చి పోతుంటాయి. వీటినే ప్రారబ్ధకర్మ లేదా పూర్వజన్మకర్మ అంటారు. వీటిని ఎటువంటి వారైనా తప్పించుకోలేరు. దీనికి దృష్టాంతంగా ఒక పురాగాథ.

పూర్వం ఒకప్పుడు శని, కైలాసంలో పార్వతితో వేడుకలో ఉండే పరమేశ్వరుని చూశాడు. శివునితో - "నన్ను మించిన వాడెవ్వడూ త్రిలోకాలలో లేడు. ఎట్టివానినైన నేను పట్టకమానను" అని శనిదేవత ప్రజ్ఞలు పలికినాడు. శివుడు అతని మాటలు విని – "ఓయీ! నన్ను కూడా పట్టి బాధింపగలవా?" అని ప్రశ్నించాడు. "నీవొక లెక్కా ఏమి? ఏ ప్రాణిని వదలను" అని శని అన్నాడు. "అట్లైతే ఒక నెల లోపల నన్ను పట్టు చూద్దాం" అని శంకరుడు పంతమాడినాడు. శని సరే! అని వెళ్ళిపోయాడు.

ఈశ్వరుడు తదనంతరం - "వీడు నన్నెట్లో పట్టునో చూచెదగాక. శనికి కనిపించకుండ దాగి ఉంటాను" అని ఒక కారడవిలోని ఒక కోనలోని బురదగుంటలో ఎవ్వరికీ కనిపించక కూర్చొని, ఆ గోతిని ఆకులలో కప్పి నెల దినాలు అక్కడే దాగి ఉన్నాడు. పందెం వేసిన నెల రోజుల తర్వాత శివుడు ఆ గోతి నుండి బయటకు వచ్చాడు. ఎదురుగా శనిదేవత కనిపించాడు. "చూచితివా! నన్ను పట్టలేక పోయావే! ఓడితివిగదా! ఇక ఎప్పటికీ నాతో పంతములాడవద్దు" అని శంకరుడు గెలిచేశాడు. శని చిరునవ్వు నవ్వుతూ "నేనే పట్టకుంటే నీకు ఈ పాడుగుంటలో పడి ఉండే అవస్థ ఏల వస్తుంది? నేను పట్టుట అనగా ఇట్టి దురవస్థ సంభవించుటేగదా!" అని అన్నాడు. ఆ మాటలు విన్న పశుపతి సిగ్గుతో మారుమాట్లాడక కైలాసానికి వెళ్లిపోయినాడు. రానున్నవి రాకమానవు గదా!

# 25. గొప్పవారితో పంతము లాడరాదు

"గొప్పవారితోడ నెప్పుడు పంతంబు
లాడవలదు తనకె కీకడ కలుగు
కీర్తి పోవు వృద్ధికిని హానికరమగు
బాగుపడదు బాలుడోగెయగును"

తనకన్న గొప్పవారితోను, పెద్దలతోను పంతాలు పనికిరావు. దానివల్ల కీడు కలుగుతుంది. పేరు ప్రతిష్ఠలకు భంగం వాటిల్లుతుంది. అభివృద్ధికి ఆటంకం కలుగుతుంది. దీనికి దృష్టాంతంగా మరో పురాగాథ.

శివునితో పంతమాడి జయించినట్టి శనైశ్వరునికి, ప్రపంచంలో తన కెవ్వరూ సమానులు లేనేలేరని అహంకారంతో ఒకనాడు వైకుంఠానికి వెళ్ళాడు. శ్రీమన్నారాయణునితో – "నన్ను మించినవారు పదునాలుగు లోకాలలో ఎవ్వరైనా ఉన్నారా!" అని ప్రశ్నించాడు. విష్ణు భగవానుడు చిరునవ్వుతో, "కుమారా! ఇది నిజము. ప్రపంచములోని ప్రాణులంతా, వారు చేసికొనిన చెడుగుల వల్ల నీకు లోబడవలసిన వారే. ఈ ఉద్దేశంతోనే నిన్ను పుట్టించాను. అన్నింటికి ప్రభువైన నా ఉత్తరువే నీకు ఆధారం. అందుకే నీవు అంతటివాడవైనావు" అని అన్నాడు.

ఆ మాటలు విన్న శని – "నీవు నన్ను పుట్టించుట ఏమి? నీ ఆజ్ఞకు లోబడి నీ బలంతో నేను గొప్పవాడగుట ఏమి? నేను నిన్ను మాత్రం పట్టలేనా!" అని గర్వోక్తులు పలికినాడు. అంతట ఆ నారాయణుడు –"నాయనా! నీవల్ల కాదు" అని అన్నాడు. శని "పంతమేమి?" అని మరలా అడిగాడు. "వత్సా! వలదు, నాతో పంతములాడకుము, నా భక్తుల వద్ద సైతం నీవిట్లు పంతము లాడితే భంగపడగలవు" అని శ్రీమన్నారాయణుడెంత చెప్పినా వినకుండా ఆ సూర్యపుత్రుడైన శనీశ్వరుడు – "నిన్ను కూడా వదలను. నిన్ను భంగపరచి నాకు కల్గిన అపకీర్తిని పోగొట్టుకుంటాను. గడువిమ్ము" అన్నాడు. విష్ణు భగవానుడు శాంతంగా, "బిడ్డా! పెద్దల కొలది ఎఱుగక మాటాడకుము. శివుని పట్టినట్లు నన్నును పట్టుటకు నీకు సాధ్యంకాదు. అయినా నీవు పట్టిన పట్టు వదలకున్నావు. కాబట్టి రేపు వచ్చి నన్ను పట్టుము" అని అన్నాడు.

అంత శని, "నీవు కపట నాటకుడవు. నిన్ను నమ్మరాదు. మనకు గుఱుతు కావాలి" అని నొక్కి వక్కాణించినాడు. అంతట వైకుంఠుడు "రేపు" అని ఆ వాకిటి గోడపై రాసిపెట్టి పొమ్మన్నాడు. శని అట్లుచేసి, మరుసటి రోజు వచ్చి "నేడు నిన్ను పట్టవచ్చునా!" అని విష్ణువును అడగగా అతడు "గోడను చూచ చదువుము" అన్నాడు. "రేపు" అని శని చదువగా "రేపు రమ్ము పొమ్ము" అన్నాడు. అది మొదలు శని ప్రతిదినం వైకుంఠానికి పోయి గోడను చూచి వచ్చుచున్నాడు. కాబట్టి గొప్పవారితో పంతములాడరాదు. భంగపాటు కల్గుతుంది.



## 26. తల్లిదండ్రులను కష్టపెట్టరాదు

**"తల్లిదండ్రుల సుఖపెట్టు తనయునకును**
**సకల సౌఖ్యముల్ తమయంత సరసజేరు**
**తాను వారి శరీరమై తనర వారి**
**హింస చేయుట తనయాత్మ హింసయగును".**

కన్న తల్లిదండ్రులు సాక్షాత్ దైవ స్వరూపులు. వారిని ఆదరించి, ప్రేమానురాగాలతో పోషించడం బిడ్డల బాధ్యత. వారిని హింసించడం ఆత్మహింసతో సమానం. తల్లిదండ్రుల మీద దయలేని పుత్రుడు పుట్టినా, గిట్టినా ఒక్కటే. దానికొక దృష్టాంత కథ.

ఒక ఊర్లో ఒక బీద కుటుంబీకునికి లేకలేక ఒక కుమారుడు కల్గినాడు. వారు వాన్ని మిక్కిలి గారాబంగా పెంచినారు. తమ కొడుకును పెద్ద చదువులు చదివించాలని, తాము ఒక పూట తిని, ఒక పూట తినకుండ, కొడుకు చదువుకే అంతా ఖర్చు పెట్టినారు.

ఆ బాలుడు క్రమక్రమంగా బాగా చదువుకొని, గొప్ప ఉద్యోగి అయ్యాడు. వానికి విద్యా గర్వం, ఉద్యోగ గర్వం రెండూ ఎక్కువైనాయి. వీటికితోడు ఒక ధనికుడు పదివేల రూపాయల కట్నంతోపాటు కూతురునిచ్చి పెండ్లి

చేశాడు. అప్పుడతనికి యౌవన గర్వం, ఐశ్వర్య గర్వం కూడా కలసి నాలుగైనాయి.

ఈ నాల్గింటిచే వానికి కన్నులు, చెవులు క్రమ స్థితిలో ఉండకపోయినవి. తన యోగ్యతకు తగని తల్లిదండ్రులను, తన తండ్రులుగా చెప్పుకోవడం అవమానకరంగా తోచింది. వారిని వెడలగొట్టాలని ఉన్నా, తల్లిదండ్రులను తరిమేస్తే వారిని నలుగురు నాలుగు విధాలుగా అనుకొంటారనే భీతితో, వారిని ఇల్లు వెడలగొట్టలేదు. బందెల దొడ్డిలో ఒక గదిలో ఉంచినాడు. ఒక మూకుడిచ్చి వేళకింత అన్నం మూకుటిలో వేయించుకొని, ఆ గదిలోకి పోయి ఇరువురూ తినాలని ఆజ్ఞాపించాడు.

కొన్నాళ్ళకు అతనికొక కొడుకు కల్గినాడు. వాడు పెరిగి ఏడేండ్ల వాడైనాడు. ఆ ముసలివాడు ఒకనాడు అన్నానికై మూకుడుతో వెళ్ళుచుండగా, చేయి వణకుటచేత మూకుటిని నేలపై పడవేచినాడు. అది బ్రద్దలయింది. అంత ఆ బాలుడు తన తాతతో, "తాతా! వణకుచు, వణకుచు దినానికొక మూకుడు పగులగొట్టితే తెచ్చిపెట్టే వారెవ్వరు? మా తండ్రిని కూడా నీవలె బఱ్రెల దొడ్డిలో పెట్టి అంబలి పోయాలంటే, డబ్బు వ్యర్థం చేసి మరొక మూకుడు కొనాలికదా! తాతకిచ్చిన మూకుడు తరతరాల వరకుండాలి. కాబట్టి ఈ పెంకులన్నింటిని ఒకటిగ చేర్చు అతుకుము" అని గద్దించినాడు.

అది విన్న వాని తండ్రి వాన్ని చేరదీసి "నాయనా! నీవు నన్ను బందెల దొడ్డిలోని గదిలో పెట్టి గంజి పోస్తావటరా!" అని అడిగాడు. ఆ బాలుడు "మన కులాచారమంతేగదా! నీవు చేసేపని నేను చేయరాదా? నీకు నీ తండ్రి ఎంతో, నాకు నా తండ్రి అంతేగదా!" అని అన్నాడు. కొడుకు మాటలతో జ్ఞానోదయమైన ఆ తండ్రి సిగ్గుపడ్డాడు. అప్పటినుండి తెలివి తెచ్చుకొని తన తల్లిదండ్రులను తమతో పాటే ఇంట్లో ఉంచుకొని, గౌరవంతో సంరక్షిస్తున్నాడు.

మనం మన తల్లిదండ్రులను చూచినట్లే మన బిడ్డలు మనల్ని చూస్తారు. తల్లిదండ్రులను సుఖ పెట్టడం ప్రతి సంతానం బాధ్యతగదా!



# 27. విద్య గల వాడు చెడడు

"అనుభవింపగ చెడదన్యహరముగాదు
స్వగృహ మిత్రంబు పరదేశ బంధువరయ
జ్ఞాన నేత్రం బొసంగును జడియమాన్చు
విద్యకు సమవస్తువు పృథివిలేదు".

ప్రపంచంలో విద్యకు మించిన వస్తువేదీ లేదు. విద్య గొప్పతనాన్ని చాటే కథ చూడండి.

హరివర్మ అనే ఒక బ్రాహ్మణునకు సోమదత్తుడు, బ్రహ్మదత్తుడు అనే కుమారులున్నారు. హరివర్మ చిన్న కుమారుడైన బ్రహ్మదత్తుని గురుకులానికి విద్యాభ్యాసానికై పంపించాడు. పెద్దకుమారుడైన సోమదత్తుని తనకు చేదోడుగా ఇంటిలోనే ఉంచుకున్నాడు. హరివర్మకు అవసానకాలం సమీపించింది. బ్రహ్మదత్తుడు ఇంటికి రాకముందే తన ఆస్తినంతా సోమదత్తునికి అప్పగించి మరణించాడు.

బ్రహ్మదత్తుడు విద్యలన్నీ పూర్తి చేసుకొని కొన్నాళ్ళకు ఇంటికి వచ్చి, ఆస్తిలో తన అర్థభాగమిమ్మని అన్నను అడిగాడు. ధనలోభంచే సోమదత్తుడు ఇవ్వలేదు. "తండ్రి చేసిన అప్పులన్నీ నేను సంపాదించి తీర్చాను" అని అబద్ధం చెప్పాడు. ఇక ఏమీ చేయలేక "దైవమే నాకు దిక్కగుగాక!" అని బ్రహ్మదత్తుడు మద్ర దేశపు రాజాస్థానానికి వెళ్ళి తన విద్యలచే అచ్చటి పండితులను, రాజును మెప్పించాడు. వారు అతని తెలివితేటలను, విజ్ఞానాన్ని చూచి సంతోషించారు. రాజు అతని జ్ఞాన సంపదకు మెచ్చి, గొప్ప బహుమాన మివ్వడమే కాకుండ, అతన్ని తన ఆస్థానంలో ఉంచుకొన్నాడు. అది మొదలు బ్రహ్మదత్తుడు గొప్ప ధనవంతుడైనాడు.

సోమదత్తుడు ధనమదం చేత, తనకన్నా మించిన వారు లేరని విర్రవీగుతూ ఏ వ్యాపారం చేయకుండా, ఉన్న ధనాన్ని ఖర్చు చేశాడు. దినానికొక రాయి తీస్తే, కొండైనా కరిగిపోతుంది కదా! కొన్నాళ్ళకు అతడు నిర్ధనుడైనాడు. ఆస్తి అంతా కరిగిపోగా, అప్పులు దొరక్క పూటమార్చి పూటకైన గంజి దొరక్క పస్తులున్నాడు. సోమరికి అప్పు ఎవరైనా ఇస్తారా! చివరకు

సిగ్గుమాలి తమ్ముని పంచకు చేరాడు. బ్రహ్మదత్తుడు ధనవంతుడే గాక, బుద్ధిమంతుడు కాబట్టి, అన్న చేసిన మోసాన్ని మనసులో ఉంచుకోక, చేరదీసి, తన సంపాదనలో కొంత భాగమిచ్చి కాపాడినాడు. ఈ వృత్తాంతంచే విద్యా ధనం అన్ని ధనాలకన్నా గొప్పదని తేలింది.



## 28. అన్నదమ్ములు కలహింపరాదు

కం॥ క్షీరము నీరమునుం బలె
జేరికగా నొకరికొకరు క్షేమంకరులై
వైరములు దూరమిడి సుఖ
వారాశిని నోలలాడవలయును భ్రాతల్.

అన్నదమ్ములు ఒకరి క్షేమాన్ని ఒకరు కోరుతూ, ఒద్దికగా, వైరంలేకుండా, పాలు నీరులాగా కలసి ఉండాలి. అన్యోన్యంగా జీవించే అన్నదమ్ముల సుఖాలకు లోటుండదు. కాని అసూయతో కలహించుకుంటే నష్టమేమిటో చూడండి.

ఒక ఊర్లో ఇద్దరు అన్నదమ్ములున్నారు. వారు బాల్యం నుండి తినుబండారాలకు, వస్త్రాలకు ప్రతి చిన్న విషయానికి తగవు పడేవారు. వారు పెద్దవారైనా వారి స్వభావంలో మార్పు రాలేదు. కలసి జీవించలేక భాగపరిష్కారం చేసుకొని వేరుపడ్డారు. ఒకనికి పెరటిలో జానెడు స్థలం ఎక్కువగా పోయిందని, రెండోవానికి ఒప్పలేదు. ఆ జానెడు స్థలంకోసం ఇద్దరన్నదమ్ములు తగవుపడి కోర్టు కెక్కారు. వంద రూపాయలు కూడా చేయని ఆ స్థలాన్ని తమలో ఒకరు అనుభవించడానికి మనసొప్పనివారు, వకీళ్లకు ఒక్కొక్కరు వేయి రూపాయలు ఇచ్చినారు. ఇవిగాక స్టాంపులు క్రింది, రానుపోను ఖర్చులు క్రింద ఎంతో ఖర్చు చేశారు. వ్యవహారం మాత్రం

తేలలేదు. ధర్మస్వరూపుడైన న్యాయాధిపతి ఆ అన్నదమ్ముల తగవును విచారించి తానే తగాదాగల నేలను చూడాలని బయలుదేరినాడు. అన్నదమ్ములతో పాటు వారివారికి కావలసిన వారంతా వచ్చారు.

న్యాయాధిపతి వివాద స్థలాన్ని (జానెడు) చూశాడు. అక్కడే కూర్చొని ఆ అన్నదమ్ములను తన దగ్గర కూర్చోబెట్టి అక్కడున్న చీమల బారును చూపించినాడు. "ఈ చీమలబారును చూశారా! వీనిలో ఒకదానిని నేను పుడకతో అదమగా తక్కినవి వచ్చిఈ పుల్లను కరవడానికి కారణమేమి?" అని ప్రశ్నించాడు. అంత "వానికి జాత్యైక్యత మెండు. ఒండొంటి కవి సాయం చేయకమానవు" అని ఆ సోదరులన్నారు. అంతట న్యాయాధిపతి నవ్వుతూ ఇట్లన్నాడు. ఈ చీమలను చూచి మీరేల బుద్ధి తెచ్చుకోలేరు? వానికంటే మీరు తెలివితక్కువ వారా! చీమలకున్న బుద్ధి మీకేలలేదు? మీ నేలయందే మీకు న్యాయాధిపతులిందరుండగా నాదగ్గరకేల వచ్చితిరి? సహోదరులలో ఒకడు జానెడు నేలను అనుభవిస్తే మీ మనసు ఒప్పలేదు. వకీళ్ళకు, న్యాయ స్థానానికి మీ సొత్తు ఎంత ఖర్చయింది? మీరు చేసిన వ్యయంలో ఈ నేల ఎన్నో భాగం? అని పలురకాలుగా చీవాట్లు పెట్టినాడు.

అంతట ఆ సహోదరులు సిగ్గుపడి, బుద్ధి తెచ్చుకొని, అది మొదలు ఇద్దరూ కలసిమెలసి ఒద్దికతో, సంతోషంగా, ఒకరి క్షేమాన్ని ఒకరు కోరుతూ జీవించారు. కాబట్టి అన్నదమ్ములు కలహింపరాదు.



# 29. అల్లరి పిల్లలతో జేరరాదు

"దుష్టులను గూడి చరియింప శిష్టునకును
గౌరవంబునురాదు సౌఖ్యమునులేదు
స్వర్ణముం గూడి మెఱయంగ వలసినమణి
యినుము గూడిన నెటులుండు నీవ చెపుమ"

దుష్టులతో కూడి తిరిగితే శిష్టులు కూడా చెడిపోతారు. అల్లరిమూకలతో చెలిమి పనికిరాదు. దీనికొక దృష్టాంత కథ.

వీరవరమనే గ్రామంలో రంగయ్య అనే బుద్ధిగల ఒక బాలుడున్నాడు. వాడు తల్లిదండ్రుల మాట జవదాటడు. వేళకు బడికిపోతూ, పాఠశాల నుండి ఇంటికి రాగానే శ్రద్ధగా చదివేవాడు. తల్లిదండ్రులు ఏదైనా పని చెప్పితే చేసేవాడు. అల్లరి పిల్లలతో చేరేవాడుకాదు.

ఒకరోజు రంగయ్య బడికి పోతుంటే కొంతమంది సోమరి పిల్లవాండ్రు తమతో రమ్మని వానిని నిర్బంధించారు. తియ్యని మామిడి పండ్లుకోసి ఇస్తామని ఆశ చూపించారు. వేడుకగా, విచ్చలవిడిగా ఆడుకోవచ్చని ప్రోత్సహించారు. బాల్యచాపల్యం చేత రంగయ్య కాదనలేక ఆ అల్లరిమూకతో వెళ్ళాడు.

అంతా కలసి, పలకాపుస్తకాలను ఒక పొదలో దాచిపెట్టి కొంతసేపు ఆడుకున్నారు. అంతా కలసి బావిలో ఈదులాడడానికి పోయారు. రంగయ్యకు ఈతరాదు. పిల్లల బలవంతంపై మెట్లు పైననే కూర్చుండి స్నానం చేస్తూ, ఆ బావి సోపాన శిలలను పట్టుకొని దిగుతూ, కాళ్ళను నీటిపై దబదబ కొట్టుకొంటున్నాడు. ఒక తుంటరి నడిబావిలో కాలి ఈతలో నిలబడి, చేతులు పైకెత్తి, రంగయ్యా! ఇక్కడ ఇంతేలోతు! ఇక్కడికి రా! అని పిలిచాడు. అమాయకుడైన రంగయ్య లోతు తెలియక, వాని మాటలు నమ్మి దిగి ఈత రాక మునకలు వేయసాగినాడు. అది గమనించిన మరొక పెద్ద పిల్లవాడు వానిని తటుక్కున గట్టు చేర్చాడు. అతడు సమయానికి సాయపడకుంటే రంగయ్య గతి ఏమయ్యేది?

ఈదులాడిన తర్వాత అంతా కలసి ఒక చెట్టుక్రింద చేరారు. సమీపంలో నున్న మామిడితోపు కెళ్ళి కొందరు మామిడి పండ్లు కోసుకొని వచ్చారు. అందరూ కలసి తింటుండగా, ఇంతలో తోటకాపరులు చూశారు. ఆ బాలురందరిని పట్టుకొని నాలుగేసి చంపకాయలిచ్చారు. రంగయ్య కూడా చెంపకాయలు తిని ఇంటికి వచ్చాడు.

ఆరోజు రంగయ్య బడికి పోలేదనే సంగతి తండ్రికి తెలిసింది. తండ్రి దండించినాడు. రంగయ్య తండ్రితో నిజం చెప్పి, "నాకు బుద్ధి వచ్చింది. ఇంక నేనెప్పుడూ ఇటువంటి పనులు చేయనే చేయనని అట్టివారితో చేరనే చేరను" అని ఒట్టుపెట్టుకున్నాడు. అప్పటినుండి సక్రమంగా బడికిపోతూ మంచి పేరు తెచ్చుకున్నాడు. బాగా చదివి గొప్పవాడైనాడు.



# 30. తాను కోరినది ఇతరులకు చేయాలి

"ఇతరులేది తనకు జేయ హితముకాదొ
ఇతరులకు నద్దిదాజేయ నెంచరాదు
ఒకటి చేసి యొకటిగోర గొప్పిదంబె
ఆరుకలు చల్లి గోధుమల్ గోర దగునె?"

తాను ఏదైతే కోరుతాడో, తనకు ఏదైతే హితమనిపిస్తుందో అట్టి పని ఇతరులకు చేయాలి. తనకు అప్రియమైంది ఇతరులకు చేయరాదు. అదే ధర్మం. పాపం చేసి పుణ్యం రమ్మంటే రాదుగదా! దీనికి దృష్టాంతంగా భారత కథ.

ధృతరాష్ట్రుని కొడుకైన దుర్యోధనుడు తాను ఏకచ్ఛత్రాధిపతి కావాలని తలంచేవాడు. కాని రాజులంతా తనకు లోబడి ఉండాలంటే తానేమి చేయాలో ఎరుగడు. తాను ఇతరులను గౌరవించడు. తన్ను మాత్రం అందరూ గౌరవించాలి. తానొకరికి లోబడడు. తనకు మాత్రం అందరూ లోబడి ఉండాలి. ఇట్టి పనికిమాలిన తెలివితో దుర్యోధనుడు, పెద్దలైన భీష్మ, ద్రోణాదులు చెప్పినా వినకుండ చెడు త్రోవలో ఇలా ఆలోచించేవాడు.

"పాండవులు తమ యోగ్యత చేతను, భుజబలము చేతను, సర్వ రాజుల లోబరచుకొనియున్నారు. వారిని మోసంతో లొంగదీసుకొని వారి రాజ్యాన్ని హరించి, వారిని అడవులకు తరుమగొట్టితిమేని, వారును, ఇతర రాజులును మనకు భయపడి లోబడి ఉంటారు" అని తలంచినాడు.

ఒకనాడు దుర్యోధనుడు పాండవులను మంచితనంతోనే పిలిపించి జూదానికి పురికొల్పినాడు. మాయా జూదమాడించి, మోసగించి పాండవుల రాజ్యభాగాన్ని గెలుచుకొని, వారిని పండ్రెండేండ్లు అడవులకు పంపినాడు. సత్యం, ధర్మం తప్పని పాండవులు ఆడినమాటకు కట్టుబడి అరణ్యవాసం పూర్తి చేసుకొని తిరిగివచ్చి తమ రాజ్యాన్ని తిరిగి ఇమ్మని అడిగినారు. దుష్టబుద్ధి గల సుయోధనుడు ఎందుకిస్తాడు? "దిక్కులేని పాండవులు నన్నేమి చేయగలరు" అనే గర్వంతో, సూది మొన మోపినంత కూడా ఇవ్వనని

తిరస్కరించినాడు. కురు పాండవ యుద్ధం తప్పలేదు. యుద్ధంలో పాండవులు దుర్యోధనుని, వాని సోదరులందరిని, బంధువులను, స్నేహితులను అందరినీ చంపి తమ రాజ్యంతోపాటు వారి రాజ్యాన్ని కూడా గైకొన్నారు. వినాశాన్ని కౌరవులు చేజేతులా కొనితెచ్చుకున్నారు. కాబట్టి తాను కోరునదే ఇతరులకూ చేయాలి.



## 31. అసూయ కూడదు

**"ఒకరి మేలు జూచి యోర్వనివానికి**
**తెవులు లేని బాధ దవిలి తుదకు**
**నవ్వుబాటు గలుగు నలుగురిలోపల**
**క్రుళ్ళుబోతు తనము కూడ దెపుడు"**

బుద్ధి జీవులైన మానవులు అసూయకు, అరిషడ్వర్గాలకు దూరంగా ఉండాలి. క్రుళ్ళుబోతుతనం లేకుండా జీవించాలి ఇతరుల మేలు చూచి ఓర్వలేక పోవడాన్ని అసూయ అంటారు. ఈ గుణం కలవానికి ఎంత తిన్నా ఒంటబట్టక క్షీణిస్తుంటాడు. ఈ రోగానికి మందులేదు. మనస్సును మిక్కిలి బాధించే అసూయ అనే గుణం కూడదు. ఈ గుణం ఉంటే వెంటనే త్యజించాలి. దీనికొక దృష్టాంత కథ.

ఒక ఊర్లో సుశీలుడు, దుశ్శీలుడు అనే ఇద్దరు దాయాదులున్నారు. సుశీలుడు తనకు లభించిన దాంతో తృప్తి చెందుతూ, ఆశ్రయించిన వారికి పెట్టి, తాను భార్యాబిడ్డలను పోషించుచుండెను. బీదవాడైనా తృప్తిగా జీవిస్తూ ఉండేవాడు. దుశ్శీలుడు తాను సంపాదించింది తృప్తిగా తినడు. ఇతరులకూ పెట్టడు.

సుశీలుడు ఒకనాడు అడవికి కట్టెలకై పోయినాడు. ఒక కొలను గట్టున గల చెట్టుకొమ్మకు, తాను తెచ్చుకొన్న అన్నం మూటను తగిలించినాడు.

కట్టెలు కొట్టి, మోపు గట్టుకొని ఆ కొలను దగ్గరకు అన్నానికై వచ్చాడు. ఆ సమయంలో సుశీలుని శీలాన్ని, దాతృత్వాన్ని పరీక్షించడానికై, భగవంతుడు ఒక ముసలి బాటసారి రూపంలో వచ్చి, అతని అన్నాన్ని తినుచున్నాడు. సుశీలుడు దూరం నుంచే చూశాడు. "అయ్యో! పాపం! ఇతడు మిక్కిలి ఆకలితో ఉన్నాడు కాబోలు! ఆవురావురుమని తింటున్నాడు. నేను సమీపిస్తే తృప్తిగా తినకుండా వదలిపెట్టి వెళ్ళిపోతాడేమో!" అని తలంచి, ఆ ముదుసలి అన్నం తినే వరకు అక్కడే దాగి ఉన్నాడు. ఆ ముదుసలి తిని కూర్చొన్న తర్వాత వచ్చాడు.

సుశీలుడు ఆ మాయా ముదుసలిని సమీపించగా – మాయా వృద్ధుడు "అయ్యా! ఆకలి మెండగుటచే నీ ఉత్తర్వులేకనే నీ అన్నం తిన్నందుకు మన్నించు. మిగిలిన దానిని నీవు భుజించు" అనగానే, సుశీలుడు "నాయనా! నీకు చాలకుంటే తృప్తిగా భుజించు. నాకిప్పుడక్కరలేదు. అడవిలో సైతం అతిథి సత్కారం చేయగలిగితిగదా! అనే సంతోషం నాకు తృప్తినిచ్చింది" అని అంటూ, మూటవిప్పే సరికి ఎప్పటియట్ల ఆ మూటలోని అన్నం యథాతథంగా ఉంది. అదిచూచి ఆశ్చర్యపడి ఇతడు నాపాలిటి దైవం కాబోలు, అణి తలంచి అతని పాదాలపై పడ్డాడు. భగవంతుడు కరుణించి "కుమారా! నీవు ఈ మూట విప్పినపుడెల్లా నీకు కావలసినంత అన్నం దొరుకుతుంది పొమ్ము" అని నిజరూపాన్ని చూపించి అదృశ్యుడైనాడు. సుశీలుడు ఇంటికి వచ్చి ఆ మూటతో నాటి నుండి అన్న సంతర్పణ చేస్తూ తృప్తిగా జీవిస్తున్నాడు.

ఇదంతా చూచిన దుశ్శీలునకు కడుపుబ్బింది. "నా దాయాదికి ఇంత కీర్తి రాగా నేనెట్లు ఓర్చుకుంటాను. నేనను వానివలె పోయి, ఒక మూట తెచ్చుకుంటాను" అని ఆలోచించి అడవికి వెళ్ళాడు. మూటను సుశీలుడు చెప్పిన చెట్టుకే కట్టి కట్టెలు కొట్టుతూ, తిరిగి తిరిగి చూస్తున్నాడు. దేవుడు మునుపటిలాగానే, ముసలి రూపంలో వచ్చి అన్నం తినుచున్నాడు. దుశ్శీలుడు ఆకలితో అతన్ని సమీపించి, "నాకు కొంచెముగ మిగిల్చిన చాలును" అన్నాడు. "ఎక్కువగనే మిగిల్చితిని కొనిపొమ్ము" అని ఆ దేవుడు మాయమైనాడు.

వాడా మూటను తీసుకొని ఇంటికి వచ్చి, కొంతమంది స్నేహితులను విందుకు పిలిపించాడు. అందరూ కూర్చొన్న తర్వాత ఆ మూటను విప్పినాడు.

అందుండి ఇద్దరు పురుషులు వచ్చి అందరి తలలు గుందు గీసి మాయమైనారు. "ఇందులకా మమ్ము రప్పించింది" అని అందరూ కోపంతో అతన్ని బాగా తన్ని వెళ్ళిపోయారు. తనకట్టి భాగ్యము కలుగలేదని, అవమానం ప్రాప్తించిందని, దుశ్శీలుడు సుశీలుని కీర్తిని, గౌరవాన్ని చూచి ఓర్వలేక లోలోన క్రుళ్ళి క్రుళ్ళి తుదకు తీరని వ్యాధిచే శీఘ్రకాలంలోనే మరణించాడు. చూచితిరా! సంపద కన్నా తృప్తి గొప్పది. అసూయ పనికిరాదు.



## 32. ధనాశ ప్రేమను చెఱచును

"ఇరుగు పొరుగు వైరమినుమడింపగ జేయు
హితుల గాననీక యేపుచుండు
ధనము లుబ్ధునకును దగగూడినట్లైన
వింతచీకుజేసి ప్రేమమాన్చు".

అత్యాశ ఆపదలకు మూలం. ధనాశగల వారికి బంధుమిత్రులు, హితులు, గురువులు, ఇరుగుపొరుగు వారనే భేదం ఉండదు. అట్టి వానికి ధనమే ప్రాణం. ధనం పాడైనా, ఖర్చైనా, దొంగలింపబడినా అట్టివాడు మనోవ్యథచే పిచ్చివాడవుతాడు. అటువంటి లుబ్ధుని వృత్తాంతం.

లోభి ఒక్కడు కొంత ధనాన్ని కూడబెట్టి నక్క గోరీ దగ్గర కాచినట్లుగా దాన్ని కాచి ఉన్నాడు. అది తెలిసిన ఊరివారు వాన్ని చేబదులు అడగటం మొదలుపెట్టారు. తన కడుపుకే తిననివాడు చేబదులిచ్చునా! "మరల రాదేమో?" అనే సందేహంతో లేదంటుండేవాడు. అందరికీ వీనిపై క్రమక్రమంగా విరోధభావం కలిగింది. ఇరుగుపొరుగు పోరు పడలేక అతడు పొరుగూరికి పోవడానికి నిశ్చయించాడు.

ఒక నాటి రాత్రి ధనాన్ని మూటగట్టి నెత్తిపై పెట్టుకొని, బిడ్డను చంకలో పెట్టుకొని, భార్య తోడురాగా బయలుదేరినాడు. తెల్లవారేసరికి ఒక ఏటి

ఒడ్డుకు చేరినారు. ఏటిలో ప్రవాహం అధికంగా ఉంది. ఏటిని దాటించడానికి పడవవాడు నాలుగు రూకలడిగినాడు. దానికా లుబ్ధుడు సమ్మతించలేదు. భార్యను ఒక చేతితో పట్టుకొని, నెత్తిపై మూటను మరో చేతితో పట్టుకొని నీటిలో దిగి సగం ఏటిని దాటినారు. అంతలో ఆ ఏటిలో లోతు ఎక్కువైంది. దాటడానికి కష్టమై, భార్యతో ఇట్లన్నాడు – "ధనము విడిచినచో గట్టెక్కినా బ్రతుకలేము. దానిని విడువరాదు. మనం సుఖంగా ఉంటే బిడ్డలకేం తక్కువ? చెట్టున్నప్పుడు పండ్లకు తక్కువా? చంకలో బిడ్డను నీటిలో వదలుము". భర్త మాట మీరలేక, తన ప్రేవులలోని ప్రేవైన ముద్దుల కూనను వదలలేక చింతించి, విధిలేక కన్న కొడుకును ఏటిలో వదలి మరి నాలుగడులు ముందుకు వేసినారు. ఆమెకు కాళ్ళందక నీటిపై పైకి తేలియాడు చున్నది. అ లుబ్ధుడు మరలా ఇట్లాలోచించాడు. "ఎంతో కష్టపడి సంపాదించిన ధనమిది. దీనిని నేనెట్లావదలేది? వదలకున్నచో భార్యను వదలవలసిందేగదా! భార్యను, ధనాన్ని పట్టుకొని దాటడానికి వీలుకాకున్నది. దేన్ని వదలాలి? కష్టసుఖాలలో తోడునీడగా ఉండే భార్యను వదలుకోవడం పాపం కదా! అయినా భార్యను కాపాడుకుంటే, ఇద్దరూ ధనానికి కష్టపడాలి. ధనాన్ని కాపాడుకొంటే, ఈ ధనాన్ని చూచి, దీని అక్క వంటిది ఇంకొకతె నాకు భార్యగా వస్తుంది. కనుక ధనాన్నే కాపాడుకొంటాను" అని ధనాన్ని పట్టుకొని, భార్యను వదలివేశాడు. మరో నాలుగడుగులు వేసే సరికి ఆ లోభికి కూడా కాళ్ళు నేలకు అందలేదు. కొట్టుకొని పోతున్నాడు. ప్రాణభీతితో మూటను పారవేశాడు. ధనాశ ఎంత ముప్పు తెచ్చిందో చూశారా! వాడెట్లో ఈతలాడు కుంటూ గట్టు చేరాడు. తన మందమతితో, ధనాశతో భార్యబిడ్డలను, ధనాన్ని పోగొట్టుకున్నానని పశ్చాత్తాపపడ్డాడు. కాబట్టి ధనాశ ప్రేమను చెరుస్తుంది.



## 33. ధనము ప్రాణ ఘాతి

"మదక కఱ్ఱుచే తల్లిఁజంపగ జేసె
కొడుకును విషాన్నమున నేల గ్రూలద్రోచె
తల్లికొడుకుల కిటు విరోధంబు పెంచు
ధనమునకు ప్రాణ హర్తకు దండమొందు"

న్యాయంగా సంపాదించిన ధనం తప్ప మిగిలిన ధనం స్వబుద్ధిని చెరచి దుర్బుద్ధిని కల్గిస్తుంది. ధనం తల్లిదండ్రులు, కన్నబిడ్డలనే విషయాన్ని కూడా మరిపింప చేస్తుంది. కంసుడు కన్నతండ్రి ఉగ్రసేనుని చెరలో పెట్టించింది. ఔరంగజేబు కన్నతండ్రిని ఏడేండ్లు బంధించింది సంపద కొరకే గదా! ప్రాణఘాతి అయిన ధనం పట్ల మనుజులు జాగరూకతతో వర్తించాలి. దీనికో దృష్టాంత కథ.

ఒక కాపు యువకుడు మదకకు ఎద్లను కట్టి పొలం దున్ను చున్నాడు. అప్పుడా పొలంలో ఒక బిందెడు లిబ్బి (ధనం) మదక మొనకు తగిలి లేచింది. ఆ కాపు యువకుడు పరమానందంతో ఆ లంకె బిందెను లేవనెత్తి, దానిపై మూతను తీసి చూశాడు. ఆ బిందె నిండా బంగారు నాణేలున్నాయి. ఆహా! ఏమి నా అదృష్టం. అంటూ మురిసిపోయాడు. ఆ యువకుని ఊహలకు, కోరికలకు అంతులేకున్నాయి. "నేనింక ఈ ధనంతో ఈ పట్టణం పాలించే రాకుమార్తెను పెండ్లాడతాను. గొప్ప మిద్దెలు, మేడలు కట్టిస్తాను. రాజును కూడా లెక్కచెయ్యను. కావలసినంత మంది దాసీజనాన్ని, సేవకులను ఉంచుకొంటాను. నాకు అడ్డు వచ్చే వారినంతా నరికేస్తాను." అని పలు రకాలుగా ఆలోచిస్తుండెను. ఇంతలో ఆ యువకుని తల్లి చలిది అన్నం తెచ్చింది. ఆమెతో 'అమ్మా! ఇంక నేను మదక (నాగలి) దున్ని జీవించవలసిన అవసరం లేదు. పెన్నిధి దొరికింది. రాత్రికి ఇంటికి తీసుకొని పోదాం' అన్నాడు. ఆ మాటలు విన్న ఆ తల్లి మహానందంతో ఇల్లు చేరింది.

ఇంటికి వెళ్ళిన తల్లికి పలు ఆలోచనలు వెన్నంటాయి! "నా కొడుకు పసివాడు. ఈ ధనాన్ని సక్రమంగా కాపాడుకోలేడు. చెప్పిన మాట వినడు. వీనికి అధికారమిస్తే నాలుగేళ్ళకే కొంప గుల్లచేస్తాడు. ఆ తర్వాత ముసలి

దానినైన నేను మిక్కిలి కష్టపడాల్సి వస్తుంది. నా పెత్తనానికి వాడు ఒప్పుకోడు. చెడు బుద్ధి పుట్టి మధ్యలో వాడు నన్ను చంపినా చంపవచ్చు. నేనే వాన్ని ఇప్పుడే చంపేస్తే, నా జీవితకాలమంతా ఆ పెన్నిధితో హాయిగా బ్రతకవచ్చు" అని ఆలోచించింది. ధనాశతో కన్నకొడుకుకు విషాన్నం తెచ్చింది.

ఆ యువకుడు కూడా తల్లి ఆలోచించినట్లే ఆలోచించాడు. తల్లి ఉంటే తన ఆటలు కోరికలు సాగనియ్యదు. అందుకే ఆమెను చంపాలనుకున్నాడు. తల్లి అన్నం పుటకదించే సమయంలో ఆ కాపు యువకుడు మడక కఱ్ఱుతో తల్లి తల పగలగొట్టి చంపినాడు. తిరిగివచ్చి అమ్మ తెచ్చిన విషాన్నం తిన్నాడు. వాడుకూడా చచ్చాడు.

చూచితిరా! ధనం ఎంత ప్రాణఘాతియో! ప్రాణఘాతియైన ధనం పట్ల ఎల్లరూ జాగరూకతతో ఉండాలి.



## 34. ధనము సంపాదించుట సౌఖ్యము కొఱకు

**"న్యాయమున ధన సంపాదనంబు చేసి**
**ఆశ్రితుల కింతయిడి తాను నధికవైభ**
**వంబు కోరికలనుభవింపంగ వలయు**
**గాట కుక్కగతి ధనంబు గడనతగదు."**

ధనాన్ని న్యాయంగా సంపాదించాలి. ఆశ్రయించిన వారికిచ్చి తాను కూడా అనభవించాలి. భోగానుభవం లేని అర్థ సంపద వ్యర్థం. భోగము గల అర్థము అల్పమైనా సార్థకం. దీనికొక దృష్టాంత కథ.

ఒక గ్రామంలో యశోదవర్మ అనే పేరుగల బీద కుటుంబీకుడున్నాడు. అతడు తనకు ఏది దొరికినా దేవీప్రసాదమని తలంచేవాడు. అన్యాయంగా ఒక కాసైనా ఆర్జించేవాడు కాదు. అతనికి పదిమంది బిడ్డలు. కుచేలుని వంటి పేదవాడు. దేవీభక్తుడు. అలనాటి కుచేలుడు శ్రీకృష్ణుని ఆశ్రయించి

ఐశ్వర్యాన్ని పొందినట్లుగా, ఇతడు దేవీప్రసాదంచే సంపద పొందాలని శ్రీ లక్ష్మీదేవిని ఉపాసించాడు.

లక్ష్మీదేవి అతనిని కరుణించి ప్రత్యక్షమైంది. "నీకు అర్థశ్రీ కావాలా! భోగశ్రీ కావాలా!" అని అడిగింది. ఆ రెండింటికి తేడా నాకు తెలియదు అని అతడు చెప్పగా, "ఈ సమీప పట్టణంలో అర్థవర్మ, భోగవర్మ అనే ఇద్దరున్నారు. పొమ్ము వారి ఐశ్వర్యాలను చూచివచ్చి నన్నడుగుడు" అని దేవి పంపించింది.

లక్ష్మీదేవి ఉత్తర్వు ప్రకారం అతడు ఆ పట్టణానికి వెళ్ళి తొలుత అర్థవర్మ ఇంటికి వెళ్ళినాడు. కోటీశ్వరుడైన అర్థవర్మ అతనికి అతిథి మర్యాదలు చేసి, ఆనాడు తన ఇంటిలోనే ఉంచుకున్నాడు. ఆరాత్రి ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు. అర్థవర్మ ఆహార పదార్థాలు ఏవీ తినలేక పాలు మాత్రం తీసుకున్నాడు. కారణం ఏమని అడుగగా – "నాకు అజీర్ణవ్యాధి ఉంది. ఒక పూట మాత్రం భుజిస్తాను. ఇప్పుడు నీకోసం ఈ పాలను మాత్రం తీసుకున్నాను" అని అన్నాడు.

ఆరాత్రి యశోదవర్మకు స్వప్నంలో – నల్లని దీర్ఘ దేహులు కొందరు అర్థవర్మలో – "నీవేల నేటి రాత్రి అక్రమంగా అరసేరు పాలు త్రాగావు? ఎవరి అబ్బ సొత్తు అని తీసుకున్నావు? వెడల గ్రక్కుండు" అని గద్దించి గ్రుద్దుచున్నట్లు తోచింది. ఉలికిపడి మేల్కొని చూచేసరికి అర్థవర్మ అజీర్ణంతో బాధపడుతూ వాంతి చేసుకుంటున్నాడు. అది చూచి యశోదవర్మ భోగానుభవం లేని అర్థ సంపద వ్యర్థం. అని భావించి, అక్కడనుండి మరునాడు భోగవర్మ ఇంటికి వెళ్ళాడు.

భోగవర్మ అతనికి అతిథి పూజలు చేసి కూర్చోపెట్టి, అప్పుడే ఆరోజు వ్యాపారంలో తనకు వచ్చిన లాభాన్ని సేవకుల కిచ్చి, పెక్కు పిండివంటలతో వంట చేయమని చెప్పి ఇంటికి పంపినాడు. ఆ పూట వారిద్దరు కలసి మృష్టాన్న, పానములు ఆరగించినారు. నిద్రించునపుడు పాలు కొంచెంగా ఉండుటచేత అతిథికిచ్చి భోగవర్మ ఊరకనే పాలు త్రావక పడున్నాడు. ఆ రాత్రి స్వప్నంలో సుందర శరీరులు కొంతమంది సేవకులను పట్టి కొట్టుతూ

"నేడేల మీ యజమానికి పాలు ఉంచలేదు" అని బెదిరిస్తూ, "తెండు మావాడు తెస్తున్న పాలు తీసుకొని పోయి యిమ్ము" అని లేపుచున్నట్లు కనిపించింది. యశోదవర్మ నిద్ర మేల్కొని చూడగా - "భోగవర్మ సేవకులతో దప్పికగా ఉంది. పాలు లేకున్న నీరైనా తెండు" అని చెప్పుచున్నాడు. సరిగ్గా అదే వేళకు ఎవరో ఒక సేరు పాలు తెచ్చి ఒక సేవకుని చేతికిచ్చి - "మా ఆవు సాయంకాలం దూడను చేరనీయలేదు. దానికి తవుడు పెట్టి ఆలస్యంగా పాలు పితికి, కాచి తెచ్చాను. మన్నించండి" అని చెప్పి వెళ్ళిపోయాడు. ఆ పాలను భోగవర్మ త్రాగి హాయిగా నిద్రించాడు.

మరునాడు యశోదవర్మ నిద్రలేచి, భోగవర్మ దగ్గర సెలవు తీసుకొని "భోగముగల అర్థము అల్పమైనను సార్థకము" అని భావిస్తూ, లక్ష్మీదేవి ఆలయానికి పోయి 'భోగశ్రీ' ని కోరి, భోగభాగ్యాలతో భార్య పుత్రాదులతో సుఖంగా జీవించినాడు. కాబట్టి భోగానుభవం లేని ధనం వ్యర్థం.



## 35. ఒంటరిగా త్రోవ నడువరాదు

**కం॥ చెడు పురుగు పుట్రలుండును**
**గడుకొని దోచికొన త్రోవగాతురు చోరుల్**
**పొదచూపు దుష్టమృగములు**
**నడువకు తెరువొంటరిగను నయ విద్యార్థీ!**

ఒంటరిగా ప్రయాణిస్తే దారిలో పురుగుపుట్రలుంటాయి. దొంగల భయం, క్రూరమృకాల భయం వెన్నంటి ఉంటుంది. అందుకే ఒంటరిగా త్రోవ నడువరాదని మన పెద్దలు అనేవారు. దానికి దృష్టాంతము.

ఒక దాసరివాడు చంకలో మూటను, నెమలి ఈకల కట్టను, ఎడమ చేతిలో గరుడ స్తంభాన్ని, జేగంటను, దానికి వ్రేలాడకట్టిన శంఖాన్ని పట్టుకొన్నాడు. కుడిచేతిలో ఒక కర్రను ఊతగా పెట్టుకొని తెల్లవారకముందే ఒక పల్లెనుండి మరోపల్లెకు పోవడానికి ఒంటరిగా వడివడిగా దారిన నడచి

పోవుచున్నాడు. ఆ మార్గంలో అతనికొక బావి కనిపించింది. దంత ధావణం చేసికొని శ్రీచూర్ణము, తిరమణి ధరించి దాసరి వేషధారికా దలంచి, తన చంకనున్న మూటను గరుడ స్తంభాన్ని ఆ బావి దగ్గరలో నున్న ఈతచెట్టు క్రింద బెట్టి, జేగంటను కూడా క్రింద పెట్టడానికి ఉద్యుక్తుడైనాడు.

ఒక ఎలుగుబంటి ఆ రాత్రి ఈత చెట్టెక్కి కల్లు త్రాగింది. మత్తెక్కి చెట్టు దిగలేక మిణకరిస్తుండిన ఎలుగుబంటి, చెట్టుక్రింద దాసరిని చూచి బెదరి దబాలును వాని ముందుకు దూకింది. దాసరి నివ్వెరపోయి, భూతమను కున్నాడు. తర్వాత ఎలుగుగొడ్డు అని తెలిసికొని, భయపడి చేతనున్న జేగంటను గణగణమని మోగిస్తూ, భంభమ్మని శంఖు ఊదుతూ, దానిని బెదరించి తరుమగొట్టడానికి యత్నించినాడు. కల్లు త్రావిన మైకంలో ఆ భల్లూకం ఘంటనాదానికి, శంఖానాదానికి ఆడ నారంభించిది.

తరుమగొట్టాలని గంట వాయిస్తే ఇది ఆడుచున్నదే! అని దాసరి గంటను నిలిపినాడు. ఆ భల్లూకం వాన్ని ఉరిమిచూచి మీద పడటానికి చేయి (ముంగాలు) పైకెత్తింది. అది చంపునేమో అనే భయంలో దాసరి మరలా గంట వాయిస్తూ శంఖం ఊదుచున్నాడు. అదియును ఆడుచున్నది. దాసరి ఘంటానాదానికి, ఎలుగుబంటి నాట్యానికి అంతం లేకుండెను. దాసరి అలసి గంట నిలుపగా, చంపుతుందనే భయంలో వాయిస్తూనే ఉన్నాడు. అది మత్తులో ఆడుతూనే ఉంది.

తెల్లవారిన తర్వాత కొందరు బాటసారులు ఆ దారిలో వస్తుండగా, వారిని చూచి ఆ భల్లూకం పారిపోయింది. దాసరికి చావుగండం తప్పింది. నిలకడ లేకుండా గంటను వాయిస్తూ, శంఖాన్ని ఊదడంతో మధ్యాహ్నం దాకా అతని కాళ్ళు చేతులు స్వాధీనానికి రాలేదు. ఇక ఒంటరిగా ఈ దారిన రారాదు అనుకుంటూ దాసరివాడు మెల్లమెల్లగా నడచి ప్రక్క ఊరు చేరుకున్నాడు. అందుకే పూర్వీకులు ఒంటరిత్రోవ నడువరాదన్నారు.



# 36. రానున్నవి రాకమానవు

"కష్టములు కోరకయెవచ్చు కరణి, ధరణి
సంపదలు వచ్చుగాన స్వసౌఖ్యమునకు
నితరులను పీడనము చేసి యేమతించి
ధనముతో పాపమార్జింప దగునె చెపుమ".

కష్టసుఖాలు, సంపదలు వారివారి కర్మానుసారంగా వచ్చిపోతుంటాయి. కష్టాలను, దుఃఖాలను ఎవరూ కోరుకోరు. అయినా వస్తుంటాయి. సుఖాలను, ఐశ్వర్యాలను కోరడం మానవనైజం. పూర్వజన్మలో తాను చేసుకున్న, పాప పుణ్యాలను బట్టి, కోరకనే సుఖదుఃఖాలు, ఐశ్వర్యం వస్తుంది. దీనికొక దృష్టాంత కథ.

పూర్వం కేశవుడనే దైవభక్తుడు మధురాపురంలో ఉండేవాడు. దైవికంగా లభించిన దాంతో తృప్తి చెందేవాడు. ఒకనాడు భిక్షాటనకై పొరుగూరికి పోయి తిరిగి వస్తుండగా దారిలో అతనికొక లంకెబిందె (లిబ్బి) కనిపించింది. దాన్ని చూచినా, తీసుకోలేదు. బిచ్చమెత్తిన బియ్యంతోనే తృప్తిపడి ఇంటికి వచ్చాడు. దారిలో చూచిన నిధి వృత్తాంతాన్ని భార్యకు చెప్పినాడు. దొరికిన దాన్ని ఎందుకు వదలి వచ్చావని భార్య అడిగింది. అందుకాతడు – "ఓసీ! పిచ్చిదానా! ఇతరుల సొత్తు మన కగుపడినా, మనం దాన్ని సంగ్రహింప తగదు. అది పాపకార్య మౌతుంది. అంతేగాక అట్టి ధనం ప్రాణిఘాతి అని నీకు తెలియదా! మనకు అదృష్టం ఉంటే ఆ కనిపించిన నిధి మన ఇంటికే వస్తుంది. మనది కాని దానిని స్మరించడం కూడా పాపమే. దాని సంగతి వదలి నెమ్మదిగా ఉండుమని భర్త అన్నాడు.

ఆ సంభాషణ అంతా గోడ అవతలి వైపు నుండి వింటున్న ఒక కంసాలి మిక్కిలి ఉప్పొంగి 'నా భాగ్యమే భాగ్యం'. దరిద్రుడు లభించినదాన్ని దక్కించుకోలేక పోయాడు. అని భావించాడు. కేశవుని భార్య వెళ్ళి ఎక్కడ ఆ నిధిని తెచ్చుకుంటుందో అనే సందేహంతో ఆమె కంటే ముందు లంకె

బిందెలున్న చోటికి చేరినాడు. ఆ బిందెలు అక్కడనే ఉన్నాయి. ఆనందంతో దానిలో ఏముందో తెలుసుకోవాలనే ఆత్రంలో పైమూత తీసి, చేతిని చొప్పించాడు. అప్పుడేం జరిగిందో తెలుసా? ఒక చలి తేలు కొండితో అతనిని కుట్టింది. ఆ నొప్పి బ్రహ్మ రంధ్రం దాకా వ్యాపించగా, లబలబ మొత్తుకున్నాడు. ఆ పాపి కేశవుడు తన్ను మోసగించాడు. అందుకే ఇట్లయింది. అని కొంతసేపు ఏడ్చి కుదుటపడ్డాడు.

కంసాలి, కేశవునపై కసి తీర్చుకోవాలనుకున్నాడు. ఆ లంకెబిందె పై మూతను యథాతథంగా పెట్టినాడు. దాన్ని నెత్తిని పెట్టుకొని తెచ్చి, కేశవుని ఇంటి పైకప్పు నుండి అతని ఇంటిలో పడేటట్లు కుమ్మరించినాడు. కేశవుని అదృష్టమేమోగాని, క్రింద కుమ్మరించగానే వీని కన్నులకు తేళ్ళుగా కనిపించినవి, బంగారు నాణెములై మ్రోగుతూ క్రిందకు జారినవి. ఆ చప్పుడు విన్న కేశవుడు మేల్కొని, భార్యను లేపి, కాంతా! చూశావా! 'మనకు ప్రాప్తమున్నది కోరకనే మన ఇంటికి వచ్చింది'. తీసుకోమన్నాడు. ఆమె మహానందంతో పరవశురాలై వాటిని ఏరి భద్రపరచింది. అది మొదలు వారు సుఖజీవులై ఆశ్రయించిన వారికి పెడుతూ, తాము తింటూ, హాయిగా సుఖంగా జీవితాలను గడుపుచున్నారు. రానున్నవి రాకమానవుగదా.



# 37. తృప్తి కంటె మించిన భాగ్యము లేదు

**"దొరికిన దానితోడ తుష్టివహించుట**
**మేలు, కోరికలకు మితములేదు,**
**అల్పమూతగొనుచు నాకాశసోపాన**
**ములను గట్టరాదు, మొదలు చేటు"**

అదృష్టవశంచే దొరికిన దానితో తృప్తిపడాలి. తృప్తి కలవాడు కుబేరు కన్నా ధనవంతుడు. తృప్తి కలవాన్ని దేవుడు ప్రేమిస్తాడు. తృప్తి కంటె మించిన భాగ్యం లేనే లేదు. గొంతెమ కోరికలలో దుఃఖాన్ని తెచ్చుకోరాదు. దీనికొక దృష్టాంత కథ.

రామావధాని అనే పేరుగల ఒక బ్రాహ్మణుడు ఒక ధనికుడిచ్చే సంతర్పణలో తుష్టిగ భుజించి, తన అదృష్టం కొద్దీ వచ్చిన పేలపిండిని దానంగా గైకొన్నాడు. రామావధాని ఆ పేలపిండి ముంతను తీసుకొని, ఎండకు తాళలేక ఒక కుమ్మరి ఇంట విశ్రమించి, నిద్దురరాక తనలో ఇట్లాలోచించినాడు.

ఈ పేలపిండిని ఉదరపోషణకై వాడకుండా, రెండణాలకు అమ్ముతాను. ఆ రూకలతో అంగూరు పండ్లు కొని అర్ధ రూపాయికి అమ్ముతాను. మరలా ఆ అర్ధరూపాయికి కొని, రెండు రూపాయలకు విక్రయిస్తాను. రెండు రూపాయలతో కొని పది రూపాయలకమ్ముతాను. ఆ డబ్బుతో ఒక బక్క నెల్లూరావును పట్టుకొని బలుపుగా మేపుతాను. దానికొక పేయదూడ పుడుతుంది. ఆ వెనుక రెంటికి రెండై, నాలుగు పదునారై క్రమంగా ఒక పెద్ద ఆలమంద అవుతుంది. ఆ మందను పదివేలకు విక్రయించి, మరొక మందచేసి కొంత కాలానికి ఆ రెండు మందలను కొన్ని లక్షలకు అమ్ముతాను. అటుపిమ్మట రత్నాలు వ్యాపారం చేస్తాను. చిత్రచిత్రమైన గొప్ప మేడకట్టి, మహారాజులందరినీ పరిచయం చేసుకుంటాను. అప్పుడు ఆ పట్టణాన్ని పాలించే రాజు నన్ను బ్రతిమాలి తన కూతురునిచ్చి పెండ్లి చేస్తాడు. అపుడు నేనెవ్వరినీ లక్ష్యపెట్టను. నేను కొంచెం కోపించితినా, రాజు, రాజు భార్య,

రాజు కూతురైన నా భార్య వచ్చి నన్ను బ్రతిమాలుతారు. నేను పట్టువదలక బిఱ్ఱబిగిసి కాలితో నా భార్యను తంతాను. అని అనాలోచితంగా, తన్నుతా మరచి నిజముగానే తన్నినాడు. ఆకాలి తన్నుకు పేలపిండి ముంతకు, దాని ప్రక్కనున్న క్రొత్త కుండల దొంతులకు తగిలి అన్నీ పగిలి పోయినవి. ఆ బ్రాహ్మణుడు ఉలికిపడి లేచినాడు.

ఆ ఇంటి కుమ్మరివాడు ఆ శబ్ధాన్ని విని పరుగెత్తికొని వచ్చి, కుండలు పగలడానికి కారణమైన ఆ బ్రాహ్మణుని చీవాట్లు పెట్టి పంపినాడు. తన ఆలోచనలు పాడై పోవడమే గాక, రాత్రిపూట గడవడానికి పేలపిండి కూడా లేక లోలోన ఏడుస్తూ ఇంటికి తిరిగి వెళ్ళినాడు. కాబట్టి ఆకాశ సోపానములు కూడదు.



## 38. తెలిసిన వారివలె నటింపరాదు

**కం॥ అర్థమెఱిగి పలుకుట, కా**
**మ్యార్థ ప్రదమంత్రు పెద్దలదియారసి స్ప**
**ష్టార్థకముగ బలుకుము, ధ**
**ర్మార్థాదికములును నీకు నగు విద్యార్థీ!**

తెలియనివాడు, తెలిసిన వానిలా నటిస్తూ మాట్లాడితే కలిగే అనర్థాలకు అంతుండదు. చదువనివాడు చదివిన వానివలె నటించే ఓ మూఢుని కథ.

ఒకానొక మూఢుడు ఒకనాడు ఒక విద్వాంసుని ఇంటికి వచ్చాడు. విద్వాంసునితో సరసంగా మాట్లాడాలనే ఉద్దేశంతో ఆ మూఢుడు స్వామీ! ఒక 'చెంబు వడ్డించండి. ఒక మంచం వడ్డించండి' అని అన్నాడు. పండితుడు వాని తెలివికి అబ్బురపడి – 'నీవు మహిషము లాగున్నావే?' అన్నాడు. పండితుడు తనను పొగడుచున్నాడని అర్థం తెలియని ఆ మూఢుడు 'చిత్తం చిత్తం పండితులవారూ! మూడు తరాల నుండి మావారు తమ వంటివారి

అను(గహం చేత ఇట్లే అశ్వినీ, భరణులులాగా ఉండండని కూడా అనిపించు కున్నాము' అని అన్నాడు. అర్ధం తెలియకపోతే ఇలాంటి అనర్థాలు కలుగుతాయి.

పూర్వం త్వష్ట, తన కొడుకును ఇం(ద్రుడు చంపినాడని, ఆతనిపై పగతో (బహ్మదేవుని గూర్చి తపస్సు చేశాడు. వాని తపస్సుకు మెచ్చి (బహ్మ (ప్రత్యక్షమై 'నీకేమి వరం కావాలో అడుగు, ఇచ్చెదను' అన్నాడు. ఇం(ద్రుని చంపునంత కుమారుడు కావాలని త్వష్ట సంస్కృత భాషలో అడగదలిచాడు. త్వష్ట సంస్కృత భాషలో పండితుడైనా, (బహ్మను వరం అడిగేటప్పుడు ఒక అక్షరం ఉచ్చరించ వలసిన (క్రమాన్ని స్వరభేదంతో ఉచ్చరించి అడిగాడు. స్వరభేదంలో పలికినందున అర్థం తారుమారైంది. (బహ్మదేవుడు వరమిచ్చి సత్యలోకానికి వెళ్ళినాడు. కొన్నాళ్ళకు త్వష్టకు వృతుడు అనే కొడుకు కలిగాడు. వాడు పెద్దవాడై దుష్టుడై దేవతలందరినీ బాధిస్తుండగా ఇం(ద్రుడు కోపించి వాన్ని చంపినాడు.

త్వష్ట (బహ్మను వరం కోరేటప్పుడు 'ఇం(ద్రుని చంపు కొడుకు' అని కోరాలని, స్వరభేదంతో ఉచ్చరించినందువల్ల 'ఇం(ద్రునిచే చచ్చు కొడుకు' అని అర్థం ఏర్పడింది. కాబట్టి బాలురు చదువునప్పుడు, ఇతరులతో మాట్లాడేటప్పుడు స్పష్టంగ, అపస్వరం లేకుండా, అర్థం చెడకుండునట్లుగా మాట్లాడాలి.

**కం॥ స్వరభేదమైన పలుకున**
**కరము చెడును భవమందు గార్యము చెడుటే**
**స్థిరమగు నిష్టార్థంబును**
**వరమడిగిన త్వష్ట చెడియె వర విద్యార్థీ!**



## 39. బుద్ధి బలము గొప్పది -1

**"మందమతులెంత కోపులై మలయుచున్న**
**గత్తికొని చంపవచ్చినగాని, బుద్ధి**
**బలము గలవాడు దొరకక తొలగగలడు**
**కనుక నద్దాని నార్జింప జను జనునకు".**

ఎంతటి బలవంతునైనా,- కోపంగల వారినైనా, బుద్ధిబలంతో గెలవవచ్చు. దీని కొక దృష్టాంత కథ.

ఎఱ్ఱావారిపాళెం ఏలుచుండిన ఎఱ్ఱమరాజు నిరక్షరకుక్షి. ఒకసారి విద్వాంసులను ఓడించి, అధిక విద్వాంసుడని పేరు గడించాలని నిశ్చయించాడు. "విద్వాంసులకు అవారిగ బహుమతులీయబడును" అని ఒక పటం వ్రాయించి వాకిట గట్టించినాడు. అది చూచి పండితులు రాసాగిరి. వచ్చిన పండితుని తన ఎదుట నిలిపి – "చక్కని కైత చెప్పుము. తప్పు పోయెనా తల నరకింతును" అని, తలవరులను ఇరుప్రక్కల కత్తులతో నిలుపును. ఆ కవి కవిత్వంలో తనకు "తప్పు" అని తోస్తే వెంటనే 'పదెరాయి సగనం' అంటాడు. వెంటనే తలవరులు తల నరికి వేస్తారు. ఆ విధంగా ఎఱ్ఱమరాజు ఆస్థానానికి పోయిన కవి ఒక్కరైనా ప్రాణాలతో తిరిగి వచ్చేదిలేదు.

ఈ క్రూరకృత్యాన్ని విని కవిరాజైన శ్రీకృష్ణదేవరాయలు, వికటకవి అయిన తెనాలి రామకృష్ణుని ప్రోత్సహించి పంపించినాడు. అతడు గుండెలరచేత పెట్టుకొని ఎఱ్ఱమరాజును దర్శించాడు. రాజు ఎప్పటిలాగే ఏర్పాట్లుచేసి కవిత్వం చెప్పమన్నాడు. తెనాలి రామకృష్ణ కవి వాని యోగ్యత ఎరిగి గొంతు సవరించుకొని –

**పాట॥ "అవురయిదెంత ఆశ్చర్యమన్న అ ఆ ఇ ఈ ఉ**
**ఎఱ్ఱమరాయడు జాణగదన్నా ఎ ఏ ఒ ఓ ఔ**
**కరుణగలాడు, కైతగలాడు క ఖ గ ఘ ఙ**
**చెప్పినమాట తప్పదురన్న చ ఛ జ ఝ ఞ**

టక్కరిగాడు పక్కీరుగాడు ట ఠ డ ఢ ణ
దబ్బరగాడు దాతగాడన్న త థ ద ధ న
పలికి బొంకకు పండితుడన్న ప ఫ బ భ మ"

అని పాట పాడగా ఎఱ్ఱమరాజు "బలే! బలే! ఇట్లుండాలి కవిత్వం! ఉన్నదున్నట్లు చెప్పితివి" అని మెచ్చుకొన్నాడు. నూరు వరహాలిచ్చి, ఇంకో పద్దెము చెప్పుమన్నాడు.

సీ॥ "నీయూరు నెఱ్ఱన - నీపేరు నెఱ్ఱన
నీ ప్రతాపంబెర్పు - నీవు నెర్పు
ఇంగిలీ కమ్మెఱుపు - పెఱ్ఱలు నెఱుపన్న
కాపుఱాయి యెఱుపు - గరుడు డెఱుపు
దొండపండెఱ్ఱమో - దుగపూత యెఱ్ఱన్న
గురుగింజ యెఱ్ఱన" - అనుచుండగానే పడెరా యిసగనం అని

రాజు అరచినాడు. తలవరులు తక్షణమే కత్తులు పైకెత్త సాగిరి. తెనాలి రాముడును రెండు చేతులెత్తి తాళుతాళు ఇంకా చెప్పెదను' అని మరింత గట్టిగా అరచినాడు. పైకెత్తిన కత్తులను తలవరులు క్రిందికి దించినారు. రాజు కవిని చూచి 'కయీస్వరా! గురుగింజ యెఱ్ఱన అంటివే దాని క్రింద వుండే నల్లన చెప్పితివా? అది యిసగనం కాదా? నిన్ను నరకవలసిందే కదా? అన్నాడు'.

"ప్రభూ! నేనంత తెలివి తక్కువ వాడనుగాను. గురిగింజ కన్నా ముందు వచ్చిన కాపురాయి ఆ నలుపును కప్పి వేస్తుంది. అని తన చంకలోని కాపురాయి తీసి ఆ నల్లన్నకు పూసెను. రాజు 'సెబాస్! బలే తమాష! బలే తమాష్! ఇట్లా ఉండాలె కయిత్తమంటే! నీకు వెయ్యెన్నూట పదార్లు ఇచ్చినాను. తీసుకొని వెళ్ళు అని మర్యాదచేసి పంపినాడు. కాబట్టి సమయస్ఫూర్తి, బుద్ధిబలం ఎంతైనా అవసరం.



# 40. బుద్ధిబలం గొప్పది

"దేహబలము వలన దీరని పనులెల్ల
బుద్ధిబలము వలన బొసగుచుండు
బుద్ధిబలము జగము బూనిలో గొనజాలు
దానికుద్ది జగతి గానరాదు".

దేహబలం వల్ల సాధింపరాని కార్యాలను బుద్ధిబలం చేత సాధించుకోవచ్చు. దేహబలం కన్న బుద్ధిబలం మిన్న. బలవత్తరమైన ఆహారంచేత, కసరత్తులచేత దేహబలం వృద్ధి పొందుతుంది. సద్విద్యచేత, సదాచారాలచేత, సత్సాంగత్యాలవల్ల బుద్ధిబలం వర్ధిల్లుతుంది. దీనికొక దృష్టాంత కథ.

పూర్వం అప్పాజీ అనే పేరుతో మంచి తెలివితేటలు గల ఒక బుద్ధిమంతుడుండేవాడు. ఆదేశం నవాబు అప్పాజీ తెలివితేటల గురించి విన్నాడు. అతన్ని పరీక్షించాలని నవాబుగారు ఒక చిన్న మూతిగల కూజాను తన సేవకులతో అప్పాజీకి పంపిస్తూ, 'నీ తెలివినంతా దీనిలో నింపి పంపించు' అని చెప్పి పంపాడు. నవాబు తనను పరిహసించుచున్నాడని వెంటనే తెలివిగల అప్పాజీ గ్రహించాడు. సరే తర్వాత పంపుతానని సేవకులను పంపేశాడు. ఆ కూజాను గుమ్మడి పొదలో నుంచి, ఒక పిందెను కడవలోనికి చొప్పించాడు. ఆ గుమ్మడికాయ ఆ కూజాలోపలనే పెద్దదయింది. అప్పాజీ దాన్ని త్రుంచి నవాబుకు పంపిస్తూ – "నా తెలివి ఇట్లా పంపిస్తున్నాను, తమ తెలివితో కడవను పగులగొట్టకుండా దీనిలోని గుమ్మడికాయను బయటకు తీసుకోండి" అని చెప్పి పంపాడు. నవాబు ఆ కాయను బయటకు తీయలేక సిగ్గుపడ్డాడు. నవాబు అతని తెలివితేటలను మెచ్చుకొన్నాడు. కాబట్టి దేహబలంకన్నా బుద్ధిబలం గొప్పది.



# 41. సమయస్ఫూర్తి

"తెలివి తక్కువతో నేది పలుకరాదు
బుద్ధిమంతుల నది పొనరుచునెడ
మానమును బోవు నెల్లిదమౌనుగాన
సమయమునకు దగినరీతి సభలనుడువు".

బుద్ధిమంతులు సమయం, సందర్భాన్ని బట్టి ప్రవర్తించాలి. తెలువ తక్కువతో మాట్లాడరాదు. సమయస్ఫూర్తితో వ్యవహరించాలి. దీనికొక కథ.

ఒక మంత్రిగారి భార్య అధికార గర్వంతో మిడిసిపడేది. ఆమె ప్రతిరోజు ఒక కొలనులో స్నానం చేసేది. ఆ కొలను దరిదాపులకెవరూ రాకూడదని మంత్రిగారి ఆజ్ఞ. ఒక తుంటరి, మంత్రి భార్య వారించినా వినకుండా ఆ కొలనులో దిగి స్నానం చేసి వెళ్ళిపోయాడు. ఆమె మిగుల కోపంతో 'ఆ శుంఠను కఠినంగా దండించండని తన భర్తతో చెప్పింది. భార్యా విధేయుడైన ఆ మంత్రి ఆమెకు బదులు పలుకలేక, అట్లే కానిమ్మని ఆ తుంటరి పిల్లవాన్ని పిలిపించి, రేపు ఉదయం ఆరు గంటలకు నీవు నా ఎదుటకు రావాలి అని ఆజ్ఞాపించినాడు.

ఆ బాలుడు మరుసటి రోజు ఆలస్యంగా 10 గం॥లకు వచ్చాడు. మంత్రి నా ఉత్తర్వు దిక్కరించి ఆలస్యంగా ఎందుకు వచ్చావని ప్రశ్నించాడు. ఆ పిల్లవాడు – వినయంగా, 'అయ్యా! మీ ఆజ్ఞ ప్రకారం నేను వస్తుండగా మార్గమధ్యలో ఒక పెద్ద సభ జరుగుతూంది. చూచి వత్తమని అక్కడకు వెళ్ళాను. లోకంలో స్త్రీల సంఖ్య అధికమా! పురుషుల సంఖ్య అధికమా! అని చర్చ జరుగుతూంది. ఎట్లా తేలుతుందో చూద్దామని నిలబడ్డాను. తర్జన భర్జనల తర్వాత స్త్రీల సంఖ్యయే అధికమని సిద్ధాంతీకరించినారు. అని అన్నాడు.

అప్పుడా మంత్రి ఓరీ! లోకంలో స్త్రీ, పురుషులు సమంగా ఉండాలిగాని స్త్రీలెక్కువ ఎలా ఉంటారు? ఈ సందేహం ఆ సభలో ఎవరికీ కలుగలేదా! అని ప్రశ్నించాడు. ఆ పెంకి బాలుడు మంత్రిగారూ! మీకు కలిగిన సందేహం

ఆ సభలో ఒకరికి తోచింది. ఆ విషయం కూడా చర్చకు వచ్చింది. తీర్మానకర్తలు 'భగవంతుడు ప్రపంచంలో ఆడువారిని, మగవారిని సమంగానే సృష్టించాడు. అందువల్ల లోకంలో ఆడువారి సంఖ్య సగం మాత్రమే. మిగిలిన సగంమంది మగవారిలో ఆడువారి మాటలు విని, నిరపరాదులైన వారిని బాధించే ఆడంగులున్నారు కదా! అట్టివారు మగవారైనా ఆడవారి క్రింద జమ కట్టాలిగదా! కాబట్టి ఆడువాండ్ర సంఖ్య అధికమైందని తేల్చినట్లు బదులిచ్చాడు.'

ఆ మంత్రిపుంగవుడు వాని మాటలు విని తన సంగతి ఆలోచించుకొని 'వీడు లెస్సగా బుద్ధి చెప్పినాడు' అని వాని బుద్ధిని మెచ్చుకొని దండింపక పంపివేశాడు. కాబట్టి సమయస్ఫూర్తి ఎంతైనా అవసరం.



## 42. త్రాగుబోతుల జేరరాదు

**"తెలివి నశియించు, క్షీణించు దేహశక్తి**
**ధనము నష్టమౌ, నవమతి నొనరజేయు**
**సభల జిన్నపుచ్చును, గంపసహ్యమగును**
**త్రాగుడెట్టివారికయిన దగదు తగదు".**

త్రాగుడు, జూదము వంటి వ్యసనాలు అలవడితే జన్మాంతరం దాకా వదలదు. ఈ వ్యసనాలుండే దురభ్యాసులతో చేరరాదు. చేరితే చేటుకలుగుట తథ్యం. దీనికో దృష్టాంత కథ.

ఒక సాలెవాడు త్రాగుబోతులతో కూడి త్రాగుడు నేర్చుకొని, దానికి బానిసైనాడు. వాని తండ్రి కొన్నాళ్ళు తెలియక, తెలిసియు నమ్మక కొన్నాళ్ళు, కొడుకుపై గారాబంతో పైకి చెప్పలేక కొన్నాళ్ళు గడిపాడు. తుదకు పాకం

ముదురుటచే ఒకనాడు కొడుకును పిలిచి కుమారా! ఈ త్రాగుడు మానుకో! ఇది నీచము. అవమానకరం. నలుగురిలో చులకన అవుతావు. అంతేగాక ధన నష్టం, ఆరోగ్య నష్టం కలుగుతుంది. ఇట్టి దురభ్యాసం నీకేల పట్టువడింది? దీన్ని పూర్తిగా ఇప్పుడే మానుమని పలురకాలుగా బోధించాడు. మీతాత, ముత్తాతలు ఈ వ్యసనం వల్ల శీఘ్రంగా మృతి చెందిరని కూడా చెప్పినాడు. తండ్రి మాటకు తలూపి అట్లేకానిమ్మని అన్న కొడుకు ఆ వ్యసనాన్ని మానలేక పోయాడు.

మరొక రోజు తండ్రి వాన్ని దగ్గరకు పిలిచి ఇట్లన్నాడు. నాయనా! దేహం మీద వస్త్రం ఉండేది లేనిది తెలియనీక మత్తు కలిగించే, మానాన్ని, ధనాన్ని, నరాల పటుత్వాన్ని పోగొట్టి, బుద్ధిని చెరచి, సభలో తలెత్తుకోనీక చేసే ఈ చెడ్డ అలవాటును మానుకోమని బుద్ధులు చెప్పి చూసెను. ఇంకా ఈ వ్యసనం కాకి వలె వికార స్వరంతో అరపింప చేస్తుంది. కోకిలలాగా కొంత సేపు పాటలు పాడిస్తుంది. కోతిలా కుప్పిగంతులు వేయిస్తుంది. ఈ దురభ్యాసం వల్ల ఏమాత్రం లాభం లేదు. యాదవులు ఈ మధుపానం వల్లనే చెడ్డారు. శుక్రాచారుడు చెడి శాపమిచ్చింది దీనివల్లనే. అని సుతునకు జనకుడు పురాణ నీతులను హితోపదేశం చేశాడు. ఏమి బదులు చెప్పెదవన్నాడు.

చివరకు కొడుకు తండ్రివంక చూస్తూ, నాయనా! దీన్ని నిలపాలంటే నీవు నాతో కలసి ముప్పది రోజులు త్రాగు. ముప్పది ఒకటో రోజు ఇద్దరం కలసి వదలి పెడతాం. ఇంతకంటే వేరు మార్గం లేదన్నాడు. తండ్రి మరికొన్నాళ్ళు చెప్పినా, అదేమాట అంటున్నాడు. తుదకు వాని ఒడంబడికకు సమ్మతించి కొడుకుతో కలసి, త్రాగుడు మోతాదును పెంచుతూ ముప్పది రోజులు త్రాగినారు.

ముప్పది ఒకటవ నాడు కొడుకు తండ్రిని చూచి నాయనా? 'నేటి నుండే మనం త్రాగుడును నిలపవలసింది' అన్నాడు. వెంటనే ఆ తండ్రి పోపోరా! నీవు నిలిపినా సరే! నేను నిలుపను. నాకు కులాచారంగా వచ్చిన

ధర్మమిది! ఇల్లు, వాకిలి, ఆలుబిడ్డలు అన్నీ పోయినా, చివరకు నా ప్రాణం పోయినా దీన్ని వదలనన్నాడు. అంతేగాక –

కం॥ "కల్లున సురలైరమరులు
కల్లుననే పరమశివుడు కాపురముండెన్
ఇల్లును వాకిలి నమ్మియు
కల్లే త్రాగంగవలయు ఘనులు సురలుగాన్."

అని అన్నాడు. తండ్రి మాటలు విన్న కొడుకు నీవు ముప్పది దినాలకే రుచి మరగి వదలలేనప్పుడు, నేను మూడేండ్లు అలపడ్డవాడను, ఎలా వదలగలను? అన్నాడు. అది మొదలు తండ్రి కొడుకులు ఇద్దరు కలసి త్రాగి ఇల్లు వాకిలి సర్వస్వాన్ని పోగొట్టుకొని పాడైపోయినారు. కాబట్టి త్రాగుడు ఎట్టివారికైనా తగదు. తగదు.



## 43. జూదమాడరాదు

"ధనము నష్టమౌ కొలది మత్సరము హెచ్చు
ఖేదముం గూర్చు మఱియపకీర్తి దార్చు
దుష్టపథముల కీడ్చు మోదంబుమాడ్చు
నిట్టి జూదంబు నాడుట హితమెచెపుమ".

సప్త వ్యసనాలలో జూదం ఒకటి. ఇతరులు అసహ్యించుకొనే వ్యసనాలైన త్రాగుడు, జూదం వంటి వానిని వెంటనే త్యజించాలి. జూదం వల్ల ధన నష్టమే కాకుండ, మాత్సర్యాన్ని కూడా పెంపొందిస్తుంది. ఖేదాన్ని కల్గిస్తుంది. మన సంతోషాన్ని, పరువును భంగపరుస్తుంది. కాబట్టి జూదం ఆడటం తగదు. నలమహారాజు, ధర్మరాజుల వృత్తాంతమే దీనికి దృష్టాంతం.

పూర్వం నిషధ దేశాన్ని పాలించే రాజైన నలమహారాజుకు జూదమంటే ప్రీతిమెండు. షట్చక్రవర్తులలో ఒకరైన నలుడు తమ దాయాదియైన పుష్కరునితో జూదమాడినాడు. మంత్రులు, హితులు ఎన్నో విధాల జూదం వద్దని చెప్పినా వినలేదు. స్నేహితులు, బంధువుల మాటలు పెడచెవిని పెట్టినాడు. అర్ధాంగి దమయంతిచే చెప్పించినా ప్రయోజనం లేకపోయింది. చివరకు, నలుడు రాజ్యానంతా జూదంలో పోగొట్టుకున్నాడు. అతని దాయాది పుష్కరుడు, 'హేళనంగా ఇక నీకు మిగిలింది ఒకటి ఉంది,' అదే నీ ప్రాణ ప్రియసఖి – దమయంతి! దానిని ఒడ్డి రాజ్యాన్ని తిరిగి జయించుకో! అని పలికినాడు. నలుడు సిగ్గుతో, కోపాన్ని, అవమానాన్ని దిగమ్రింగుకొని, ఏమీ చేయలేక, కట్టుబట్టలతో ఆలితో అరణ్యానికి పోయినాడు. నలుని ఈ దుస్థితికి కారణం జూదమే గదా?

ఇక పాండవులు సర్వస్వాన్ని ఓడి అడవులపాలు కావటానికి కారణం జూదమేగదా! ధర్మరాజు సోదరులతో కలసి రాజసూయ యాగాన్ని దిగ్విజయంగా పూర్తిచేసినారు. దుర్యోధనుడు ఆ వైభవాన్ని చూచి, అసూయ చెందినాడు. పాండువులను మంచిగానే పిలిపించి, ద్యూతప్రియుడైన ధర్మరాజును జూదమాడడానికి పురికొల్పినాడు. ధర్మరాజు తుదకు అంగీకరించి, దుర్యోధనుని పక్షాన శకునితో జూదమాడడానికి పూనుకున్నాడు.

శకుని అంటేనే మోసం. కపటం మూర్తీభవించినవాడు. మనసా, వాచా, కర్మేణ మోసగాడు. శకుని దగ్గర జరాసంధుని ఎముకలతో చేసిన మంత్ర పూరితమైన పాచికలున్నాయి. ఆ పాచికలు తను అనుకున్నట్లు పడతాయి. జరాసంధుని చంపినవాడు భీముడు. వాని గొంతు వింటే ఎముకలు (పాచికలు) భయపడి శకుని చెప్పినట్లు పడవు. ధర్మరాజు పాచికలు వేసేటప్పుడు మనదే గెలుపు! మనదే పందెం! అని భీముడు వేడుకకై అనుచున్నాడు. పాచికలు శకుని మాట వినడంలేదు. శకుని మొగం వెలవెల పోయింది. జరాసంధుని చంపిన భీముని పలుకువింటే తన ఆట సాగదని

శకుని గుర్తించి, భీముదు మాటలాడరాదని శకుని కోరినాడు. ధర్మరాజు భీముని వారించినాడు. పాండవులకీ విషయం తెలియదు.

అంతట ధర్మరాజు సర్వం ఓడిపోయినాడు. ఇక ఒడ్డేదానికి ఏమీ మిగలలేదు. ఇక తన తమ్ములను వరుసగా సహదేవుని, నకులుని, అర్జునుని, తుదకు భీమసేనుని కూడా పందెంలో దారబోసినాడు. తనను కూడా ఉంచుకొని జూదమాడగా మాయాపాచిక ప్రభావంచే తన్నుకూడా ఓడిపోయినాడు. శకుని చేతిలో అన్నీ ఓడిపోయిన ధర్మరాజును హేళన చేస్తూ, ధర్మరాజా! మీ భార్య ద్రౌపదిని పణంగా పెట్టి ఆడు. గెలుతువేమో! అన్నాడు. జూదంలో విచక్షణ కోల్పోయిన ధర్మరాజు రోషావేశంలో ద్రౌపదిని పణంగా ఒడ్డినాడు. భీమార్జునులు వద్దని వారించినా వినలేదు. వ్యసనాలకు లోనైన వారికి యుక్తాయుక్త జ్ఞానముండదు గదా? ద్రౌపదిని కూడి ఓడిపోయినాడు.

తదనంతరం దుర్యోధనుడు 'ద్రౌపదిని నిండు సభలో వస్త్రాపహరణ చేయమని' దుశ్శాసనుని ఆజ్ఞాపించినాడు ఆపద్బాంధవుడైన శ్రీకృష్ణుడు ద్రౌపది మానాన్ని కాపాడినాడు. జూదం కారణంగా పాండవులు, ద్రౌపదితో పాటు పండ్రెండేండ్లు అరణ్యవాసం, ఒక సంవత్సరం అజ్ఞానవాస కాలంలో విరటుని కొలువులో నీచవృత్తులలో కుదిరి, కాలాన్ని వెలిబుచ్చినారు. అరణ్య, అజ్ఞాత వాసాలు పూర్తి చేసుకొని, కౌరవులతో యుద్ధం చేసి జయించి, పాండవులు తిరిగి రాజ్యాన్ని పొందినారు.

పాండవులు ఇన్ని కష్టాలు పడటానికి కారణం జూదమేగదా? అట్టి జూదం జోలికి పోరాదు. జూదమాడి (కోడిపందేలు, చీట్ల పేకలు) బాగుపడ్డ వాడొక్కడూ జగాన లేదు.



# 44. మనిషి చేసే కార్యానికి రహస్యం లేదు

**తే॥గీ॥ అణువు మొదలుగ బ్రహ్మ పర్యంతముగల**
**సర్వ వస్తువు లందున సమత నిండి**
**నడుపు చుండంగ దేవుడు నడవనగునె!**
**యతని యొఱంగించి యెట్లు రహస్య ఫణితి"**

ఒక కాపువాడు ఒక రోజు నాగలిని, కాడిని భుజంపై పెట్టుకొని ఎద్దుల్ని తోలుకొని పొలానికి పోతున్నాడు. ఆయన భార్య జొన్న విత్తనాల బుట్టను చంకలో పెటుకొని భర్తను అనుసరిస్తోంది. వాళ్ళు వెళ్ళే దారిలో ఒక వినాయకుడి గుడి వుంది. ఆ కాపువాడు ప్రతిరోజు వస్తూ పోతూ పంట బాగా పండాలని, ఎద్దులు ఎలాంటి రోగం లేకుండా బాగా కష్టపడి పని చేయాలని, తన కుటుంబం సుఖ సంతోషాలతో వుండాలి అని ఇలా ఏదో ఒకటి ఆ సమయానికి తోచినవన్నీ కోరుకుంటూ వినాయకునికి నమస్కరిస్తూ వుండేవాడు.

ఎవరైనా ఒక పనికి అలవాటుపడితే తాను మరిచిపోయినా తనకు తెలియకుండానే అలవాటే ఆ పనిని చేయిస్తుంది. కాపువాడు అలవాటు ప్రకారం విఘ్నేశ్వరుని దేవాలయం దగ్గర నిలబడి స్వామి వైపు తిరిగి "స్వామి! నేనిప్పుడు చల్లబోయే ధాన్యము పదినూర్ల పుట్లైతే, గంపెడు గింజల్ని కొట్టి అంబలికాచి నీపేరు చెప్పి గుడి దగ్గరున్న పేదలకు పోస్తాను" అని మొక్కాడు.

ఆ మాటలు విన్న అతని భార్య ఉలికిపడి "ఏమయ్యా ఎవరి ప్రాణాలు తీయడానికి ఇలాంటి మొక్కులు మొక్కావు. ఒకవేళ నీవు కోరుకున్నట్లే పండిందనుకుందాం. గంపెడు గింజల్ని కొట్టడం, విసరడం, అంబలి కాయడం, ఇక్కడికి మోసుకొని రావడం, అందరికి పోయడం ఇవన్నీ సాధ్యమౌతాయా! నావల్లగాదు" అంది. అపుడు ఆ కాపు భార్య వైపు తిరిగి తన ఎడమ చేతిని వినాయకునికి తన ముఖం కనిపించకుండా అడ్డంగా పెట్టి "అయ్యో పిచ్చిదానా! ఊరుకోవే. ధాన్యం పండనీ, తర్వాత వానికి ళు ళు ళు ళే" అని నాలుకను అడ్డంగా ఆడించాడు.

ఆ భగవంతునికి తెలియనిది ఏముంది? లోకనాథుని కళ్ళు మనం మూయగలమా? దేవుని ముందు అబద్ధాలాడి తప్పించుకోలేము. అలా చేస్తే మన తప్పులు రెట్టింపవుతాయి.



# 45. మాతృభక్తి

ఆ.వె॥ "జనని తన్ను గర్భమున మోచికొని యొక
కడప దాఁటినట్టి కష్టమునకు
బ్రతికినంతదాక పలువిధ సేవ ల
నర్ప సమము గావు నరులకెన్న"

"తల్లిని మించిన దైవం లేదు" అన్నది యెన్నో తరాలుగా మనం వింటూనే వున్నాం. జ్ఞానులు, వేదవేత్తలు, పెద్దలు "మాతృదేవోభవ......" అంటు తల్లికి మొదటిస్థానాన్ని కేటాయించారు. శ్రీరామచంద్రుడు సవతి తల్లి మాట జవదాటక పధ్నాలుగేళ్ళు వనవాసం చేశాడు. గరుత్మంతుడు తల్లి దాస్య విముక్తి కోసం యేకంగా ఇంద్రుడి వద్దకు వెళ్ళి అమృత భాండాన్నే తీసుకొచ్చాడు. ఇలా తల్లికోసం మనం యెన్ని పనులు చేసినా ఆమె ఋణాన్ని తీర్చుకోలేము. అలాంటి తల్లిపట్ల వుండవలసిన భక్తి వాత్సల్యాలను గూర్చి మూర్ఖులైన బిడ్డలకు అర్థమయేలా చేయడమే ఈ నాటక సారాంశం.



రామచంద్ర : ఏరా గోపాల్! ఎక్కడికి? అలా పరుగు పరుగున వెళ్తున్నావు?

గోపాల్ : ఆ ఏమి లేదు రామూ! కూరగాయలు కొనడానికి అంగడి వీధికి వెళ్తున్నా.

రామ : ఆశ్చర్యంగా వుందే!

గోపాల్ : ఏం? మా అమ్మ నాకు రూపాయిచ్చింది. సీతాఫలం కొనుక్కుందాం. నువ్వు కూడ రా!

రామ : అందుకే ఆశ్చర్యం అన్నాను. ఏరోజు యిలాంటి పనులకు రావే. ఓహో! ఒక్క రూపాయి కోసం వచ్చావు కాబోలు.

గోపాల్ : అబ్బే అదేం లేదు అమ్మ మరీ బ్రతిమాలితే వచ్చాను.

రామ : నిజంగానే యిది వింత.

గోపాల్ : రామచంద్రా! ఎందుకలా అంటున్నావు? నీ మాటలు నాకు అర్థం కావడంలేదు.

రామ : కేవలం కూరగాయలు తేవడానికి మీ అమ్మ నిన్ను బ్రతిమాలితే, అదీ లంచమిస్తే ఒప్పుకున్నావు. అమ్మను బాధపెట్టావు. నీవు పాపం చాలా కష్టపడ్డావు.

గోపాల్ : నాకేం కష్టంగాలేదు. ఆనందంగా వుంది.

రామ : ఆమెను యెందుకు నువ్వు “మా అమ్మ” అంటున్నావు?

గోపాల్ : ఆమె నాకు జన్మ నిచ్చింది కాబట్టి.

రామ : తొమ్మిది నెలలు మోసి కన్నందుకే కదా!

గోపాల్ : అవును

రామ : నువ్వు పుట్టిన తర్వాత చీమ కుట్టినా, నల్లి కుట్టినా, నువ్వు యేడిస్తే ఆ బాధను తాను అనుభవించి, నీకు ఆకలివేసి అడగడానికి మాటలు రాక ఏడ్చినపుడు పాలిచ్చి రక్షించింది అమ్మకదా!

గోపాల్ : అవును అమ్మకాక యింకెవరు చేస్తారు?

రామ : అంతేకాదు. నీవు కడుపులో వున్నప్పుడు ఉప్పో, కారమో ఎక్కువగా తింటే, నీవు లోపల బాధపడతావేమోనని, తానేవైనా భయంకరమైన రూపాలను చూస్తే నీకు అంగవైకల్యం వస్తుందేమోనని భయపడుతూ, అందమైన రూపాలనే చూస్తూ, నీకోసం తన కోరికలను సైతం వదులుకొంది మీ అమ్మనే కదా!

గోపాల్ : నీవు చెప్పిందంతా నిజమా? నిన్న మా బళ్ళో మాష్టార్లు కూడ ఈ విషయాన్నే చెప్పారు. కాని అది పుస్తకంలో పాఠమేకదా! అనుకున్నాను.

రామ : ఈ వయస్సులో నువ్వు అనుభవంతో నేర్చుకోగలిగింది చాలా తక్కువ. కొన్నింటిని గురువులు చెప్పింది నిజమని నమ్మితే, కొద్ది రోజుల తర్వాత అవి నీ అనుభవంలోకి వస్తాయి.

గోపాల్ : అన్ని విషయాలను సాక్ష్యాలతో నిరూపిస్తామని మన గురువులు అంటుంటారు. అది అసత్యమా?

రామ : అంటారు నిజమే. కాని అన్ని విషయాల్ని సాక్ష్యాలతో చూపడం సాధ్యం కాదు.

గోపాల్ : అయితే నువ్విప్పుడు ఏమంటావు?

రామ : పెద్దలు చెప్పినమాట వినాలి. తర్వాత నమ్మాలి. చెప్పినట్లు నడచుకోవాలి. నీవు పుట్టినప్పటి కంటే ఇప్పుడు ఎదిగావు. ఎవరివల్ల?

గోపాల్ : అమ్మవల్ల.

రామ : అలాంటి అమ్మనుండి నువ్వు లంచం తీసుకొని పని చేస్తున్నావే అది తప్పు కదా! మనం పుట్టినందుకు మాతృసేవను మించి చేయగలిగింది వేరొకటి వుంటుందా?

పదిమంది గురువులకంటే ఒక కులగురువు, నూర్గురు ఆచార్యుల కంటే తండ్రి, వేయిమంది తండ్రులకంటే తల్లి గౌరవించే విషయంలో అధికులు అని పెద్దలంటారు.

గోపాల్ : అది నిజమే. ఇప్పటిదాకా ఈ విషయం తెలిసి కూడ అలా ప్రవర్తించలేదు. ఇప్పటి నుండి అమ్మను దైవంతో సమానంగా చూస్తాను.

రామ : అహా కాదు. మొదటి దైవంగా అనాలి. ఉదయం, సాయంత్రం ఆటపాటల కంటే అమ్మను సేవించడమే గొప్పపని అని భావించు. అమ్మ చెప్పిన పనులు చేసి వేళమించకుండా బడికిరా!



# 46. సోదరప్రేమ

తే.గీ॥ "రాఘవుల సోదరప్రేమ రహిని నెంచి
పాండవుల సోదరప్రేమ బరిగణించి
యన్నదమ్ముల న్యోన్య ప్రియంబు మీఱ
వర్తిలన నంతకన్నను స్వర్గమున్న?"

తండ్రి తరువాత తండ్రి యంతటి వాడు అన్న అంటారు. ఒక తల్లి కడుపున పుట్టిన బిడ్డల మధ్య అనుబంధం, ఆప్యాయం సర్వ సాధారణం. కాని దశరథుని కుమారులు, పాండురాజు కుమారులు వేర్వేరు తల్లులకు జన్మించినా వారి మధ్య వున్న ప్రేమానురాగాలు అపూర్వం, అనితరసాధ్యం. యక్షుడడిగిన ప్రశ్నలకు సరియైన సమాధానమిచ్చి, అతణ్ణి సంతృప్తిపరచిన ధర్మరాజు యక్షుడు ఒకరికి ప్రాణమిస్తానని అన్నప్పుడు కౌంతేయుల్లో తాను జీవించి వున్నానని, మాద్రీయుల్లో ఒకరిని బ్రతికించమని అని కోరడం అతని నిస్వార్థ సోదరప్రేమకు నిదర్శనం. అలాంటి ప్రేమను కలిగి సోదరప్రేమకు ప్రతిరూపంగా నిలిచినవారు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు.

కోసల దేశాన్ని పాలిస్తోన్న దశరథ మహారాజుకు కౌసల్య, సుమిత్ర, కైకేయి అని ముగ్గురు భార్యలు. కౌసల్యకు శ్రీరాముడు, సుమిత్రకు లక్ష్మణ, శత్రుఘ్నులు, కైకేయికి భరతుడు జన్మించారు. నలుగురూ విద్యాబుద్ధులు నేర్చుకుంటూ క్రమంగా పెరిగి పెద్దవారయ్యారు. అప్పుడు దశరథుడు శ్రీరామునికి రాజ్యాభిషేకం చేయాలని నిర్ణయించాడు. అది తెలిసిన మంథర అనే కైక దాసి తన రాణి వద్దకు వెళ్ళి ఆమెకు చెడ్డబుద్ధులు నేర్పింది. ఆ మాటలు విన్న కైకేయి దశరథుని వద్ద ముందుగ మాట తీసుకొని, శ్రీరాముడు నార చీరలు ధరించి పదునాల్గు సంవత్సరాలు అరణ్యవాసం చేయాలని, భరతునికి కోసల రాజ్యాన్ని పట్టం కట్టాలని కోరింది. ఆడిన మాట తప్పలేని దశరథుడు పిడుగులాంటి ఆమె మాటలు విని ఒప్పుకొని నేల కొరిగాడు.

తండ్రి ఆజ్ఞను శ్రీరాముడు శిరసావహించి తల్లిదండ్రుల నుండి అనుమతి తీసుకొని వనవాసానికి సంతోషంతో బయలుదేరాడు. పతి అడుగుజాడల్ని అనుసరించడం పతి ధర్మమని నమ్మిన జానకి అతని వెన్నంటి

నడచింది. సోదరసేవయే ముఖ్య కర్తవ్యము అని తల్లిచే ప్రేరేపించబడిన లక్ష్మణుడు సీతారాములకు రక్షణగా ముందు నడిచాడు. వారు అరణ్య వాసానికి వెళ్ళారన్న వార్తనువిన్న దశరథుడు క్రుంగిపోయి, అచిరకాలంలో ప్రాణాలు వదిలాడు. మేనమామ యింటికి వెళ్ళివున్న భరతుడు అయోధ్యకు వచ్చి, జరిగిన విషయాన్నంతా తెలుసుకొని తల్లి వద్దకు వెళ్ళి –

"పాతకీ! ఎంత పాపానికి ఒడిగట్టావు! నాకంటే రాముడు నీకు ఏవిధంగా తక్కువయ్యాడు? అతడు నీకేమి ద్రోహం చేశాడు? నీ కడుపున పుట్టినంత మాత్రాన నాకు నీలాంటి చెడుగుణాలు అలవడతాయి అనుకున్నావా? తండ్రి తర్వాత తండ్రియైన శ్రీరాముణ్ణి నా ప్రత్యక్ష దైవాన్ని, సద్గుణాభిరాముని, మునిలా అడవికి పంపి, నీ భర్తను చంపి, నీవేమి పొందదలచావు? రాముడు శాంతమూర్తి కాబట్టి నీ మాటకు యెదురుచెప్పక నిన్ను తల్లిగా భావించి కాఅడవులకు నడిచాడు. ఆ లక్ష్మణుడైన నీ మోసాన్ని గ్రహించి నీతల నరక్కుండా ఎందుకు వదిలిపెట్టాడు? కులవినాశిని! నాకు అత్యంత ప్రియమైన రాముడు అడవుల్లో కష్టపడుతూ వుంటే నేనిక్కడ పట్టం కట్టుకొని సుఖిస్తాననుకున్నావా? దుర్మార్గురాలైన నీ కడుపు మండేలాగ రాముని సింహాసనాధిష్ఠుని చేసి నేను మునివేషంలో పద్నాలుగేండ్లు అరణ్యాల్లో సంచరిస్తాను" అని అన్నాడు.

తరువాత భరతుడు దశరథునికి అంత్యక్రియలు చేసి తన సేనతో కలసి రాముణ్ణి వెదకడానికి బయలుదేరాడు. చిత్రకూట పర్వతంలో రాముడు పర్ణశాలను నిర్మించుకొని సీతాలక్ష్మణులతో కాలము గడుపుతూ వున్న సమయంలో ఒకనాడు ఒక కలకలాన్ని విని కారణాన్ని తెలుసుకొని రమ్మని లక్ష్మణుణ్ణి పంపాడు. లక్ష్మణుడు ఒక చెట్టు కొమ్మనెక్కి, దగ్గరకు వస్తోన్న సేనను చూసి "అన్నా! మోసం జరిగింది. భరతుడు సేనాసమేతుడై మన మీదికి వస్తున్నాడు. లే! లేచి విల్లెక్కు పెట్టి సిద్ధంగా వుండు. ఆలశ్యం చేయకు. నాకు ఆజ్ఞ యివ్వు. నా బాణపు కొస కఠినమైనదో ఆ భరతుడి బొమ్మ కఠినమైనదో చూస్తాను" అంటూ వుండగా రాముడు లక్ష్మణుని "లక్ష్మణా! భరతుడు నీకంటే నాపట్ల ప్రేమకలవాడు. నీవంటి తొందరపాటు మనిషికాదు. తొందరపాటు వద్దు అని వారించాడు.

ఇంతలో భరతుడు రాముని సమీపించి రాజ్యాన్ని స్వీకరించమని ఎన్నో రకాలుగా ప్రాధేయపడ్డాడు. తల్లిదండ్రుల కిచ్చిన మాటను అగౌరవపరచి తాను రాజ్యాన్ని చేపట్టలేనని రాముడు నిరాకరించాడు. చివరకు భరతుడు చేసేదేమిలేక, అన్న మాటను జవదాటలేక, రాముని పాదుకలను స్వీకరించి అయోధ్యకు వెళ్ళలేక నంది గ్రామంలో ఆ పాదుకలకు పట్టాభిషేకం చేసి, తాను కూడా రాముడిలా నారచీరలు ధరించి, దర్భలపై పడుకుంటూ, కందమూలాలు తింటూ పాదుకలనే రాముని ప్రతినిధిగా రాజ్యపాలన చేయించి సోదర ప్రేమకు నిదర్శనంగా నిలిచాడు.



## 47. పొగరు తగదు

కం॥ "కుల, మాచారము, ధనమును
విలసిత విద్యయును, రాజ్య విభవము రూపం,
బెలఁబ్రాయము దీపమును వ
ర్థిల్లఁజేయును మదమునంద్రు స్థిర విద్యార్థీ!"

ఉన్నతమైన కులం, సదాచారం, ధనం, విద్య, రాజ్యవైభవం, రూప సంపద, లేతప్రాయం, తపము ఈ విధంగా అన్ని రకాల సుఖాలొకే చోట వుంటే దానిని 'విభవము' అంటారు. మహేంద్ర విభవము చాలా గొప్పది. పూర్వపు రాజులు ఈ మహేంద్ర వైభవము కోరి యాగాలు చేసేవారు. సుఖాలు కోరనివారు ఎవరుంటారు? ఇంద్రునికి "శతక్రతువు" అని పేరు. అంటే 'నూరు యాగాలు చేసినవాడు' అని అర్థం. అలా చేసినవారు ఒకరి తర్వాత ఒకరు ఇంద్రులౌతారని మన పూర్వీకుల నమ్మకం.

ఇంద్రుడు స్వర్గం, మర్త్యం, పాతాళం అనబడే ముల్లోకాలకు అధిపతి. స్వర్గలోకంలో అమరావతి అతని ముఖ్య పట్టణం, అతడి సభకు 'సుదర్మము' అని పేరు. పాలసముద్రం నుండి పుట్టిన 'ఉచ్చైశ్రవమనే గుఱ్ఱము', నాలుగు దంతాలు కలిగి, తెల్లని రంగుతో ప్రసిద్ధి చెందిన "ఐరావతము" అనే ఏనుగు ఇంద్రుని వాహనాలు. దేవతలు, ఋషులు, ఆచార్యుడు గురువు అని ఖ్యాతి గడించిన బృహస్పతి, సామంతులు దిక్పతులు ఇతని సభలోని వారు.

కోరినవన్నీ యిచ్చే చింతామణి, కామధేనువు ఇంద్రుని వద్ద ఉన్నాయి. ఇతని వనం నందన వనం. ఆ ఉద్యానవనంలో ఎన్నడు వాడనివి, కోరిన కోర్కెలొసగే పారిజాతం, మందారం, సంతానం, హరిచందనం, కల్పకం అనే వృక్షాలున్నాయి. గంధర్వులనబడే గాయకులు, రంభాది అప్సరసలు వున్నారు. ఇలాంటి వైభవాన్ని కోరని వారెవరుంటారు?

**ఆ॥వె॥ ఎట్టి వానికైన నెంత యైశ్వర్యంబు**
**వడసియైన గర్వ పడగరాదు**
**మిన్నుమన్నుగనక మున్నహుషుండు చెడెఁ**
**బొగరుఁబోతుఁదనము తగదు తగదు.**

అయితే ఎంత ఐశ్వర్యం పొందిన గర్వపడరాదు. అలా ఐశ్వర్య మదాన్ని పొందిన వాడికి అధోగతి తప్పదనడానికి అహుషుడనే రాజు కథే మంచి దృష్టాంతము.

పూర్వం అహుషుడనే రాజు నూరు అశ్వమేధ యాగాలు చేసి ఇంద్ర పదవిని పొందాడు. దానితో తనను మించినవారు ముల్లోకాలలో ఎవరూ లేరని గర్వం అతడిలో అతిశయించింది. అహంకారంతో విఱ్ఱవీగే వారికి విచక్షణాజ్ఞానం నశిస్తుంది. “నేను ఇంద్రుడిని కాబట్టి అందరూ నా చెప్పుచేతల్లో వుండాలి” అనుకొని పరమ పవిత్రులైన మునులను తన పల్లకిని మోయమని ఆజ్ఞాపించాడు. ఆ మౌనిపుంగవులు మౌనంగా, నెమ్మదిగా పల్లకిని మోస్తూ వుండగా వారిని “నేను మహేంద్రుణ్ణి, ఇంద్రుని సర్వైశ్వరాలు నా సొంతమయ్యాయి. ఇంద్రుని భార్య శచీదేవి కూడా నాదే కాబట్టి శచీదేవి అంతఃపురానికి పల్లకిని మోసుకొని వెళ్ళండి” అని తొందరపెట్టసాగాడు.

అహుషుడు వెళ్ళే దారిలో అతడికి అగస్త్య మహర్షి ఎదురయ్యాడు. ఆ ఋషిశ్రేష్ఠుని చూసి అహుషుడు ‘పాము పాము’ అని పరాచికాలాడాడు. దానితో అగస్త్యమహర్షి కోపంతో మండిపడి “ఒరే దుష్టబుద్ధీ! నీకు పదవి చేతికి రాగానే కళ్ళు కనిపించకుండా పోయాయి. నీలాంటి గర్వాంధుడు ఇంద్ర పదవికి అనర్హుడు. భూలోకంలో పామువై పడివుండు” అని శపించాడు.

ధనమదంతో మన్ను, మిన్ను కానకుండా ప్రవర్తించేవాడు తగిన ప్రతిఫలాన్ని అనుభవిస్తాడని ఈ కథ తెలియజేస్తోంది.

# 48. పెద్దల మాట చద్ది గట్టిన మూట

కం॥ మన పెద్దలేది చెప్పిన
మన మేలున కంచునెంచి మహిత మనమునన్
బొనరించు నతని కల్రబ
చ్చిన కీర్తియు మంగళంబు పృథు విద్యార్థీ!

పెద్దలు ఏది చెప్పినా అది మన మంచి కొఱకే అని ఎవరైతే పెద్దల మాటల్ని శిరోధార్యాలుగా భావిస్తారో అలాంటి వారికి కీర్తి, శుభము హస్తగత మౌతాయి. దీనికి దృష్టాంతముగా ఈ కథను పరిశీలిద్దాం.

ఒకానొక గ్రామంలో ఒక షావుకారుకు ఇద్దరు కొడుకులుండేవారు. వారు బడికి వెళ్ళి యింటికి వచ్చిన తర్వాత ప్రతి రోజూ వారి తండ్రి వారికి కొన్ని నీతులు బోధిస్తూ వుండేవాడు. వాటిలో సారాంశం ఇది.

1) పెద్దల మాట వినాలి.

2) విన్న మాటల్ని నమ్మి ఆచరించాలి.

3) వర్ణాశ్రమ ధర్మాల్ని అతిక్రమించకూడదు.

4) బయటి వెళ్ళి వచ్చేటప్పుడంతా ఏదో వొకటి తీసుకొని రావాలి.

చతుర్ముఖుడి నాలుగు ముఖాల నుండి వెలువడ్డ నాలుగు వేదాల్లా ఈ నాలుగు వాక్యాలు ఆయన నోటినుంచి పదేపదే వల్లె వేయబడేవి. తాను ధనవంతుడు, కీర్తివంతుడు కావడానికి ఆ నాలుగు సూత్రాలో కారణమని తన అనుభవాలను సైతం బిడ్డలకు చెప్పేవాడు. అయితే అవి ఆ కొడుకులకు యెంత మాత్రం వంటబట్టాయి?

పెద్ద కొడుకు పాశ్చాత్య నాగరికతా మత్తులో మునిగి తేలుతూ క్రమంగా తండ్రి మాట పెడచెవిన పెట్టాడు. ముందు జుట్టు కత్తిరించుకున్నాడు. తర్వాత సూటు, ఇంగ్లీషు వాళ్ళ జోళ్ళు (Shoes) వెదల్పు టోపీలను అలంకరించుకొని "సర్వజాత్యభేద సమాజ సభ్యతా" స్వీకరించి తండ్రికి అపకీర్తి తేసాగాడు.

తండ్రి సంప్రదాయానికి, కొడుకు అనాచారానికి ఉప్పు-నిప్పులా వైరం పెరగసాగింది. కొడుకు ఇంటికి రావడం తండ్రి నీచంగా అనుకుంటే, ఇంగ్లీషు రాని వాణ్ణి తండ్రి అనడం తనకు అవమానమని కొడుకు భావించాడు. చివరికి స్పెన్సర్స్ వారి సత్రంలో తింటూ, డబ్బు కోసం మాటి మాటికి తండ్రికి ఉత్తరాలు రాస్తూ పట్టణంలో స్థిరపడి పోయాడు. ఆలాగని ఆంగ్ల భాషలో పాండిత్యం సంపాదించాడా? అంటే తండ్రి మాట వినని వాడు ఉపాధ్యాయుల పాఠాల్ని ఎలా వింటాడు? ఉద్యోగమా లేదు. తండ్రికి ఉపయోగపడలేదు.

ఇక రెండో కొడుకు గురించి తెలుసుకుందాం. చిన్న కొడుకును తల్లిదండ్రులు అల్లారు ముద్దుగా పెంచినా చెడ్డ గుణాలేవి అలవడలేదు. క్రమం తప్పకుండా బడికి వెళ్తూ, తీరిక సమయంలో నాన్న చెప్పిన నీతుల్ని అతిక్రమించకుండా, బయటికి వెళ్లినపుడు మరచిపోకుండా ఇంటికి ఏదో ఒకటి తీసుకొనివస్తూండే వాడు.

ఒక రోజు వాడు పొలానికి వెళ్ళి ఇంటికి వచ్చేటపుడు ఏమీ దొరక్క, ఒక కట్టె పుల్లైనా దొరక్కుండా ఇంటికి వెళ్ళకూడదని నిర్ణయించుకొని దారిలో చచ్చిన పాము వొకటి కనిపిస్తే ఆశవాన్ని ఈడ్చుకుని వచ్చి పెరట్లో ఉన్న కట్టెల మీద వేసి ఇంట్లోకి వెళ్లిపోయాడు. ఆ రోజు సాయంత్రం అలవాటు ప్రకారం తన దిన చర్యను తండ్రికి చెబుతూ పాము సంగతి చెప్పాడు. తండ్రి ఉలికి పడి పెరట్లోకి వెళ్ళి చూసేసరికి పాము స్థానంలో రత్నాల హారమొకటి కళ్ళు మిమిట్లు గొలుపుతూ కనిపించింది. అదంతా దేవుని దయని భావించి సంతోషంగా దానిని స్వీకరించారు.

ఇంతకు పామెట్లా హారంగా మారింది? ఒక కోటేశ్వరుని కూతురు స్నానం చేస్తూ తన రత్నాల హారాన్ని ప్రక్కనుంచింది. ఒక గ్రద్ధ దాన్ని మాంసంగా భావించి నోట్లో కరుచుకుని వెళ్తూ షావుకారు ఇంట్లో వున్న చచ్చిన పామును చూసి ఆ హారాన్ని అక్కడపెట్టి పామును తీసుకొని వెళ్ళిపోయింది.

పెద్దలు చెప్పిన మాట 'చద్ది కట్టిన మూట' లాంటిది. అది ప్రమాదంలో రక్షణగా వుంటుంది. అవసరమైనపుడు ఆదుకుంటుంది.

# 49. అధికాశ ఆపదలకు మూలము

ఆ॥వె॥ అరయనెవరికేని యత్యాశకూడదు
కలుగుదానఁ దృప్తిఁ గనుటమేలు
సృంజయుండు చోరులేయైరి? యధికాశ
యాపదలకు మూలమంద్రు బుధులు.

"దురాశ దుఃఖమునకు చేటు" అన్న ఆర్యోక్తి అందరికి తెలిసిందే. అత్యాశతో బంగారు గుడ్డు పెట్టే బాతుని చంపిన యజమాని కథ మనం చిన్నతనం నుండి వింటునే వున్నాం. ఉన్నదానితో తృప్తిపడటం కన్న అధికమైన సంపద మరొకటి ఉంటుందా? అత్యాశతో కోరిన వరం కొడుకు ప్రాణాలకే ముప్పు తేగా సర్వస్వం కోల్పోయిన సృంజయుడి కథ దీనికి నిజమైన దృష్టాంతం.

పాంచాల వంశానికి చెందిన సృంజయుడనే రాజకు ధనం మీద ఆశ చాలా ఎక్కువగా వుండేది. డబ్బు సంపాదించాలనే కోరికతో రకరకాల ఆలోచనలు, ఊహలు చేస్తూ అది అంతంలేని పలు పోకడల ఆలోచనలు ఆశా సముద్రంలో తరంగాల్లా ఎగసిపడేవి. చివరికి అతడు దేవుణ్ణి గూర్చి ఘోర తపస్సు చేసి తనకు పుట్టబోయే కొడుకు దేహం నుండి వచ్చిన ఏ పదార్థమైన బంగారంగా మారాలనే వరాన్ని కోరుకున్నాడు. కొన్నాళ్ళకు అతనికొక కొడకు పుట్టాడు. ఆ బిడ్డ ఉమ్మి, చెమట, మలమూత్రాలు ఒకటేమిటి అతడి శరీరం నుండి బయటికి వచ్చిన సర్వస్వం సువర్ణమయ మయ్యాయి. ఇక అతడికి లోటేమిటి? సృంజయుడు మహదానందంతో కొడుకుకు "సువర్ణష్ఠీవి" అన్న సార్థక నామాన్ని పెట్టి, చేటలు, తలుపులు, కిటికీలతో, సింహాసనము వరకు అన్నింటినీ బంగారంగా చేయించాడు.

ఈ విషయం తెలిసిన ప్రక్క రాజ్యాల రాజులకు కడుపుబ్బ సాగింది. దొంగలకు సైతం సృంజయుడి ఇంటి మీదే కన్ను. ఒకరోజు కొందరు దొందలు రాజ గృహంలోనికి ప్రవేశించి, వస్తువులను దొంగలించడం కన్నా సువర్ణష్ఠీవినే తీసుకొని వెళ్ళడం ఉత్తమమని భావించి, అతణ్ణి ఒక నిర్జన ప్రదేశంలోకి తీసుకొని వెళ్ళి దురాశతో వాని పొట్టను చీల్చి ఏమీలేక

పోయేసరికి నిరాశతో బిక్కమొహం వేసి, ఆ పిల్లవాడి శవాన్ని అక్కడే వదిలి వెళ్ళిపోయారు.

సృంజయుడు మరుసటి రోజు ఉదయం సువర్ణష్ఠీవి కనిపించక పోయేసరికి, తన పరివారంతో పాటు తాను వెదుకుతూ వెళ్ళి చివరికి తన కొడుకు శవాన్ని కనుక్కొని యెంతగానో దుఃఖించి, చేసేదేమి లేక తన రాజ్యానికి తిరిగి వచ్చే సరికి పొరుగురాజులు అతడి రాజ్యాన్ని కైవసం చేసుకున్నాడు. తర్వాత సృంజయుడు దిక్కుతోచక బాధపడుతూ సంచరిస్తోన్న సమయంలో నారదుడు అతడిని అనుగ్రహించాడు.

సృంజయుడు దురాశతో ప్రకృతి సహజం కాని కోరికను కోరి కొడుకును, రాజ్యాన్ని కూడా కోల్పోయాడు. కాబట్టి మానవుడు తనకున్న దానితో తృప్తి పడితే ఎంతో ఆనందంతో, మనశ్శాంతితో జీవిస్తాడు.

**"ఆశ లేని వాడికి భవిష్యత్తు శూన్యం**
**దురాశాపరుడికి జీవితమే శూన్యం".**



## 50. సత్యమునే పలుకుము

**ఆ॥వె॥ సత్యమొకటి నిలువ సర్వసద్గుణములు**
**వచ్చి నిలుచుఁదాయె వరుసమీఱ**
**దుర్గుణంబొకండు దొరకొన నొకనికి**
**నన్ని సద్గుణంబు లడఁగిపోవు.**

అబద్ధం చెప్పరాదన్న నియమాన్ని పాటిస్తూ రాజ్యాన్ని, కొడుకును పోగొట్టుకొని, భార్యను సైతం అమ్ముకొని చివరకు సత్యమే యింటి పేరుగా నిలబెట్టుకొన్న సూనృతవ్రతుడు హరిశ్చంద్రుడు. ఇలా లోకంలో సత్యమునే అలంకారంగా చేసుకొన్న ఘనులు తక్కువ సంఖ్యలో దర్శనమిస్తారు. సత్యం ఉన్న చోట అన్ని సద్గుణాలు తమంతట తాము వచ్చి చేరతాయి. ఒక్క దుర్గుణం అలవడితే అన్ని సద్గుణాలు అణగిపోతాయి.

పాటలీపుత్రాన్ని ధర్మవర్ధనుడనేరాజు సార్థక నామధేయునిగా పాలించే వాడు. లోక వ్యవహారాలను గమనించడానికి, తన వల్ల జరిగే పొరపాట్లు ప్రజల ద్వారా సవరించుకోవాలనే ఉద్దేశంతో ఆ రాజు అప్పుడప్పుడు మారువేషంలో పట్టణంలో సంచరించేవాడు. ఒక రోజు రాత్రి రాజు సన్యాసి వేషంలో తిరుగుతూ వున్న సమయంలో అతడికి ఒక దొంగ యెదురై నమస్కరించాడు. రాజు "నీవు ఎవరు?" అని అడిగాడు. సన్యాసులతో అబద్ధం చెబితే మొదటికే మోసం వస్తుందేమో అని భయపడి, ఇతనితో చెప్పినంత మాత్రాన తనకేంటి నష్టం అని భావించాడేమోకాని "నేను దొంగను" అని నిజం చెప్పాడు. "నీవు దొంగతన మెందుకు చేస్తున్నావు" అని రాజు అడిగే సరికి, "నాకు వేరే దారి లేదు" అని దొంగ సమాధాన మిచ్చాడు. "పోనీ నాకెందుకు నమస్కరించావు?" అని అడిగేసరికి, మీరు 'శుభమస్తు' అని దీవిస్తారు. ఆ దీవెన వల్ల నాకీరోజు మేలు జరుగుతుందని నమస్కరించాను అని దొంగ బదులిచ్చాడు. "సరే నాకు గురుదక్షిణగా ఏమిస్తావు?" అని రాజు అడిగేసరికి "దొంగతనం తప్ప ఇంకేమడిగినా ఇచ్చేస్తాను" అన్నాడు.

రాజు కాస్సేపు ఆలోచించి "నీ అసత్యాన్ని నాకు ఇచ్చేయ్. దీనివల్ల నీ కెలాంటి నష్టం జరగదు" అన్నాడు. దొంగ 'సరే' అని ఒప్పుకొని వెళ్ళిపోతున్న సమయంలో రాజు దొంగను వెనక్కు పిలిచి "ఈ పట్టణంలోని రాజు గారింట్లో మూడు రత్నాలున్నాయి. నేను దివ్యదృష్టితో చూశాను. వాటిని తీసుకొని వచ్చి నాకు సగం వాటా ఇవ్వు" అనగానే దొంగ సరే అన్నాడు.

తరువాత దొంగ రాజు కోశాగారానికి కన్నం వేసి, లోపలికి వెళ్ళి సన్యాసి చెప్పిన చోట మూడు రత్నాలను చూసి ఆశ్చర్యపోయాడు. మూడింటినీ తీసుకొని వెళ్తే సమభాగాలు చేయడం కష్టమనుకొని రెంటిని మాత్రం తీసుకొని ఒకటి సన్యాసికిచ్చి, రెండోది తాను తీసుకొని వెళ్ళిపోయాడు.

కొద్దిసేపటికి రాజమందిరలంలో కావలి వారు మేల్కొని దొంగతనం జరిగిందని గమనించి, దొంగ కోసం వెదకసాగారు. రాజు తన మంత్రిని పిలిచి ఏయే వస్తువులు పోయాయో కనుక్కొని రమ్మన్నాడు. తెల్లవారగానే రాజు సభకు వచ్చాడు భటులు ముక్కు మొహం తెలియని వారిని కొందరిని

పట్టుకొని వచ్చి వీళ్ళే దొంగలని కొన్ని నిదర్శనాలు చూపనారంభించారు. రాజు ఏయే వస్తువులు పోయాయో వివరంగా చెప్పమన్నాడు. అప్పుడు మంత్రి లేచి "మహారాజా ఈ దొంగతనం విచిత్రంగా వుంది. వస్తువులన్నీ వుండాల్సిన చోటే వున్నాయి. డబ్బు పోలేదు. మీకెంతో ప్రియమైన మూడు రత్నాలు మాత్రం దొంగలించ బడ్డాయి" అనగానే రాజు మూడుసార్లు "అవి పోయాయా?" అని అడిగి వెంటనే రాత్రి తన్ను కలిసిన దొంగను పిలిపించాడు.

సత్యాన్నే పలుకుతానని సన్యాసికి మాటిచ్చిన దొంగ రాజుకు రాత్రి జరిగిన విషయాన్నంతా తెలియజేశాడు. రాజు ముందు రోజు రాత్రి తానే సన్యాసిగా సంచరించానని చెప్పి తన దగ్గర వున్న రత్నాన్ని చూపి మూడో రత్నమేదని అడిగేసరికి సభలోని వారు ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకున్నారు. చివరికి అందరి దృష్టి మంత్రి వైపు మళ్ళింది. మంత్రిని పరీక్షించే సరిగి మూడో రత్నం బయటపడింది. మంత్రి పదవి వూడింది. రాజు దొంగకు ఉన్నతమైన పదవినిచ్చాడు. సత్యాన్నే ఆభరణంగా ధరించిన దొంగ సర్వ సద్గుణ సంపన్నుడై ముఖ్యమంత్రి పదివిని అలంకరించాడు.



# 51. విద్యార్థి ధర్మాలు

ప్రతి మనిషి జ్ఞానాన్ని సంపాదించాలంటే చదువు అత్యవసరం "విద్య లేనివాడు వింత పశువు" అన్నది అక్షర సత్యం. చిన్నతనంలో చదువుమీద శ్రద్ధలేకుండా సోమరులైన ఆటపాటల్లో మునిగితేలి, పెద్దైన తరువాత చదివితే అది సఫలం కాకపోవచ్చు. వంటకు పెట్టి ఇంట్లో గింజల్లేవని పొలంలో విత్తనాలు నాటితే అది ఆరోజు ఆకలి తీరుస్తుందా? ఇల్లు అంటుకున్నప్పుడు నీటికోసం బావి తవ్వడం ప్రారంభిస్తే ఆ మంటలు ఆర్పడం సాధ్యమా? కాబట్టి బాల్యంలోనే విద్య నభ్యసించాలి. సద్విద్య పట్టుపడాలంటే కొన్ని పద్ధతుల్ని ముందే పాటించాలి.

1) వేళ తప్పకుండా బడికి వెళ్ళాలి. తనకోసం మిగిలిన విద్యార్థులు వేచి వుండేలాగో, తనకే కొంత పాఠం నష్టమయ్యేలాగో వెళ్ళరాదు.

2) బడికి వెళ్ళిన వెంటనే ఉపాధ్యాయులకు నమస్కరించాలి. దైవ ప్రార్థన చేసి, తరగతిలో నిశ్శబ్దంగా వుండాలి. ఉపాధ్యాయులకు తలనొప్పి, విసుగు వచ్చేట్లు అల్లరి చేయకూడదు.

3) ఉపాధ్యాయుడు చెప్పే విషయం మీదే మనస్సు లగ్నంచేయాలి. పరధ్యానంతో వుండి "దూరిందా? అంటే తోక మాత్రం దూరలేదు" అనే లోకోక్తికి గురికారాదు. మనస్సును నిలుపలేక పోతే బడికి వెళ్లి కూడ నిష్ప్రయోజనమే.

4) గురువు ఏది చెప్పిన మన కొరకే అని స్థిరంగా నమ్మాలి.

**కం॥ "ఒకటి చదువు రెండడఁకువ**
**ప్రకటితముగ మూఁడు తెలివి భావ**
**ప్రకటన నాలుగయిదున**
**మ్మిక పాళులు గావలయు జుమీ విద్యార్థి".**

గురువు "ఓ" అని వొక అక్షరాన్ని రాస్తే, శిష్యుడు 'ఓ' కాదు 'న' అంటే వాడికి విద్య వస్తుందా?

5) అన్నీ తెలిసిన వాడిలా గురువును ఎకసెక్కంగా ప్రశ్నించకూడదు. ప్రశ్నించడం సులభమే జవాబివ్వడం కష్టం. అది బాలల తలకెక్కించడం మరింత కష్టం. విద్యార్థుల గ్రహణశక్తిని, యోగ్యతను తెలుసుకొని వారి స్థాయికి తగిన విషయాలనే గురువు బోధిస్తాడు.

6) బడిలో తెలుసుకొన్న విషయాలను ఇంటిలో మననం చేయాలి. అప్పుడు దానిలో ఏవైనా సందేహాలొస్తే మరుసటి రోజు తీర్చుకోవాలి. గురువు ఆ సందేహాన్ని నివృత్తి చేసిన తర్వాత ఆ పాఠం వచ్చేవరకు చదవాలేగాని ఈ చెవిలో వేసుకొని ఆ చెవిలోంచి తీసివేయరాదు.

7) తన తోటి బాలలతో ఐకమత్యంగా వుండాలి. వారితో కలసిమెలసి వుంటే తాను మరచిపోయిన విషయాల్ని అడిగి తెలుసుకోవచ్చు. ఎదుటివాడికి నాలుగు మార్కులు ఎక్కువగా వచ్చాయని అసూయతో

శ్రోతృత్వం పెంచుకోవడం కంటే, మరింత శ్రద్ధగా చదివి వాడికంటే ఎక్కువ మార్కులు తెచ్చుకోవచ్చు.

8) సమబుద్ధి, సాధుసేవ, మంచి నడవడి, శాంతం, త్రికరణ శుద్ధి, సత్యవాక్కు, వినయం కలిగుండాలి. సమబుద్ధిని ఐక్యమత్యంతో సాధించవచ్చు. సాధుసేవ వల్ల అన్నింటినీ గ్రహించవచ్చు. సాధువులను సేవించాలంటే మంచి నడవడి అవసరం. శాంతముంటే విద్యను పరిపూర్ణంగా పొందగలరు. ఓర్పు లేకపోతే అఅకొఅ విద్యనే పొందుతాం. మనోవాక్కాయాలను ఒకే మార్గంలో నడపడం త్రికరణశుద్ధి అనబడుతుంది. మూడింటిలో ఏది వికటించినా అది కపటమౌతుంది. సత్యాన్నే పలకాలి. సత్యం వల్ల విద్యకు వినయమే భూషణం. వినియం లేని విద్య ప్రకాశించదు.

9) **విద్యా గర్వం తగదు** : విద్యావంతుడు కల్పవృక్షంలాంటివాడు. అతడి దగ్గరికి చాలామంది వస్తూ వుంటారు. సీకి పొదలాంటి గర్వం వానిలో నిండిపోతే వాడి దగ్గరికి ఎవరూరారు. అలాంటి వాడికి విద్య వుండి ప్రయోజనం లేదు. ఆ విద్య అడవి కాచిన వెన్నెల అవుతుంది.

10) కాలం విలువను తెలుసుకొని ఒక్కనిముషాన్నైనా వ్యర్థం చేయకుండా ఉండాలి. వ్యర్థమై పోయిన ఒక్క క్షణాన్ని కూడా జన్మలో తిరిగి పొందలేం.

11) **మృదువుగా మాట్లాడాలి** : మార్దవానికి మంచివారు, చెడ్డవారు కూడ వశమౌతారు. దారుణమున దారుణము అణగిపోతుంది. విజయాన్ని పొందడానికి దీనికి సమానమైన ఆయుధం వేరొకటి లేదు.

12) తల్లి, తండ్రి, గురువు, దైవం పట్ల భక్తి కలిగి ఉండాలి. మనకు జన్మనిచ్చిన తల్లిని కొలుస్తూ, మన అభివృద్ధికి కారకుడైన తండ్రిని గౌరవిస్తూ, మనకు జ్ఞానాన్ని ప్రసాదించే గురువును సేవిస్తూ, ఉత్తమమైన మానవ జీవితాన్ని ప్రసాదించి, అవయవలోపాలు లేకుండా సృష్టించి మనలను ప్రపంచం రంగానికి పంపిన ఆ జగన్నాటక సూత్రధారుని ఆజ్ఞానుసారం నడుస్తూ, ప్రేక్షకలోకంలో ఖ్యాతిని పొంది, పవిత్రజన్ములమై ఆ భగవంతుని సన్నిధికి చేరాలి.

# 52. శ్రమ కొద్దీ విద్య

కం॥ ఎందఱు నీకు గురువు? లన
నెందఱో నెలనెలకుమాఱి యెందోపోగా
నందొకరిఁజెప్ప నెటులగు
నందువె? మది నొకని నిల్పుమా విద్యార్థి!

ఒక విద్యార్థి నెలకో గురువును మారుస్తూ అరకొర విద్యను నేర్చుకొనే తరుణంలో "నీ గురువెవరు?" అని ప్రశ్నిస్తే ఒక్క గురువు పేరు చెప్పడం వాడికి అసాధ్యమౌతుంది. అలా కాకుండా ఒక్క గురువునే నమ్మి అతడు చెప్పే విషయాలను శ్రద్ధగా నేర్చుకుంటే విద్య వాడికి కరతలామలకం అవుతుంది. ఎప్పుడైనా సరే చెడు పనులు, చెడు సహవాసం గాని చాలా త్వరగా జరుగుతాయి. మంచి స్నేహం క్రమంగా కాని కుదరదు. మంచి పనిని ప్రారంభించినప్పుడు దానికెన్నో ఆటంకాలు ఎదురై కాలయాపన జరగవచ్చు. కాని శ్రద్ధతో, ఓర్పుగా ఆపనిపైనే దృష్టి నుంచితే లభించే ఫలితం అమూల్యం. ఉన్నత పదవి పొందడం చాలా కష్టం. అధోగతి పొందడం అత్యంత సులభం. సత్కీర్తి పొందాలంటే ఎంతగానో శ్రమించాలి. అపకీర్తిని క్షణకాలంలో సంపాదించవచ్చు. అలాగే సద్విద్యను సంపాదించాలంటే కొన్ని సంవత్సరాలపాటు శ్రద్ధతో అభ్యసిస్తే గాని పొందలేము. శ్రద్ధకు మారుపేరైన చంద్రచూడుడు విద్య నెలా పొందాడో తెలుసుకుందాం.

పూర్వం గురుకులాలు విద్యాభ్యాస కేంద్రాలుగా విలిసిల్లే కాలంలో "చంద్రచూడుడు" అనే పేద విద్యార్థి కాశీపట్టణంలో ఒక గురువును ఆశ్రయించాడు. అతడికి విద్యపట్ల చాలా శ్రద్ధ వుండేది. తన గురువు నిద్ర లేవకముందే నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకొని, ముందురోజు విన్న పాఠాల్ని మననం చేసుకొని, గురువు ఆజ్ఞకోసం ఎదురు చూస్తూ ఉండేవాడు. గురువుకు సేవలు చేయడాన్ని ఎంతమాత్రం అసహ్యించుకొనే వాడుకాదు. గురువు ఇంటిపనులు అప్పగించినపుడు తప్ప తక్కిన సమయాల్లో అంతా విరామం ఎరుగకుండా చదువుతూండేవాడు. అతడెప్పుడు పడుకొనేవాడో ఎవరికీ తెలియదు. "విద్యాతురాణాం న సుఖం న నిద్రా" అన్నమాట వాడికి సరిగ్గా సరిపోతుంది.

చంద్రచూడుడికి విద్యపట్ల వున్న శ్రద్ధను పరీక్షింప దలచిన గురువు తన భార్యను పిలిచి "నా శిష్యుడికి అన్నం పెట్టేటప్పుడు నేతికి బదులుగా వేపనూనె వడ్డించు" అని ఆజ్ఞాపించాడు. ఆమె అలాగే వడ్డించింది. విద్యాభిలాషి అయిన చంద్రచూడుడు ఆ భేదును గమనించక అలాగే తిన్నాడు. ప్రతిరోజూ అలాగే జరుగసాగింది. గురువు నిద్రించే వరకు కాళ్ళొత్తుతూ వుండి, నిద్రపోయిన తర్వాత చదువే చంద్రచూడుడితో ఒకరోజు గురువు "నా నిద్రకు భంగం కలుగుతోంది. ఇక్కడ చదవకు" అన్నాడు. ఆనాటి నుండి శిష్యుడు ఎవరియింట్లో దీపం వెలుగుతూ వుంటే అక్కడ కూర్చొని చదువసాగాడు. రాత్రంతా నిద్రపోనీయడని అందరూ (ఎవ్వరూ) అతణ్ణి తమ ఇండ్ల దగ్గరకి రానివ్వడం మానేశారు.

ఒకరోజు అతడు ఊరిలో ఎంతగా తిరిగినా దీపమున్న ఇల్లు ఒక్కటి కూడా కనిపించలేదు. ఊరి బయట ఒక వెలుగును చూసి అక్కడికి వెళ్ళి అది శ్మశానవాటిక అని, తాను దూరం నుంచి చూసిన వెలుగు కాలుతున్న శవానిదని గమనించకుండా అక్కడ కూర్చొని చదువసాగాడు. కాస్సేపటికి చదువుల తల్లి సరస్వతి అతని దగ్గర నిలబడి నాయనా! అని పలుకరించింది. "నన్ను చదువనీయకుండా ఇక్కడికి కూడా దాపురించిన విఘ్నకారిణీ! నీవెవరు? నాతో నీకేం పని?" అని తలయెత్తకుండానే ప్రశ్నించాడు. దానికామె "బిడ్డా! నీ శ్రద్ధకు సంతోషించి నిన్ను అనుగ్రహించదానికి వచ్చిన వీణాధరిని" అని పలికింది. చంద్రచూడుడు తటాలున లేచి సరస్వతీదేవిని ఎన్నో రకాలుగా స్తుతించగా, ఆమె యెంతో ఆప్యాయంగా వాడి శరీరమంతా తడిమి "సర్వవిద్యా విశారుదుడగమ్ము" అని దీవించి శారదాదేవి అంతర్ధానమై పోయింది. తరువాత అతడు గురువు యింటికి వెళ్ళి నిద్రించాడు.

మరునాడు బారెడు పొద్దు ఎక్కినా చంద్రచూడుడు నిద్రలేవక పోయే సరికి గురువు "నిన్న ఏదో విశేషం జరిగింది. లేకపోతే నిద్ర అన్నదే లేని వీడికి ఇంత గాఢ నిద్రెలా పడుతుంది?" అని భార్యతో వాడంతట వాడు లేచిన తర్వాత ముందులాగే వేపనూనె వడ్డించమని చెప్పి వెళ్ళాడు. చంద్రచూడుడు ఆదమరచి అలాగే నిద్రపోయి, మధ్యాహ్న సమయానికి లేచి "అయ్యో! ఎంత ఆలస్యము అయ్యింది. ఎంత అపచారము చేశాను.

గురువుగారి సేవకూడా చేయకుండా మొద్దు నిద్ర పోయానే" అని బాధపడ సాగాడు. అపుడు గురువతణ్ణి చూసి "నాయనా! దిగులు పడకు. జరిగిన దానికి చింతించకు. నీ రోజువారీ పనులు ముగించుకొని భోజనం చేసిరా!" అని పంపాడు. అతడు గురువాజ్ఞాపించినట్లు వేగంగా కాలకృత్యాలు తీర్చుకొని భోజనానికి ఉపక్రమించాడు.

గురుపత్ని అన్నాన్ని వడ్డించి, వేపనూనె పోసింది. ఒక్క ముద్ద నోట్ల పెట్టుకొని "అమ్మా! విపరీతమైన చేదు తినలేను" అని చెయ్యి కడిగేశాడు. ఆమె ఆ అన్నాన్ని పారవేసి వేరే అన్నాన్ని వడ్డించింది. భోజనము తర్వాత అతడు గురువు దగ్గరికి వెళ్ళి ముందురోజు రాత్రి జరిగిన వృత్తాంతాన్ని చెప్పగానే గురువెంతగానో సంతోషించాడు.

కాబట్టి శ్రద్ధతో చేసిన పని కాస్త ఆలస్యమైనా మంచి ఫలితాన్నిస్తుందని ఈ కథ ఋజువు చేస్తోంది.



## 53. పరులను అవమానించరాదు

**తే॥గీ॥ పరుల కవమాన మొనరింపఁబాటుపడినఁ**
**దమకెగలుగుట తథ్యంబు దాని ఫలము**
**మన్ననలు సేయు వారికే మన్ననయగు**
**జొన్నవిత్తిన వరి పండుటున్నె చెపుమ?**

ఇతరులకు అవమానం కలిగించాలని భావించిన వాడే అవమానాల పాలు కాకతప్పదు. గోడకు కొట్టిన బంతి తిరిగి అదే వేగంతో వేసినవాడి ముఖానికి తగులుతుంది. దుర్యోధనుడు కూడా పాండవులకు అవమానం చేయాలని వెళ్ళి తానే అభాసుపాలై "కాగల కార్యం గంధర్వులే తీర్చారు" అన్న నానుడికి కారకుడయ్యాడు.

పాండవులు వనవాసం చేస్తున్న సమయంలో ఒక రోజు దుర్యోధనుడు దుష్టచతుష్టయంతో కొలువుదీరి "పాండవులు ప్రాణాలతో ఉన్నంత వరకు

నా మనసుకు శాంతి లభించదు. నేనిప్పుడు సైన్యాన్ని తీసుకొని వెళ్ళి వారిని మట్టుపెడతాను" అన్నాడు ఇదే మంచి పద్ధతని దుశ్శాసనుడు వంత పాడాడు. సైంధవుడు వారు అసాధ్యులని, ఆలోచించి నిర్ణయం తీసుకొమ్మని సలహా యిచ్చాడు. "మునుపు జూదంతో వారి సంపదలన్నింటినీ దోచుకున్నాం. అడవులకు పంపించాం. ఇప్పుడు కూడా మాయోపాయంతో శత్రువుల్ని సంహరించడమే ఉత్తమం" అని శకుని తన అనుభవాన్ని తెలిపాడు. దుర్యోధనుడు దానికి సమ్మతించాడు. అది చూసి కర్ణుడు "కౌరవేంద్రా! పాండవులిప్పుడు ద్వైతవన సరోవరానికి దగ్గర్లో ఎంతగానో దుఃఖితులై, నార వస్త్రాలు ధరించి, జడలు ముడుచుకొని కందమూలాలు తింటూ తమను తాము తిట్టుకుంటూ, బాధపడుతూ కాలం గడుపుతున్నారు. నీవు నీ రాణులతో, సమస్త సైన్యంతో, వైభవంతో అక్కడికి వెళ్లి వాళ్ళ కళ్ళు కుట్టేటట్లు కనబడు.

**తే॥గీ॥ "అతుల సౌభాగ్య భోగ సమగ్ర మహిమ**
**నొప్పుచున్న నీ దేవుల మెప్పు చూచి**
**ధృతిదఱింగి తన్నుదాన నిందించు కొనుచు**
**హృదయమున బాండవాంగన యెరియవలదే?"**

"నీ భార్యల ఐశ్వర్యాన్ని చూసి ద్రౌపది హృదయంలో ఎంతగానో వేదన చెందుతుంది. నీ వైభవాన్ని చూసి మనస్సులో క్రుళ్లి కృశించి, దుఃఖించి దీన్ని చూడలేక ప్రాణాలు వదలడం ఖాయం. కానీ, మీతండ్రి ఈ ప్రయాణానికి ఒప్పుకోడు. నీవు యేదోవొక ఉపాయంతో ఆయన్ను ఒప్పించాలి." అని చెప్పేసరికి, దుర్యోధనుడు అతడి తెలివిని అభినందించి ద్వైతవనంలో వున్న గోసమూహాన్ని రక్షించాల్సిన అవసరమేర్పడిందని గోపాలుని ద్వారా ధృతరాష్ట్రునికి చెప్పించాడు.

ధృతరాష్ట్రుడు "నాయనా! పాండవులిప్పటికే మనవల్ల పడరాని పాట్లు పడివున్నారు. ఎటుపోయి ఎటువస్తుందో? వారికెలాంటి కీడు తలచకుండా మీపని మీరు చేసుకొని వచ్చేయండి" అనగానే సరే అని పలికి దుర్యోధనుడు ఘోషయాత్ర అని పట్టణంలో ప్రకటించి మరుసటిరోజు ద్వైతవనానికి బయలుదేరాడు. ఎనిమిదివేల రథాలు, మప్పైవేల ఏనుగులు, తొంభైవేలు

గుఱ్ఱాలు, లక్ష కాల్బలము తన్ను అనుసరిస్తూ రాగా రారాజు ద్వైతవనం లోనికి ప్రవేశించి, ధర్మరాజు అతని సోదరులు ఎక్కడ వున్నారో తెలుసుకొని ఒక సరోవరం దగ్గర్లో క్రీడ గృహాలను నిర్మించమని సేవకులను ఆజ్ఞాపించాడు.

వారు నిర్మాణాన్ని ప్రారంభించగానే ఇంద్రుడిచే ఆజ్ఞాపించబడిన గంధర్వులు అక్కడికి వచ్చి, అది ఘారి ప్రభువైన చిత్రసేనుడికి అది క్రీడ కొఱకు నిర్ణయించిన స్థలమని, అక్కడి నుండి దుర్యోధనుని సేవకులనూ తొలగిపొమ్మని బెదిరించారు. సంగతి తెలుసుకున్న దుర్యోధనుడు కోపగించి గంధర్వులతో యుద్ధానికి దిగాడు. గంధర్వులకు, కౌరవులకు మధ్య భీకరమైన పోరాటం జరిగింది. చిత్రసేనుడి సైనికుల చేతిలో ఓడిన కర్ణుడు రథాన్ని కోల్పోయి వికర్ణుని రథమెక్కి యుద్ధభూమి నుండి తొలగిపోయాడు. దుర్యోధనుడు మాత్రం స్థిరంగా నిలిచి పోరాడుతూ వుండగా చిత్రసేనుడు అతడి రథాన్ని నుగ్గుచేసి, జుట్టుపట్టుకొని యీడ్చి నేలపై పడేసి, చేతుల్ని వెనక్కు విరిచి తన రథానికి కట్టేశాడు మిగిలిన గంధర్వులు దుర్యోధనుని తమ్ముళ్లను, కొడుకులను, మంత్రులను, రాణులను బంధించి తెచ్చి చిత్రసేనుడికి అప్పగించారు.

రణరంగం నుండి పరుగెత్తిపోయిన కొందరు సైనికులు ధర్మరాజు దగ్గరికి వెళ్ళి, అతని పాదముల మీద పడి దుర్యోధనుని విడిపించమని వేడుకున్నారు. "మనం చేయాల్సిన పని ఆ గంధర్వులే చేశారు. బాగా అవమానింపబడ్డారు" అని భీముడు ఆనందించే సరికి ధర్మరాజు "తమ్ముడూ! అలా అనడం భావ్యంకాదు. ఒకే వంశానికి చెందిన వారికి మనస్పర్థలు ఏర్పడితే సహజమైన బంధుత్వాన్ని మరచిపోయి, ఇతరులచే అవమానించ బడ్డప్పుడు చూస్తూ ఊరుకోవడం కులహాని. ఆపదలో వున్న వారిని ఆదుకోవడం మన కర్తవ్యం. మరో మాట మాట్లాడకుండా, నువ్వు నీ తమ్ములతో కలిసి దుర్యోధనుణ్ణి విడిపించు" అని ఆజ్ఞాపించే సరికి, అన్నమాట జవదాటలేక అర్జున, నకుల, సహదేవులతో కలిసి భీముడు గంధర్వుల మీదకు దాడిచేశాడు.

గంధర్వులకు, భీమాసేనాదులకు మధ్య యుద్ధం జరుగుతూ వుండగా, చిత్రసేనుడు అర్జునుని చూసి "మిత్రమా! మనకు మనకు మధ్య ఎలాంటి

శత్రుత్వం లేదు. మిమ్మల్ని అవమానించడానికి వైభవంతో వచ్చిన సుయోధనుణ్ణి అవమానించి తీసుకొని రావాలన్న ఇంద్రుని ఆజ్ఞతో యిలా చేశాము. ఇక మీకెలా ఇష్టమైతే అలా జరుగుతుంది." అని దుర్యోధనుణ్ణి, అతని పరివారాన్ని వదిలివెళ్లిపోయాడు. ఇంక ముందెన్నడు యిలాంటి సాహసం చేయొద్దని ధర్మరాజు దుర్యోధనుణ్ణి మందలించి పంపాడు. రారాజు "తానొకటి తలిస్తే దైవ మొకటి తలచాడు" అనే సామెతలా తన కోరిక తనకే ప్రమాదంగా మారినందుకు బాధపడి ప్రాణ త్యాగం చేయబోయి దుష్టచతుష్టయంచే వారించబడ్డాడు.



## 54. సజ్జనులను బాధించకూడదు

**తే॥గీ॥ "మంచి యిది చెడ్డ యిది యని యెంచకెపుడు**
**దుష్ట సహవాసమునఁజేసి శిష్ట జనుల**
**కపకృతి యొనర్చువారల కమిత దుఃఖ**
**చయముఁ జెప్పంగరాని నాశమును గలుగు"**

"చెఱపకురా చెడేవు" అన్న మాట ఇతరుల నాశనాన్ని కోరే వారికి సర్వదా వర్తిస్తుంది. చెడు చేసేవారికే కాదు, వారికి సహకరించిన వారికి కూకదా దుఃఖం, నాశనం తప్పదు. మంచి వారికి అపకారం తలపెట్టి, మంచి, చెడుల గురించి ఆలోచించకుండా ఎదుటి వారికి హాని కలిగించే వాడికి అధోగతి తప్పదు.

"వెఱిపింపబోయి వెఱచి వచ్చాడు" లోకోక్తికి చక్కటి దృష్టాంతంగా దుర్యోధనుని ఘోషయాత్రను చూపించవచ్చు. అలా విఫల మనోరథుడైన అతడు 'గాలవుడు' అనే మునిని ఆశ్రయించి, ఆయనను సేవించి, తృప్తిపరచాడు. 'గాలవుడు' "నీకేమి కావాలి?" అని అడిగాడు. దానికి దుర్యోధనుడు పాండవులను నాశనం చేసేట్లు ఒక మారణహోమాన్ని చేయాలని కోరాడు. గాలవుడు ఉలికిపడి "దుర్యోధనా!

కం॥ చెడువానిఁ జేరనెప్పుడు
జెడుగే వాటిల్లుఁగాని చెందవుశుభముల్
చెడఁగాలుచు నంగారమె
కదు నలుపిడుఁ బిదపముట్టఁ గద విద్యార్థీ!

దుర్జనులతో స్నేహం చేస్తే కీడే జరుగుతుంది అన్నది నీకు చక్కగా వర్తిస్తుంది. శిష్టులను బాధించదలచిన వాడి వంశము నాశనమౌతుంది. ఈ కోరిక తీరదు. వేరేదైనా కోరుకో" అన్నాడు. అపుడు సుయోధనుడు ఆ ముని పాదాలపై పడి ఎలాగైనా నా కోరిక నెరవేర్చండని దైన్యంగా బ్రతిమాలాడాడు. ఆడిన మాట తప్పలేక గాలవుడు చివరికి అంగీకరించి హోమం చేశాడు. దాని నుండి ఒక శక్తి పుట్టి "ఏమిటి ఆజ్ఞ"? అని గాలవుని కెదురుగా నిలిచింది. ఆ ముని పాండవులను చంపి రమ్మని ఆజ్ఞాపించాడు. పాండవులు తనకు దొరకని పక్షంలో నిన్నే ఆహారంగా గ్రహిస్తానని హెచ్చరించి వెళ్ళింది. ఆ శక్తితో పాండవులు నాశనమౌతారని దుర్యోధనుడు ధైర్యాన్ని తెచ్చుకున్నాడు.

అదే సమయంలో ద్వైతవనంలో ఒక బ్రాహ్మణుడు హోమాన్ని రగల్చడం కోసం వుంచిన అరణిని ఒక జింక తన కొమ్ముకు తగిలించుకొని పరుగెత్తింది. బ్రాహ్మణుడు దాని వెంటబడి అందుకోలేక అలసిపోయి పాండవుల దగ్గరకు వెళ్ళి అరణిని తెమ్మని ప్రార్థించాడు. వారు దానికంగీకరించి ఐదుగురూ అరణ్యంలో వెదికి వెదికి లేడి దొరకక ఒకచోట చేరి చతికిలబడ్డారు.

"ధర్మము తప్పని మనకు యీ అలజడి యేమిటి"? అని నకులుడు ధర్మరాజును ప్రశ్నించగా "ఈ జన్మలో అనుభవించే సుఖదుఃఖాలకు గత జన్మలో చేసిన పాప పుణ్యాలే కారణము" అని సమాధానమిచ్చాడు. "కాదు, కాదు ఆనాడు నిండు సభలో ద్రౌపదిని ఈడ్చుకొని వచ్చినపుడు ఈ మాటలతో నిలిపివేసిన వాళ్ళను వదిలివేయడం వల్లే ఇలా జరిగింది". అన్నాడు భీమసేనుడు. సభలో కర్ణుడు ద్రౌపదినన్న మాటలకు ఆవేశపడక అడవికి రావడం వల్లే ఇలా జరిగిందన్నాడు అర్జునుడు. "దుష్టశీలుడు, మాయాజూద కర్త అయిన ఆ శకునిని జూదం నాడే చంపివుంటే మనకిన్ని కష్టాలుండేవి కావు" అని పలికాడు సహదేవుడు.

ధర్మరాజు నకులుణ్ణి చూసి "నీ అన్నలందరూ దాహంతో వున్నారు. ఎక్కడైనా నీళ్ళున్నాయేమో చూసి, నీవు దాహం తీర్చుకొని మాకు కూడా తీసుకొనిరా" అనగానే, నకులుడు బయలుదేరి చాలా దూరం వెళ్ళి ఒక నీటి మడుగును చూసి, నీరు త్రాగబోయేసరికి ఒక అశరీరవాణి "ఈ తటాకము నాది. నేనడిగిన ప్రశ్నలకు మొదట సమాధానం చెప్పి, తర్వాత నీరు తాగు" అని పలికింది. నకులుడా మాటలు లెక్కచేయకుండా ఆ నీటిని తాగి అచేతనుడై ఒడ్డున పడిపోయాడు.

నీటికై వెళ్ళిన నకులుడు ఎంతసేపటికి రాకపోయే సరికి కారణాన్ని తెలుసుకొని రమ్మని ధర్మరాజు, సహదేవుని పంపాడు. సహదేవుడు నకులుడు పడివున్న చోటుకు వెళ్ళి అన్నను చూసి దుఃఖించి దాహాన్ని భరించలేక నీరు తాగడానికి సంసిద్ధుడయ్యే సరికి ఎప్పటిలాగే భూతం ఆక్షేపించింది. సహదేవుడు ఆ మాటలు పెడచెవిన పెట్టి నీరు తాగి పడిపోయాడు. పిమ్మట అర్జునుడు, ఆ తరువాత భీముడు కూడా వచ్చి వారిలాగే యక్షుని మాటలు పట్టించుకోకుండా తమ్ముళ్ళలాగే పడిపోయారు.

చివరకు ధర్మరాజు వచ్చి తమ్ముళ్ళ పరిస్థితి చూసి "అయ్యో! ఇక్కడ పరులెవరూ లేరు. యుద్ధపు చాయలు లేవు. తమ్ముళ్ళ శరీరం మీద గాయాలు లేవు. నీరు స్వచ్ఛంగా వుంది. వీరిలా పడివుండటానికి కారణమేమిటి? దుర్మార్గులైన దుర్యోధనుడు ఇలా చేశాడో! మా రాజ్యము, భోగభాగ్యాలు శత్రువులకు అప్పగించి, అడవుల్లో కష్టాలు అనుభవిస్తోన్న మాకిలాంటి దుర్గతి పట్టిందేమిటి? వీరినిలా పోగొట్టుకొని వెనుకకు మరలితే మా తల్లి "తమ్ముళ్ళేరి?" అని ప్రశ్నిస్తే నేనేమని బదులివ్వాలి? ఈ దుఃఖసాగరాన్ని ఎలా దాటాలి? తమ్ముళ్లతోపాటు చేరేది ఏదైనా అది నాకు స్వర్గమే" అని అమితంగా దుఃఖిస్తూ మూర్ఛపోయాడు.

అదే సమయంలో గాలవమునిచే పంపబడ్డ శక్తి అక్కడికి వచ్చి అచేతనంగా పడివున్న పాండవులను చూసి మరణించారని భావించి వెనుతిరిగి గాలవుణ్ణి చంపివేసింది. దుర్యోధనుడు ఆ దృశ్యాన్ని చూసి భయంతో బిక్కచచ్చి తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.

మూర్ఛనుండి తేరుకొన్న ధర్మరాజు భరించలేని దాహంతో కొలనులో దిగి నీరు తాగబోగా యెప్పటిలాగే అశరీరవాణి ప్రశ్నించింది. శాంతమూర్తైన ధర్మరాజు భూతమడిగిన ప్రశ్నలకు సమాధానాలిచ్చి దాన్ని తృప్తి పరచి తమ్ములను బ్రతికించుకొని, తన్ను ప్రశ్నించింది ధర్మదేవత అని తెలుసుకొని వరాలు పొంది, తమ్ముళ్లతో కూడి తన పర్ణశాలకు వెళ్ళాడు.



## 55. సహవాసము

కం॥ "చెలిమియె కీడునొసంగును
జెలిమియె సద్గుణముఁగూర్చు జింతింపగాఁ
జెలిమియె కీర్త్యపకీర్తులఁ
గలిగించుం గానఁగెలిసి కలియుము చెలులన్"

సత్సాంగత్యమో, దుస్సాంగత్యమో యేదో వొకటి లేకుండా మన జీవిత పయనాన్ని కొనసాగించలేం. స్నేహం చిన్నతనం నుండే యేర్పడి దినదిన ప్రవర్ధమాన మౌతుంది. 'మొక్కై వంగనిది మానై వొంగదని' అన్నట్లు బాల్యంలో సత్సాంగత్యం లభించకపోతే పెద్దవాడైన తర్వాత చేతికందదు. పిన్నవయస్సు నుండే మంచి స్నేహితులు కలిగినవాడు పెద్దైన తర్వాత చెడుదారిలో నడవమన్నా నడవలేదు. "ఎందు సందేహ వస్తువులయందు నాత్మగతులె ప్రమాణంబు లార్యులకు" అని కాళిదాసు సజ్జనులతో స్నేహం చేసిన వారిని గూర్చి చెప్పాడు.

ఒక తల్లి పిల్లలైన రెండు చిలుకలలో ఋష్యాశ్రమంలో పెరిగిన చిలుక "రండి విశ్రాంతి తీసుకోండి. ఫలాలను తినండి. సత్యంవద, ధర్మంచర, మాతృదేవోభవ, పితృదేవోభవ, అబద్ధాలాడరాదు" వంటి మాటల్ని నేర్చింది. రెండవది కటికవాని వద్ద చేరి "మేకమాంసం యాభై, కోడినంజుడు నలభై, మూతిమీద ఒక్కటిస్తాను! డబ్బిచ్చిపో! ఎవడబ్బ సొమ్ము? కడుపుకేమి తిన్నావు?" వంటి మాటలు నేర్చించి – ఈ భేదానికి కారణం పెరిగిన వాతావరణం. చిన్నతనంలో దొంగతనానికి మరిగినవాడు పెద్దైన తర్వాత

మర్యాదగా వుండగలడా? "గుణమెరిగి స్నేహం, పాత్ర మెరిగి దానం" చేయాలంటారు పెద్దలు. సత్సాంగత్యం వల్ల దాసీపుత్రుడు బ్రహ్మమానస పుత్రుడిగా ఎలా మారాడో తెలుసుకుందాం.

జగత్ప్రసిద్ధుడు, పరమ పవిత్రుడు, బ్రహ్మ మానస పుత్రుడు అయిన నారదుడు తాను ఆ స్థానాన్ని పొందడానికి కారణం బాల్యంలో చేసిన కృషి, సత్సాంగత్యము అని తన పూర్వజన్మ వృత్తాంతాన్ని గూర్చి వ్యాసునితో ఇలా తెలిపాడు.

"నేను వేదవేత్తల యింటిలో దాసీ పుత్రుడిగా వుంటూ, వారి ఇంట్లో పెరుగుతూ, వారికి సేవలు చేస్తూ, తక్కిన పిల్లల్లా ఆటలకు వెళ్ళకుండా, ఎలాంటి గొడవలకు దిగకుండా, భక్తి శ్రద్ధలతో భాగవతులను సేవిస్తూ, వారి ఎంగిలిని అసహ్యించుకోకుండా ప్రసాదంగా స్వీకరిస్తూ, వారు భగవంతుణ్ణి కీర్తిస్తూవుంటే శ్రద్ధాసక్తులతో వినేవాణ్ణి. కాలక్రమేణా నా మనస్సు భగవంతునిలో లీనమై మరి వేటినీ ఆశించకుండా ఉంది. ఏడు సంవత్సరాల వయస్సులోనే ఇలా హరిభక్తిలో మునిగి తేలుతోన్న నన్ను కరుణించి మునులు ఈశ్వరతత్త్వాన్ని నాకు బోధించారు. కొన్ని దినాలకు మా అమ్మ పాము కాటువల్ల మరణించినది. తల్లి మరణించడాన్ని చూసి దుఃఖించకుండా పెండ్లికై చేసిన అప్పును తీర్చివేసిన వాడిలా సంతోషిస్తూ, శ్రీహరి పద ధ్యానంలో తలమునకలౌతూ, ఉత్తర దిశగా నడిచి పర్వతాలు, అరణ్యాలు, పట్టణాలు గ్రామాలు దాటి అలా వెళ్ళి వెళ్ళి ఆకలి దప్పికలతో అలసి, ఒక నదీ ప్రవాహంలో మునిగి, పవిత్రుడినై, నీరు తాగి శ్రమను మరచిపోయి ఒక అశ్వత్థవృక్షం నీడలో కూర్చోని ఆ పరమేశ్వరుణ్ణి ధ్యానించసాగాను. ఉన్నట్టుండి ఒక రూపం నా మనోనేత్రానికి గోచరమైంది. కొన్నాళ్ల తర్వాత ఆ దేహాన్ని వదిలి, మరొక సాత్వికమైన శరీరాన్ని పొంది భగవన్నామ స్మరణను వదలకుండా ధ్యానిస్తూ, తరువాత జన్మలో బ్రహ్మ మానసము నుండి ఉద్భవించాను. ఇప్పటికి కూడ నేను దాసీ కుమారుడిగా ఉన్న నాటి హరినామ స్మరణ మరువలేదు" అని చెప్పాడు.

బాల్యంలో దుష్టుడికైనా మంచివారితో స్నేహం ఏర్పడితే దుర్గుణాలు తొలగిపోయి, సద్గుణాలు అలవడతాయి అనడంలో సందేహం లేదు.

స్నేహితుల ప్రవర్తనను చూసి, తన చెడు ప్రవర్తనను తెలిసికొని సిగ్గుపడి స్నేహితుల కోసం చెడును వదలివేయాలి. కాబట్టి పిల్లలు మంచి సావాసం చేసుకోవడం వారి అభివృద్ధికి మంచిది. "దుష్ట సహవాసము కంటే ఒంటరిగ్గా ఉండుటయే శుభకరము."



## 56. పరిహాసం ప్రాణాంతకం

తే॥గీ॥ "తనకుఁ బరియాచకంబయి తనరునడియ
యెదుటి వానికి నొవ్వియై యెసగుచుండు,
బరుల నొప్పించుటయె మహాపాపమంద్రు
గాన నెవరికేఁ బరియాచకంబు తగదు".

ఎదుటి వారిని పరిహాసం చేయడం మొదట పిల్లలకు ఒక ఆటలా అనిపించవచ్చు. కానీ దానివల్ల కలిగే అనర్థాల గురించి వారికి తెలియదు. ఇది ప్రారంభంలో వేడుకగా అనిపించినా రానురాను ఇతరులలో లోపాలను ఎత్తిచూపడం, ఇతరుల గొప్పదనాన్ని సహించలేకపోవడం, తన లోపాలను కప్పిపుచ్చుకొంటూ, అహంకారం మొలకెత్తి చివరికి అన్ని దోషాలకు నిలయ మౌతుంది. మొదట తన స్నేహితులతో మొదలైన పరిహాసం క్రమేణా తక్కువ వారిని, ఎక్కువ వారిని కూడా ఎగతాళి చేయడానికి కారణభూతం. ఎగతాళి మాటలుగాని, చేష్టలుకాని, పనులుగాని తగవు. ఈ పరిహాసమే యదువంశ వినాశానికి పునాది వేసింది.

పూర్వం యాదవులు అజేయులై బలగర్వంతో విఱ్ఱవీగుతూ ఉండేవారు. శ్రీకృష్ణుడు వారికి పెట్టని కోటగా ఉండటం వల్ల దేవతలు సైతం వాళ్లవైపు కన్నెత్తి చూసేవారుకాదు. ఒక రోజు నారదుడు, కణ్వ, విశ్వామిత్రులు శ్రీకృష్ణుని దర్శించడం కోసం వచ్చారు. రాజధానికి వస్తోన్న మునులను చూసి యాదవులు సాంబుడనే వాడిని స్త్రీలా అలంకరించి, వెంటబెట్టుకొని వచ్చి, దొంగ వినయం ప్రదర్శిస్తూ, వారికి నమస్కరించి సాంబుణ్ణి చూపి

"మహాత్ములారా! మీరు త్రికాలజ్ఞులు. మీకు తెలియందేమీ లేదు. ఈ అమ్మాయి బభ్రుని భార్య, వీరికి మగబిడ్డలంటే మక్కువ ఎక్కువ. ఈమె గర్భంలో మానవ శిశువు జన్మిస్తుందా?" అని పరాచికాలాడారు. అది విన్న మునుల హృదయంలో క్రోధాగ్ని రగిలి "ఈ ఆడవేషాన్ని ధరించిన సాంబుడు ఒక ముసలాన్ని కంటాడు. అది ఈ యాదవ వంశ వినాశనానికి కారణమౌతుంది" అని శపించి గోపాలుని దర్శనం కూడా చేయకుండా వెనుదరిగారు.

మునులు శపించినట్లే సాంబుడికి ఒక రోకలి పుట్టింది. దాన్ని చూసి యాదవులు గజగజలాడిపోయి వసుదేవుడి దగ్గరకు వెళ్ళి జరిగినదంతా విన్నవించారు. అది విని అతడు నివ్వెరపోయి, ఆ రోకలిని పొడిపొడిగా చేసి సముద్రంలో కలపమని ఆజ్ఞాపించాడు. యాదవులు అలాగే చేశారు.

కొద్ది రోజులు గడిచిన తర్వాత కృష్ణుడు యాదవ వినాశకాలం దగ్గర పడిందని గ్రహించి, వారిని సముద్రతీరంలో జాతర చేయడానికని ప్రయాణం చేయించాడు. అందరూ సముద్రతీరాన్ని చేరారు. కృష్ణుని వద్ద సెలవు తీసుకొని ఉద్ధవుడు తపస్సు చేయడానికి వెళ్ళాడు. అతని వెన్నంటి బలరాముడు వెళ్ళాడు. జాతరలో ఉత్సాహంగా పాల్గొన్న యాదవులందరూ అమితంగా మద్యం సేవించి ఆ మత్తులో ఒకరిని ఒకరు యెగతాళి చేసుకోవడం ప్రారంభించి అది కాస్తా శ్రుతిమించి కలహంగా మారింది. కృష్ణుడెంత ప్రయత్నించినా వారిని వారించలేక పోయాడు. ఒకరినొకరు తిట్టుకుంటూ అక్కడితో ఆగకుండా సిగపట్లు, తన్నులు, గుద్దులతో మరింత ఉధృతమైంది. పొడిగ చేయబడి, సముద్రంలో కలుపబడ్డ ముసలం తుంగలా మొలచి, వారి పోట్లాటకు ఆయుధంగా మారింది. ఆ తుంగ పలుగులతో తండ్రి కొడుకులు, అన్నదమ్ములు, బావమఱదులు, మిత్రులు అన్న తేడాలేకుండా ఒకరినొకరు పొడుచుకొని మరణించారు.

"వినాశకాలే విపరీతబుద్ధి" అన్న సామెతను నిజం చేస్తూ వారి పరిహాసం వారి వినాశానికి దారి తీసింది.



# 57. ఆత్రగానికి అల్పబుద్ధి

ఆ॥వె॥ "ఆత్రగాని చెయువు లన్నియుఁజెడిపోవు
దుదిని దుఃఖమొదవుఁ దోరముగను
వానినెపుడు వలవదు దూరమౌ
నాత్రగానికబ్బు నల్ప బుద్ధి"

ఏ పనిలోనైనా మనిషికి ఓర్పు చాలా అవసరం. ఓర్పులేని యేపనికూడా నిరాటంకంగా పూర్తికాదు. ఎదుటివాడు కోపంతో కొట్టడానికి వచ్చినపుడు ఓర్పుతో మాట్లాడితే వాడి కోపం అణగిపోతుంది. ఒక దెబ్బ కొడితే సహించి తర్వాత వాడితో మాట్లాడితే అతడు "అయ్యో! తొందరపడి ఎంత పొరపాటు చేశాను?" అని పశ్చాత్తాప పడతాడు. ఆత్రపడితే చేయాలనుకొన్న పని పాడైపోతుంది. తొందరపాటుతో తీసుకొన్న నిర్ణయాలు దుఃఖకారకాలు. ఆత్రబుద్ధి వానికి యెప్పుడూ దుఃఖమే తప్ప, వాడి జీవితంలో సుఖానికి స్థానం లేదు. ఆత్రబుద్ధి గల బోయవాడొకడు తన భుక్తిదాతనే చంపుకొన్న వైనాన్ని తెలుసుకొందాం.

ఒక బోయవాడు డేగనొక దానిని మచ్చిక చేసుకొని ప్రేమతో పెంచి, దాని సహాయంతో పక్షుల్ని వేటాడుతూ జీవనాన్ని సాగించేవాడు. ఒకరోజు వాడొక అడవిలో తిరిగి తిరిగి అలసిపోయి నోరెండిపోయి, నీటికోసం వెదకి వెదకి విసిగి వేసారి చిట్టచివరికి ఒకచోట యెత్తైన పర్వతము నుండి చుక్కలు చుక్కలుగ రాలే నీటి బిందువులను చూసి, తాగడానికి వీలుకాక బాధపడ్డాడు. కొద్దిసేపు ఆలోచించి వెడల్పుటాకును దొన్నెగా చేసి, దానిలో ఆ నీటిచుక్కల్ని పట్టుకోసాగాడు. అదిచూసి వాడి పెంపుడు డేగ రివ్వున ఎగిరివచ్చి ఆ దొప్పను క్రింద పడదోసి ఎత్తుమీద కూర్చుంది. ఆ డేగ మీద వుండే ప్రేమ కొద్దీ ఆ బోయవాడు దాన్నేమి చేయలేక తిరిగి ఆకును దొన్నెగా చేసి నీళ్ళు పట్టుకోసాగాడు. ఆ డేగ మళ్ళీ వచ్చి దొప్పను తోసేసింది. వాడు కళ్ళెఱ్ఱ జేస్తూ కోపంగా ఆకు దొన్నెలో నీరు పట్టసాగాడు.

డేగ వేగంగా యెగిరివచ్చి మళ్ళీ ఆ దొన్నెను తోసేసింది. అపుడా శబరుడు ఆవేశాన్ని ఆపుకోలేక డేగ మెడను కసిగా పట్టుకొని రాతికి వేసి

బాదుతూ "నేను దాహంతో ఎన్నో కష్టాలు అనుభవించి, ఎంతో ప్రయాస మీద చివరకు ఈ కొద్ది నీటితో దప్పిక తీర్చుకొందామనుకుంటే నువ్వు అడ్డం వస్తావా! నేను దాహంతో అలమటిస్తే నీకానందమా? చావు చావు" అని విసిరికొట్టాడు. తిరిగి నీటిని త్రాగబోయి "ఈ డేగ ఎందుకు యిలా మాటిమాటికి ఆ దొప్పనెగురగొట్టింది? కారణమేమై వుంటుంది? ఏరోజూ నా పనికి అడ్డుతగలంది ఈరోజెందుకిలా చేసింది?" అని ఆలోచించి, ఆ దొన్నెను అక్కడే పడవేసి, అతి కష్టం మీద పర్వతాన్నెక్కి చూస్తాడు కదా! ఒక్కసారిగా వానికి గుండె ఆగినంతపనైంది. వేటగాడైన వాడికే యేవగింపు కలిగేలా అక్కడ ఒక పెద్దపాము చచ్చి కుళ్ళిపోయి, దానినుండి బయటపడి స్రవిస్తున్న నీటినే వాడు తాగబోయింది. ఇక వాడి దుఃఖానికి అంతముంటుందా?

"అయ్యో! నా ముద్దుల బైరీ! నేను విషపూరితమైన నీటిని త్రాగి నా ప్రాణాలు కోల్పోకుండా చేసిన నిన్ను అన్యాయంగా చంపేశానే! నీ ఉపకారాన్ని గుర్తించలేక పోయానే! నీవు నా దగ్గరికి వచ్చింది మొదలు నాకన్నం పెట్టింది మరచి, దాహం తీర్చలేదని ఇంత పాపానికి వొడిగట్టానే. నా పాపానికి ప్రాయశ్చిత్తముందా? "ఆత్రగానికి అల్పబుద్ధి" అన్న లోకోక్తి నావల్ల నిజమైందికదా! నేను జీవించి ఇంక ప్రయోజనమేముంది? నీలాంటి ఉపకారిని చేతులారా చంపుకున్నాను" అని రకరకాలుగా దుఃఖిస్తూ బాధపడుతూ పిచ్చివానిలా దేవురిస్తూ ఇంటికి వెళ్ళిపోయాడు.



## 58. దురదృష్టవంతుడికి యేది వచ్చినా నిలువదు

"అదృష్టహీనుడికి యెంత ధనాన్ని యిచ్చినా ఓటి కుండలో నీరులా వ్యర్థమౌతుంది" – అని చెప్పిన కథ యిది.

పూర్వం లక్షదత్తుడనే రాజువద్ద లబ్ధదత్తుడు అనే ప్రియమైన సేవకుడుండేవాడు. లక్షదత్తుడు తనతో చమత్కారంగా మాట్లాడిన వాడికి లక్ష బంగారు నాణేలు ఇచ్చేవాడు. తనను సంతోషపెట్టిన పేదవాణ్ణి ధనికుడిగా

చేసేవాడు. లబ్ధదత్తుడికి తోలుగోచి, భార్య, పద్నాలుగు మంది సంతానము ఆస్తిగ వుండింది. తన కాంతితో ఇంటిని వెలుతురుమయంగా చేసే దీపపు సెమ్మె క్రింద ప్రక్కల చీకటి వున్నట్లు రాజుగారి దాతృత్వం ప్రియసేవకుని మీద ప్రసరించేదికాదు. లబ్ధదత్తుడు తన ప్రాణాన్ని అడ్డువేసి ఎన్నో ప్రమాదాల నుండి రాజును కాపాడి, తన వృత్తిని పవిత్రం చేసుకున్నాడు. రాజుకు కూడా అతడంటే వల్లమాలిన అభిమానం. కాని లక్షదత్తుడి ప్రేమ, దయ ధనరూపంగానో, ధాన్యరూపంగానో వెలుగుచూడలేదు. వానికొక్క తోలుగోచి, వాడి భార్యకొక్క నాలుగు మూరల చినిగిన చీర, వాడి బిడ్డలకు దిగంబరత్వం ఉందనీ, అంతకంటే మరేమి గతిలేదని కూడా రాజుకు తెలుసు. తెలిసి యేమి ప్రయోజనం? రాజ్యంలోని పౌరులంతా లబ్ధదత్తుని విషయంలో రాజెందుకంత ఉదాసీనంగా ఉన్నాడో అని ఆశ్చర్యపోయేవారు.

ఒకరోజు రాజు లబ్ధదత్తుని గురించి బాగా ఆలోచించి "వీడికి ఇప్పటికైనా దరిద్రదేవత వదిలిందా? ఆ జ్యేష్ఠాదేవి వున్నంత కాలం లక్ష్మి వాడివద్ద నిలవడం లేదు. ఈసారైనా లక్ష్మి వీనికి దర్శనమిస్తుందో ఇవ్వదో పరీక్షిస్తాను" అని ఒక పెద్ద పండును భరిణలా చేసి, దాని లోపల నిండుగ రత్నాల్ని నింపి, తన దగ్గరుంచుకొని, నిండు సభలో లబ్ధదత్తుణ్ణి పిలిచి ఏదో ఒక గీతాన్ని పాడమన్నాడు.

**గీ॥ "నిండినట్టి జలది నిండించుచు నదులు**
**మెట్లనేల నెండ బెట్టునట్టు**
**లబ్జ నిలయ ధనుల కధికంబు గూర్చుచు**
**బీదనంబు సేయు బీదజనులు"**

"నదులు ప్రవహిస్తూ నీరు నిండిన సముద్రాల్నే నింపుతాయిగానీ, మెట్ట నేలల్ని పండిచవు. అలాగే లక్ష్మి డబ్బున్న వారి వద్దకే పరుగుదీస్తుంది. బీదవారిని పీడిస్తుందేగాని, కరుణించదు" అంటూ పాడేసరికి, రాజు అదే పాటను రెండుసార్లు పాడించుకొని రత్నాలు నిండిన ఫలాన్ని వాడికి బహుమతిగా యిచ్చాడు. "ఈ రాజు తనను సంతోషపెట్టిన వాని దరిద్రాన్ని నాశనం చేస్తాడు. పాపం యా సేవకుడు దురదృష్టవంతుడు కాబట్టే రాజు

సంతోషించి కూడా వీడికి ఫలాన్ని మాత్రమే ఇచ్చాడు. అదృష్టహీనులకు కల్పవృక్షం కూడ మోదుగు చెట్టవుతుంది". అని సభ్యులు రాజు చేసిన విషయం తెలియక ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారు.

లబ్ధదత్తుడు దాన్ని తీసుకొని ఇంటికి వెళ్తూ "ఈ పండుతో నాపొట్ట నిండుతుందా? నా కుటుంబానికి యీ పూట గడిచేదెలా? దీన్ని అమ్మి యింటికి కనీసం నూకలైనా తీసుకెళ్తాను" అని అనుకున్నాడు. ఇంతలో అతడికి రాజుగారి వందిమాగధుల్లో వొకడు యెదురై తన పైకండువాను వాడికిచ్చి ఆ పండును తీసుకొని రాజును దర్శించి కానుకగా రాజు కిచ్చాడు. రాజు ఆ ఫలాన్ని గుర్తించి నంది దానిని లబ్ధదత్తుడి నుండి తీసుకొన్నాడని తెలుసుకొని "ఆహా! వీడి దురదృష్టమింకా తీరలేదు కదా! అని బాధపడి, మరుసటి రోజు లబ్ధదత్తుడితో ముందురోజు పాడించుకొన్న పాటనే పాడించి అదే పండునిచ్చాడు. సభికులంతా ముందులాగే అనుకున్నారు. "రాజానుగ్రహమే చాలు. ఈ ఫలమెంత" అనుకుంటూ లబ్ధదత్తుడు వెళ్తూ వుండగా, ఒక సామంతరాజు రాజును దర్శించాలని వెళ్తూ వాడి చేతిలో వున్న ఆ పెద్ద ఫలాన్ని చూసి "ఇది రాజుకు కానుకగా యివ్వడానికి బాగుంది" అనుకొని వాడికి రెండు వస్త్రాలిచ్చి, దానిని నిండు సభలో వున్న రాజుకు సమర్పించాడు. ఆ పండును రాజు గుర్తించి "అయ్యో! లక్ష్మి వీనిని యింకా కరుణించలేదే? అని చింతిస్తూ సభ చాలించాడు. లబ్ధదత్తుడు ఒక వస్త్రాన్ని అమ్మి భోజన పదార్థాలకు, రెండవ దాన్ని చించి పిల్లలకిచ్చాడు.

రాజు మూడవరోజు లబ్ధదత్తుడితో అదే పాట తిరిగి పాడించుకొని అదే ఫలాన్ని వాడికిచ్చాడు. వాడు దాన్ని రాజనర్తకికి యిచ్చాడు. ఆమె దానిని రాజుకు కానుకగా సమర్పించింది. రాజు "అయ్యో! ఈ దౌర్భాగ్యుడు నా కానుక నిష్ఫలంకాదు అని తెలుసుకోడే. లక్ష్మి వీడి ఇంట్లో వుండలేక నాయింటికే చేరుతోంది కదా! అనుకొని, నాలుగోరోజు నిండు సభలో లబ్ధదత్తనిచే అదే పాట పాడించుకొని, అదీ ఫలాన్ని యిచ్చాడు. అలా యిచ్చేటప్పుడు ఆపండు చెయిజారి కిందపడి బద్దలై దాని లోపలి రత్నాలు చెల్లాచెదురయ్యాయి. సభికులు ప్రభువు కరుణ ఈ రీతిగా వుంటే, మూడు రోజులు భ్రమపడ్డామే అనుకొన్నారు. "వీణ్ణి లక్ష్మి కటాక్షిస్తుందో లేదో అని

పరీక్షించడం కోసం ఈ పని చేశాను. ఇన్నాళ్ళకు ఆ తల్లి కరుణించింది". అని అంటూ, వాడికి ఆ రత్నాలతో పాటు అనేక వస్తువాహనాలు ఇచ్చి, వాణ్ణి సామంతరాజుగా చేసుకొన్నాడు.



## 59. సత్కార్యాలకు ఆటంకాలు యేర్పరచరాదు

**తే॥గీ॥ సాధులకు బాధయగునట్లు సత్కృతులకు**
**జెఱపు సేయంగ, దప్పక చెడుగువచ్చు**
**నవ్వుచును బిల్లచేష్ట లొనర్చి పిదప**
**నేడ్చుచను భవించుట యేలె యీావ చెపుమ॥**

మంచి వారిని నొప్పించడం, మంచి పనులకు ఆటంకాలు కలిగించడం తగనివి. వాటివల్ల ఆక్షణంలో ఆనందాన్ని పొందగల్గినా తర్వాతి పర్యవసానాన్ని ఆలోచించరు. "చేతులు కాలిన తర్వాత ఆకులుపట్టుకొన్నట్లు"గా తుంటరి తనంతో తప్పుచేసి ఆ తర్వాత దుఃఖించే ప్రయోజనం వుండదు. కాబట్టి సాధులను బాధించకూడదు. అలా బాధించిన వొక పిల్లవాడికి పట్టిన గతియేమిటో ఈ కథ ద్వారా తెలుసుకుందాం.

ఒక బ్రాహ్మణుడు ప్రతిరోజూ ఒక కొలనులో స్నానాధికాలు ముగించుకొని, దాని గట్టుమీదున్న అశ్వత్థవృక్షం నీడలో కూర్చొని, నిశ్చలమైన మనస్సుతో భగవంతుని ధ్యానించేవాడు. ఒకరోజు ఒక తుంటరి పిల్లవాడు ఆ బ్రాహ్మణుడి ఎదురుగా వచ్చి నిలబడ్డాడు. ఆ స్వామి అరమూసిన కన్నులతో భగవంతుని రూపాన్ని ఊహిస్తూ ఆనందలోకాల్లో విహరిస్తూ ఆ బాలుణ్ణి చూడలేదు. అపుడు ఆ అల్లరిపిల్లవాడు అతని వెనుకకు వెళ్ళి పిలకజుట్టును లాగాడు. పిలకలాగినందుకు అతడికి కోపం రాలేదుకాని, ధ్యానం భంగమయిందని కోపం వచ్చింది. అయినా ఆ కోపాన్ని అణచుకొని ఇలా ఆలోచించాడు.

"వీడిమీద కోపంతో ఏదైనా అంటే మాటామాటా పెరుగుతుంది. అపుడు చిన్నా పెద్ద అన్న తేడాలేకుండా పోతుంది. చుట్టూ చేరిన వాళ్ళు నాకే శాంతి

వాక్యాలు బోధిస్తారు. అంతే కాకుండా అల్లరి పిల్లలు ఎంత గొప్ప సాధువునైనా నిముషంలో పిచ్చివాణ్ణి చెయ్యగలరు. అతడు వూరుకొన్నా, వారు అతణ్ణి వెక్కిరించి తిట్టి, రాళ్ళు రువ్వి కోపాన్ని పెంచుతారు. కొందరు పిల్లలకు అది ఒక ఆటగా అనిపిస్తుంది. వారి బాధతట్టుకోలేక అతడు వారిని తరమడానికి ప్రయత్నిస్తే. అతడు వచ్చే వరకు పరుగెత్తి, నిలిస్తే నిలిచి, ఇక వీరు వెళ్ళి పోతారులే అని వెనుదిరిగితే తిరిగి వెంబడించి, పిచ్చివానిగ చేసి ఆడిస్తారు. నేను ఊరుకుంటే వీరూరుకోరు. కాబట్టి వీరికి తగిన గుణపాఠం వేరొకరితో చెప్పిస్తాను" అని అనుకొని ఆ అల్లరివాడికి తన వేలికున్న బంగారు ఉంగరాన్ని ఇచ్చాడు.

వాడు ఆ ఉంగరాన్ని తీసుకొని ఎంతో ఆనందంగా "నాకు డబ్బు సంపాదించడానికి మంచి ఉపాయం దొరికింది" అని ఎగురుకుంటూ ఆ బ్రాహ్మణుని ఆ రోజుకు వదిలిపెట్టి ఇంటికి ప్రయాణమయ్యాడు. మార్గమధ్యంలో వాడికి ఒక మహమ్మదీయుడు యింటిముందు అరుగు మీద ఒక వస్త్రాన్ని పరచికొని దాని మీద మోకరిల్లి, కూర్చొని, వంగి, లేచి నమాజు చేయడం కంటబడింది. వీడిని ఏడిపిస్తే యింకో ఉంగరం దొరికే శుభ ఘడియలు దగ్గరపడ్డాయి అని భావించి ఆ నవాబుకు పిలకలేకపోయే సరికి చెవిపట్టి లాగాడు. అపుడతడు కోపంతో మండిపడి, కళ్ళెర్రజేస్తూ పండ్లు పటపట కొరుకుతు పొమ్మని సైగచేశాడు. "నీకోసం మళ్ళీ ఎవరు వస్తారు? ఇప్పుడే యివ్వు" అని కాస్త రోషంగానే చెబుతూ వాడు ఇంకాస్త గట్టిగా చెవి లాగాడు. అపుడు ఆ మహమ్మదీయుడు గుడ్లురిమి చూసి, వాడి రెండు చెంపలు వాయించి, మెడపట్టి నెట్టివేశాడు.

ఆ తుంటరి వాడు ఏడుస్తూ కొలని గట్టుపై ఉన్న బ్రాహ్మణుని వద్దకు వెళ్ళి" అయ్యా! నీ జుట్టుపట్టి లాగితే ఉంగరమిచ్చావు. ఆ మహమ్మదీయుని చెవిపట్టి లాగితే అతడు యీడ్చి కొట్టాడు. మీ యిద్దరికీ బేధమెందుకు?" అని అడిగాడు. దానికతడు "ఓరే అమాయకుడా! నీవు చేసింది చెడ్డపని. నేను నీకు ముందే నీతులు చెపితే వినవని, అతడు చేసినపని చేయడానికి నాకు శక్తిలేక, నీవు బుద్ధివంతుడయ్యే మార్గాన్ని ఆలోచించి వేరే వారితో ఈ పని చేయించాలని అనుకొని ఇలా చేశాను. నా కోరిక తీరింది. నీవు బుద్ధివంతుడవై యెవరికీ అపకారం చేయకుండా, మంచి పనులకు ఆటంకం

కలిగించకుండా భగవంతునికి ప్రీతిపాత్రునిగా జీవించు" అని దీవించి తన దారిని తాను వెళ్ళాడు. ఆనాటి నుంచి ఆ పోకిరివాడు బుద్ధిమంతుడై సాధువులను గౌరవించసాగాడు.



## 60. ఋణశేషము వుండరాదు

భార్య, బిడ్డలు, ఇల్లు, భూములు, ఆవులు, ధనము, ధాన్యము మొదలైనవన్నీ ఋణం వల్లే ప్రాప్తిస్తున్నాయి. ఋణము తీరిన వెంటనే వాటిని గట్టిగా పట్టుకున్నా అవి మన దగ్గర వుండకుండ దూరమౌతున్నాయి. మనకు ఋణపడిన వాడివల్ల దుఃఖాన్ని మనం పొందుతున్నాం. మనం ఎవరి దగ్గరైన అప్పు తీసుకుంటే దానిని ఎగవేయకూడదు. ఈ జన్మలోనే కాకుండా అది మరుజన్మలో కూడా మనల్ని వదలదు. ఋణశేషము, వ్యాధి శేషము, శత్రుశేషము వుండకూడదు. ఉంచితే అవి మనల్ని ముంచుతాయి. దాదాపు యాభై సంవత్సరాల క్రిందట దీనికి దృష్టాంతంగా జరిగినది అని చూసిన వారు చెప్పిన ఒక విచిత్రమైన కథను తెలుసుకుందాం.

చంద్రగిరి దగ్గర్లోని గ్రామంలో వొక ధనికుడుండేవాడు. అతడు పరమ పిసినారి. ఆకలితో కడుపు పట్టుకొని వచ్చిన బిక్షగాణ్ణి కసిరివేస్తాడే గాని అన్నం పెట్టడు. కూలి చేసినవాడికి కూలి డబ్బులు కూడా సరిగా ఇవ్వడంటే వాడి దాతృత్వాన్ని గూర్చి పొగడాల్సిన అవసరముందా? తన ఇంట్లో బట్టలుతికే చాకలికీ అతడు మేరగింజలు ఈయడు. అడగాలంటే ఆ చాకలి వాడికి భయం. అతడా అడగకుంటే యీయడు. కూలిడబ్బు ల్లేకుండా ఆకలితో పనియెలా చేస్తాడు? ఒకరోజు ఆ చాకలి ధైర్యం చేసి ఆ ధనికుడి దగ్గరకు వెళ్ళి, చేతుల జోడించి, వినయంగా, "దేవరా! పిల్లలు పస్తున్నారు, దయచేసి గింజలు ఇప్పించండి" అని కాళ్ళా వేళ్ళాపడ్డాడు. ఆ లోభివాడిని కొఱకొఱ చూస్తూ, "ఏరా! బాగా కొవ్వుపట్టి కళ్ళు కనిపించడం లేదా? పొగరు తలకెక్కిందా? ఈ వూరి నీళ్ళు బాగా ఒంటబట్టినట్లున్నాయి. పెద్దంతరం చిన్నంతరం లేకుండా మాట్లాడుతున్నావే" అని దబాయించాడు.

దాంతో వాడు బెంబేలెత్తిపోయి "ఎంతమాట! ఎంతమాట! నేనంతపని చేయలేదే మన్నించాలి. గింజలు పెట్టించండని అడిగాను. మరే తప్పు చేయలేదు స్వామి" అని మళ్ళీ వేడుకోసాగాడు. "మళ్ళీ మళ్ళీ అదేమాట. నీ చర్మం వొలిపిస్తాను. నిన్ను నీకులం నుండి వెలివేస్తాను" అని బూతులు తిట్టి కొట్టబోయాడు. పాపం చాకలివాడేమి చేయగలడు? షావుకారు ఆ వూరిలో పెద్దరైతు. అందరూ అతని మాటనే గౌరవిస్తారు. చాకలి ఇంకేమి మాట్లాడలేక వెనుదిరిగి పోయాడు. డబ్బు యివ్వకపోయినా అతని ఇంట్లో పని చేయక తప్పలేదు. మరుసటి సంవత్సరం కూడ చాకలి మేరగింజలు అడగడం. అతగాడు కాదని తిప్పికొట్టడం జరిగింది. అలా చాలా సంవత్సరాలు గడచిపోయాయి. "బండచాకిరి నాతో కూలి ఇవ్వక చేయించుకొని, నా ఇంట్లో మురికి గడ్డలు మోసే గాడిదవై పుడ్తావులే" అని చాకలివాడు తనలోతాను షావుకారుని తిట్టుకొనే వాడు.

కొద్దికాలం తర్వాత ఆ పిసినిగొట్టు చనిపోయి, నిజంగానే చాకలి యింట్లో గాడిదగా పుట్టి, వాడి మూటలే మోయసాగాడు. ఒకరోజు ఆ ధనికుని కొడుకు గాడిద పాలకోసం చాకలి యింటికి వచ్చాడు. ఆ గాడిద షావుకారు బిడ్డను చూసి కన్నీరు మున్నీరుగా యేడ్చింది. అతడు ఆ దృశ్యాన్ని చూసి యేదో తెలియని బాధకు లోనయ్యాడు. ఆ రోజు రాత్రి అతడి కలలో ఆ గాడిద కనపడి "నాయనా! నేను మీ నాన్నను, చాకలి వాడికి తిండి గింజలు యివ్వక, వెట్టిచాకిరి చేయించుకొని, ఆ ఋణాన్ని తీర్చుకోవడం కోసం వాడి యింట్లో గాడిదైపుట్టాను. వాడి మురికిమూటలు మోయలేక నా నడుము విరిగింది. దానికి వైద్యం చేయించడు గాని, పనిమాత్రం చేయిస్తూనే వుంటాడు. పారిపోదామా అంటే మూటలే మోసే సమయంలో తప్ప, మిగిలిన సమయంలో కాళ్ళు కట్టేస్తాడు. వాణ్ణి ప్రయోజనమేంటి? నాయనా! నేనింకా వాడి ఋణం తీర్చాల్సి వుంది. రేపే నీవు వాణ్ణి యింటికి తీసుకొనివచ్చి, గాదెలన్నింటినీ తెరిపించి, వాడికి తనివితీరేంత వరకు గింజల్ని తీసుకొని పొమ్మని చెప్పు" మీ తండ్రి ఋణం తీరింది" అని వారనేంత వరకు యివ్వు. ఎప్పుడైతే వాళ్ళు "తృప్తయ్యింది" అంటారో అప్పుడే నా ప్రాణము పోతుంది. ఇదే నీకొక దృష్టాంతమౌతుంది. నా కొడుకువైపుట్టినందకు యీ విధంగా చేసి, నన్ను ఋణవిముక్తుణ్ణి చేసి వుద్ధరించు" అని బాధపడ్డాడు.

ఆ మాటలు విన్న కొడుకు మేల్కొని, "ఇది చిత్రం" అనుకొని, అతడు తండ్రిలాంటి లోభికాదు కాబట్టి, చాకలివానిని, వాని కుటుంబ సభ్యుల్ని పిలిపించి, కొన్ని గాదెల్ని తీయించి వారికి తృప్తి కలిగే వరకు తీసుకొని పొమ్మన్నాడు. కానీ వారలా చేయడానికి సందేహించారు. కాని ధనికుని కొడుకు "నిర్భయంగ, నిస్సశయంగ, జంకుగొంకు లేకుండ యెంతైనా తీసుకొని పొండి" అని బలవంతం చేశాడు. అప్పుడు వాళ్ళు ధైర్యంగా కావలసినంతా తీసుకొని పోయారు. ఇంకా తీసుకెళ్ళండి అని ఇంకెంతో మంది కూలి వాళ్ళను సాయంగ పంపాడు. వాళ్ళు యేడెనిమిది గరిసెల గింజల్ని తీసుకెళ్ళి "ఇక చాలు వుంచుకోవడానికి చోటులేదు" అన్నారు. అయితే ధనికుని కొడుకు పెద్ద యిల్లిస్తాను. ఆ ఆశ తీరేదాకా తీసుకెళ్ళండి అన్నాడు. చాకలివాళ్ళు ఆశ్చర్యపోయి "అయ్యా! నాలుగు సంవత్సరాల కూలి ముట్టింది. ఇంక మాకు వద్దు" అన్నారు. ఇంకో నాలుగు సంవత్సరాలకు సరిపడా తీసుకెళ్ళుండని అతడు బలవంతం చేసి, కూలివారితో పంపాడు. ఆ చాకలివారు "వద్దు స్వామీ వద్దు! మీ యింట రెండు తరాల వారికి పనిచేస్తే వచ్చేంత ముట్టింది" అన్నారు. అతడు "వీరింకా మానాన్న ఋణం తీరిందని చెప్పలేదే? నేనడక్కుండానే వాళ్ళతో చెప్పించాలి" అనుకొని, తిరిగి యింకో పూరి గుడిసె నిండా ధాన్యాన్ని వారికిచ్చాడు. వారు దిగులుపడి "స్వామీ! మా తండ్రి తోడు, మీ తండ్రి కాలంది కూడ ముట్టింది. ఇంక మాకు వద్దు" అన్నారు. ఆ మాట వాళ్ళ నోటినుండి వచ్చీ రాకముందే ఆ గాడిద గిఱ్ఱుమని నేలమీద పడి చనిపోయింది.

అష్ట దరిద్రాలలో ఋణం మొదటిదిగా చెప్పబడింది. అప్పు తీసుకొని ముంచిన వాడికి యమదండం లేదు. వాడు తిరిగి ఋణం తీర్చుకోవడానికి అనుకూలంగా కుక్కగానో, పశువుగానో, కొడుకుగానో, సేవకుడుగానో పుట్టాలి. కుక్కను మనమెంత ప్రేమతో పెంచినా, ఒక్కోసారి మన యింటిని కాదని, తనను తరిమి తరిమి కొట్టే వారింట్లోకి బలవంతంగ వెళ్ళి వాళ్ళు తిండిపెట్టక పోయినా శ్రద్ధగా కాపలా కాస్తూ వుంటుంది. దీనికి కారణం ఋణానుబంధమే కదా!

# 61. పెట్టిపుట్టాలి

**శ్లో॥ యేన యేన శరీరేణ యద్యత్కర్మ కరీతియః**
**తేనతేన శరీరేణ తత్తత్ఫల ముపాశ్నుతే॥**

ఎవరు ఏ శరీరాన్ని ధరించి ఏయే కర్మలు చేస్తారో, ఆయా శరీరాలతో ఆయా కర్మఫలాల్ని అనుభవిస్తారు. కొంతమందికి పూర్వజన్మల మీద పునర్జన్మ మీద నమ్మకం ఉండదు. అదే లేకపోతే మానవులంతా సమానంగా ఉండాలి కదా! డబ్బున్నవారు - పేదవారు ; రోగులు - ఆరోగ్యవంతులు; సుఖజీవులు - కష్టజీవులు; అందమైనవారు - కురూపులు; మంచివారు - చెడ్డవారు; జ్ఞానులు - అజ్ఞానులు మొదలైన భేదాలెందుకున్నాయి? ధనవంతుల ఇంట్లో పుట్టడానికి, పేదవారింట్లో పుట్టడానికి వారి పూర్వజన్మలోని పాపపుణ్యాలు కారణం కాక వేరే కారణం ఉంటుందా? పుట్టుకతోనే అందవిహీనంగా, అందంగా ఉండడానికి తల్లిదండ్రులు కారణమంటారు కాని తల్లిదండ్రుల దోషాల్ని బిడ్డలు అనుభవించడమా? కర్మ ఒకరిది దాని ఫలితం మరొకరిదా? ఎక్కడో కొడితే దవడపండ్లు రాల్తాయా? తెలివైన వారి పనులు జరుగక పోవడానికి, ఎలాంటి ప్రయత్నం చేయనివారి పనులు వాటంతట అవి విజయవంతం కావడానికి, కోరిన ఆనందం దూరమవడానికి; కోరకుండానే దుఃఖం కలగడానికి పూర్వజన్మలో చేసిన కర్మఫలాలే కారణం.

**శ్లో॥ యస్యరత్నాకరస్తాత యస్యలక్ష్మీ సహోదరీ ।**
**శంఖోరోదతి భిక్షార్థీనా ఉదత్త ముపతిష్ఠతే ॥**

దేనికి రత్ననిలయుడైన సముద్రుడు తండ్రో, లక్ష్మీదేవి తోబుట్టువో అలాంటి శంఖము భిక్షార్థియై ఇంటింట వాకిట్లో రోదిస్తోంది. పెట్టిపుట్టని వారిని అదృష్టం వరించదు. దీనికొక దృష్టాంతాన్ని చూపుతాను.

ఉజ్జయినీ నగరాన్ని ధర్మబద్ధంగా పాలిస్తూ 'సాహసాంకుడు' అని బిరుదు పొందిన విక్రమార్కుడు ఒకరోజు నిండు సభలో రాజ్య కార్యాల్ని ముగించుకొని, తర్వాత తన మంత్రివర్గాన్ని చూసి ఎంతో ఆసక్తితో "నేను పూర్వజన్మలో ఏ కులంలో పుట్టి, ఏయే మంచిపనులు చేసి ఈ పదవికి రాగలిగానో వివరంగా చెప్పి నా జన్మను ధన్యం చేయండి" అని అడిగే

సరికి మంత్రులు ఒకరి ముఖాలు ఒకరు చూసి తలదించుకున్నారు. వారిలో చాలా తెలివైన వాడైన భట్టి ఇలా అన్నాడు. "రాజోత్తమా! మీ కోరిక ఈ మంత్రులవల్ల తీరేదికాదు. ఆరు నెలలు గడువిస్తే మీ పూర్వ జన్మను గూర్చి చెప్పగలిగే జ్యోతిష్యుణ్ణి వెంటబెట్టుకొని వస్తాను" అనే సరికి విక్రమార్కుడు సరే అని సభను చాలించాడు.

భట్టి "రాజుగారి పూర్వజన్మ వృత్తాంతాన్ని సాక్ష్యాలతో సహా ఆరు నెలల్లో చెప్పినవారికి గుమ్మడికాయంత బంగారం, కోరిన గ్రామాలు బహుమతిగా లభిస్తాయి. అయితే ఆ పని జరుగుతుందని వచ్చి, ఆరు నెలలు గడిపేసి, ఆ తర్వాత 'నావల్లకాదు' అనేవారికి, అబద్ధం చెప్పి అనుభవపూర్వకంగా వివరించని వారికి శిరచ్ఛేదం తప్పదు" అని రాజ్యమంతటా చాటింపు వేయించాడు. ఈ చాటింపు మొదటి వాక్యం విన్నప్పుడు ఎందరో జ్యోతిష్యులు ఆ లాభాన్ని పొందడానికి ఉవ్విళ్ళూరేవారు. తీరా రెండో వాక్యం వినగానే నీరుగారిపోయేవారు. ప్రాణమంటే అందరికీ తీపి కదా!

ఒక అగ్రహారంలో అధిక సంతానం వున్న 'శంకరభట్టు' అనే బ్రాహ్మణుడు ఈ చాటింపు విని ఇలా ఆలోచించాడు. "నివ్వరి గింజల్ని ఏరితెచ్చి రోజుకొక్క పూటైనా కడుపునిండని గంజిని బిడ్డలకు తాగిస్తే, అది సరిపోకుండ వాళ్ళు ఆకలికి మలమలమాడుతు పాలకోసం అలమటిస్తుంటే చూస్తూ ఉండే నా దరిద్రపు జీవితం ఎందుకు?

**కం॥ ఒడమిగల వెడగునైనను**
**బుడమింగల వారలెల్ల భూషింతురు శ్రీ**
**వెడవాసిన దూషింతురు**
**కడుఁ బీదరికంబు కంటెఁగష్టము కలదె?**

భార్యా బిడ్డలకు శత్రువులా, బంధువులకు దొంగలా, సభ మధ్యలో పాపిలా కనిపించేలా చేసే ఈ దరిద్రాన్ని అనుభవించడం చాలా కష్టం. కాబట్టే విశ్వామిత్రుడు "ధనమార్జయ కాకుత్స్థ, ధనమూల మిదంజగత్" అని శ్రీరాముణ్ణి హెచ్చరించాడు. చిన్నబిడ్డలు ఆకలో అంటూ చీరపట్టి లాగుతుంటే, విపరీతమైన ఆకలితో సోలిపోయే నా భార్య దుస్థితిని ఎలా చూస్తూ ఊరుకొనేది! విక్రమార్క మహారాజు పూర్వజన్మ చరిత్రను చెప్పడానికి వెళ్ళే నా అదృష్టం ఎలావుందో! ఎలా జరగల్సివుంటే అలాగే జరగనీ!

చెప్పగలిగితే భూతి. చెప్పలేకపోతే మృతి. పర్యవసానం ఎలావున్నా ఆరు నెలలు మృష్టాన్నం" అని నిశ్చయించుకొని భార్యతో చెప్పి, బిడ్డల్ని ఆశీర్వదించి, ముద్దాడి "ఫలిస్తే మీకు పాయసం. ఫలించకపోతే నాకు మరణం" అని బయలుదేరాడు.

అతడు అడవిగుండా ప్రయాణం చేయాల్సి వుండడం వల్ల పగటి పూట నడుస్తూ, కాయలు, ఆకులు తింటూ, నీళ్ళుతాగి రాత్రిపూట క్రూరమృగాల భయంతో చెట్లమీద పడుకుంటూ, ఒకరోజు రాత్రి ఒక బిల్వవనంలోకి ప్రవేశించి అక్కడ ఉన్న ఒక చెట్టుమీద పడుకున్నాడు. అర్ధరాత్రి సమయంలో చెవులు చిల్లులుపడేలా భయంకరమైన శబ్దం వినిపించింది. ఆ శంకరభట్టు లేచి "మంచికని బయలుదేరిన నాకు ఈ నట్టడవిలో పిడుగుపాటేమిటి?" అనుకుంటూ మెల్లగా కళ్ళు తెరిచాడు. "దాగబోయిన చోట దయ్యాల పోరు" అన్నట్లు ఇదేమిటి తండ్రీ! శంకరా!" అని కళ్ళు విప్పార్చి చూసేసరికి ప్రమథగణాలతో పార్వతీ పరమేశ్వరులు ఆ వైపే రావడం చూసి "ఆహా! నా పుణ్యమే పుణ్యం. నా భాగ్యమే భాగ్యం" అని ఆనందోద్రేకంతో ఉప్పొంగి పోయి, చెట్టుదిగి కళ్ళనుండి ఆనందాశ్రువులు ప్రవహిస్తూ ఉండగా సాగిలపడి పదేపదే మొక్కసాగాడు.

ఇలా ఐదుపదిసార్లు చేసేసరికి ఆ ఆదిదంపతులు ప్రేమతో లేవనెత్తి "కుమారా! భక్త శిఖామణీ! నీపూర్వ జన్మ పాప ఫలం ఎక్కువగా ఉండడంవల్ల ఇన్నాళ్లు నిన్ను ఉపేక్షించాము. ఇది మావిరవనం. ఇందులో అడుగుపెట్టిన వారికి పాపాలు నశిస్తాయి. ఈ బిల్వవనంలో నివశించేవారికి మేము రోజు దర్శనమిస్తాం. నువ్వు ఈ వనంలో ప్రవేశించి, మమ్మల్ని దర్శించిన కారణంగా నీ పాపాలన్నీ నశించాయి. నీ మనస్సులోని కోరికను గ్రహించాము. నీవు విక్రమాదిత్యుడి పూర్వజన్మను గురించి చెప్పినా నమ్మడు కాబట్టి అతడిని నమ్మించే ఉపాయాన్ని అతడికి తెలిసేలా చెయ్యి. ఉజ్జయినికి తూర్పు దిక్కులో రెండుమైళ్ళ దురంలో ఒక పల్లె వుంది. అందులో ఒక కుమ్మరివాడి ఇంట్లో మట్టితో చేసిన గుడ్డి ఎద్దు ఉంది. అమావాస్య రోజు రాత్రి శివపూజ చేసి ఆ ఎద్దు దగ్గరికి వెళ్ళి దానిని అడిగితే రాజు పునర్జన్మ వృత్తాంతం తెలుస్తుందని చెప్పు. తర్వాత ఏమి జరుగుతుందో నీకే తెలుస్తుంది. వెళ్ళు. నీకు అంతా మేలే జరుగుతుంది" అని దీవించి శంకరీశంకరులు అంతర్థానమయ్యారు.

శంకరభట్టు ఆ రాత్రికి బిల్వవనంలోనే ఉండి సూర్యోదయానికి ముందే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని ప్రయాణం సాగించి, కొద్ది రోజులకు ఉజ్జయిని చేరుకున్నాడు. రాజును దర్శించి, అతడి సత్కారం పొంది "రాజశేఖరా! నీ పూర్వజన్మ వృత్తాంత మంతా నాకు స్పష్టంగా తెలుసు. కానీ నీకు చెప్పడానికి సాహసింపలేక పోతున్నాను. నీవు అమావాస్య రోజు భవానీ సమేతుడైన శివుణ్ణి శాస్త్రోక్తంగా పూజించి, ఆ నిర్మాల్య అక్షతల్ని ధరించి, తూర్పు దిక్కున రెండు మైళ్ళ దూరంలో ఉన్న పల్లెకు వెళ్ళి, అక్కడ కుమ్మరివాడింట్లో వున్న మట్టిది, గుడ్డిది అయిన ఎద్దుమీద పుష్పాల్ని, అక్షతల్ని చల్లి అడిగితే నీ పూర్వజన్మ వృత్తాంతాన్ని చెప్పగలదు" అని అన్నాడు.

ఆ మాటలకు ఎంతగానో ఆనందించిన రాజు బ్రాహ్మణున్ని చూసి, "నీ మాటల్లోని నిజానిజాల్ని తెలుసుకొనే వరకు నువ్వు ఇక్కడే ఉండు" అని చెప్పి, శంకరభట్టు చెప్పినట్టే చేసి, ఆ ఎద్దుపై అక్షతలు చల్లి "నా పూర్వజన్మ వృత్తాంతాన్ని నాకు తెలియజేయి" అని అడిగేసరికి ఆ ఎద్దు మానవభాషలో ఇలా చెప్పింది.

"పుణ్యాత్మా! నిన్ను చూడగానే నాకు విచిత్రమైన జ్ఞానం వచ్చింది. నీ పూర్వ వృత్తాంతం నాకు బాగా తెలుసు. అయినా ఈ జ్ఞానం మధ్యలో తొలగిపోయేట్లు ఉంది. పూర్తిగ చెప్పలేనేమో అన్న అనుమానం కలుగుతోంది. నీ రాజ్యానికి పడమటి దిక్కున, ఆరుమైళ్ళ దూరంలో ఉండే అడివిలో ఒక విశాలమైన మర్రిచెట్టు వుంది. దాని మీద ఒక పిశాచం నివాసముంది. వచ్చే అమావాస్య రోజు రాత్రి నా దగ్గరికి వచ్చినట్లే దాన్ని అడుగు. అది నీకు చెప్తుంది" అని మౌనంగా ఉండిపోయింది.

రాజు ఆ మాట విని ఆశ్చర్యపోయి చేసేదేమిలేక తిరిగివచ్చి, మరుసటి అమావాస్య రోజు శివపూజ చేసి అక్షతలు, పూలు, నీళ్లు తీసుకొని ఎద్దు చెప్పిన అడివికి వెళ్ళి, మర్రిచెట్టు దగ్గరికి వెళ్ళేసరికి ఆ పిశాచం భయంకరంగా అరుస్తూ రాజుమీద పడబోయింది. విక్రమార్కుడు ఏమాత్రం భయపడకుండ తాను వెంట తెచ్చుకున్న పూలు, నీళ్లు, అక్షతల్ని ఆ పిశాచం మీద చల్లి "ఓ పిశాచమా! నా పూర్వజన్మ వృత్తాంతాన్ని చెప్పు" అని అడిగేసరికి ఆ పిశాచం కోపం తగ్గిపోయి గోడుగోడున ఏడుస్తూ కొద్దిసేపటికి "రాజేంద్రా! భగవంతుని ప్రసాదంతో నీ వృత్తాంతం, నా వృత్తాంతం జ్ఞప్తికి వచ్చింది. కాని ఈ జ్ఞాపకశక్తి

నాకు కేవలం రెండు నిముషాలే ఉంటుంది. ఆ తర్వాత నీకు నా చేతిలో చావు మూడుతుంది. కాబట్టి నువ్వు వెంటనే వెళ్ళిపో. వచ్చే అమావాస్య నాటికి తొమ్మిది సంవత్సరాల వయస్సున్న నీ పెద్దమంత్రి కూతుర్ని ఏకాంతంలో నన్ను అడిగినట్లే అడుగు సర్వం తెలుస్తుంది" అని పొమ్మని తొందరచేసింది.

విక్రమార్కుడు త్వరగా అక్కడినుండి ఉజ్జయినికి వెళ్ళి పెద్దమంత్రిని పిలిపించి "వచ్చే అమావాస్య రోజు నీ ఇంట్లో శివపూజ చేసి నీ కూతుర్ని ఏకాంతంలో చూడాలి. తగిన ఏర్పాటు చేయాలి" అని ఆజ్ఞాపించాడు. మంత్రి 'చిత్తం' అని భార్యతో ఆలోచించి, చివరికి రాజు తమ బిడ్డను కాళికి బలి ఇవ్వడానికే అలా చెప్పాడని నిశ్చయించుకున్నారు. దుఃఖమనే దావానలం వారి మనసుల్ని కాల్చివేయసాగింది.

అమావాస్య రోజు రానే వచ్చింది. ఆ రోజు మంత్రి కుటుంబంలో ఒక్కరి ముఖంలో కూడ నెత్తుటిచుక్క లేకుండా పాలిపోయింది. రాజు మాటను కాదనలేదు. రాత్రవగానే రాజు వచ్చి తనకోసం శుభ్రం చేసి ఉంచిన గదిలోకి ఆ అమ్మాయిని తీసుకెళ్ళి, పూజ పూర్తిచేసి ఆ బాలిక మీద పూలు, అక్షతలు చల్లి "కుమారీ! నా తొలిజన్మ కథను చెప్పు" అని అడిగాడు. అప్పుడు మంత్రి కూతురు "రాజేంద్రా! దేవతల అనుగ్రహం వల్ల నాకేరోజు రాని కొత్త జ్ఞానం ఉదయిస్తోంది. మన వృత్తాంతం నాకళ్ళెదుట నాటకం ఆడుతున్నట్లు కనిపిస్తోంది. దాన్ని చూసి మీకు చెప్తున్నాను.

గౌతమీ తీరంలో ఉండే ఒక మునిపల్లెలో 'రామశాస్త్రి' అనే బ్రాహ్మణు డుండేవాడు. అతడికి ఒక భార్య, కొడుకు, కోడలు ఉండేవారు. ఒకసారి మూడు రోజుల పాటు కుండపోతగా వర్షం కురిసింది. ప్రజలకు అపారమైన నష్టం వాటిల్లింది. దాంతో రామశాస్త్రి కుటుంబం మూడు రోజులపాటు పస్తులు ఉండాల్సి వచ్చింది. నాలుగో రోజు కాస్త తెరిపి దొరకడంతో అతడు భిక్షకోసం ఊరిలోకి వెళ్ళాడు. ఆ సమయంలో కూలిన గోడల్ని సరిచేస్తూ వుండేవాళ్ళు, చచ్చిన గొర్రెల్ని చూసి ఏడ్చేవాళ్ళు, నాశనమైపోయిన పంటల్ని చూసి గుండెలు బాదుకొనేవాళ్ళు, వీధుల్ని సరిచేసేవాళ్ళు ఇలా అందరూ దిక్కుతోచక బిక్కచచ్చి ఉండడంతో రామశాస్త్రికి పెద్దగా భిక్ష దొరకలేదు.

ఆ రోజుకు దొరికిన దాన్ని తెచ్చి భార్య కిచ్చాడు. ఆమె దాన్ని వండి సిద్ధం చేసింది. దేవతార్చన కాగానే దాన్ని, ఆమె నలుగురికీ సమానంగా వడ్డించింది. అదే సమయంలో ఇద్దరు అతిథులు వచ్చి, "ఆకలితో ప్రాణాలు పోయేట్లున్నాయి. బ్రాహ్మణులం కొంచెం అన్నం పెట్టి మా ప్రాణాలు నిలబెట్టండి" అని వేడుకున్నారు. ఆ మాటలు విన్న వెంటనే అతడి భార్య భర్త స్వభావం తెలిసిందే కాబట్టి వెంటనే లేచి పందిలా ఘుర్ఘురిస్తూ "నేనివ్వను. నా కొడుకు భాగం ఇవ్వను. నువ్వు, నీ కోడలు ఏమైనా చేసుకోండి" అని తన విస్తరిని, కొడుకు విస్తరిని పక్కకు తీసుకొనిపోయి కొడకుతో కలసి తినేసింది. రామశాస్త్రి కోడలివైపు తిరిగి "అమ్మా! నీ అభిప్రాయమేంటి?" అని అనగానే ఆమె "మీతోపాటే నేను" అంది.

అపుడు రామశాస్త్రి అతిథులకు తమ ఇద్దరి భాగం అన్నాన్ని వాళ్ళకు పెట్టబోయాడు. వాళ్ళు వారించి "మీ ఇద్దర్ని వదిలి మేము తినలేము. ఉన్నదాన్ని నలుగురు తిందాం" అని పంచుకొని తిన్నారు. "ఓరాజా! ఆ రామశాస్త్రివి నీవే. గయ్యాళిలా, ఇతరుల సుఖదుఃఖాల్ని పట్టించుకోని నీ భార్యే ఆ పిశాచం. సొంత బుద్ధి లేకుండ తల్లి చెప్పినట్లు నడుచుకున్న నీ కొడుకు ఆ గుడ్డి ఎద్దు. చేసుకున్న వారికి చేసుకున్నంత! పెట్టి పుట్టాలని పెద్దలంటారు కదా!" అని చెప్పి మంత్రి కూతురు మౌనంగా ఉండిపోయింది. అపుడు విక్రమార్కుడు "నువ్వేకదా అతడి కోడలు?" అని అడిగేసరికి ఆమె సిగ్గుతో తలదించుకొని 'ఔ'నని తల ఊపింది.

తర్వాత రాజు గదినుండి బయటికి వచ్చి మంత్రితో "నీ కూతుర్ని నా కోడలిగ చేసుకోవాలనుకుంటున్నాను. నీ అభిప్రాయమేమిటు?" అని అడగ్గానే మంత్రికి పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లై, ఆనందంగా "మీ ఆజ్ఞ" అన్నాడు. నరేంద్రుడు మంచి ముహూర్తం చేసి పెళ్ళి జరిపించి, శంకరభట్టుకు గుమ్మడికాయంత బంగారాన్ని, అతడు కోరుకున్న గ్రామాల్ని వాటితోపాటు ఎన్నో బహుమతుల్ని ఇచ్చాడు.

ఎవరికైనా మనం పెడితే మనం అడవుల్లో ఉన్నా పంచభక్ష్య పరమాన్నాలు మనకు అందుతాయి. ఎవరికీ ఏమీ పెట్టకుండ, ఇవ్వకుండ ఉంటే బంగారు సింహాసనంలో కూర్చున్నా తినడానికి ఏమీ ఉండదు.

# 62. కాలము

కం॥ "కాలమ జనుల సృజించును
గాలమ రక్షించు(దుంచు గాలమ చూడన్
మూలము ముమ్మూర్తులకును
గాలమ సుఖదుఃఖ కారకము విదాఁరీ!"

కాలమే జనుల్ని సృష్టిస్తుంది, రక్షిస్తుంది, నశింపజేస్తుంది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు మూలం యీకాలం. కాలమే సుఖదుఃఖాలకు కారణము. అది దాటశక్యం కాని ప్రవాహంలాంటిది. సర్వజీవరాశులు యిందులోపడి కొట్టుకొని పోతున్నాయి. ఈ కాలాన్ని జయించి శాశ్వతానందాన్ని పొంది, అవతలి గట్టుకు చేరే మహాత్ములు చాలా తక్కువ మంది. ఈ కాలంలో నాలుగు గొప్ప భాగాలున్నాయి.

కృతయుగం పదిహేడు లక్షల యిరవై యెనిమిది వేల సంవత్సరాల్ని కలిగి, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ అవతారధారియైన భగవంతుడి చేత ధర్మం ఉద్ధరించబడి నాలుగు పాదాల మీద నిలబడగ, అస్థిగతమైన ప్రాణి సమూహం ఇరవై వేల సంవత్సరాల ఆయుఃపరిమాణాన్ని కలిగి, వెలిగే గొప్ప ధర్మకాలంగా వెలుగొందింది.

రెండవదైన త్రేతాయుగం పన్నెండు లక్షల తొంభైఆరువేల యేండ్లు కలిగి ఆ విష్ణువు యొక్క వామన, పరశురామ, శ్రీరామావతారాలలో విరాజిల్లింది. అప్పటి మనుష్యులు మాంసగత ప్రాణులై ఏడువేల ఐదువందల సంవత్సరాల ఆయుర్దాయం కలిగి వున్నారు. ధర్మం మూడు పాదాల మీద నిలిచి వుండేది.

మూడోదైన ద్వాపరయుగం ఎనిమిది లక్షల అరవైనాలుగేండ్ల పరిమితితో, బలరామ, శ్రీకృష్ణ అవతారం ధరించిన భగవంతుడితో ధర్మం రెండు పాళ్ళు నిలుపబడి ప్రకాశింపబడింది. ఆ కాలంలో మానవులు రక్తగత ప్రాణులై వేయేళ్ళ జీవితకాలాన్న కలిగివున్నారు.

నాల్గవది, చివరిది అయిన కలియుగం నాలుగు లక్షల ముప్పైరెండు వేల యేండ్ల పరిమితితో, బుద్ధ, శ్రీనివాస, కల్కి అవాతారాన్ని ధరించిన

నారాయణునితో ఒకే పాదంతో ధర్మం ఉద్ధృతం కాగా, ప్రజలు అన్నగత ప్రాణులై నూరు సంవత్సరాల ఆయుష్ను కలిగి వున్నారు.

ఈ నాలుగు యుగాలతో కూడిన కాలాన్ని "మహాయుగం" అంటారు. వేయి మహాయుగాలు పద్నాలుగు మన్వంతరాలవుతాయి. బ్రహ్మకు అదివొక పగలౌతుంది. అంతే సమయం రాత్రవుతుంది. అంటే రెండువేల మహాయుగాలు బ్రహ్మకు వొక దినమౌతుంది. అలాంటి మూన్నూట అరవై అయితే ఒక సంవత్సరం. అలాంటివి నూరు సంవత్సరాలు పూర్తయితే బ్రహ్మ ఆయువు పూర్తవుతుంది. బ్రహ్మ జీవితకాలంలో మొదటి యాభై సంవత్సరాల్ని "పాద్మ కల్పము" అని తర్వాత యాభై సంవత్సరాల్ని "వరాహకల్పము" అని అంటారు. మొదటి సగంలో బ్రహ్మ, విష్ణువు నాభి నుంచి పుట్టి ప్రపంచాన్ని సృజించడం ప్రారంభించాడు. అందుకే దాన్ని 'పాద్మకల్పం' అన్నారు. రెండవ సగంలో ఆదినారాయణుడు వారాహమూర్తిగా మారి చెడబోయిన భూమిని వృద్ధరించాడు. కాబట్టి దానికి "వరాహకల్పం" అని పేరు వచ్చింది.

ఇప్పుడు వరాహకల్పంలో యేడవ వాడైన వైవశ్యత మన్వంతరం జరుగుతోంది. మానవులకు కాలం సూర్యుడు, చంద్రుడు మొదలైన నవగ్రహ చలనాన్ని బట్టి, అశ్విని మొ॥న నక్షత్ర చలనాన్ని బట్టి లెక్కింపబడింది. ప్రపంచాది నుండి యిప్పటికి యెంతకాలం గడిచిందో తెలుసుకోవాలంటే యిప్పటి గ్రహస్థితుల్నిబట్టి, విలోమగణితం చేసి భవ సంవత్సర చైత్ర శుద్ధ మొదటి ఆదివారము ఏడుగ్రహాలు మేషరాశి యొక్క మొదటి అంశంలో మొదటి కలలో, మొదటి వికళలో యెప్పుడు వుండిందో తెలుసుకుంటే స్పష్టమౌతుంది.

మనుష్యుల సంవత్సరాలకు ప్రభవ, విభవ మొదలైన అరవై పేర్లున్నాయి. ఇది కూడ వొక గొప్ప పరిమాణమే అవుతుంది. సూర్యుడి ఉత్తర, దక్షిణ పరిస్థితుల్ని బట్టి ఉత్తరాయణం, దక్షిణాయనం యేర్పడ్డాయి. చెట్లు మొదలైన వాటి పరిమాణాల్ని, వర్షాది పరిణామాలను బట్టి వసంతం మొదలైన ఋతువులు ఆరు యేర్పడ్డాయి. ఒక్కో ఋతువులో రెండు నెలలు యేర్పడి చైత్రం మొదలైన పేర్లు ఏర్పడ్డాయి. చంద్రుడు పౌర్ణమి రోజు యే నక్షత్రాన్ని

చేరువవుతాడో ఆ నక్షత్రం పేరుతో ఆ నెల యేర్పడుతుంది. ఒక నెలలో చంద్రుడి వృద్ధి, క్షయాలను బట్టి శుక్ల, కృష్ణములు అని రెండు పక్షములు యేర్పడతాయి. పక్షంలో ఏకాదశి, ద్వాదశి మొదలైన తిథులు పదిహేను వున్నాయి. తిథి శబ్ద భవమే తేది అని వాడబడుతోంది.

భూమి తిరుగుతోందని చెప్పడానికి పురాణాల్లో కూడ ప్రమాణాలున్నాయి. అంతేకాక సూర్యుడు భూమిని చుట్టవచ్చాడన్నా, భూమి సూర్యుణ్ణి చుట్టి వచ్చిందన్నా కాల పరిమాణానికి యెలాంటి చిక్కురాదు. సూర్యశబ్దం పుంలింగము. భూ శబ్దం స్త్రీలింగము. భూమి సూర్యుని చుట్టి వచ్చేకాలాన్ని సంవత్సరమని, చంద్రుడు భూమిని చుట్టివచ్చే కాలానికి మాసమని పేరు.

'తిథి' అంటే ఒక దినము. రాత్రి పగలు కలిగింది. చంద్రుడు వొక నక్షత్రంలో వుండే కాలము. నక్షత్రాలు ఇరవై యేడు. జ్యోతిశ్చక్రములో లెక్కించడానికి అనుకూలంగా ఇరవై యేడు గుర్తించబడి, వాటికి అశ్వని, భరణి మొదలైన పేరు పెట్టబడ్డాయి. రెండుంబావు నక్షత్రాలకు ఒక రాశి అని పేరు. రాసులు వెరసి పన్నెండు. సూర్యుడు వొక్కో రాశిలో ఒక నెల వుంటాడు. ఒక రోజులో వెలుతురున్న సగభాగాన్ని పగలని, చీకటున్న సగ భాగాన్ని రాత్రి అని అంటారు. ఏడు అరగడియలు ఒక యామం. రెండుంబావు గడియలు ఒక హోర (గంట). రోజుకు ఇరవైనాలుగు హోరలు.

ఏడు రోజులు కలిస్తే ఒక వారం. ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని వారాలు. ఆయా వార సప్తకాలకు ప్రసిద్ధాలు. 1. సూర్యుడు, 2. శుక్రుడు, 3. బుధుడు, 4. చంద్రుడు, 5. శని, 6. గురువు, 7. అంగరకుడు లేక మంగళుడు. ఈ క్రమంలో ఒక రోజు సూర్యోదయం నుండి మరుసటి రోజు సూర్యోదయం వరకు ఒక్క హోరకు ఒక్కో అధిపతి వుంటాడు. అందుకే మొదటి హోరకు ఆదిగ్రహమని యెంచబడే సూర్యుడధిపతి అవడం వల్ల ఆ దినానికి "ఆదివారము" అని పేరు కలిగింది. రెండవ రోజు మొదటి హోరకు చంద్రుడధిపతి కావడం వల్ల సోమవారమనబడింది. ఇలాగే మిగిలినవి కూడ. భూగోళము చుట్టూ చంద్ర, బుధ, శుక్ర, రవి, మంగళ, గురు, శని గ్రహాలు క్రమంగా దూరదూరంగా తిరుగుతున్నాయి. వారమంటే "వంతు" అని అర్థం. ఏడుగురు వొక్కో వరుస అధికారులైన కాలానికి వారమని పేరు.

యామములు రెండు కలిస్తే వొక ముహూర్తం. ముహూర్తాలు మూడుం బావు ఘడియలు లేక రెండు నాడుల కాలం. నాటికి పదిహేను లఘువులు. లఘువుకు పది కాష్ఠలు. కాష్ఠకు క్షణాలు ఐదు. క్షణానికి నిమిషాలు మూడు. నిమిషానికి లవములు మూడు. లవమునకు వేధలు మూడు 'వేధ' అంటే త్రుటిలో నూరోవంతు. త్రుటికి త్రసరేణువులు మూడు. త్రసరేణువుకు అణువులు మూడు. అణువుకు పరమాణువులు రెండు. 'పరమాణువు' అంటే సూక్ష్మము కంటే సూక్ష్మమైన అణువు తన స్థానము నుండి తాను ఆక్రమించుకొన్నంత స్థలం దాటు కాలము.



## 63. ప్రాణులు

తే॥గీ॥ "మృత్యువెప్పుడు నెత్తిపై నృత్యమాడు
నాయువల్పంబు కోర్కుల కంతులేదు
నిర్మలాంత కరణులయి ధర్మమార్గ
మునను నడచుటే జనులకు ముఖ్యముగను"

ప్రపంచంలో ఉన్న జీవరాశుల సంఖ్య ఎనభై నాలుగు లక్షలు. అందులో వృక్షజాతులు ఇరవైలక్షలు. పక్షి తెగలు పదిలక్షలు, జలచరాలు తొమ్మిదిలక్షలు, పశువులు మొ॥ మృగాలు ముప్పైలక్షలు, క్రిములు పదకొండు లక్షలు, మానవజాతి బేధాలు నాలుగులక్షలు. మనుష్యుల్లో స్త్రీ, పురుషులని రెండు జాతులున్నప్పటికి కుల, శీల, మత, స్వభావాల్ని ఆధారం చేసికొని అన్ని తెగలున్నాయని ఊహించవచ్చు. ప్రతి ప్రాణి తన ఆయుష్షు పూర్తికాగానే మృతి చెందుతుందన్నది అందరికి తెలిసిన విషయమే.

మానవుడు మరణించిన తర్వాత పంచభూతాలతో నిర్మించబడ్డ ఆ దేహము పంచభూతాలతో కలసిపోతుంది. తరువాత వాడి పుణ్యపాపాలకు తగట్టు జన్మ వాడికి లభిస్తుంది.

మనకు జీవన ప్రమాణం నూరేళ్లయినా అందరూ నూరేళ్ళు బ్రతకడం లేదు. మనం చేసే కార్యాన్ని బట్టి మన ఆయుఃపరిమితి మారుతూ వుంటుంది. మహర్షులు ఆయుష్షు వృద్ధి చేసే పనులే చేసి తమ వయోపరిమితిని పెంచుకుంటారు. కొందరు మృత్యువునే జయిస్తారు. దశరథుడు, రాముడు, రావణుడు మొదలైన వాళ్ళు తమ ఆయువును వృద్ధి చేసుకొన్నారు. పరశురాముడు, హనుమంతుడు మొదలైన వారు మృత్యుంజయులు. మన చేసే పాపపు పనులవల్ల, ఉన్న సమయాన్ని తిండి, గుడ్డ, నిద్రలకై వృథా చేసి, మంచి పనులు చేయకపోవడం వల్ల ఆయుష్కాలం క్షీణించడమే కాదు, అకాలమరణం కూడ సంభవిస్తుంది.

మనం మృత్యువును జయింపలేక పోయినా, కుల, శీల, మతాచారాలను అనుష్ఠానం చేస్తూ, ఆయుష్షును అభివృద్ధి చేసికొని, పునర్జన్మలోనైనా మంచి మార్గంకోసం ప్రయత్నిస్తున్నామా? అని కాస్త జీవిత తత్త్వాన్ని పరిశీలన చెసుకోవడం మన తక్షణ కర్తవ్యం. మానవజన్మ ఎత్తిన తర్వాత ధర్మార్థ కామ మోక్షాలను సంపాదించాలి. ధర్మ మార్గాన్ని వదలకుండ అర్థ సంపాదన చేసి ధర్మ విరుద్ధం కాని కామాన్ని అనుభవించి, మోక్షయత్నం చేసి విముక్తులవడమే ఈ పురుషార్థాలుకు తాత్పర్యము.

భగవంతుడు జగన్నాటక సూత్రధారి. మనము అతనిచే లోకమనీ నాటకరంగానికి పంపబడిన వేషదారులం. సూత్రధారుడికి నచ్చినట్లు ప్రవర్తించిన వాళ్ళనే తన వద్దకు రప్పిస్తాడు. అక్రమరీతిలో ప్రవర్తించే వాళ్ళని శిక్షిస్తాడు. దగ్గరకు రానీయడు. కాబట్టి భగవంతుని ఆజ్ఞకు బద్ధులమై ప్రవర్తించడం మన ముఖ్య ధర్మం. చావును ఎలాగు తప్పించుకోలేము. ఎప్పుడు మనల్ని తన నోట్లో వేసుకుంటుందో తెలియదు. కాబట్టి కాలహరణం చేయకుండ సత్కార్యాలను చేసి భగవంతుని కృపకు పాత్రులవడం ఉత్తమం. ఇలా మృత్యువుకు భయపడి, గుహలో దాక్కొని, చివరికి మృత్యువు నోటికి చిక్కిన ఒక అమాయకుడి వృత్తాంతాన్ని తెలుసుకుందాం.

ఒక రాజుకు వొక సేవకుడుండేవాడు. వాడెప్పుడు మృత్యుదేవతను ధ్యానిస్తూ ఉండేవాడు. ఒకరోజు ఆరాజు కొంతసేనతో, ఆ సేవకుడు వెంటరాగా అడివికి వేటకు వెళ్ళి, పగలంతా వేటాడి ఆ రాత్రికి అక్కడే

గుడారాలు వేయించి విడిదిచేశాడు. ఆ రాత్రి ఆ సేవకుడికి బొత్తిగా నిద్రపట్ట లేదు. ఒంటరిగా పడుకుంటే తనకేమై పోతుందో అని భయపడి సేనమధ్యలో వెళ్ళి పడుకున్నాడు అయినా వాడికి నిద్ర పట్టలేదు. కప్పుకుంటే ఏమౌంతుందో నని భయపడి ముఖంమీద దుప్పటి కప్పుకోకుండా, కళ్ళు మూసుకుంటే ఏమొచ్చి నెత్తిన పడుతుందో అని కనులు మూయక దిక్కులు చూస్తూ వున్నాడు.

ఇలా ఉన్న వాడి కళ్ళకు దగ్గర్లో ఉన్న పర్వతం మీద నుండి ప్రాకి వస్తోన్న భయంకర సర్పమొకటి కనిపించింది. దాన్ని చూసి వాడు అది తన్నే కాటు వేయడానికి వస్తూ వుందని నిశ్చయించుకొని నిప్పు తొక్కిన కోతిలా తహతహలాడసాగాడు. ఆ కాలసర్పం మెల్లమెల్లగా సేనా మధ్యంలోకి వచ్చింది. ఈ పిటికివాడు రెప్పవేయకుండా దాన్నే చూడసాగాడు. మెల్లగా అది రాజుపడుకున్న గుడారం లోకి ప్రవేశించింది. ఆ పిరికివాడు భయంతోనే, ధైర్యంతోనే దాన్నే అనుసరిస్తూ వెళ్ళాడు. ఇంతలో ఉన్నట్లుండి ఆ పాము తేలుగా మారిపోయి, మంచమెక్కి రాజును కుట్టి తప్పించుకుంది. రాజు తేలు కుట్టిందని అరుస్తూ మేల్కొన్నాడు. అందరూ రాజుకు చికిత్స చేయసాగారు. కొద్దిసేపటికి రాజు మరణించాడు.

ఆ పిరికివాడు పాము తేలుగా మారి రాజుని కుట్టి వెళ్తూవుండగా అది ఎక్కడికి వెళ్తోందో తెలుసుకోవాలనే ఉత్సాహంతో దాన్నే అనుసరించే సమయంలో రాజు మరణవార్త వాడి చెవిన పడింది. ఆ తేలు కాస్త దూరం వెళ్ళిన తర్వాత ఒక తోడేలుగా మారి గొఱ్ఱెల మందలోకి వెళ్ళి, కొన్ని పశువుల్ని చంపివేసి, అక్కడి నుండి వెళ్ళి పులిగా మారి ఆవుల మందలోకి వెళ్ళి కొన్నింటిని చంపివేసి వొక స్త్రీ రూపాన్ని ధరించి ఒక బాటసారికి ఎదురైంది. ఆ మాయలాడి వాణ్ణి వలపించి, కౌగిలించి, ఆ కౌగిలిలోనే వాణ్ణి యమపురికి పంపింది. అక్కడినుండి కాస్త దూరం వెళ్ళి నాలుగుదారులు కలిసేచోట ఒక మండపంలా మారింది. ఇంతలో వర్షం ఆరంభమయ్యింది. నాల్గు దిక్కులనుండి దారిన వెళ్ళే వాళ్ళు పదిమంది ఆ మండపం కింద చేరారు. పిరికివాడు మాత్రం అక్కడికి వెళ్ళడానికి సాహసించలేదు. వాన నిలువకు ముందే ఆ మండపం కూలి అందులో వారంతా జీవసమాధయ్యారు. కొద్ది సేపటికి ఒక బ్రాహ్మణుడు ఆ మండపం నుండి బయటికి వచ్చి నడవసాగాడు.

ఆ పిరికివాడు ఇదే మంచి సమయం అనుకొని ఆ బ్రాహ్మణుని పాదాలపై పడ్డాడు.

అపుడా బ్రాహ్మణుడు "లే నాయనా లే! నీవెందుకు నా కాళ్ళపై పడుతున్నావు చెప్పు" అని అడిగేసరికి, వాడిలా సమాధానమిచ్చాడు. "అయ్యా! మీరు మొదట పాముగా వచ్చి, తేలుగా మారి రాజును కుట్టి చంపి, వెంటనే తోడేలయిపోయి కొన్ని గొఱ్ఱెల్ని చీల్చి చంపి, తర్వాత స్త్రీవై ఒక బాటసారిని చంపి, ఆపై మండపంలో పది మందిని సమాధిచేసి బాపనయ్యవై ఇప్పుడెక్కడికి వెళ్తున్నావు! నీ పనులు నాకు విచిత్రంగాను, భయంకరంగాను అనిపిస్తున్నాయి. నీ సంగతి నాకు వివరంగా చెప్పు" అని వేడుకొనే సరికి ఆ మాయాబ్రాహ్మడు వాడితో ఇలా అన్నాడు.

"నేను మృత్యుదేవతను ఏదోవొక నెపంతో ప్రాణులను నాశనం చేయడం నా వృత్తి. అందువల్లే నేనిలా రూపాలను మారుస్తున్నాను. నీవు నన్నెప్పుడు ధ్యానిస్తూ ఉంటావు కాబట్టి నీకు కనిపించాను" అనేసరికి వాడు భయంతో గడగడ వణుకుతూ "దైవమా! నీవు ప్రత్యక్షమైన తర్వాత నన్నిక వదులుతావా?" అని అడిగేసరికి "నాయనా! నీకింకా సమయం దగ్గర పడలేదు. ఇంక పదో నెలలో పండకొండో రోజు పగలు ఐదు గంటలకు ఏనుగు కాలికింద నీకు చావురానుంది. అని చెప్పి అదృశ్యమయ్యాడు.

ఆ పిరికివాడు తొమ్మిదినెల్లు ఎలాగోలా కాలం గడిపి పదోనెల రాగానే దిగులుపడిపోయి, మృత్యువాత తప్పించుకొనే వుపాయాన్ని ఆలోచించి ఒక ఇరుకైన ముఖద్వారమున్న గుహలో వెళ్ళి అక్కడ ధైర్యంగా కాలం గడపసాగాడు. అయితే తన ముందరే అనేక రూపాలు ధరించిన మృత్యువు ఏనుగు రూపంతో ఈ గుహలోకి రాలేదా! అన్న అనుమానం మాత్రం వాడికి రాలేదు. అల్పబుద్ధి వాడికి దీర్ఘాలోచనలు ఎలా వస్తాయి.

ఆ గుహకు సమీపంలో ఒక మైలు దూరంలో ఒక పట్టణముంది. ఆ పట్టణపు రాజు పందెం కోసం ఒక పొట్టేలును ప్రేమగా పెంచుతున్నాడు. ఒక రోజు రాత్రి దొంగలు నగరంలోకి వచ్చి ఆ పొట్టేలును ఎత్తుకొని వెళ్ళారు. రాజభటులు వెంటనే మేల్కొని, పొట్టేలు కనిపించకపోయే సరికి నాల్గుదిక్కులు

వెదుకుతూ వెళ్ళి పిరికివాడు దాక్కొనున్న గుహలోకి వెళ్ళారు. అక్కడ వారికి పొట్టేలు మాంసం రాశి, చర్మము కనిపించింది. భటులు ఆ సొత్తుతో పాటు పిరికివాణ్ణి తెచ్చి రాజుకు అప్పగించారు. రాజు కోపంతో వాడికి ఉరివేయమని ఆజ్ఞాపించాడు. ఉరితీసే సమయంలో ఉరిత్రాడు తెగడంతో, చావు తప్పిన వాణ్ణి తిరిగి చంపకూడదన్న నియమం వల్ల వాడికి చావు తప్పింది. రాజు వానిని "నీవెందుకు దొంగతనం చేశావు, ఈ వృత్తిని వదిలిపెట్టు" అన్నాడు. దానికివాడు సమాధానంగా తన గతాన్నంతా వివరించాడు.

రాజు వాడి మాటలు విని వీడు దొంగకాడని, పిచ్చిపట్టి అలా అయ్యాడని నిశ్చయించాడు. మృత్యువు ప్రత్యక్షమవడాన్ని మాత్రం నమ్మలేదు. వాడికి ఆ భయం పోగొట్టాలని సంకల్పించి, వాడు చెప్పిన రోజు, గడియలు తప్పకుండ, అదే సమయానికి మూడు మార్గాలు కలిసేచోట వాడిని మాంత్రికులతో పాటు తీసుకొని వెళ్ళాడు. సైనికులు ఆయుధాల్ని ధరించి, చుట్టూ కాపలా కాయసాగారు. భయ నివారక మంత్రాలను చదువుతూ, తంత్రాలను చేయమని రాజు మాంత్రికుల్ని ఆదేశించాడు. ఏనుగు వల్ల భయం లేకుండా చేయడం కోసం మాంత్రికులు ఒక మట్టి యేనుగును తయారు చేసి మంత్రాలతో ఆ భయస్థుడు చెప్పిన లగ్నానికి సరిగా దిష్టి తీసి పారవేయడం కోసం చుట్టి దాన్ని వాడి బొమ్మ మీదుంచారు. మృత్యుదేవత మరుక్షణమే ఆ ఏనుగు రూపంతో వాణ్ణి చంపివేసింది. అదిచూసి అందరూ ఆశ్చర్య పోయారు.

కాబట్టి మృత్యువు ఎప్పుడు మన నెత్తిన సిద్ధంగా వుంటుంది. నిర్మలమైన మనస్సులతో, ధర్మమార్గంలో నడుస్తూ, సత్కర్మలను ఆచరించడమే అందరి కర్తవ్యం.



# 64. కలి మహిమ

తే॥గీ॥ "సర్వధర్మ ప్రపూర్ణమై జరగుఁగృతము
మూడుపాళ్ళు ధర్మంబున మొనరుఁద్రేత
ద్వాపరమ్మునఁ సగఁబాలు ధర్మమొనయుఁ
గలని ధర్మదేవత మొంటి కాలినడుచు."

కాలమనేది ఒక నదీ ప్రవాహం వంటిది. ఆ ప్రవాహంలో అందరూ కొట్టుకొని పోవలసిందే. మన పూర్వీకులు ఈ కాలాన్ని ఆధారం చేసుకొని నాలుగు విభాగాలు చేయడం అందరికీ తెలిసిందే. ఆయా కాలాన్ని అనుసరించి ధర్మం విలసిల్లుతూ వుండేది. కృతయుగంలో ధర్మం నాలుగు పాళ్ళు, త్రేతాయుగంలో మూడు పాళ్ళు, ద్వాపరయుగంలో ధర్మం రెండు పాళ్ళు వర్ధిల్లాయి. కలికాలంలో ధర్మం సంగతి ఏమిటి? అన్న ప్రశ్న ఉదయించక మానదు. దానికి సమాధానమే ఈ దృష్టాంతము.

కురుక్షేత్రంలో పాండవులు కౌరవులను మట్టుపెట్టగా ధర్మరాజు తమ్ములు తనను సేవిస్తూ వుండగా, ధర్మబద్ధుడై హస్తినాపురాన్ని ముప్పై సంవత్సరాలు పాలించాడు. ఒకరోజు శ్రీకృష్ణుడు వారి దగ్గరకు రాగా పాండవులు అతణ్ణి ఆనందంగా ఎదుర్కొని, భయభక్తులతో అతన్ని సింహాసనంపై కూర్చోబెట్టి, అర్ఘ్యపాద్యాదుల్ని ఇచ్చి ఎన్నో రకాలుగా సత్కరించారు. అపుడు అర్జునుడు శౌరిని కాలమహిమను గూర్చి తెలియజేయమని అడిగాడు. అపుడు కృష్ణుడు-

"కృతయుగం ధర్మమయంగా, త్రేతాయుగంలో మూడు పాళ్ళు, ద్వాపరంలో నాలుగు పాళ్ళు ధర్మంతో నడుస్తుంది. కలియుగంలో ఒంటి కాలితో నడుస్తుంది. కొంతకాలం తర్వాత కలి మహిమతో లోకమంతా అన్యాయం నిండిపోతుంది. ఐకమత్యం చెడిపోతుంది. వ్యసనాలు చెలరేగి పోతాయి. అన్ని ధర్మ కార్యాలు నశిస్తాయి. అన్ని రకాల పాపకృత్యాలు పెచ్చుమీరిపోతాయి" అంటూ మృదుమధురమైన తేనెలొలికే మాటలతో పాండవుల మనస్సులు రంజిల్లేలా, వీనుల విందుగా పలికాడు.

అంతలో యుధిష్ఠిరుడు లేచి "మాధవా! భూమిలో ఇటువంటి అకృత్యాలెదుకు సంభవిస్తాయి? రాజులు లేరా? శిక్షలు లేవా? శాస్త్రాలు

లేవా? దీనిని నేను నమ్మలేను" అని అంటూవున్న సమయంలోనే ఇద్దరు అపరిచితులు వారి ముందుకు వచ్చి కృష్ణునికి, కౌంతేయులకు వినయంగా వరుస క్రమంలో నమస్కరించారు. కాస్సేపటికి వారిలో ఒకడు ఇలా అన్నాడు.

"న్యాయమూర్తులారా! నా విన్నపాన్ని వినమని వేడుకుంటున్నాను. నేను పంప నుండి గంగకు వెళ్తోన్న సమయంలో ఎండను తట్టుకోలేక ఒక చెట్టు నీడలో నిలబడ్డాను. అప్పుడు ఈ మూట నాకళ్ల బడింది. దాన్ని చూసి "అయ్యో! దీని పోగొట్టుకున్న వారు ఎంతగా దుఃఖిస్తున్నాడో!" అనుకుంటూ పరుగు పరుగున వెళ్ళి ఇతణ్ణి చూసి, అతడితో మాట్లాడి "ఇతడిదే ఆ మూట" అని నిర్ధారించుకొని, ఆయనకు ఇవ్వబోయే సరికి అతడు వద్దన్నాడు. నేను "పరులు మరచిపోయిన వస్తువుల్ని గ్రహించడం భిక్షాటన కన్నా హీనమైంది. ఆ పోగొట్టుకొన్న వారెవరో గుర్తించి, ఆ వస్తువును వారికి అందజేయడం గొప్పవారి లక్షణం. కాబట్టి ఓ పుణ్యాత్ముడా! నీవు నీ మూటను తీసుకొని, నన్నీ పాపం నుండి విముక్తుణ్ణి చెయ్యి. ఈ ధనం నీదని తెలిసి తెలిసి నేనెలా తీసుకుంటాను. ఇంతకంటే నీచమింక ఏమైనా వుందా?" అని పలువిధాలా ప్రార్థించాను. అయినా ఇతడు నన్ను ఇబ్బంది పెడుతున్నాడు. న్యాయమూర్తులు! గొప్పవారు! మీరైన ఇతని ధనాన్ని ఇతనికి ఇప్పించండి." అని వేడుకొన్నాడు.

అది విన్న రెండవవాడు "అనఘులార! ఇది నిజంగా నాదబ్బే అయితే నన్ను వదలి అతని కంట ఎందుకు పడుతుంది? ఇతరులకు చెందవలసిన దానిని నేనే విధంగా తీసుకోగలను? లక్ష్మి చంచలమైంది. ఒకచోట స్థిరంగా వుండటం అరుదుకదా? అది ఎవరిని చేరాలో వారి వద్దకే వెళుతుంది. దానిని ఇతరులు ఆశించవచ్చా? అది అతడి సొత్తు కాబట్టి అతణ్ణే చేరిం దానిన్నీ అతడే తీసుకొని పోనివ్వండి" అన్నాడు.

వారి మాటలు విన్న ధర్మరాజుకు ఎలాంటి తీర్పు చెప్పాలో అర్థంకాక కృష్ణుని వైపు చూశాడు. అపుడు శ్రీకృష్ణుడు యుదిష్ఠిరునితో "ధర్మరాజా! మనము ఇప్పుడు వెంటనే ఒక చోటికి వెళ్ళాలి. మనం తిరిగి వచ్చే వరకు వీరిక్కడే వుంటారు. వచ్చిన తర్వాత వీరికి తగిన న్యాయాన్ని చెప్పవచ్చు త్వరగా రా" అని వచ్చేసరికి ధర్మరాజు ఆశ్చర్యపోయి అతడిని అనుసరించాడు.

అపుడు వారిద్దరూ భూ భారాన్ని మోసే నాగరాజు నిలయమైన పాతాళంలో ప్రవేశించి, బలి నగరంలో అడుగుపెట్టి మొదటి వాకిలి వద్ద కురు, యదు ముఖ్యులిద్దరు నల్లని శరీరాన్ని కలిగి, వికృత వేషంతో, విగత రోషంతో, శృంఖలబద్ధుడై, ఆక్రోశిస్తోన్న ఒక దీనుణ్ణి చూశారు.

అతడు దుఃఖిస్తూ "అయ్యో! నన్ను బంధవిముక్తుణ్ణి చేసే నాధులే లేరా? ఎవరిని వేడుకోవాలి? ఎంతని ఏడ్వాలి? నా దుఃఖసాగరానికి అంతం లేదు. నా మిత్రులు విలాస, విశేష గర్వంతో తపియిస్తున్నారు. పాండవులకు ఊతగా నిలిచి కృష్ణుడు నన్ను అణచివేశాడు. బలి భూమి మీద ఉండకుండ చేశాడు. నేనెలా బయటపడాలి?" అని బాధపడుతూ వుండగ వాడి మాటలు విని ధర్మరాజు బాధపడి పద్మాక్షునితో "కృష్ణా! చూశావా? ఇతడి దైన్యాన్ని, హైన్యాన్ని, వేదనను, పరితాపాన్ని చూసి నాకు వీడిపట్ల దయ కలుగుతోంది. వీడిని పొరపొచ్చెము లేకుండా విడిపిస్తాను" అన్నాడు.

అపుడు కృష్ణుడు "వీడిని బంధించింది బలి. మనకు వీడితో పనేమి? వీడెవడో మనకు తెలియదు. నీవు ఇలాంటి ఆలోచనలకు చోటివ్వద్దు" అన్నాడు. అపుడు ధర్మరాజు "పద్మనాభ! ఇతడికి విధించిన శిక్షలన్నింటిని నేను ఓర్పుగా భరిస్తాను. ఇతని బాధను నేను చూడలేకున్నాను. ఏదైనా జరిగితే నాది పూచి" అని కృష్ణుని మాటను పెడచెవిన పెట్టి వాడిని విడిపించాడు.

బంధవిముక్తుడైన వెంటనే అతడు ఒక్క గెంతులో, చాలావేగంగా, ధర్మరాజు నివ్వెరపోయేలా క్షణంలో ఎక్కడికో మాయమయ్యాడు. యుధిష్ఠిరుడు రెప్పపాటులో తాను కృష్ణునితో సహా తన కొలువులో వుండటాన్ని గమనించి అశ్చర్యపోయాడు. తన చుట్టూ సోదరులు వాదించే ఇరువురు బాటసారులు కనిపించేసరికి అతడికి అద్భుతమనిపించింది.

"ఇది కలా? నిజమా? వైష్ణవమాయా? జరిగింది ఏమిటో ఆ మధువైరిని అడిగితే? వాడిని విడిపించిన క్షణంలో నేను ఈ సభలో ఎలా వున్నాను? ఈ బాటసారులు నాకోసం వేచివున్నారు. వారికి ఏమని తీర్పు చెప్పాలి?" అని ఆలోచిస్తోన్న సమయంలో మొదటి తగవుకాడు ఇలా అన్నాడు.

"అయ్యా ఇది వినండి! ఇతడు తన డబ్బును తిరిగి ఇమ్మనడం ఏమైనా న్యాయంగా వుందా? మనిషి పూర్వజన్మ కర్మను అనుసరించి వాడిని ధనమో, దరిద్రమో వెన్నంటి వస్తుంది. నా పూర్వజన్మ పుణ్యం వల్ల నాకు దొరికిన ధనాన్ని నేను వీడికి ఎందుకివ్వాలి!" అన్నాడు. దానికి సమాధానంగా రెండవ వాడు "ధర్మాత్ములారా! ఆదమరచిన వాడి ధనాన్ని సొంతం చేసుకున్న వీడిని ఎందుకు శిక్షింపరు? భూమిమీద ఇలాంటి అన్యాయమెక్కడైనా వుందా?

**వసువునకు మతికి సుషథ మొసఁగువారి**
**వసుమతీశ పదంబు నన్వర్థమగును**
**వసుమతీశులైనంత న వఱలఁబోదు**
**ధరణీ పులకీర్తి పదమునఁగాక** – కాబట్టి మీరే న్యాయాన్యాయాలను విచారించండి" అని వేడుకున్నాడు.

అది విని కౌంతేయుడు ఒక్కసారిగా ఆశ్చర్యపోయి మాధవుని ముఖము చూసి, "పురుషోత్తమా! వీరి బుద్ధిలోని మార్పు చూసి నా మనస్సు కలవర పడుతోంది. వీరిలా మారడానికి కారణమేమిటి? దీనిని వివరించడానికి నీవు ఒక్కడివే సమర్థుడివి" అని ప్రార్థించాడు. కృష్ణుడు చిరునవ్వుతో సమాధానం చెప్పసాగాడు. "ధర్మానికి, అధర్మానికి తగవు పెడుతూ వున్న ఒకడిని బలి పాతాళలోకంలో బంధించి వుంచాడు. ప్రాజ్ఞులు వాణ్ణి 'కలి' అని అంటారు. కలి బందీగా వున్న సమయంలో వీరిద్దరూ ధర్మానికి లొంగివున్నారు. నువ్వు కలిని విడిచిపెట్టగానే వాడి ప్రభావంతో వీరిలా మాట్లాడుతున్నారు. ఇక కలియుగం ప్రవేశించింది. మీరు ముక్తిని ఆశ్రయించండి" అని చెప్పి కృష్ణుడు వెళ్ళిపోయాడు. ధర్మరాజు రాజ్యాన్ని తన మనవడికి పట్టం కట్టి వానప్రస్థానికి వెళ్ళి మోక్షాన్ని పొందాడు.



# 65. దేవుడెందున్నాడు ?

ప్రపంచకర్త దేవుడొకడున్నాడని మనకు నమ్మకం ఉంది. అయితే దేవుడు ఎక్కడున్నాడు? ఎట్లుంటాడు? అనే విషయాలు తెలుసుకోవాలి. దేవుడు జ్ఞాననేత్ర గోచరుడు. కాబట్టి అతన్ని తెలుసుకోవాలంటే జ్ఞాన సంపాదనం అత్యావశ్యకం.

తంజావూరు రాజు ఒకనాడు నిండు కొలువులో విద్వాంసులను జూచి "మనకు దేవుడెంత దూరంలో ఉన్నాడని" ప్రశ్నించాడు. పండితులా ప్రశ్నకు జవాబు చెప్పలేక ఒకరి మొగం ఒకరు చూచుచుండిరి. ఎన్నో రకాలుగా ఆలోచించి, చివరకు తమకు తోచినట్లుగా, రాజునకు విన్నవించినారు. రాజునకు ఆ మాటలేవీ రుచింపలేదు. "భిన్నాభిప్రాయాలను వదలి అందరూ ఏక వాక్యులు గండని" అన్నాడు. వారంతా కొంతసేపు తర్కించుకొని, విసిగి, రాజువద్ద నుండి తప్పించుకొనే ఉపాయం ఆలోచించి ముక్త కంఠంతో ఇట్లన్నారు. "రాజేంద్రా! ఈ పురంలో గాజుల వ్యాపారం చేసే పరమ భాగవతుడైన పెద్దదాసును అడిగితే మీ సంశయ నివృత్తి కాగలదు". పండితుల పలుకులు విన్న రాజు "పండితుల పసి యింతేనా" అని అనుకొని పెద్దదాసును పిలిపించి ఆ ప్రశ్న అడిగినాడు. ఆ భక్త శిఖామణి ఇట్లన్నాడు.

**శా॥ "వైరుల్ కట్టిన పుట్టముల్ తివియగా వారింపనా వల్లభుల్**
**రారీవేళనుపేక్ష సేయదగవే రావే నివారింపవే**
**లేరేత్రాతలు కృష్ణ! యంచు సభలో లీనాంగియై కుయ్యిడం**
**గా రుణ్యంబున భూరివస్త్ర కలితంగా జేయదే ద్రౌపదిన్"**

ఆ విధంగా ద్రౌపది ఆర్తనాదాన్ని విని ఆదుకున్నాడు. గజేంద్రుడు 'నీవే తప్ప నితఃపరం బెరుగ కావవే వరదా!' అనగానే వచ్చి ఆదుకున్నాడు. అంతేగాక అజామిళుండు తన అవసానకాలంలో 'నారాయణా! అని తన కుమారుని పిలువగా ఆ శ్రీమన్నారాయణుడు అనుగ్రహించాడు. హిరణ్యకశిపుడు పరమ భాగవత శిఖామణియైన ప్రహ్లాదుని "హరి యెందున్నాడు? చూపవేని నీ శిరము ద్రుంచి భూతబలి చేయుదు" అని

గద్దించి "ఈ స్తంభంలో చూపు"మని కోరగా అట్లే కానిమ్మని ప్రహ్లాదుడు హరిని స్తుతింపగా ఆ భక్తుని మొరాలకించి స్తంభాన ఆవిర్భవించి ఆ అసురుని పరిమార్చి బాలభక్తుని పాలించినాడు. కంచెర్ల గోపన్న కారాగారంలో - "సూత్రధారివగు నీవాడించినట్లే నటించిన కీల్బొమ్మను నెట్లు చేసిన సరే శ్రీభావనారాయణా!" అని ప్రార్థింపగా అతని దీనాలాపములు విని, కరుణా సముద్రుడైన ఆ శ్రీరామభద్రుడు తన భక్తుని చెఱనుండి విడిపించాడు. కావున భగవంతుడు భక్తులకు కూత దూరంలో ఉన్నాడని తెల్పినాడు. పెద్దదాసు సుధామధురోక్తులకు ప్రభువు సంతసించి అనేక విధాల కొనియాడినాడు.

**శ్లో॥ జలేవిష్ణు స్థలేవిష్ణు-ర్విష్ణు స్థావర జంగమే**
**అంతర్విష్ణు ర్బహిర్విష్ణు-స్సర్వం విష్ణుమయం జగత్"**

దేవుడు నీటిలోను, భూమి మీదను, అన్ని జీవరాశులలో నున్నాడు. ప్రతి వస్తువునందు, పరమాణువు లోపలను, వెలుపలను ఉన్నాడు. అతడు లేని చోటేలేదు. సర్వ జగత్తును విష్ణుమయం కాబట్టి దేవుడు అంతటా, అందరిలో అంతరాత్మగానున్నాడు.

దేవుడు ఎట్టి రూపంలో ఉంటాడు? జగదేక మాతయగు సీతమ్మకు మారుతి ఇచ్చిన ప్రత్యుత్తరం చూడండి.

**సీ॥ "నీలమేఘచ్ఛాయ బోలు దేహమువాడు**
**ధవళాబ్జ పత్ర నేత్రములవాడు**
**కంబు సన్నిభమైన కంఠంబు గలవాడు**
**బాగైన యట్టి గుల్భములవాడు**
**తిన్ననైకనుపట్టు దీర్ఘబాహులవాడు**
**ఘనమైన దుందుభి స్వనమువాడు**
**పద్మరేఖలు గల్గు పదయుగంబుల వాడు**
**చక్కని పీన వక్షంబువాడు**

**తే॥గీ॥ కపట మెఱుగని సత్యవాక్యములవాడు**
**రమణీరాముడు శుభలక్షణముల వాడు"**

శ్రీరాముడు మానవుడే గాని దేవుడు గాడని కొందరు వాదిస్తారు. భగవంతునికొక రూపంలేదని, విగ్రహ పూజ కూడదనే వారితో మనకేల వాగ్వాదం? ఏరూపం లేని దేవుని ఎలా సేవిస్తారంటే సమాధానం సున్న. రామ, కృష్ణ అవతారాల చరిత్రలు చదివినా, విన్నా, మనకు కలిగే ఆనందం ఆ దౌర్భాగ్యుల కెలా లభిస్తుంది? భక్తితో, పరమానందంతో శ్రీరామచంద్రుని సుందరమూర్తిని ధ్యానింపగా మనకు సమకూరే నిర్మలానంద భాగ్యం – "దేవునకు రూపము లేదు. గుణములేదు, నడవడి లేదు. నాలో నీలో కుక్కలో నక్కలో అన్నిటిలో నున్నా"డని ఒక్క స్థిరభావం లేకుండా, పలుపోకలు పోతుంటారు. తాను ధ్యానించే దేదో తనకే తెలియకుండా అవ్యక్తాన్ని చింతించే వారికి ఆ దేవుని రూపం ఎలా తెలుస్తుంది.

మనస్సు చంచలమైనది. దానిని స్థిరంగా నిలపడం దుష్కరం. మొదట ఒక వస్తువును చూస్తేగాని, అవ్యక్త వస్తు కల్పనం మనుజుల మనస్సులకు స్ఫురింపదు.

**క॥ "తగు విషయము జింతింపక**
**యగోచరమనూహ్యమెట్టులగు జింతింపన్**
**దగమొదటి మెట్టు నెక్కక**
**యెగువ కెగురనగునె? పడవె? యిల విద్యార్థీ!**

నారాయణుడు గరుడవాహనుడని, చతుర్బాహుడని, కమలనాభుడని శంఖుచక్రధారియని కౌస్తుభధారియని, శ్రీవత్సుండని భాగవత శ్రేష్ఠులు వర్ణించుచున్నారు. భగవంతునికి సూర్యచంద్రులు కన్నులని, దిశలు కర్ణములని, భూమి పాదంబులని ..... పలువిధాలుగా దండకాలలో దేవుని విరాట్ స్వరూపాన్ని స్తుతిస్తారు.

కొందరు తత్త్వవేత్తలు, ఆదిమధ్యాంత రహితుడై –

కll "లోకంబులు లోకేశులు
లోకస్థులు తెగిన తుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డే కాకృతి వెలుగు నతని".... సేవిస్తారు.

సగుణోపాసనచేత నిర్మల నిశ్చల భక్తి కుదురుతుంది. ఆపై నిర్గుణో పాసనంబు చేత నిలుకడ కలుగుతుంది. ప్రాధమిక దశలోని వారికి సగుణోపాసన, జ్ఞానులకు నిర్గుణోపాసన అవసరం. కొందరు తాము గొప్పవారమని లోకానికి చాటడానికి సగుణోపాసనను దూషిస్తారు. మహాత్ములు అట్లు చేయరు.

ఏఱుదాటి తెప్ప గాల్చు వారెట్టివారు?

కll పైకెగురు శక్తి చాలదు
ప్రాకి నడక తనకు హీన వర్తనమాయే
కాకి కగు గబ్బిలపు గతి
పోకయును త్రిశంకు పదమును విద్యార్థీ!

బాలకులకు సగుణోపాసనమే ముఖ్య కర్తవ్యం. ప్రహ్లాదుని ఉపదేశాన్ని ఆలకించండి.

కll చిక్కడు వ్రతముల గ్రతువుల
జిక్కడు దానముల శౌచ శీలతపములన్
జిక్కడు యుక్తిని, భక్తిని
జిక్కిన క్రియనచ్యుతుండు సిద్ధముసుండీ.

భగవంతుని మెప్పించడానికి భక్తియే శ్రేష్ఠం. భగవంతుని భజింపడానికి జాతి రూప వయో విద్యా పరాక్రమాలు అనవసరాలు. ధర్మవ్యాధుని వ్యాపారమేమి? ధ్రువుని వయస్సెంత? గజేంద్రుడెంత పండితుడు? కుబ్జ యెంత రూపసి? కుచేలుడెంత ధనవంతుడు? విదురుడే వంశస్థుడు? ఉగ్రసేనుడెంత పౌరుషశాలి? వీరంతా ఆ దేవుని దయకు పాత్రులు కాలేదా? కాబట్టి భగవంతుని భక్తి చేతనే సంతోషిస్తాడు.

భగవంతుని పూజించడానికి ఎనిమిది మంచి పుష్పాలు కావాలి. అవి ఏమంటే!

**“అహింసా ప్రథమం పుష్పం! పుష్ప మింద్రియనిగ్రహం!**
**సర్వభూత దయా పుష్పం, క్షమా పుష్పం విశేషతః**
**ధ్యానపుష్పం తపఃపుష్పం! శాంతిపుష్పం తథైవచ**
**సత్యమష్టవిధం పుష్పం! విష్ణోః ప్రీతికరం భవేత్”**

భగవంతుడు భక్తపరాధీనుడు.

“భక్తవత్సలుడైన శ్రీహరి దుర్వాసునితో పలికిన మాటలు ఆలకించండి.”

**“నాకు మేలుగోర నా భక్తులక కాని**
**భక్తజనులకేన పరమగతియు**
**భక్తుడెందు జనిన బఱతెంతు వెనువెంట**
**గోవు వెంట దవులు కోడె భంగి”**

నారదమహర్షి ఒకానొకప్పుడు “నీవెచ్చట నుందు”వని నారాయణుని అడుగగా అతడు చెప్పిన సమాధానం చూడండి.

**శ్లో॥ “నా హం వసామి వైకుంఠే! న యోగిహృదయార్ణవే**
**మద్భక్తాయత్ర గాయంతి! తత్ర తిష్ఠామి నారదా!”**

నేను వైకుంఠంలో నివసించుట లేదు. యోగుల హృదయాలలో అంతగా ఉండను. నా భక్తులు నన్నెచ్చట కీర్తించుచుందురో అచ్చటనే ఉందునన్నాడు. కాబట్టి దేవుడు భక్తసులభుడు.



# 66. దైవభక్తి

విద్యార్థులు తమ పాఠశాల్లో, తమ జీవిత పర్యంతం ఎట్లా ప్రవర్తించాలో అన్నింటినీ నేర్చుకోవాలి. వాటిని సంగ్రహంగా చెప్పాలంటే వర్ణాశ్రమ ధర్మాలను, పురుషార్థాలను, దేశకాల పాత్రాదులను, మాతృ పితృ గురు దైవ భక్తియు అని చెప్పాలి. నేర్వదగిన, నడుచుకోవలసిన సత్యధర్మములన్నీ ఇందే విలీనమై ఉన్నాయి.

దైవభక్తి లేనివాడు రెండు కాళ్ళ పశువని చెప్పబడినారు. మనుజుడు మాతృ గర్భంలో ప్రవేశించిన నాటినుండి సంభవించు ఆపదలన్నింటినీ సదా కాపాడేవాడు ఆ లోకేశ్వరుడు, లోక శరణ్యుడైన భగవంతుడు ఒక్కడు మాత్రమే.

చెట్టుగానో, క్రిమికీటకాదులగానో పుట్టింపక బుద్ధిజీవియైన మనుష్యునిగా పుట్టించి సర్వావయవ సౌభాగ్యవంతునిగ జేసి, వివేక మిచ్చి పరిరక్షించు పరమేశ్వరుని యెడ నిష్కలంకమైన ప్రేమ చూపించుట తప్ప వేరొక కృతజ్ఞతా సూచక కృత్యం కలదా? మానవ నిర్మితాలైన దేవాలయాలును, ఉత్సవాదులును, కృతజ్ఞతా సూచకాలే కదా! భగవద్భక్తి, భక్తితో కూడిన సేవనం మనుజుడు విధిగా చేయవలసిన పనులు. ఇవి కోరికతో కూడి ఉండరాదు.

**ఉ॥ "లోకములన్నింటి గడుపులోన భరించిన వాని లంచమున్**
**జోకగనిచ్చి లోగొనెడు జోదుకలాడె? మహానురాగియై**
**కాక! క్రతువ్రతంబులను గానక శక్యమె? యంచు దేవుపై**
**దేకువ ప్రేమ నిల్పగల ధీనిధి ధన్యుడు భూతలంబునన్"**

పూర్వం మధురానగర సమీపంలో ఒక మునిపల్లె ఉండేది. అందు సుధాముడనే బీద బ్రాహ్మణుడొకడుండేవాడు. అతడు బాల్యంలో శ్రీకృష్ణునితో కూడి సాందీపని అనే గురువు దగ్గర సద్విద్య నభ్యసించాడు. విద్యాభ్యాసం

తర్వాత అన్వర్థ నామధేయురాలైన సుశీల అనే కాంతను వివాహమాడి గృహస్థ ధర్మాన్ని నిర్వర్తిస్తూ ఇరువది యేడుగురు బిడ్డలను పొందినాడు. సహజంగా లోకంలో బీదలకే వద్దన్నా సంతానం ప్రాప్తిస్తుంటుంది. పేదరికంచే కట్టబట్ట లేక చినిగిన పాత వస్త్రాదులను అతడు ధరించుట చేత జనులతనిని కుచేలుడని పిలువసాగినారు. మానవుడు చేయు ప్రతిపనిలో ప్రాణి కలదని కాబోలు ఆ కుచేలుడు –

**క॥ "విసువక యడవుల రాలిన**
**కసవుల ధాన్యములు తమ కుగ్రాసంబులుగా**
**వసుదేవ సుతుని గొలుచుచు**
**బసిబిడ్డలు నాలు నతడు బ్రతుకు ధరిత్రిన్"**

ఇట్లు ఏరి తెచ్చి కాచిన గంజిలో సగం అతిథుల కివ్వగా ఇక మిగిలింది ఎవరి కడుపు నిండుతుంది! ఎవరి ఆకలి తీరుతుంది! పిల్లల క్షుద్బాధ తీరునా! కుమారులు ఆకటి చిచ్చునకు మలమల మాడుచూ, ఒకడు సొమ్మసిల్లినాడు. ఒకడు తల్లడిల్లినాడు. ఇంకొొక్కడు ఆకలంటూ ఏడ్వసాగినాడు. మరొక్కడు అమ్మా! అన్నం పెట్టవే! అని చెంగుపట్టి ఈడ్వ, ఒక్కడు అడుగలేక నోరు తెరువగా, వేరొక్కడు తన్నుతాను మరువగా, మరొక్కడు లేవలేక చతికిల బడగా, ఇంకొక్కడు బ్రతుకలేనని దిగులుతో నుండగా, ఇట్లు పరిపరివిధాల ఆ పిల్లలు పరిదేవనం చేయగా ఆ పతివ్రతారత్నం పరితాపము చెది ప్రాణనాథునికి ప్రణమిల్లి ఇట్లన్నది. నాథా! తనయులు దారిద్ర్యంచే పీడింపబడి ఏడ్చుచుండ వారిని రక్షించే మార్గం అన్వేషింపక ఊరకుండుట పాడియా? మీకు బాల్యమిత్రుడు శ్రీకృష్ణుడని విన్నాం. అతన్ని ఆశ్రయించిన మంచిదని సలహా ఇచ్చింది. వారి సంభాషణను తిలకించండి.

కుచే :– తరుణీ! మన బిడ్డల రక్షింప మనమే కర్తలమని భావిస్తున్నావా? వారు నీ కడుపులో నున్నప్పుడు నీవే రక్షించావా? ఎల్లవేళల నీవే వారిని కాపాడగలవా? పుట్టించిన జగజ్జనకుడు పోషింపకుండునా?

సుశీ :- ఆ॥వె॥ "గొల్లవాని పోల్కి గోలచేకొని యాల
గాచునట్లు ప్రజల గావదెపుడు
నొకరికొకరి జూపి యొక్కింత తెల్విని
నొసగి కాంచుదేవుఁదుర్వియందు"

అని విజ్ఞులు అంటారు. సర్వకార్యాలకు మనుష్య ప్రయత్నం అత్యావశ్యకం. కావున మహాత్మా! హరి కృపాకటాక్ష రవిదీప్తిని పొంది దారిద్ర్య అంధకారంలో మునిగిన మమ్ము ఉద్ధరించండి.

కుచే :- అతడిచ్చు వాడేనా?

సుశీల :- వరదుడతడు.

కుచే :- చంచలమైన, మనోవికార కారకమైన ఐశ్వర్యాన్ని ఇచ్చేవాడా అతడు.

సుశీ :- వర = శ్రేష్ఠమైన దానిని, ద = ఇచ్చువాడు (వరదుడు).

కుచే :- చూచిన మాత్రాన ఏవకలిగించే అంగహీనత కల నా వంటి వానికి కూడా ఇచ్చునా?

సుశీ :- అతనికి రూపాదులు అనవసరం. సాధు భక్తజనవత్సలుడు.

కుచే :- తన శాసనాన్ని అతిక్రమించనివారు సాధువులు. తన సేవ చేయువారు భక్తులని పిలుపబడుతారు. కాన సాధులు, భక్తులు తనవారౌతారు. తన ఖారిని మాత్రం రక్షించు వాడు వరదుడగునా?

సుశీ :- దిక్కులేని వారికి సైతం దిక్కయిన వాడు ఆర్తశరణ్యుడు.

కుచే :- "దాతాదరిద్ర" అన్నట్లుగా దాతృత్వంకల వారికి ధనముండుట అరుదు.

సుశీ :- ఇందిరావరుడు! ఇక దక్కువేమి?

కుచే :- అయినచో "కృపణోధనాఢ్య" యను న్యాయాన లుబ్ధుడుగా నుండిన?

సుశీ :- దయాపయోధి!

కుచే :- ఇన్ని సుగుణములతని యందున్నవా?

సుశీ :- భగవంతుడు! సుగుణముల కేమిలోటు? (సంపూర్ణ మాహాత్మ్యం, ధైర్యం, కీర్తి, సంపజ్ఞానం, వైరాగ్యం - అను ఆరింటికి 'భగ'మని పేరు. అది కలవాడు భగవంతుడు).

కుచే :- భగవంతుడు నిరాకారుడు, నిర్వికారుడు, నిర్గుణుడని శ్రుతులు ఘోషిస్తున్నాయి. అట్టివాని నెచ్చోట నెట్లు చూడనౌతుంది?

సుశీ :- దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం, శ్రీకృష్ణుడై యదుకులంలో అవతరించి, యాదవులు సేవింప, కుశస్థలీపురంలో నున్నాడు.

కుచే :- అంత వైభవంతో ఉండేవానికి నావంటి దీనుడెట్లా కనిపిస్తాడు?

సుశీ :- బాల్యసఖుడు కాబట్టి మీకు చిరపరిచితులు. అంతేగాకుండ-

**మ॥ "కలలో నందను మున్నెఱుంగని మహాకష్టాత్ముడైనట్టి దు**
**ర్బలుడా పత్సమయంబున న్నిజపదాబ్జాతంబులుల్లంబులో**
**దలపన్ దా మది మెచ్చియార్తిహరుడై తన్నైన నిచ్చున్ని ని**
**శ్చల భక్తిన్ భజియించు కితడే సంపద్విశేషోన్నతుల్"**

కుచే :- అట్టివాని నిట్టి తుచ్ఛ శ్రీకై ఎట్లాసింపగలను? సిగ్గగుచున్నది!

సుశీ :- సర్వజ్ఞుడు కాబట్టి మీరు అడుగకనే, మిమ్ములను చూచినంతనే మిమ్మెఱిగి మీ కోరిక నెరవేర్పగలడు.

కుచే :- ఎప్పుడు?

సుశీ :- ధనమదాంధులవలె 'నేడుతే'పని జరపక అప్పుడే ఇచ్చును.

కుచే :- నా మనస్సీ తుచ్ఛ సుఖములందు తగుల్కోదు.

సుశీ :-అనూన సంపదలే యిచ్చును.

కుచే :- అతని కింత టిక్కేమి వచ్చె? అక్కర ఏల కలుగుతుంది?

సుశీ :- అతడు విభుడు, లోకేశ్వరుడు కదా!

**చ॥ "వరదుడు సాధుభక్తజన వత్సలుడార్త శరణ్యుడిందిరా**
**వరుడు దయాపయోధి భగవంతుడు కృష్ణుడు తాగుశస్థలీ**
**పురమున యాదవప్రకరముల్భజియింపగ నున్నవాడు మీ**
**రరిగిన మిమ్ము జూచి విభుడప్పుడయిచ్చుననూన సంపదల్"**

కుచే :- సుశీలా! నీ మాటలను బట్టి నీ అంతరంగం పవిత్రమైనది. నీచమైన యాచక వృత్తికి నన్ను పురికొల్పినావు. కాని శ్రీకృష్ణునే వేడు కొమ్మంటివి. అతని యాచించుట నీచగుణము కానేరదు. ఇహపర సుఖదాయకం. యజ్ఞం, గృహం, పొలం, గర్భిణి, వృద్ధుని, బాలకులను, రాజును, గురువును, దేవుని దర్శించడానికి వెళ్ళేవారు రిక్త హస్తాలతో పోరాదు. ఏదేని కానుక తీసుకొని వెళ్ళడానికి మనకేముంది?

అనగానే సుశీల మదిలో సంతసించింది. ప్రతిరోజు దాచియుంచిన నాలుగేసి గింజలుగా దాచిన ఒక పిడికెడు అటుకలను తెచ్చు నాధుని శిథిల వస్త్రపు కొంగుకు ముడివేసి సాగనంపింది.

సుధాముడు దారిలో పలుకష్టాల కోర్చి ఆ అటుకలతో ద్వారకకు చేరినాడు. ఆ పట్టణ సౌభాగ్యాన్ని చూచి ఆనంద పరవశుడయ్యాడు. ఆపై అతని హృదయంలో పెక్కు సందేహాలు కలిగాయి. "ఈ నగరులోని వారు ఇంద్ర సమ వైభవంతో తులతూగేవారు. నిరుపేదనైన నన్ను పురములోనికి రానిత్తురా? రానిచ్చిరి పో, ద్వారపాలకులు నగరిలోనికి పోనిత్తురా? పోనిచ్చిరి పో, దక్షిణ నాయకుడైన శ్రీకృష్ణుని ఎచట కనుగొనగలను? కనుగొంటినిబో, స్నేహ వాత్సల్యంతో నన్నిప్పుడు పల్కరించునా? ఆతడట్లేల చేయును? అయిన నా భాగ్యము! అతని దయ!" అని అనుకొంటూ ఆ పురం ప్రవేశించాడు. కృష్ణ సందర్శనోత్సుకతతో చనుదెంచిన జనలోకాన్ని చూచి అబ్బురపడ్డాడు. "దినములు, మాసములు కాచియున్న యీ మహారాజులకు, మహర్షులకు దర్శనమీయని ఆ పురుషోత్తముని దర్శన భాగ్యం నాకెట్లు లభ్యంబగును" అని సంశయిస్తూ ద్వారపాలకుని దగ్గరకు వెళ్ళి వారిని ఆశీర్వదించి, వారికి దయ కలిగేటట్లు మాట్లాడి, తన వృత్తాంతాన్ని, శ్రీకృష్ణ సందర్శన ఆకాంక్షను తెల్పినాడు.

వారలాతని అపేక్ష నుపేక్షసేయక శ్రీకృష్ణుల వారికి నివేదించారు.

పట్టపు దేవియైన రుక్మిణితో వేడుకలో నున్న ఆ పుండరీకాక్షుడు వాని నెల్ల మాని, లేచి ఎదురుగా నడచి వచ్చినాడు. తన్ను నగరికి కొనిపోవుటకు

స్వయంగా రాగా ఆ కుచేలుడు చూచి, మైపులకలతో, ఆనంద అశ్రువులతో నిమీలిత నేత్రాలతో, కృష్ణ సందర్శన ఆనంద అపరిమిత ఉన్మత్త నాట్యంబులతో పరవశుడైనాడు. శ్రీకృష్ణుడాతని గాఢాలింగనం గావించి, తోడుకొనిపోయి, తన తల్పంపై కూర్చుండబెట్టి, పాదాలను కడిగి ఆ జలాన్ని శిరమున జల్లుకొని, శ్రమ పోగొట్టడానికి విసనకర్రతో విసరి వివిధ ఉపచారాలను ఒనరించినాడు. కృష్ణుని భార్యలది గాంచి, ఈతడెంత మహాత్ముడో యని భావించి తాము సుధామునకు పరిచర్యలు చేశారు. వాసుదేవుడాతని ఒడలంతా తడిమి, క్షేమములడిగి, తాము బాల్యంలో గురుకులంలో విద్య నభ్యసించే సమయంలో చేసిన చేష్టలను కొన్ని జ్ఞప్తికి తెచ్చుకొని గుర్తు చేశాడు. "మిత్రమా! నన్ను జూడ నింతదూరం వచ్చితివే! నాకేమి తెచ్చితివని ప్రియమార ప్రశ్నించినాడు.

సుధాముడు తాను తెచ్చిన పృథుక తండులములు (అటుకలు) నివేదించడానికి సిగ్గుపడ్డాడు. అది గ్రహించిన సర్వజ్ఞుండైన శ్రీకృష్ణుడు కుచేలుని చంకనున్న అటుకులను అందుకొని, "ప్రేమతో నాకిచ్చినది పిడికెడైనా దానిని మేరుతుల్యముగ గ్రహింతును" అని పల్కి అందు సగము భుజించాడు. రుక్మిణి లేచి "మహాత్ముల ప్రసాదం మాకు వలదా? మీ అర్థాంగులమైన మాకు మీకు లభించిన దాంట్లో సగమిచ్చుట న్యాయము" అంటూ ఆ పద్మనాభుని కరకమలాలు పట్టుకొనగా, శ్రీవిభుడు నవ్వుచు రుక్మిణీదేవి పలుకులు మన్నించి అట్లే చేసినాడు.

తదనంతరం, భక్తప్రియుడైన శ్రీకృష్ణుడు మూడు దినాలు కుచేలుని తన గృహంలో నిలుపుకొన్నాడు. వివిధ విందు వినోదాలతో గడపినారు. నాల్గవనాడు కొంతదూరం తోడొచ్చి సాగనంపినాడు. కుచేలుడు కృష్ణుని వీడుకోలుతో పయనిస్తూ తన మనస్సులో -

ఉ॥ "శ్రీనిధి యిట్లు నన్నుపచరించి ఘనంబుగ విత్తమేమియు
స్నీని తెఱంగుగానబడె నెన్న దరిద్రుడు సంపదంభుడై
కానక తన్ను జేరదనికాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నను జేయకుండునే?"

అని వితర్కించుకుంటూ చనిచని ముందట బహువిధ ఫలపుష్పాలతోను, లతా గుల్మంబుల చేతను, శుకపిక శారికా నికర కూజితంబులచేతను, చంద్రకాంత వేదికల చేతను, వికచహల్లకకల్హార కైరవ రాజీవ సహిత కాసారాలతోను రమణీయమై ఒప్పునట్టి విశాలమైన ఉద్యానవనాన్ని చూచి, సందర్శించాలనే కుతూహలంతో ఆ ఉద్యానవనంలోకి ప్రవేశించాడు. ఆపైన కలిగిన విచిత్రమేమని చెప్పవచ్చును!!

'ఎముకలు బయల్పడుచుండిన ఆతని దేహం పరిపుష్టమై అపరంజి వన్నెతో ప్రకాశించెను. జీర్ణచేలములు స్వర్ణచేలములయ్యెను. తులసిపేరులు రత్నాలహారములుగా మారినవి. దర్భముడులన్నీ భర్మ ముద్రికలుగా మారినవి. నేను కుచేలుడనా! అనే అనుమానం అతనికి కల్గింది. స్వామి దర్శనంచేత అతడిప్పుడు ఐశ్వర్యవంతుడైనాడు.

తన్ను తాను సంశయిస్తూ, ఆ ఉద్యానవన రామణీయకతను చూచి ఆశ్చర్యపోతూ, కలయ తిరుగుచుండగా, ఆ వనం మధ్యలో పటికంపు గోడలతో, పద్మరాగ స్తంభాలతో, మరకతమయ కవాటాలతో, ఇంద్రనీలజాలకాలతో, శశికాంత శిలావేదికలతో, మౌక్తిక తోరణాలతో కూడిన అందమైన భవనాన్ని చూచినాడు. కనకమణిమయ ఆభరణాదులతో దాసదాసీజనంబులు అటనిట విహరిస్తున్నారు. ఇది ఎట్టి పుణ్యాత్ముల నిలయమో అని కుచేలుడు చూచుచుండగా, కుచేలుని ఇల్లాలు సుశీల పలువురు చెలికత్తెలతో ఎదురొచ్చి ఆతని లోనికి తీసుకొని వెళ్ళింది. కుచేలుడా వైభవమంతా తిలకిస్తూ - "ఇది యెల్ల హరి దయావలోకనమున జేసికాదెయబ్బె. నా వచ్చిన కార్యము విచారింపక నన్ను బంపి యీ సంపదలెల్ల నా కొడగూర్చి నన్నింతవానిం జేసె. ఆ పురుషోత్తముడు భక్తి నిష్ఠలతో సజ్జనులు లేశమాత్రంబగు పదార్థం సమర్పించిన యది కోటి గుణితంబుగా గైకొని మన్నించుటకు నిదియు దృష్టాంతంబు గాదె. అట్టి కారుణ్య సాగరుండైన గోవిందుని చరణారవిందంబుల భక్తి ప్రతిభవంబున నాకు గలుగుగాక" అని సతీసుత సమేతుండై భోగములందాసక్తి చెందక అనంతుని అనంత ధ్యాననిమగ్నుడై, విగత బంధనుడై శాశ్వత సుఖాన్ని అనుభవించినాడు.

బాలకులారా! "విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే, పాదయుగము తోడి పశువుగాక" అను ప్రహ్లాదుని వాక్యాన్ని జ్ఞప్తి యందుంచుకోండి.



## 67. ప్రేమ

ప్రేమ ఒక లత వంటిది. అది చక్కగా అల్లుకుంటే తెగుటగాని, నశించుటగాని అరుదు. ప్రేమలత ఎంత కోమలమైతే దాని ఫలాలు అంత మధురాలు. ప్రేమకంటె మనిషి ఆర్జింపదగినది ఈ భువిలో ఏదీలేదు. నిష్కలంక ప్రేమగల వారికి శత్రువులుండరు. ప్రేమ మృత్యువునే జయిస్తుంది. ప్రేమకు అసాధ్యమేదీలేదు. 'కత్తినెత్తి కుత్తుక గత్తరించు, కఠినాత్ముని కరవాలాన్ని సైతం దింపించి, వాని మనసును కరిగించి లోబరచుకునే శక్తి ప్రేమకుంది. కపట ప్రేమను చూపించి వంచింప తలపెట్టిన దుర్యోధనాదుల రాజ భోజనాన్ని నిరాకరించి, శ్రీకృష్ణుడు విదురుని ఇంట్లో విందారగింప జేసింది ఈ ప్రేమయే. ప్రేమయేదైనా సీతారామలక్ష్మణులు గంగానది దాటే వేళ గుహుడు ఓరి రామా! యని సంబోధించెనని లక్ష్మణుడు కోపింపగా "అతడెట్లాడినను మాననీయంబు. అతని దూఱకుము. ప్రేమ రహిత గౌరవ వచనములకంటె ప్రేమ పూర్ణగ్రామ్య వచనంబులు నాకతి ప్రియకరంబులు" అని రామునిచే అనిపించినది ఈ అవ్యవహిత ప్రేమయేకదా! విమలమైన ప్రేమ విధిని కూడా లక్ష్య పెట్టదు.

నిషధ దేశాధీశుడైన నలమహారాజు కలి ప్రేరణచే పుష్కరునితో జూదమాడి తనకున్న సర్వస్వాన్ని కోల్పోయి, భార్యతో అరణ్యాల పాలైనాడు. కారడవిలో గుట్టలు మిట్టలు ముండ్లుగండ్లు దాటలేక దమయంతి పడే దురవస్థ చూడలేక నలుడు తన ఇల్లాలిని పుట్టినింటికి పొమ్మన్నాడు. వైదర్భి ఆ

పలుకులకు ఉలికిపడి – "నాథా! అర్ధాంగిని మీరిట్లు మాట్లాడుట ఉచితమే? ప్రాణనాయిక ప్రాణేశ్వరుని వదలి ఎచటకు పోగలదు? మీరు అడవులలో ఇడుములు పడుచుంటే నేను పురములో సుఖింపగలనా? మీరు కాననముల కాయకసురులు తినుచుంటే నేను మేడలలో మృష్టాన్నాన్ని ఎలా తినగలను? మీరు ఒంటరిగా కీకారణ్యంలో బాధపడుచుండగా, నేను సఖులతో ఎలా సంచరించగలను? నన్ను ప్రాణిగ్రహణం చేయువేళ మీరు మా జనకునితో వచించిన పవిత్ర వచనాలను ఒకసారి స్మరించుకోండి. మీ వెంట నుండిన మీకేమి భారము? మీరు అలసినవేళ ఆయాసాన్ని పోగొట్టి ఉపచరించు వారెవ్వరు? తాత్కాలిక దుస్థితిని తలంచుకొని దురసిల్ల, ధైర్య వాక్కులతో ఓదార్చు వారెవ్వరు?

**గీ॥ "అఖిల దుఃఖరోగార్తున కౌషధంబు**
**సురుచిరంబుగ భార్యయె చూవె యెందు**
**నొనర భార్యాసమేతుడై యున్నవాని**
**కెట్టి యాపదలయ్యును నెఱుకపడవు!**

అని పల్కిన అపార ప్రేమపూరిత దీనాలాపంబులు ఆలకించిన నైషధుడు, – "కాంతా! సర్వస్వం కోల్పోయినా నీవు నా అండనుండుట చేత ఎటువంటి ఆపదలనైనా దాటగలను. కాంతిలేని సూర్యుడు, కాంతలేని దీనుండు కొఱగానివారు. నిన్ను విడువజాల, చింతింపకు"మనెను. ఇంకా ఆ నలరాజు, తన భార్యతో ఇట్లన్నాడు. "నీవు అసూర్యంపశ్యవు. కోమలాంగివి. కష్టాలంటే తెలియని బేలవు. అరణ్యవాస కష్టాలకు ఓర్వజాలవని ఇట్లంటిని వేరొండుగాదని రమ్ము నావెంట" అని భార్యా సహితుడై కారడవులలో ప్రవేశించెను. ఆ కారడవిలో వారికి ఆకలి, దప్పికలు తీర్చుకోడానికి ఫలములు గాని, జలములు గాని దొరకలేదు. ఒక పిట్టను పట్టబోయి, కట్టుబట్టను కూడా పోగొట్టుకున్నాడు. దమయంతి చీరనే చుట్టుకొని మాపటివేళకు ఒక పాడుబడ్డ గుడిని చేరినారు. భార్యతో కూడా భూశయ్యలో పవ్వళించారు.

ఆయాసముచే దమయంతికి గాఢ నిద్ర పట్టింది. నలునికి నిద్ర రాలేదు. అతడు తన పూర్వస్థితిని, ప్రస్తుత స్థితిని, భవిష్యత్తును గురించి చింతిస్తున్నాడు. "అక్కటకటా! నా వలన దమయంతికి ఎట్టి ఇక్కట్లు వాటిల్లింది. హంస ఈకల పాన్పుపై నిద్రించే మృదులాంగి నేడు కఠిననేలపై పరుండవలసి వచ్చింది. ఇంతలో ఎంత గాఢనిద్ర చెందింది. నన్ను వీడి పుట్టింటికి పొమ్మన్నా పోదు. నేనెక్కడ చింతిస్తానోనని తన బాధల నణచుకొన్నది. మృగరాజు గర్జనకు ఉలికిపడి నన్ను కౌగిలించుకోగా "దమయంతీ భయపడితివా? అనగా "నాథా లేదు. కంటకమంటె" అన్నది. "నాకై పలు కష్టాలు పడుచున్న ఈ పడతిని చూస్తే నా గుండె నీరగుచున్నది. ఈమె కష్టాలను నేనిక చూడలేను. వదలి ఎచటికైనా పోయెద. తరువాత మేల్కొని నన్ను గానక కొంతసేపు పలవించి తుదకు ఏదోవిధంగా పుట్టినిల్లు చేరగలదు. ఇది మంచి ఉపాయం". అని నిశ్చయించి లేవబోయినాడు. ఇరువురకు ఒక్క చీరయే అగుటచేత వీలుకాలేదు. ఆమె "రాజేంద్రా! సహధర్మచారిణిని వదలిపోవుట ధర్మం కాదు. పోకు పోకు"మని కలవరించుచుండెను. దమయంతి మేల్కొనునేమో యని నలుడు తటాలున కూర్చుండి ఆ పద్మముఖిని చూసి, జలధారలు కన్నులనుండి అనర్గళముగా కారుచుండ ప్రేమబంధము అయస్కాంతం ఇనుమును వలె ఆకర్షించుచుండగా, ఎట్లో మనసు దిటవు చేసుకొని లేవ ప్రయత్నించగా, ఒక కత్తి చేతికి తగిలింది. ఆ కత్తితో "భూ మండలాన్ని పాలించిన నరపాలునకు ఇప్పుడు కట్టుబట్ట కరువయ్యెనే? అని చింతించెను." "జీవితేశా! ప్రేమబంధానికి తోడు వస్త్ర బంధాన్ని కూడా పొందించి పరమేశ్వరుడు మనకు పరమానుకూలుడయ్యె" నని సయోధ్య పరచే ఇమ్ముద్దియ చేలాన్ని ఎమ్మాడ్కిత్రెంపనేర్తు అని మనసాడక కత్తిని జార్చినాడు. విధి ప్రేరణచే "మగువను దిగనాడుకున్న, నెగులుమిగులబొనలుగదా! కొలది తాపంబున కోర్చిన పడతి యిడుములుడుగు గదా!" అని తిరిగి తెగువతో చీరను చించి లేచినిలిచి ఆమె మోము చూచెను. అదివరకున్న కాఠిన్యము మాయమై మరల కూర్చున్నాడు. "స్వయంవర కాలమున పురందరాదుల సైతము తిరస్కరించి

నన్ను అపార ప్రేమతో చేపట్టిన యో సుగుణమణీ! నిన్ను విడనాడ వలయుననే కఠిన బుద్ధి నాకేల కలుగుచున్నది? అదేలనో నామతి నా వశం తప్పియున్నది. ఎంతవలదన్నను నిన్ను విడనాడమనియే ఉద్బోధించుచున్నది. తీవరించుచున్నది. నేనేమి చేయుదును? నాతోడ నీవుండిన నీకింక ఎన్ని పడరాని పాట్లు కలుగునో కదా! అని భవితవ్యము ఊహించగా నా హృదయం బీటలు వారుచున్నది. దమయంతీ! మత్ప్రాణాధిపా! నీకు దైవమే శరణ్యం. కఠిన మతినై నిన్ను కానల పాలుచేసి పోవుచున్నాడను. దైవము కరుణింపకున్న ఇదియే కడసారి చూపు. ఈ పాపాత్ముని మన్నింపుము" అని ఒక ముద్దిడుకొన బోయినాడు. దమయంతియు నాథా! అని కలువరించి నలుని గాఢముగ పరిష్వజించింది. నలుని గుండె నీరైనది. ఆమె కరమృదు మృణాళములతో నలహస్తి కట్టువడి పోయింది. పొంగిపొరలే దుఃఖతరంగాలను, ధైర్యమనే ఆనకట్టచే నిలుపజూచెను గాని సాధ్యంకాలేదు. ఎట్లో మనసు దిటవు చేసుకొని ఆమె కలపల్లముల వదలించుకొని లేచి నాలుగడుగులు నడచి మరలా ముందుకు పోలేక తిరిగి చూచినాడు. పోవబుద్ధి కాలేదు. సమీపింప మనసొప్పలేదు. బుద్ధికి, మనసుకు కొంత పోరాటం జరిగింది. బుద్ధి గెలిచింది. అతడు మరల దమయంతిని సమీపించినాడు. ఆమె మైమరచి నిద్రించుట చూచి, కలి ప్రేరితుడై కొంత దూరం పోయాడు. అంతలో ఒక ఘోర గర్జన వినిపించింది. సతీమణి ఎంత భయపడెనోనని పరుగుపరుగున వచ్చెను. ప్రేమలత అంత సులభంగా తెగునా? వైదర్భి నిద్ర మేల్కొనలేదు. ఆమెను పరత్యజింప సమకట్టి, "దమయంతి మేల్కొన్న నాయత్న మెఱింగెనా నన్నేమని భావించు? తుదకు నమ్మునా? ఇప్పుడే వదలి కదులుట మంచిది" అని మదిని పదిలపరచుకొని ముందుకు సాగినాడు. ఇరవై అడుగులు వేశాడు. దమయంతి భయభ్రాంతయై తన్ను బిగ్గరగా పిలిచినట్లు అతని మదికి తోచింది. రివ్వున మెరపుతీగ వేగంతో పరుగెత్తి వచ్చాడు. దమయంతి కదలలేదు. నిదురించుచునే ఉన్నది. ఆమెను వదలిపోనా! వద్దా! అనే

ఊగిసలాటలో నుండి, చివరకు దిటవుగా దిగవిడిచి పోవనెంచి ఆమె ముఖ చంద్రమండలాన్ని కన్నులార విలోకించినాడు. అశ్రుధారలు చూపులకు అడ్డుపడ్డాయి. అపగత భాగ్యునకు సంకల్పసిద్ధి యెక్కడిది? కన్నీటి సంద్రాన్ని ఆపుకోలేక మరల నొక ముద్దిడి లేచి "వనదేవతలారా! దిక్పాలురలారా! పంచ భూతములారా! భూమ్యాకాశములారా! సూర్యచంద్రులారా!మత్ప్రాణాధికను, నిషధరాజపత్నిని నిష్కరుణుడనై పరిత్యజించుచున్నాడ. ఈ నారీమణికి మీరే దిక్కు. నా కష్టమున కెంతయైన నోర్తుగాని, ఈమె పడు నిడుమల జూడజాల. వదలిననే యీామెకు క్షేమము కలుగగలదు." అని కొంతదూరము పోయినాడు. దుష్టమృగ మొకటి ప్రక్క నుండి తన వెనుకకు పరుగెత్తింది. దమయంతి కీ మృగమేమి కీడు చేయునో యని తానును వెనుదిరిగి పరుగెత్తినాడు. కాని మృగము కానరాదాయెను. కాంతామణియు కనిపించలేదు. దమయంతీ! దమయంతీ! యని వనమెల్ల నలుడు తిరిగినా ఫలితం లేకపోయింది. చూచితిరా! విధికి ప్రేమకు గలిగిన పోరాటం!

దమయంతి కొంత సేపటికి మేల్కొని నలుని గానక, అటు, ఇటు చూచి, పిలిచింది. నాథుడు కానిపించనందుకు దిగులుతో, బరువెక్కిన హృదయంతో నాథా! నన్ను వదలి ఎచటికేగితిరి? ఏల పిలిచినా పలుక కున్నారు? నా మొరాలకింపకున్నారేల? నాకీకీకారణ్యంలో దిక్కెవరు? నన్నేల వదలితిరి? నేనేమి తప్పు చేశాను? ఈ నట్టడవిలో వదలి పోతారని కలలో కూడా ఊహించలేదు. ఇంత సాహసమా! నాయందు మీరు చూపుచుండిన అపార ప్రేమకిదియా ఫలితం? నేనేదో మహాపరాధం చేశాను. కాకుంటే నన్నేల త్యజిస్తారు? మనోనాథా! నాకై నేను వగవను. మీకోసం నా తపన.

క॥ "అలయునెడ, డయ్యునెడ నా
కలియు దృషయునైన యెడల గడుకొని ధరణీ
తలనాథ పురుషునకు ని
మ్మల భార్యయ పాచు చిత్తమున దుఃఖంబుల్"

నన్ను పరిశోధింపను ఎక్కడైనా దాగి ఉన్నారా? నీ దర్శనభాగ్యం లేని నాకీ తనువేల? జీవితమేల? వలదు రమ్ము. దర్శనమిమ్ము. కఠిన భావము పూనకుము. అని పలు వగల వగల పొగలుచు ఎలుగెత్తి పిలుచుచు, పొదలలో వెదకుచు, తిరిగి తిరిగి చేదిపురమ్ము చేరి రాజగృహంలో సైరంధ్రీ వేషంలో కాలం గడుపుచున్నది.

నలదమయంతులు అడవుల కేగినారన్న వార్త భీమరాజు చెవుల బడింది. ఆ రాజు మిక్కిలి దుఃఖించి వారల వెదుక వేగుల పంపించాడు. వారు వెదకి వెదకి తుదకు చేదిపురంలో సైరంధ్రియై యున్న దమయంతిని తెలుసుకొని విదర్భకు తోడ్కొని పోయిరి. అచ్చట ఆమె తమ బిడ్డలను కలుసుకొన్నది. కాని భర్తృ వియోగతాపం తీరకుండెను. తదుపరి కర్కోటక విషంచేత కుబ్జుడై వికృతవేషంలో, అయోధ్య రాజు కొలువులో వంటలవాడైన నలుని రప్పించుకొని పరితాపమును పోగొట్టుకొనెను. నలుడు తిరిగి రాజ్యవైభవాలను పొంది, సతీసుతులతో, అమితానురాగంతో సుఖంగా ఉన్నారు.

చూచితిరా! నలదమయంతుల ప్రేమా విశేషము. అకలంక ప్రేమ అంటే ఇట్టిది. పరస్పర మిట్టి ప్రేమయే ఉండాలి. పెద్దలపట్ల పిల్లలు చూపే ప్రేమకే భక్తి అని పేరు. సములయెడ చూపే ప్రేమనే స్నేహం అంటారు. పిన్నల యెడల చూపే ప్రేమను దయ అంటారు. ప్రేమ గొప్పతనమిది.



# 68. పెద్దలెవరు ?

మన నడవడి మంచిదనటానికి గుర్తుగా పెద్దలను సేవించాలి. పెద్దలంటే ఎవరు? వయస్సులో కొంతమంది పెద్దలు. విద్యలో కొందరు పెద్దలు. జ్ఞానంలో మరికొందరు పెద్దలు. ఇందెవరు సేవింపదగ్గవారు?

**గీ॥ "విప్రుడధ్యయనము చేత బృథివిపతి ప**
**రాక్రమముచేత, వైశ్యుదర్థమున, శూద్ర**
**జనుడు విబుధ సేవాకృషి, సర్వజనులు**
**సుగుణమున, విద్యవలన, పూజ్యులగుచుంద్రు"**

వయస్సులో పెద్దవారికంటే, విద్యలో పెద్దవారైన వారెక్కువ పూజ్యులు. విద్యా, వృద్ధుల కంటె జ్ఞానవృద్ధులు పరమపూజ్యులు. వారికంటె అనుభవ వృద్ధులు పూజ్యతములు. అనగా విద్య నేర్చి, జ్ఞానమార్జించి, అనుభవ పూర్వకంగా ఉపదేశింపగలవారు బాలకులైనా సేవింపదగ్గవారు.

**"అంకిలెతిగి మాటలాడ నేర్చినపుడు**
**పిన్న పెద్దతనము, లెన్ననేల?**
**పిన్నచేతి దివ్వె పెద్దగా వెలుగదా?**
**విశ్వదాభిరామ, వినురవేమ".**

ప్రహ్లాదుడు, మార్కండేయుడు, ధ్రువుడు, అస్తీకుడు, సనకసనందాదులు వయసులో బాలురైనా జ్ఞాన సంపాదనలో పూజ్యులైనారు.

**శ్లో॥ "యే రామ నామామృత పానమత్తా**
**యే భక్తలీలా సునివిష్ట చిత్తా**
**యే వేద వేదాంత విచార సక్తా**
**స్తేభ్యోమహద్భ్యోనమ అర్భకేభ్యః"**

ఎవరైతే భగవన్నామామృత పానమత్తులై యుందురో, ఎవరైతే భక్తుల లీలలయందు లీనచిత్తులౌతారో, ఎవరైతే వేదవేదాంత విచారణలో ఆసక్తులై

యుంటారో, అట్టివారు పెద్దలైనా, పిన్నవారైనా మనకు నమస్కరించదానికి అర్హులు.

అట్టి మహాత్ములు మనకెట్లా లభిస్తారు?

చిత్తశుద్ధి గలవారికి మహాత్ములు తమంత తామే దర్శన భాగ్యమిచ్చి పరమార్థాన్ని ఉపదేశిస్తారు. శుకుడు పరీక్షిత్తునకు, నారదుడు ధ్రువునికి, ప్రహ్లాదునకు, వ్యాసుడు పాండవులకు తమంత తామే వెళ్ళి ఉపదేశించి ధన్యులను జేసిరిగదా!

ఒకప్పుడు ధర్మరాజు, దుర్యోధనుడు తమ కార్య సహాయానికై శ్రీకృష్ణుని కోరి పిలవడానికి వచ్చారు. కృష్ణుడు సర్వజ్ఞుండు కాబట్టి వారి అభిప్రాయం గ్రహించి ధర్మరాజుతో – 'నీవొక దుష్టుని తోడి తెమ్మని' పంపినాడు. దుర్యోధనునితో, 'నీ వెచ్చటనైనా ఒక సజ్జనుని వెదకి తెమ్మని, పంపినాడు. ఇద్దరూ పల్లెలు, పురాలు తిరిగి తిరిగి ఊరకనే వచ్చారు. శ్రీకృష్ణునితో ధర్మరాజు ఇలా అన్నాడు. "కృష్ణా! ఒక్కొక్క పల్లెలో, పట్టణంలో పదిమంది చేత దుష్టుడని పించుకున్న వానిని వెదకి, వానిని పరీక్షింపగా వానిలోను ఒక సుగుణముంది. అట్టి వాని నెట్లు దుష్టుడంటారు. నా కంటి కొక దుష్టుడు కూడా కనిపించలే" దన్నాడు. దుర్యోధనుడు కూడా 'పలువురచే సజ్జనుడనిపించుకొన్న వారిని పరిశీలింపగా ఒక దుర్గణం కనిపించింది. నా కంటికి సుజను డగుపడలే' దన్నాడు.

చూచితిరా! దుష్టుని కంటికి అందరూ దుష్టులే. సజ్జనుని కంటికందరూ సజ్జనులే. తన మనస్సులో నిండుగా ఏది ఉండునో అదే ఇతరులలో తనకు కనిపిస్తుంది. కాబట్టి మన మనసు నిర్మలమైనపుడే అట్టివారు మనకు కనిపిస్తారు. మనం పెద్దల సేవించుట వారి నుండి మంచిని గ్రహించదానికే కదా! దుర్గుణాలను వెదికితే ఏదో ఒకటి కానబడక మానదు. దానితో మనకు పనియేమి?

రాక్షసుల గురువైన శుక్రాచార్యుల వద్ద 'మృత సంజీవిని' అనే ఒక గొప్ప మంత్రం ఉండేది. అది దేవతలకు, వారి గురువునకు తెలియదు. దానిని నేర్చుకోవాలంటే చిరకాలం అతన్ని సేవిస్తేగాని ఉపదేశం పొందడం

దుర్లభం. చాలా కాలం వారితో వారి శిష్యులైన రాక్షసులతో కలిసిమెలసి తిరిగితే వారి దుర్గుణాలు పట్టువడునని దేవతలకు భయం. సహవాస దోషంచే పట్టువడని గుణములెవ్వి? తుదకందరు కలిసి యోచించి, ధీరచిత్తుండగు గురుకుమారుడైన కచుడను వానిని పంపించారు.

కచుడు శుక్రుని వద్ద చేరి, అతని మదిని దోచి, తనయంత తనపై వాత్సల్యం కల్గేలా నడుచుకుంటున్నాడు. కచునిపై శుక్రాచార్యులకు ప్రీతి మెండైనది. అది రాక్షసులకు గిట్టదయ్యెను. వారొకనాడు మంత్రాలోచన చేసి దర్భలకై పోయి వచ్చుచుండిన కచుని జంపి వాని శవాన్ని అట పారవైచి వచ్చారు. రాక్షసులు ఎట్టి దుష్కర్మలు చేయుటకైనా సమర్థులు కదా!

సాయంకాలమైంది. కటుడింటికి రాలేదు. శుక్రునకు సంశయం కలిగింది. వెదక్కుంటూ అడవులకు పోగా ఒకచోట, కచుడు చచ్చి పడివున్నాడు. ఆ కళేబరాన్ని చూచి మృతసంజీవిచే బ్రతికించి ఇంటికి తోడ్కొని వచ్చాడు. రాక్షసులకా విషయం తెలిసింది. మరొకనాడు కచుని పట్టి చంపి కాల్చి ఆ బూడిదను కల్లులో కలిపి తమ గురువుకే ఇచ్చారు. మద్యపాన ప్రియుడైన శుక్రుడు దాన్ని త్రాగాడు. కచుడు ఇంటికి రానందున అడవులంతా తిరిగి వెదికాడు. ఎక్కడా కనిపించలేదు. తన దివ్య దృష్టితో చూడగా భస్మ రూపంలో తనలో నున్నాడని గ్రహించాడు. మృత సంజీవిచే బ్రతికించి ఆ మంత్రాన్ని అతనికి నేర్పి, "నా కడుపు చీల్చుకొని బయటకు వచ్చి నన్ను బ్రతికించు"మన్నాడు. కచుడట్లే చేశాడు. రాక్షసులు చేసిన కార్యం తన కార్య సాఫల్యానికే తోడయ్యింది.

పూర్వం మనదేశానికి మహమ్మదీయులు రాకముందు వారి దేశంలో జ్యోతిశ్శాస్త్రం ప్రబలి యుండేదట. దాని నెట్లైన గ్రహించాలని మన దేశస్థులాలోచించారు. అధిక మేధావంతుడైన ఒక బ్రాహ్మణ బాలుని పంపడానికి నిశ్చయించారు. ఆ కాలంలో విప్రులు నౌకాయానం చేసినా, ఇతర జాతుల వారితో భుజించినా తిరిగి తమ జాతిలో చేర్చుకొనరు. అందువల్ల స్వకులస్థుల వద్ద కొన్ని కట్టుబాట్లు ఏర్పాటు చేసుకొని, ఎన్ని పాట్లు పడి అయినా ఆ విద్యను నేర్చుకొని వస్తానని బయలుదేరాడు.

అట్లతడు బయలుదేరి పలు కష్టాల కోర్చి యవన దేశాన్ని చేరాడు. వడుగు, ముండనం, చూచి తురుష్కులు అతన్ని చేర్చుకోమని చెప్పారు. తుదకాతడు వారి మతాన్ని స్వీకరించి విద్య నభ్యసింప ప్రారంభించాడు. విద్య ప్రారంభింపక ముందే యవనులతని కొక కన్యనిచ్చి నిక్కా చేశారు. ఆమెతో ఆతడు కాపురం చేస్తూ జ్యోతిశ్శాస్త్రాన్ని గ్రహించేటప్పటికే ముగ్గురు బిడ్డల తండ్రయ్యాడు. అయితే జ్యోతిశ్శాస్త్రాన్ని క్షుణ్ణంగా అభ్యసించాడు. దేశాభిమానంతో ఆ వ్యక్తి భార్యాబిడ్డలందరినీ వదలి ఒకనాడు అర్ధరాత్రిలో బయలుదేరి తెల్లవారే సరికి రెండామడల దూరం వచ్చాడు. ఆ తురుష్క బ్రాహ్మణుడు కనిపించకపోయే సరికి ఆ ఊరివారంతా పలురకాలుగా ఆలోచించి మోసం జరిగిందని గ్రహించారు. వాన్ని వెదకి కఠినంగా శిక్షించాలని అమీరుకు తెలియజేశారు. శాస్త్రవేత్తలు దివ్యదృష్టిచే ఆ భారతీయుని పోకడలు చెప్పగా, సేనాసమేతుడై ఆ ప్రభువు ఆతని పట్టుకోడానికి బయలుదేరినాడు.

బ్రాహ్మణుడా యుదంతాన్ని గ్రహించాడు. వడివడిగ నడక సాగించాడు. కాని వారు అతని సమీపిస్తున్నారు. అది చూచిన అతడు తప్పించుకొనే ఉపాయాన్ని ఆలోచించి ఒక కొండ గుహలోకి ప్రవేశించాడు. ఆ గుహలో ఒక పెద్దపులి చచ్చిపడి వుంది. దాన్ని చర్మాన్ని ఒలిచి కప్పుకొని గొంతు కూర్చొని దైవధ్యానం చేస్తున్నాడు. తురుష్కులు వాడెక్కడున్నాడో తెలుసు కోవాలని దివ్యదృష్టితో చూశారు. పులి చర్మాన్ని కప్పుకొని ఉన్నందున, పులి కడుపులో ఉన్నాడని నిర్ధారించుకొని, వాడు చచ్చెనని భావించి తిరిగి వెళ్ళిపోయారు.

బ్రతుకుజీవుడా అంటూ అతడు కుధర కుహరం బయటకు వచ్చి, వారి తెలివిలేమికి లోలోన నవ్వుకొని, మన దేశానికి వచ్చి చేరాడు.

కఠిన ప్రాయశ్చిత్తం చేయించుకుంటే గాని తమ జాతిలో చేర్చుకోమని బ్రాహ్మణులు ఖండితంగా చెప్పారు. అతడందుల కొప్పుకొనలేదు. తుదకా బ్రాహ్మణుడు, బ్రాహ్మణ ద్వేషంతో వారికా విద్య చెప్పలేదు. వారికి విరుద్ధంగా నడవాలని ఒక దళితురాలిని పెండ్లాడి జ్యోతిష్య వృత్తిలో తన జీవితాన్ని గడుపసాగినాడు. అతని సంతతి వారే నేడు "వళ్ళువర్" అని పిలుపబడే ఒక తెగవారని పలువురి నమ్మకం.

# 69. స్వల్పమని కూడనిపని చేయరాదు

ఈ భువిలో కొలగాని వస్తువేదీ లేదు. స్వల్పమని నిర్లక్ష్యం చేస్తూ, అకార్యాలు చేసేవారు మనలో అనేకులున్నారు.

ఒకడు మన వద్ద కొక కార్యార్థియై వచ్చినాడనుకుందాం! "ఏలవచ్చితి" వని ప్రశ్నింపగా "ఊరకనే వచ్చితి" అని అతడుత్తరమిస్తాడు. కార్యార్థియై వచ్చి, ఊరకవచ్చినానని అతడేల అనాలి? ఇట్టి అపద్ధాలు మనలో అతి సహజాలైనాయి. వీని వలన స్వపరబాధకము లేదు. కాని -

**క॥ "మనమునకు హితంబును బ్రియ**
**మును బథ్యము దథ్యమును నమోగము మధురం**
**బును బరిమితమును నగు పలు**
**కొనరగ బలుకునది ధర్మయుతముగ సభలన్"**

అను సూక్తికి హాని వస్తున్నది. అణువులు ఘనములైనట్లుగా, స్వల్ప కార్యాలు ఘనీభవింపకుండునా? "నేడు వంకాయకు వచ్చింది రేపు టెంకాయకు వచ్చును" అనే సామెత ఉందికదా!

ఒక అరణ్యంలో అత్యంత శ్రద్ధతో తపస్సు చేసుకొనుచుండే ఒక మునీశ్వరుని పరీక్షింప దలచి దేవేంద్రుడు ఆ పరిసరాలలో ఒక ఖడ్గాన్ని విడిచి వచ్చాడు. స్నానార్థియై గౌతమీ నదికి పోతున్న ఆ ముని ఆ ఖడ్గాన్ని చూచి "ఎవరో దీని నిట మరచి విడిచి పోయారు. మరల వెదుక్కుంటూ వచ్చిరేని వారికి ప్రయాసలేకుండా భద్రపరచి ఇచ్చెదగాక!" అని ఆ కరవాలాన్ని తీసుకున్నాడు. స్నానానంతరం ఆశ్రమానికి తిరిగి వస్తుండగా నారచీర ముండ్ల పొదకు తగిలి చినిగింది. చేత కత్తి యుండుటచేత 'దీని గొట్టి వైచిన నిటు మాటిమాటికి తగలదు కదా!' అని అనుకొని ఆ ముండ్ల పొదను ఆ కత్తితో నరికి వేశాడు. నాలుగు మొదళ్లను ఒక్క పెట్టున సరాలున తెగుటచేత, ఆ కరవాలము వాడికి అచ్చెరువడి, ఆ మార్గంలో కనిపించే పొదలన్నింటిని వేడుక దీర ఖండిస్తూ ప్రొద్దెక్కగా పర్ణశాలకు చేరాడు. కత్తి పదునుకు మిక్కిలి

ఆశ్చర్యపడ్డ ఆ ముని, ఆశ్రమంలోని ముండ్ల పొదలన్నింటిని తెగ నరకాలనే మనస్సుతో ఆతడు ఆరోజు చేయవలసిన నిత్యకృత్యాలను వడివడిగా పూర్తిచేసి, అయినదనిపించి ముండ్ల పొదల నిర్మూలన కార్యక్రమంలో నిమగ్నుడైనాడు. అహర్నిశము జగదీశుని చింతచేయు ఆ మునికి ఆ రాత్రి కత్తి పదును గూర్చిన చింత మెండాయెను. నేడు భూచరి, రేపు ఖేచరి విద్యల నభ్యసించాలనే ఆలోచనలను వదలి, ఇప్పుడు ముండ్ల పొదలు చెండాడితిని. రేపు ప్రొద్దుననే లేచి ముందున్న మ్రాకుల నరకాలని భావించినాడు. ఆ రాత్రి అతనికి సరిగా నిద్రపట్టక స్వప్నాలు కూడా వచ్చినవి. ఆ స్వప్నాలన్నీ ముండ్లపొదలు, కరవాలం పదను గురుంచి ప్రశంసించునట్టివే. ఎట్లో తెల్లవారింది. వేకువనే లేచి కొన్ని చెట్లు గొట్టి పిదప స్నానానికి పోవాలని భావించాడు. అదే విధంగా చెట్లు నరుకు చుండగా, ఒక పుట్టనుండి ఆకస్మికంగా ఒక కోడె త్రాచు బుసకొట్టుచు బయటకు వచ్చింది. చేతిలో కత్తి యున్నందున ఆ ముని ఆ పామును చంపడానికి జంకలేదు. వెంటనే దాన్ని తుత్తినియలు చేశాడు. తదనంతరం స్నానం చేసి ఆరోజు కార్యాలను కొనసాగించినాడు. ఇట్లే ప్రతిరోజు స్వకృత్యాలు సన్నగిల్లగా, చెట్లు నరికే కార్యం బలమైంది. అట్టే అట్టే దుష్టమృగాలను చంపే కార్యానికి ఉపక్రమించి, నానాటికా ముని అచ్చపు వేటగాడైనాడు. తపశ్చర్యలన్నీ నట్టేట కలిపినాడు.

చూచితిరా! ఆ మునీంద్రుడు మొదట తాగ్రహింపదగని ఆయుధాన్ని "భద్రపరత" మను ఉద్దేశంతో గ్రహించి, ముండ్ల చెట్టే కదా యని దాని నరుకుట, కత్తి వాదరము, పొగడ్త అతని నెంతకు దెచ్చినదో! కాబట్టి స్వల్పమైనా కూడని పని చేయరాదు. మరొక వృత్తాంతాన్ని గమనించండి.

ఒక విద్వాంసుడు ఐహిక సుఖాలపై వైరాగ్యంతో, సర్వసంగ పరిత్యాగియై కౌపీనం మాత్రం ధరించి ఒక పర్వత గుహలో ధ్యాన నిష్ఠాగరిష్ఠుడై, మోక్షాపేక్షతో పరమాత్ముని చింతిస్తూ ఉన్నాడు. ఒకనాడు ఆ గుహలో నున్న ఒక మూషిక రాజు క్రొత్తగా వచ్చిన ఆ విరాగిని చూచి "మా సంచారానికి అభ్యంతరాయంగా వీడెక్కడనుండి వచ్చెను? వీని నిచ్చట నుండి తొలగించు ఉపాయమెద్ది?" అని తన పరివారంతో సమాలోచన చేసి – "ఒక్కొక్కరు

ఒక్కొక్క విధంగా, తగు యోపిన కొలది ఆతని తపస్సుకు భంగం కలిగిస్తే మన పోరుపడలేక ఆతడు ఈ గుహను వదలి పోగలడు. అతడు శమదమ సంపన్నుడును, శాంతుండును కాబట్టి ఆయనను సమీపిస్తే మనకు కలిగే నష్టమేమీ లేదు" అని నిర్ధారించి అట్లే చేయడానికి ఆ మూషిక రాజు ఆజ్ఞాపించినాడు.

జాముకు కొక్క ఎలుక ఆ తపస్విని సమీపించి అతని గోచిని దిగలాగ ఆరంభించాయి. అతడా ఎలుకల బాధ పడలేక, వసతిగా నున్న ఆ గుహను వదలి పోవడానికి మనసురాక, ఎలుకల బాధను నివారించడానికి ఎక్కడికో వెళ్ళి ఒక పిల్లి కూనను తెచ్చాడు. మూషికల ఉపద్రవం తగ్గింది. ఆకలిచేత, ఇతరత్రా ఆ పిల్లి రోదనం ఎక్కువైంది. అతని మనస్సుకు నిలుకడలేక పోయింది. పిల్లిని వదిలితే ఎలుకల పోరు మెండు. పిల్లిని ఉంచుకుంటే దానికి ఆహారాన్ని సంపాదించాలి. ఏది చేయదగినది? పిల్లికి పాలకు గాను ఒక పాడి యావును పొందడానికి బిక్షుకుండై ధనమార్జించి ఒక గోవును గొని తెచ్చాడు. గోవును కాపాడడానికి ఒక గొల్లడు కావాలికదా! ఒక గొల్లని కూడా తోడ్కొని వచ్చాడు. వానికి జీతమీయకున్నా, భుక్తియైన జరపకున్నచో వాడుండగలడా? కొన్నాళ్ళు గడచిన పిదప "ఇల్లాలు లేనివాని బ్రతుకేటి బ్రదు"కని, తనకు పెండ్లి చేయమని ఆ గొల్లడు యజమానిని తొందరచేశాడు. విధిలేక ఆ తపస్వి ఆ సత్కార్యాన్ని కూడా చేశాడు. కొన్నాళ్ళకు ఆ గోప దంపతులకు ఒక కుమారుడు జన్మించాడు. మార్జాల రోదనం శాంతించింది. గొల్లని సంసారం కొనసాగుచున్నది. కాని మన గోచిరాయని తపస్సెంత నిర్విఘ్నంగా కొనసాగుచున్నదో తెలుసా? గోపిక ఇంటి పనులు చేస్తుండగా, గోపబాలుని పోరును ఓదార్చే సేవకుడెవ్వడు? ఆ ఉద్యోగం ఆ యతికే కుదిరింది. ఆ పిల్లవాడు ఎలుకల బాధ, పిల్లిరంపు కన్నా మెరుగనిపించు చున్నాడు. అందరూ కలసి ఆ పిల్లవానికి భగవన్నామమని కృష్ణుడని నామకరణం చేశారు. ఆ బాలకృష్ణుడు వారి నేపని చేయనిచ్చేవాడుగాడు.

ఒకనాడు సంసార నిర్వహణదక్షుడైన ఆ సన్యాసి ఆ బాలుని మూపుపై నిడి గుహ ముందు అటు ఇటు త్రిప్పుచుండ ఆముదము త్రాగిన ఆ కృష్ణుడు

పలుచని మలం ఆతనిపై జారవిడిచినాడు. ఆ సమయంలో మరొక సన్యాసి అక్కడికి అతిథిగా వచ్చి "ఇదియే"మని అడిగినాడు. "ఇదియే సంసారంలోని సార" మని మన తపస్వి ప్రత్యుత్తర మిచ్చాడు. అప్పుడు జ్ఞానోదయమైన ఆ తపస్వి ఇప్పుడు నిజంగానే సర్వసంగ పరిత్యాగియై ఆ గోచిని కూడా వదలి ఎచటికో పోయినాడు.

చూచితిరా! గోచికై వచ్చిన తగవు గోల కొండదాకా ఈడ్చినది. స్వల్పమని దేనిని భావింతుమో అందులోనే ఘనకార్యాలు విలీనములై ఉంటాయి.



## 70. అన్నియు తెలిసిన వాడు లేడు

ప్రకృతి వైచిత్ర్యమనంతం. విస్తృతం. ఒక్క పరమేశ్వరుడు మాత్రమే సర్వజ్ఞుడు. తదితరులంతా పరిమిత జ్ఞానం గలవారు. ఆలోచనా శక్తి పెరిగే కొద్దీ, బుద్ధి వృద్ధి చెందుతుందే గాని సర్వజ్ఞులు కాలేరు.

**ఉ॥ "ఒక్కొక్క వస్తుతత్త్వము బ్రయోజనముందెలియంగలేమ; యం**
**దొక్క విభాగ తత్త్వమును యోచనసేయగ శక్తిచాలకే**
**యిక్కరణి గుతర్కముల నెప్పుదు సేయుట సిగ్గుచేటుకా**
**కెక్కడి గౌరవంబనుచు నెంచెడు నాతడె ధన్యుడిమ్మహిన్"**

శాస్త్రాలు అనేకం. విద్యలు లెక్కకు మిక్కుటం. వీటన్నింటిని తెలుసుకోడానికి నరునకు ఆయువు చాలదు. కాబట్టి హంసక్షీరదక న్యాయంలా, ఉత్తముడైన వాడు, "ఉత్తమం తత్త్వం చింతాచ, మధ్యమం శాస్త్ర చింతనం" అనే న్యాయసూక్తి ననుసరించి తత్త్వం గ్రహించి జన్మతారక కార్యము వెంట చరించాలి. కాక దంత పరీక్షచే కలుగు ఫలమేమి?

**శ్లో॥ "పఠకాః పాఠకాశ్చైవ! యేచాన్యే శాస్త్ర చింతకాః ।**
**సర్వే వ్యసనినో మూర్ఖా! యః క్రియవాన్ సపండితః ॥"**

చదివించేవారు, చదువువారు, శాస్త్ర చింతనం చేసేవారు, మూర్ఖులు, వ్యసనం గలవారు అగుచున్నారు. క్రియావంతుడైన వాడే పండితుడు. పండితులు కొందరు శ్రీరంగనీతులను ఏకరువు పెట్టి ఇతరులకు నూరి పోస్తుంటారు. కాని తాము మాత్రం ఆచరింపక పప్పులో అడుగు వేస్తుంటారు.

ఒక పండితుడు తన ఇంటి అరుగుపై ప్రతిరాత్రి పురాణ ప్రసంగం చేసేవాడు. గ్రామస్థులు వచ్చి శ్రద్ధగా వినేవారు. ఒకనాడతడు "సొరకాయ తిన్నచో పాతకము, కాకరకాయ తిన్నచో దోషము" అని ప్రస్తావవశాన చెప్పినాడు.

మరుసటిరోజు ఆయన అంగటికి వెళ్ళి సొరకాయ కొని ఇంటికి పంపించి, ఇతర కార్యాలు చూచుకొని, భోజన వేళకు ఇంటికి వచ్చాడు. నిత్యకృత్యాలు నిర్వర్తించి, భోజనానికై పీటమీద కూర్చున్నాడు. అతని ఇల్లాలు వట్టి చారన్నం మాత్రం వడ్డించింది. పండితుడామెను చురచురచూస్తూ, "యోసీ! పచనమునకై పంపిన తుంబము నేమి చేసితివి? వట్టి చారన్నము నా నెత్తిని బోసి పులి మెదవా?" అన్నాడు. ఆ సాధ్వీమణి తత్తరపడకుండా ఇట్లన్నది. "నాథా! మీరలు రాతిరి సొరకాయ దిన్న పాతకమని సెలవిచ్చితిరి, ఉదయమున పొరబాటున దీసి పంపితిరని భావించి, ఆ సొరకాయను పొరుగింటి పుల్లమ్మకు ఇచ్చితిని" ఆ మాటలు విన్న అతడు కోపాన్ని దిగమ్రింగి, ఆమె అమాయకత్వానికి పక్కున నవ్వి ఇట్లన్నాడు. "ఓసిరండా! నే జెప్పినది యిరుగు పొరుగులకే గాని మనకు గాదని గ్రహింపక పోయితివే? ఊరివారి నోట మట్టిగొట్ట నేనేర్పడ నానోట మట్టిగొట్ట నీవేర్పడితివా? రేయి చెప్పినది పుస్తకములోని సొరకాయ, పంపినది అంగడిలోని సొరకాయ". క్రియావంతులే పండితులు. తదితరులు పండితమ్మన్యులు. నాలుగు వేదాలు, ఆరు శాస్త్రాలు, పెక్కు స్మృతులు, పదునెనిమిది పురాణాలు, మరియు ఉప పురాణాలు, చతుష్షష్ఠి కళలు, తంత్రములు అరువది నాలుగు సాకల్యంగా నేర్చిన పండితుడు కూడా ఒక్కొక్కప్పుడు సామాన్యుని చేత ఓడింపబడతాడు. చూడండి.

సర్వతోముఖ పండితుడు సర్వదేశాలు తిరిగి పండితులందరిని తన తర్కముతో ఓడించి వీరఘంట, గండపెండేరం మొదలుగా గల పెక్కు

బిరుదులను పొందినాడు. ఒకనాడు ఒక ప్రభువు సన్నిధికి వచ్చి తన విద్యా నైపుణ్యాలను చూపడానికి రాజును అనుజ్ఞ కోరినాడు. ఆ నరపాలుడు విద్యాప్రియుడు. మరుసటి రోజు సభకు రమ్మని పంపించి, అస్థాన పండితునకు ఆ వార్త పంపించి, సభ చాలించి, అంతఃపురానికి వెళ్ళి రాణికి ఆ పండితుని ఉదంతాన్ని తెలియజేసినాడు. ఆస్థానపండితుడే గెలుస్తాడని రాణియు, వచ్చిన పండితుడే గెలుస్తాడని రాజును కొంతసేపు వాదులాడి పందెం వేసుకున్నారు.

ఆస్థాన విద్వాంసుడు ప్రభువు పంపిన వర్తమానం విని, ప్రతివాది భయంకరుడైన పండితుడని తెలిసి భయపడసాగెను. ఆరాత్రి అన్నం తినను మనసురాక, నిద్రరాక ఏకాంతస్థలంలో కూర్చుండి – "రేపటికి నాకు ఆ పండితునిచే అవమానం ప్రాప్తించుట నిక్కం. అతని గెలుచు ఉపాయం తోచకున్నది. ఏదేని సాకు చెప్పి సభకు పోకుండా తప్పించుకోవడమే యుక్త"మని లోలోపల తలపోస్తున్నాడు. అంతలో ఆతని శిష్యుడు ఒక్కడు వచ్చి గురువుగారు చింతా లోకనాన్ని గ్రహించి ముకుళీకృత కరకమలుండై ఇట్లన్నాడు "గురువర్యా! మీ ముఖాన్ని తిలకిస్తే వచ్చిన పండితునితో వాదించుటకు జంకుచున్నట్లు నాకు తోస్తున్నది. అదియే కారణమైనచో నా పలుకులు కొంచెం ఆలకించండి. కలకాలం రాజు అన్నం తిని సమయం వచ్చినప్పుడు వెనుకంజ వేయడం ధీరలక్షణం కాదు. మీ యోగ్యత మీకు తెలియక ఇట్లు కుందుచున్నారు. మీరేల! నన్ను నియోగించండి. సదస్సుల ఎదుట అతన్ని అవలీలగా ఓడించి మీకును రాజుగారికిని కీర్తిని ఆపాదింతు నన్నాడు. గురుశిష్యుల సంవాదం తిలకించండి.

గురువు : వత్సా! జగముల గెలిచిన పండితుని ఢీకొందుననుట నీ పడుచు బుద్ధిని తెల్పుచున్నది. నిజముగా నేనే జంకుచుండగా నీవెంత వాడవు?

శిష్యుడు : ఆ చింత మీకేల? నిశ్చయముగ జయించగలను.

**క॥ విదళింప నుఱుకు సింగపు**
**గొదమయు, మదమలినగండ కుంజరములపై**

నిది బలశాలికి నైజము
గద! తేజోనిధికి వయసు కారణమగునే?

గురువు : నీ ధైర్యానికి అచ్చెరువందుచున్నాను. కాని నిన్ను నియోగింప జాలను. నామాట విని నీవేగి ప్రభువుతో "గురుడు కడుపునొప్పిచే మిగుల బాధ నొందుచున్నాడు" అని విన్నవించి రమ్ము, పండితుడని పేరు పొందిన వానికి సభలో అవమానం కన్నా చావుమేలు. కావున ఈ పనికి సాహసింపరాదు.

శిష్యుడు : దైవాధీనాలైన జయాపజయాలపై ఇంత చింతిల్లనేల? నా మనవిని మన్నించి నన్నాజ్ఞాపించండి. అవశ్యం జయించగలననే దృఢ విశ్వాసం నాకుంది. సభలో మీరే చూడగలరు. సుజన మస్తకము నాశ్రయించుట చేతనే గదా! కుసుమ జన్మము సార్థక మౌతుంది.

గురువు : కాదేని వనములో వాడిపోవుచున్నది గదా!

శిష్యుడు : దేశికోత్తమా! మీరు సభకు రాకున్నచో ప్రతిపక్షి జయ ధ్వజాన్ని గొనిపోవుట నిక్కం. పరకృత తిరస్కారం మానవంతుడు సహించలేడు. ఈ అల్పుని ప్రార్థన అంగీకరించి వీని నియోగించండి.

అని గట్టి పట్టుపట్టి గురువు ఆనతిని పొంది, మరునాడు నియుక్త సమయానికి దేశికునితో ఛాత్రుండును సభ నలంకరించాడు. రాజు సింహపీఠాన్ని అధిష్ఠించిన తర్వాత తదితరులంతా ఉచితాసీనులైనారు. అంత ఆ శిష్యుడు లేచి దేశాంతరాగత పండితునుద్దేశించి సభికులతో – "మా గురువు అనుజ్ఞపొంది యీ విద్వద్వర్యునితో తర్కమునకు సిద్ధపడినాను. ప్రశ్నించుట సులభమని, ఉత్తరమిచ్చుట కష్టమని నాకు తెలుసు. అయినా ఈ పండితుడు జిగీషుండై జైత్రయాత్ర చేయుచున్నవాడు. కాబట్టి నా ప్రశ్నలకు తగు సదుత్తరములీయ భాద్యుండు" అని పలికి – "1) ఈ రాజు ధర్మాత్ముడు, 2) ఈతని రాణి పతివ్రత, 3) నీతల్లి [1]యపత్యవతి. పై మూడు అంశాలపై తర్కంలో కాదని చెప్పాలి." అని ఆ తార్కిక శిఖామణిని తేరిపార జూచి కూర్చున్నాడు.

---

1. గొడ్రాలు

ఆ తార్కికుని మొగము తెల్లబడింది. పెదవు లెండినవి. నోటమాట రాలేదు. లోలోపల పరిపరి విధాల పర్యాలోచనం చేయ సాగినాడు. "ఊరకుంటిమా ఓటమి సిద్ధిస్తుంది. పూర్వ పక్షానికి గడంగితిమా పింద శృంఖల ప్రాప్తి తప్పదు. ఇక గతియేమి? ఇట్లు చెప్పి చూచెదగాక" యని కొంత తెచ్చుకోలు బీరముతో - "ప్రభువుల చిత్తానికి ఈ ప్రశ్నలు సభా యోగ్యములు, సదుత్తర గర్భితమలని తోచినచో సెలవిండు" అనగానే పృచ్ఛకుండు లేచి, "దిగంత విశ్రాంత యశోధుర్యులగు విద్వత్ శిఖామణులకు అసభ్యము లెయ్యవి? ఎట్టి వానినైన సభాయోగ్యాలుగా చేయుటకు సమర్థులైన మీకు సమర్థింప శక్తిగల తమబోటి వారికి అసభ్యం ఒకటి కలదా! పఠన యోగ్యములు చేయని విషయాలు కవులకు మిగిలియున్నవా? పండిత వాగధిష్ఠితములైనవి ఎట్టివైనా పవిత్రములును, పఠనయోగ్యములును అగుచున్నవి. సెలవీయవచ్చు"నన్నాడు. పండితుడు ఏమియు తోచక నిరుత్తరుడైనాడు. సభ్యులలో గుసగుసలు మెండైనవి. ఇవి సరియగు ప్రశ్నలు కావని కొందరు, పాపం విద్వాంసుడని కొందరు, బాలకునిచే పరాజితు డైనాడని మరికొందరు, ఈ ప్రశ్నల కెవ్వరు కూడా ఉత్తరమీయలేరని ఇంకొందరు రాజు అడుగడా? శిష్యుడే యుత్తరమిచ్చునో చూతమని సభాసదులు గుసగుసలాడుచున్నారు. నరపాలుడు సభా కలకలాన్ని చేతి సంజ్ఞతో వారించి ఆ శిష్యుని చూచి - "నీ యుక్తికిని, సమయజ్ఞతకును సంతసించితిని. నీ వాక్యములను నీవే వ్యతిరేక సిద్ధాంతము చేసి సదస్యుల మెప్పించితివేని, ఈ విద్వజ్జిగీషుడు ఓడెనని తీర్మానింతు"నన్నాడు. శిష్యుడు ధీరుడై లేచి ముఖమున మందహాసం మొలకెత్తగా సభకు నమస్కరించి రాజు నుద్దేశించి ఇట్లన్నాడు.

"నా మొదటి వాక్యం రాజు ధర్మాత్ముడనునది. ఇప్పుడు రాజు ధర్మాత్ముడు కాదని సిద్ధాంతీకరించాలి. ప్రభువైన వాడు పండితుల పాండిత్యాన్ని చూచి యుక్తమైన సమ్మానములతో తృప్తిపరచి పంపవలెనేగాని, మల్లురకు వలె కొట్లాటకు అంగీకరింపరాదు. రాజసభ ధర్మ సహితమైంది. అట్టి ధర్మయుక్తమైన రాజసభలో పరాభూతుడై విద్వాంసుడు శోచింపకూడదు. దానివల్ల ప్రభువునకు కూడా ప్రయోజనం లేదు. విజయధ్వజ మెత్తి వచ్చిన

ఈ పండితుని ఈ సభలో ఒక బాలకుడు జయించాడు. ఈ పండితుడు అసంతుష్టుడైనాడు. కాబట్టి ఈ సభ అధర్మవిరళమైంది. సభాపతి అయిన నృపతి కూడా అధార్మికుండై"నాడు. ఆ బాలకుని వాక్ నైపుణ్యానికి అమితానందం చెందినవారై మిగిలిన రెండు వాక్యాలను గురించి వినడానికి ఏకాగ్రతగల మనస్కులై యున్నారు. ద్వితీయ విషయాన్ని గురించి ఆ శిష్య ప్రరుండిట్లన్నాడు.

"ఈతని రాణి పతివ్రత కాదు. ప్రణయ సమయంలో తప్ప తక్కిన వేళలలో సధ్మహిణి పతి నెదిరింపకూడదు. ఏ పండితుడు గెలిచిన మన కేమియని ఊరకుండక ఆమె పతితో పంతము లాడినందున ఆమె పాతివ్రత్యానికి కళంకం సిద్ధించినది. ఒకవేళ విపక్షం జయించినచో ప్రభువునకు పరిభూత చింత ప్రచ్చికొనెడిది. భర్తను పరాజిత వ్యాకులుని చేసిన సతికి మరొక విధంగా కళంకము, సమకూరుచున్నది.

మూడవది యితని తల్లి గొడ్రాలు. ఎట్లంటేని ఇతని తల్లి పున్నామనరక త్రాణుడని ఇతన్ని కన్నది. ఇతడు విద్యావంతుడై వాక్ కలహాన్ని పెంచుతూ, పరులకుగాని, తనకేగాని అవమానం కలిగించే తర్కానికి పూనుకొని పండితు లనేకులను అవమానించినాడు. తర్కంలో అసమాన ప్రజ్ఞ కల్గిన శ్రీహర్షుడు ఏమైనాడు? యుక్తములను అయుక్తాలని, అయుక్తాలను, యుక్తంబులని వాదించే తార్కికుల పాండిత్యం, పండితుల మనస్సంక్షోభానికి కారణమై అల్పాయుష్కులై తల్లులను గొడ్డాంద్రను చేయుచున్నారు. ఒకవేళ పూర్ణాయుష్కులైనా యుక్తాయుక్త నిర్ణయం చేయలేక, చెడి, జీవచ్ఛవాలై మాతృ ఋణము తీర్చక పుట్టని వారిలో చేరుచున్నారు. ఇతడు పండితుడైనా, అనేకులను జయించినా – "ఇన్నాళ్ళు బ్రతికి యింటి వెనుక జచ్చె" అన్నట్లుగా తుదకీ మహాసభలో ఒక బాలకుని చేతిలో పరాజితుడైనాడు. కాబట్టి ఇతని జన్మ జన్మము గాదని సిద్ధాంతీకరించుచున్నాను. అనగా పుట్టిన వారిలో చేరడని తాత్పర్యం. ఇట్టివాని తల్లి వంధ్యగాక పుత్రవతి యెట్లవుతుంది"?

ఆ శిష్యుని యుక్తియుక్తములైన పలుకులకు సభ్యులంతా పరమానంద పరవశులై కరతాళధ్వనులు చేశారు. తార్కికుని బిరుదులన్నీ శిష్యునకిచ్చి, రాజు ఆతనిని పారితోషికములచే సంతుష్టుని చేయుటకు పూనుకొనగా అతడు

వలదని వారించినాడు. తార్కికునికి నమస్కరించి మన్నింపవేడి, అతనికి విభునిచే వివిధ సత్కారంబులను చేయించినాడు. ఈ శిష్యుని పేరే యామునాచార్యుడు. కాబట్టి ఎవరు కూడా సర్వజ్ఞులు కారు.



# 71. కఱవు

సకాలంలో వర్షం కురవక, పంటలు పండక, ప్రజలకు తినడానికి తిండిలేక అల్లాడే కాలానికి 'కఱవు' అని పేరు. ఈ కఱవుకు మూల కారణం వర్షం కురవక పోవడమే. ఆ వర్షం ఎందుకు సకాలంలో కురవదు? భగవంతుని ఆజ్ఞానుసారం సూర్యచంద్రులు వేళ తప్పక నడచుచున్నారు. వాయువు వీచుచున్నది. భూమి భరిస్తున్నది. గోళములు (గ్రహాలు) మనపై ఊడిపడడం లేదు. సముద్రుడు హద్దుమీరుట లేదు. సర్వం ప్రకృతిలో సక్రమంగా జరుగుచుండగా మేఘములు మాత్రం ఎందుకు వర్షించుట లేదు? అవి దేవుని ఆనతి మీరి వర్తించుచున్నవా? వర్షాధిదేవతను పర్జనుడని వేదాలు పలుకుచున్నాయి. అతని పాలనా క్రమం సక్రమంగా లేదా? అట్లైతే పై అధికారి పరమేశ్వరుడు విచారింపకుండునా? సర్వసముడైన సర్వేశ్వరుడు కఱవుకాటకాలు ఎందుకు కల్పిస్తున్నాడు? దోషము దేవునిది కాదు. కఱవుకు కారణం మనమేయని తీర్మానించవలసివుంది. సూర్యకిరణాలు తటాకాలలోని, సముద్రాలలోని జలాలు ఆవిరి రూపంలో ఆకర్షింపబడి మేఘములై శీతలవాయు స్పర్శచే మరల జలంబులై వర్షించునని దృష్టాంత పూర్వకంగా ప్రకృతి శాస్త్రజ్ఞాన సంపన్నులు ప్రాక్కిచ్చుచున్నారు. ఈ కార్యం నైసర్గికంగా జరుగుచున్నదనుచున్నారు. అట్లైన ఈ కఱవునకు సూర్యుడు కారకుడా? వాయువు హేతుభూతుడా? వీరి కార్యాలు స్వాభావికాలైనప్పుడు వారిపై తప్పు మోపుట సరికాదు.

సత్యముచే వాయువు వీచుచున్నది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు.

**తే॥** "నడపునది బ్రహ్మమాదిత్యు గడకతోడ
త్రిదశులాతని గొల్చి చరించువారు
మహిత ధర్మంబునన యస్తమానమగును
నిలుచు సత్యమాధారంబు గలుగనతడు"

సత్యం మనుజుల వల్ల నడపవలసి ఉంది. సత్యం మన వద్ద ఎప్పుడైతే సన్నగిల్లునో అప్పుడు సూర్యాదుల కార్యాలు తారుమారవుతాయి. క్షామ కారణాన్ని ధర్మశాస్త్రాలు కూడా ఇట్లే చెప్పుచున్నాయి.

**శ్లో॥** "అపూజ్యా యత్ర పూజ్యంతే
పూజ్యాయత్రావ మానితాః ।
తత్రత్రయం భవిష్యంతి
వ్యాధి దుర్భిక్ష తస్కరాః ॥"

ఎచ్చట అపూజ్యులు పూజింపబడతారో, పూజ్యులైన వారు అవమానింప బడతారో, అచ్చట అకాలమృత్యు కారకాలైన వ్యాధులు, జీవన భీతిప్రదంబైన దుర్భిక్షం, మాన ప్రాణ ధనహరణ మైనట్టి చోరభయం - ఈ మూడును కలుగుచుండును.

**శ్లో॥** కాలే పానీయమశనం, కాలే బీజంతు వాపయేత్
కాలే కర్మ సముద్దిష్టం విపరీతే విపర్యయః ॥

యుక్త కాలాన అన్న పానీయాలు తీసుకొనడం, తగిన కాలమెరిగి విత్తనాలు వేయడం, అనుకున్న కాలానికి కార్యం చేయనప్పుడు ఫలితం విపరీతమగుటలో ఆశ్చర్యం లేదు కదా!

జనుల అధర్మవర్తనం వల్లనూ, పరపీడన కారకాలైన కార్యములచేతను, సత్యం క్షీణిస్తున్నది. సత్య క్షీణతవల్లనే క్షామదేవత ప్రత్యక్షమవుచున్నది.

జరుగుచున్న కాలానికి కలికాలమని పేరు. ఈ కలికాలంలో జరిగే వాటిని త్రికాలజ్ఞులైన మన పూర్వులు కాలజ్ఞానంలో మన హెచ్చరిక కొరకై తెల్పియున్నారు.

**శ్లో॥** "దాతా దరిద్రః కృపణోధనాఢ్యః
పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః

రాజా ఽకులీనో నకులీనసేవ్యః
కలౌ యుగే షడ్గుణ మాశ్రయతి"

దాత దరిద్రుడై, లోభి ధనికుడై, పాపి చిరాయుష్కుడై, పుణ్యుడు అల్పాయుష్కుడై, రాజు నీచకులుడై, నీచకులుడు సేవింపదగినవాడై ఈ కలియుగంలో ఈ ఆరుగుణాలు ఆవరించి ఉంటాయి.

మరియు సత్యం అడుగంటుటచేత, ఆయువు క్షీణిస్తున్నది. ఆయు క్షయంబున విద్యలు అల్పమైనవి. అల్పవిద్యచే విమోహంబు మిగులు. విమోహంబుచే లోభం, దానిచేత కామము, కామముచే క్రోధము, దానివలన అన్యోన్యపీడనం ప్రాప్తిస్తుంది. వర్ణాశ్రమ ధర్మాలు అడుగండి విపరీత పరిస్థితులు కలిగి తద్వారా వర్ణ సంకర మేర్పడుతుంది. సమయానికి వర్షం కురువదు. బీజములు పెక్కులు పొల్లగును. అతివృష్టి, అనావృష్టి సంభవించును. క్రయ విక్రయాలలో కపటం పెరిగిపోతుంది. అన్న విక్రయము, విద్యా విక్రయం మెండవుతుంది.

క॥ హేతు ప్రత్యయవాద వి
చేతసులై వేదనింద సేయుచును మఖ
వ్రాతంబులు వ్రతములు బెడ
బాతురు దుర్మార్గ కర్మపరులై విప్రుల్.

క॥ సుతుడవమానించు జనకుఁ
బతి నవమానించు భార్య, పడతులు బతులున్
మతి నొండొరువుల మెచ్చక
సతతము జరియింతు రిష్టసంచారములన్.

క॥ గురుగొని యాడదు శిష్యుడు
గురుడును శిష్యునెడవంచ కుండగు మదినొం
డొరువుల నొల్లరు బంధులు
పొరిబొరి గలవులగు బ్రజకు బొడమును భయముల్.

యుగాంతంలో పదియారేండ్లే ప్రజలకు పరమాయువు ఔతుంది. ఏడెనిమిదేండ్లకే స్త్రీలు బిడ్డలను గంటారు. ఇందలి విషయాలు చాల వరకు

ఇప్పటికే జరుగుచున్నాయి. మిగిలినవి కూడా శీఘ్రకాలంలోనే జరుగలవని తోస్తున్నది.

ఒక్కొక్కచోట సంవత్సరాల కొద్దీ వర్షం లేక కష్టపెట్టుచున్నది. ఒక్కొక్క చోట అతివృష్టితో కఱవే మెఱుగనిపిస్తున్నది. ఇట్టి కష్టాలకు మన అధర్మములే హేతువు. కఱవుచేత జనులు మరింత అధర్మానికి ఒడిగట్టు చున్నారు. కఱవు తగ్గితే అధర్మాలు తగ్గునేమో! అధర్మం తగ్గితేగాని ఈ క్షామం తగ్గదు. పిచ్చి కుదిరిన పెండ్లి అవుతుంది. పెండ్లి అయితేగాని పిచ్చి కుదరదు అనే లోకోక్తి ఇట సరిపోవుచున్నది. ఈ దిక్కుమాలిన గతికి దేవుడే దిక్కు.

అంగ భూపాలునకు లేకలేక వేనుడనే కొడుకు జన్మించాడు. తల్లిదండ్రులతనిని అల్లారుముద్దుగ పెంచినారు. ఆ వేనుడు బాల్యమందే తుంటరియై, తోటి బాలురను చావమోదుచు, సాధుల బాధించుచు, చేయరాని కార్యాలు చేస్తుండేవాడు. వయసు పెరిగేకొద్దీ వాని దుర్మార్గం కూడా పెరిగింది. తల్లి పెక్కు విధాల బోధించింది. తండ్రి తిట్టికొట్టి, నానా విధాల హింసించినా వాని దుశ్చేష్టితాలను మాన్పలేక పోయినాడు. దుఃఖితాత్ముడై –

**క॥ "అనయము నిట్టి కుపుత్రుని**
**గని పరిఓ పంబు బొందుకంటెను ధరలో**
**ననపత్యుండగుటొప్పును**
**వనజాక్షు భజించునట్టి వాడగువాడున్"**

అని యోచించి, ఒకనాటి రాత్రి నిద్రించు భార్యను, రాజ్యాన్ని, ప్రజలను వదలి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

మరునాడు రాజబంధులు, పురోహితులు, మంత్రులు రాజును వెదకసాగినారు. ఎంత వెదకినా లాభంలేక పోయింది. వెదకివేసారి తిరిగివచ్చి రాజ్యం అరాజకం అవుతుందని మహాత్ములతో ఆలోచించి విధిలేక వేనునికి పట్టం గట్టినారు.

దుర్గుణాలకుతోడు, దొరతనం ప్రాప్తించగా వేనునకు మిన్ను మన్ను సమమయ్యెను. అతని పరిపాలనలో సత్పురుషులు పరిభూతులైనారు. దుర్మదులు సంతసించినారు. ప్రజలకు ఆ రాజ్యం అరణ్యప్రాయంగ తోచింది.

అతడు ప్రజలను విశేషంగా బాధించుటచేత పెక్కుమంది పల్లెలు పట్టణాలు వదలి అడువుల పాలైనారు. వేనుడు అంతటితో పోకుండా –

**క॥ దివ్యులు వెఱగందగ బృ**
**హద్వ్యోమములగల భేరి వేయించె "నయ**
**ష్టవ్యమదాతవ్యమహో**
**తవ్యంవిప్రా" యనుచును దాత్తధ్వనులన్**

ఈ భేరి మ్రోతతో ఒక్కసారిగా విప్రుల గుండెలదిరినవి. మునులు వేనుని చేరి అనేక విధాల నీతులు ఉపదేశించారు. వారిమాటలు నతడు నిరాకరించి, ఇట్లన్నాడు. "మునులార! మీరలు పడుచుతనముచే పలుకుచున్నారు. "నా విష్ణుః పృథివీపతి" అనుట వినలేదా! నరపాల రూపాన్ని ధరించిన నన్ను వదలి అన్యుల నేల భజిస్తారు.

**క॥ పరికించి నను భజింపుడు**
**ధరణీశుడు సర్వదేవతామయుడగు మ**
**త్పరముడుగుడు, నాకంటెను**
**బురుషుడు మఱియెవ్వడగ్ర పూజార్హుడిలన్.**

మీరొనరించే సర్వకర్మలు నాకు ప్రీతికరంగా చేయండి". అని శాసించగా మునులు అదిరిపడి – "ఇట్టి నీచాత్ముడు బ్రతికియుండుట కంటె చచ్చుట మేలు. వీడు జీవించెనేని జగంబులు వీనిచే భస్మము కాగలవు. ఈ పాతకుడు హతుడగు గాత" అని శపించారు. ఆ శాపంతో వేనుడు మరణించాడు. సునీథ తన తనయుని మరణానికి దుఃఖించి అతని శరీరాన్ని భద్రపరచి ఉంచింది. కొన్నాళ్ళకు రాజ్యం అరాజకమైంది. చోరులు, దుష్టులు ప్రబలిపోయారు. మోసాలు మెండైనవి. సత్కర్మలు సాగుటలేదు. మరలా మునులు సునీథ గృహానికి వచ్చి వేనుని కళేబరాన్ని తెప్పించి, దానినుండి ఒక జంటను సృష్టించారు. అందు పురుషునకు పృథుడనియు, స్త్రీకి అర్చి అని పేర్లు పెట్టి వారికి రాజ్య పట్టము గట్టి మునులు తమతమ ఆశ్రమాలకు వెళ్ళినారు. పృథుడు తండ్రివలె గాక అధిక ధర్మాత్ముడై ప్రజలను కన్నబిడ్డలలాగా కాపాడుచు అధర్మాన్ని అణచివేశాడు. కాని కఱవుమెండై, పంటలు పండక ప్రజలు ఆకలి మంటచే క్షీణదేహులైనారు.

రాజు యజ్ఞాదులచే దేవతలను తృప్తిపరచినాడు. ప్రజల సోమరితనాన్ని పోగొట్టడానికి భూమిని సమము గావించి వ్యవసాయము చేయడానికి కావలసిన సహాయ సహకారాలందించినాడు. క్రమక్రమంగా అధర్మ వర్తనాలను పోగొట్టినాడు. "కృషితో నాస్తి దుర్భిక్షమ్" అని కృషి చేయించి క్షామమును బాపినాడు.



## 72. సుఖమెందున్నది ?

**తే॥గీ॥ "ఎవ్వడు ప్రవాసిగాకయు ఋణియుగాక**
**స్వగృహమందున మూన్నాల్గు జాలకైన**
**నాకు లోయలములో యున్నదంతొ యింతొ**
**వండికొని తినునాతడే పడయుధృప్తి"**

అని ధర్మరాజు, "ఎవడు సంతసించు" అని ధర్మదేవత అడుగగా ప్రత్యుత్తర మిచ్చినాడు. "క్రోధం హిత్వానశోచతి", 'మనోయమ్యనశోచతి' క్రోధాన్ని విడిచినవాడు, మనస్సును అణచినవాడును దుఃఖింపడు. అనగా సుఖించునని భావం. "శోకస్త్వజ్ఞానముచ్యతే" అజ్ఞానమే శోకమని చెప్పబడింది. 'కిం సుఖం? తుష్టి'; సుఖమేదంటే తృప్తియే సుఖమని శంకరాచార్యులు అన్నారు.

ఒక ధీమంతుడు తన భక్తికి మెచ్చి ప్రత్యక్షమైన భగవంతుని ఈ క్రింది వరాన్ని కోరినాడు.

**శ్లో॥ 'ఏకభార్యా త్రయఃపుత్రాః ద్వౌహతా దశధేనవః**
**మధ్య రాష్ట్రంతు సుక్షేత్రం దేహిమే మధుసూదన!'**

సుగుణవతి అయిన ఒక భార్యను, ముగ్గురు పుత్రులను, రెండు మడకలను (నాగళ్ళను), ఆవులు, ఎద్దులు పదింటిని, మంచి పొలాల మధ్య ఉండే సుక్షేత్రాన్ని, భగవంతా! నాకు దయచేయుము.

ఒకప్పుడు పార్వతీదేవి పరమేశ్వరునితో -

**శ్లో॥ 'రామాద్యాచయ మేదినీం ధనపతే ర్బీజం బలాల్లాంగలం**
**ప్రేతేశాన్మహిషం తవాస్తి వృషభః ఫాలం త్రిశూలం తవ**
**శక్తా హంతవచాన్న దానకరణే స్కందోస్తి గోరక్షణే**
**ఖిన్నాహం హర! భిక్షయా కురుకృషిం గౌరీ వచః పాతువః'**

మీ ప్రియశిష్యుడైన పరశురాముని కోరి కొంత భూమిని తీసుకొనండి. నీ మిత్రుడైన కుబేరుని విత్తనాలు అడగండి. మరొక శిష్యుడైన బలరాముని అడిగి మడకను తెండి. త్రిశూలాన్ని నాగలికఱ్ఱుగా గొట్టించండి. నీ ఆభరణాలైన సర్పాలను మోకుగా ఉపయోగించండి. నీకొక ఎద్దు కలదు కదా! దాని జతకు ఈ క్రింది ఉద్యోగి యముని మహిషాన్ని పట్టుకోండి. పెద్దకొడుకు విఘ్నేశ్వరుడు సేద్యం చేస్తాడు. చిన్నకొడుకు కుమారస్వామి పశువులను మేపగలడు. మీకు నే అన్నము పెట్టగలను. బిక్షమెత్తు కష్టమేల? సేద్యం చేయించండి. అని గౌరీదేవి భర్తతో అన్నది.

**"కృషిరేవ మహాశ్రేష్ఠం వినాదైన్యేన జీవనం"** దైన్యముతో జీవనం కంటే కృషి చేసి బ్రతుకుట ఎంతో మంచిది.

కొందరు ధీరులిట్లు చెప్పుచున్నారు.

హృదయమనే క్షేత్రంలో వివేకమనే మడకతో ప్రయత్నమనే ఎద్దులను పూన్చి, మనస్సనే నాగటిని త్రాటిలో కట్టి, ధర్మమనే మేడినూదిపట్టి, శ్రద్ధ అనే మునికోలగొని, దున్ని, సత్కార్యమనే ఎరువువేసి, భక్తియనే బీజాలు నాటి, సత్యమనే జలంపోసి, రాగద్వేషాలనే కలుపును, సద్విచారమనే కూలితో తీసివైచితే, నిత్యానందమనే పంట పండించుకొని, వివేకి సుఖిస్తాడు.

హస్తశుద్ధి, వాక్శుద్ధి, గుహ్యాశుద్ధి, నేత్రశుద్ధి గలవారెప్పుడేని, ఎచ్చటనేని, సుఖాన్ని యశస్సును పొందుతారని మరికొందరంటారు.

సంపద, సత్సంతానం, సద్గుణాలు, సదనుగ్రహం, సచ్ఛీలం, సత్యం, సరస్వతి అనే ఈ సప్త'స'కారాలున్నచోట, కొరత లేకుండా సుఖముంటుందని ఇంకొందరంటారు.

జీవుడనే రథికుడు శరీరమనే రథంలో కూర్చుండి బుద్ధియనే సారథిని నియమించి, మనస్సనే పగ్గాలతో, విషయాసక్తాలైన ఇంద్రియాలనే అశ్వాలతో బిగబట్టి, విషయంబులను విషమభూములకు పోనీక సన్మార్గమనే త్రోవలో పోనిచ్చి మోక్షమనే స్థానాన్ని చేరి శాశ్వత సుఖాన్ని అనుభవించవచ్చునని వేదాంతులు అంటారు.

మార్గమేది? అనే ధర్మదేవత ప్రశ్నకు ధర్మరాజు ఈ విధంగా ఉత్తర మిచ్చినాడు.

శ్లో॥ "తర్కోఽప్రతిష్ఠశ్శుతయో విభిన్నా
నైకోమునిర్యస్యమతం ప్రమాణం
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనోయేన గతస్సపంథాః"

ఊహ స్థిరపడలేదు. వేదాలు ఒకటికొకటి భిన్నాభిప్రాయాలతో నున్నది. ఎవ్వరి మతం ప్రామాణికమనుటకు, ప్రామాణికుడైన ఋషి ఒక్కడును కానరాలేదు. ధర్మతత్త్వం గుహలో పూడ్చబడినట్లున్నది. పెద్దలెట్లేగిరోగాని ఇదియె త్రోవ. లోకము పలువిధాలు గదా!

శ్లో॥ 'వైద్యోవదంతి కఫపిత్త మరుద్వికారాన్
జ్యోతిర్విదో గ్రహగతిం పరివర్తయంతి।
భూతాభిషంగ ఇతి భూత విదోవదంతి
ప్రాచీనకర్మ బలవన్మునయో వదంతి॥

ఒకడు ఏదైనా కష్టం వాటిల్లినపుడు కారణం తెలుసుకుందామని వైద్యుల నడిగితే, పైత్యదోషముచే శ్లేష్మము ఘనీభవించిందని చెపుతారు. ఇదిగాదని జ్యోతిష్యుల నడిగిచే గురువు వక్రించినాడని, గ్రహదోష నివారణకై సెనగలు, కందులు, దానం చేయాలని అంటారు. వీరినిగాదని భూతవైద్యులను ఆశ్రయిస్తే నీవు ఈ ఊరికి ఉత్తరదిక్కున రావిచెట్టున ఒక కొమ్మ నరుకు

చుండగా అందలి మునిగ్రహం సోకిందని, నీ విరోధి ఒకడు చేతబడి చేసి ఉండుటచేత ఇట్లయిందని, మూడు త్రోవలు కలిసే దారిలో దాటుతీస్తే నివారణ ఔతుందని అంటారు. మునుల నాశ్రయిస్తే నీ పురాకృత కర్మఫలం ఈ రీతిగా పరిణమించిందని పలుకుతారు.

ఇక ఉద్యోగములయందు, సుఖమున్నదేమో విచారింతము.

ఒకరిపై ఒకడు అధికారం చలాయిస్తూ ఉన్నతోన్నత పదవుల నలంకరించే స్వేచ్ఛ లేకుండా పరాధీనతతో ఉన్నప్పుడు సుఖమేముంది? పరాధీనతచే కలుగు దురవస్థను అనుభవ చక్రవర్తియైన భర్తృహరి చెప్పిన పలుకులు చూడండి –

**చం॥ "పలువలు పల్కు మాటలొక భంగి సహించితి భాష్పవారి లో**
**పలనే హరించి శూన్యమగు భావమున న్వెదనవ్వు నవ్వితిన్**
**బొలుపతివిత్త జాడ్యహత బుద్ధుల కంజలి చేసితిన్ గటా!**
**తలకక యింక నేపనికి దార్చెదొ నన్ను దురాశ నీవిటన్"**

ఒక ఉద్యోగి ఇంకొకనికి, అతడు మరొకనికి ఇట్లందరుద్యోగులు రాజునకు లోబడి ఉంటారు. కాన రాచరికమందు కూడా సుఖం సున్న. తిరిపెగాని తిండి చింత ఒక్కటే. కాగా రాజునకు పుట్టెడు చింతలు. "రాజా రాష్ట్రకృతం పాపం" అనే ధర్మోక్తి ననుసరించి రాజు ప్రజలయెడ కన్ను కలిగి ప్రవర్తించాలి. కాని నాడు "రాజ్యాంతే నరకం ధ్రువమ్" అనే మాట తప్పదు. రాజును పోషించేవారు ప్రజలే కాబట్టి రాజునకు పరాధీనత సిద్ధించుచున్నది. ప్రజలు ఉద్యోగులకు, ఉద్యోగులు ఉన్నతోద్యోగులకు, వారు మంత్రులకు, మంత్రులు మహీశునకు, రాజు ప్రజలకు అధీనత నొంది ఇట్లు పరిభ్రమించుచుండ స్థిరసౌఖ్య మెక్కడిది?

ఇక ఐశ్వర్యవంతుడేపాటి సుఖియో యోచింతము.

**మ॥ "వరసంతోష నిరంతర ప్రముదితుల్వర్ణింప నెవ్వారుని**
**ర్భరముల్వారికి మోదముల్, కనకలుబ్ధ స్వాంతులౌవారికి**
**న్విరతిం బొందదు తృష్ణ, యెవ్వనికి ;.:వింపంబడె న్భవ్మాచే**
**స్థిర సంపన్నిధి మేరువాత్మ ధృతలక్ష్మీకంబు, నా కిష్టమే?"**

దైవికంగా లభించిన దాంతో సంతృప్తిచెందే వారికి ఆనందానికి కొరత లేదు. లుబ్ధునకు మేరువంతవున్నా తృష్ణ తగ్గదు. నిత్య సంతోషికి ఐశ్వర్య మందు కోరిక కలగదు. లోభికి ఎంత వున్నా చాలదు. ఆశను మరింత పెంచే, నిరంతరం పరివేదన కల్గించే ఐశ్వర్యంలో కూడా సుఖం కానరాదు. మరి ఎవ్వరి తృప్తికోసం బ్రహ్మ ఈ సంపదను, బంగారు కొండను సృజించెనో!

**శ్లో॥ ఆకించనస్య దాంతస్య శాంతస్య సమచేతసః ।**
**సదా సంతుష్ట మనస స్సర్వాస్సుఖ మయాదిశః ॥**

శుద్ధ దరిద్రుడును, శాంతియై, దాంతియై సర్వభూత సమ చేతస్కుడై ప్రాప్తఫలముతో సంతృప్తి చెందితే, అట్టి వానికి అన్నింటా సుఖమయమై ఉంటుంది.



# 73. కోరికలు

కోరికలేని ప్రాణి లేనేలేదు. ప్రతి ప్రాణికి, ఆత్మరక్షణ కోరిక, ఆనంద కోరిక, సంతాన కోరిక అను మూడు విధాలైన కోరికలుంటాయి. స్వప్రయోజ నానికై పరప్రయోజనాన్ని రూపుమాపటం మహాపాతకం. కోరికలు సక్రమమైన వైతే పరప్రయోజనానికి ఆటంకం కలుగదు. ఆ కోరిక అతిక్రమించినపుడే చెడు సంభవిస్తుంది. కాబట్టి ప్రాణ రక్షణకు ఎంత అవశ్యకమో అంత కోరిక ఉంటే సర్వప్రాణులు ప్రేమిస్తాయి. ఉన్నదానితో తృప్తి చెందకుండా, పొరుగువారి కొంచెం ఆస్తికై ఆశించి, అతడు ఇవ్వకపోతే తప్పు వ్యాజ్యములు అతనిపై కల్పించి న్యాయస్థానానికీడ్చి, ఉన్న ఆస్తి కూడా కోర్టు ఖర్చులకు కరగిపోగా, నెత్తిపై చేతులుంచుకొనే వారు ఎందరో ఉన్నారు. అందుకే -

**క॥ వ్యాప్తింబొందక వగవక**
**ప్రాప్తంబైనదియ తనకు బదివేలనుచున్**
**దృప్తింజెందని మనుజుడు**
**సప్తద్వీపములనైన జక్కంబడునే?**

భార్యా పుత్రులయందు, ధనమునందు గల మూడు కోరికలను ఈషణ త్రయం అంటారు. వీటిని అతిక్రమించినచో విపరీత ఫలితాలుంటాయి. కాబట్టి ఈ చెడుకోరికలకు మూలకారణమేదో తెలుసుకొని చక్కబరచుకోవాలి.

వాంఛించేది మనస్సు, అది బుద్ధికి లోబడి ఉండాలి. మనస్సు బుద్ధికి లోబడకుండ అతిక్రమిస్తే విపరీత ఫలితము చేకూరుతుంది. కాన మనస్సు బుద్ధి వశం చేసి, బుద్ధిని నిర్మలంగా ఉంచుకోవాలి. బుద్ధి నిర్మలంగా ఉండాలంటే సజ్జన సాంగత్యం అవసరం.

**చ॥ "వలసినయప్పుడే యవయవంబుల బైటికి వీడు నిష్టముం**
**గలుగనివేళ ముద్చుకొను కచ్ఛపముం వలె నింద్రియంబులన్**
**దలచిన యంత వీడుచు బదంపడిలోగొనివాని తృప్తికై**
**చలితుడు గాక యుండు గుణశాలియె ధన్యుడు భూతలంబునన్"**

ధర్మార్థ కామ మోక్షములని పురుషార్థాలు నాలుగు. మానవ జన్మ మెత్తిన ప్రతివాడు కోరదగినవి కాన వీటికి పురుషార్థములని పేరు. ధర్మ మార్గంలో ప్రవర్తించని వారు మానవులు గారు. అర్థం లేకుంటే ఏ పనియు సాగదు. కోరికలే లేని ప్రాణియే లేదు. పుట్టిన ప్రాణి గిట్టుట సత్యం. జన్మించుటేల? చచ్చుటేల? చచ్చిన తర్వాత ఎచ్చటకు పోతారు? మరలా ఎలా జన్మిస్తారు. జన్మించి ఏమి చేయాలి? ఇట్లు చావు పుట్టుక లెందులకు? వీనికి అంతం లేదా? ఈ జనన మరణ ప్రవాహం నుండి తప్పించుకొని గట్టెక్కేదెట్లు? అని విచారణ చేసి, పొందే ఫలమే మోక్షం. ఈ నాలుగు లేనిచో జన్మం పౌరుషవంతం కానేరదు గదా?

**ఉ॥ ధర్మమనంగ న్యాయమగు దద్గుణముం దగబూని కూర్చుచున్**
**ధర్మయుతార్థ సంతతిని, ధర్మము నర్థము యొక్క ముఖ్యమౌ**
**మర్మమెఱుంగు కామమును, మానుగమూడు లభించు నంతటన్**
**నిర్మలబుద్ధి మోక్షము గణింపదలంచెడు వాడు ధన్యుడౌ**

ఎట్టివాడైనా సజ్జన సాంగత్యం చేతను, సత్కర్మాచరణవల్ల, తనకు గల కోరికలను నెరవేర్చుకోవచ్చును. దుర్వాంఛలను వదల్చుకోవచ్చును.

విధాతృ పుత్రుడైన స్వాయంభువునకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడనే ఇరువురు కుమారులున్నారు. అందుత్తానపాదునకు సునీతి, సురుచి అనే ఇరువురు సతులు. సునీతికి ధ్రువుడనే కుమారుడు, సురుచికి ఉత్తముడనే కొడుకు జన్మించారు. ఉత్తానపాదుడు సురుచి యందు మిక్కిలి అనురాగుడై సునీతిని నిరాదరించెను.

ఒకనాడు ధ్రువోత్తములు కలసి క్రీడించుచుండిరి. ఉత్తానపాదుడు సురుచితో సరససల్లాపము లాడుచుండెను. ఉత్తముడు కడు ప్రేమతో ఆ రాజు తొడపైకెక్కెను. బాలకులకు అనుకరణ గుణం అధికం కదా! ధ్రువుడు కూడా వేరొక ఊరువుపై కూర్చోవాలని కోరికతో రాజు చెంతకు చేరెను. సపత్నీమత్సరంతో సురుచి ధ్రువుని తండ్రి చెంత చేరనీయక మెడబెట్టి అవలికి నెట్టివేసి – "ఓరి దౌర్భాగ్యుడా! నీవంతకు దగుదువే?

గీ॥ "తండ్రి తొడ నెక్కువేడుక దగిలెనేని
పూని నాగర్భమున నాడు పుట్టకన్య
గర్భమున బుట్టి కోరిన గలదె నేడు
జనకుతొడ నెక్కు భాగ్యంబు సవతికొడుకు"

అని గద్దించి ఇంకా ఇట్లన్నది. "పొమ్ము. ఇప్పుడైనా గొప్ప తపస్సు చేసి హరిని ప్రసన్నుని చేసుకొని నా కడుపున పుట్టేటట్టుల వరంబు కోరుము. వేరొకరీతిగ జనకుని అంకతలమున కూర్చుండే అదృష్టంబు నీకులేదు" అని అసహ్యపు పలుకులు పలికింది. ఆ పలుకులు ములుకులై ఆ పిల్లవాని హృదయములో బాధింపగా, ఏడ్చుచు, నిట్టూర్పుతో తల్లి దగ్గరకు వెళ్ళి, జరిగిన అవమానం చెప్పుకోలేక ఏడ్చుచు నిలబడ్డాడు. అంతకుముందే అంతఃపుర కాంతలు సెప్పగా విన్న ఆ జనని కొడుకును తన ఒడిలోకి తీసుకొని, తాను కూడా కన్నీరు కారుస్తూ, తనపై ఈర్ష్యతో సవతి యాడిన పోటు మాటలకు, భర్త అంగీకారానికి, మనస్సులో కుమిలి కుమిలి పుత్రుని ఓదార్చుతూ – "నాయనా! దుఃఖింపకుము. పురాకృత పాప ఫలంబు ఎవరికైనా అనుభవింపక తీరదు. నీ సవతి తల్లి కారణంగా నీ తండ్రిచేత నేను భార్యగా కాకుండా దాసిగా చూడబడుచున్నాను. నీ పినతల్లి అన్నట్లుగా నీకు ఆర్తశరణ్యుడే శరణ్యుడు. అతనికంటె నీ దుఃఖాన్ని ఉపశమించువారు

లేరు. అతని దయ వడయుము" అని తల్లి చెప్పగా ఆ మాటలు విన్నవాడై, అచలమనస్కుడై, పరమార్థ ప్రాప్తి కొరకై పట్టణాన్ని వదలి అరణ్యానికి వెళ్ళినాడు. భక్తిబోధ విశారదుండైన నారదుడు దివ్యదృష్టితో ధ్రువుని చిత్తాన్ని తెలుసుకొని, ఆ బాలుని చెంతకు వచ్చి ఆ బాలుని శిరస్సును తన కరముతో నిమిరి ఇట్లన్నాడు –

నార :– కుమారా! బాలుకుడవు ఒంటరిగా ఎక్కడకు వెళ్ళుచున్నావు?

ధ్రువు :– సపత్నీ మాతృ వాగిషు క్షతంబగు మనస్సును భగవద్ధ్యాన యోగరసాయనంతో మాపికొనుటకు.

నార :– ఆటలాడుకొనే వయస్సులో నీకు మానావమానాలు ఎక్కడివి? రమ్ము నావెంట. నీ తల్లిదండ్రులను మందలించి నిన్నట విడిపించెదను.

ధ్రువు :– ముందు పెట్టిన అడుగు వెనుక పెట్టుట క్షత్రియ పుత్రుడైన నాకు పాడిగాదు.

నార :– వివేకులు సైతం సంప్రాప్త సుఖదు:ఖాలను దైవేచ్ఛగా తలచి, నిశ్చలవచిత్తులై అనుభవిస్తారు. ఐదేండ్ల కుఱ్ఱవు! నీకేల యింత పట్టుదల?

ధ్రువు :– పరభయంకరమైన క్షాత్ర ధర్మంబు నొందిన అవినీతుడను. నేను సురుచి మాటల ములుకుల చేత అవమానింపబడిన వాడనుగాన నా చిత్తానికి శాంతి లేదు. త్రిభువనాలలో శ్రేష్ఠమైన పదవిని కోరుచున్నాను. దయగల దేని సాధుమార్గం తెలుపుము.

నార :– వత్సా! తపస్సు కష్టసాధ్యం. భగవంతుడు దుస్సాధ్యుడు. యోగీంద్రులు సర్వసంగ పరిత్యాగులై యోగసమాధిలో నున్నను, జలజనాభుని తెలియలేకున్నారు. నీ నిష్ఫల ప్రయత్నాన్ని మాని, నా వెంటరమ్ము. నీ జనకుని చెంతకు పోవుదము.

ధ్రువు :– మహాత్మా! భగవంతుడైన అజుని ఊరువున జన్మించి, వీణావాదన కుశలుండవై, శ్రీహరిని మెప్పించి, జగత్ హితార్థమై త్రిలోకాలలో సంచరిస్తారు. మీకు అసాధ్యమేమియు లేదు. బాలుని, దీనుని కరుణించి తపమననేమి? తపోమార్గ మెద్దియో తెల్పండి.

నార :– వత్సా! నీ దృఢచిత్తానికి సంతసించాను. తపోమార్గాన్ని తెలియ చేస్తాను విను. పంచ మలములను పోదోలి, ఈషణత్రయాన్ని అరికట్టి, చాంచల్యదోషాలను హరించి, స్థిరచిత్తంతో, లోలో భగవంతుని గూర్చి ఆలోచించుటయే తపస్సు అనబడుతుంది. ఆలోచనలకు చంచలమైన చిత్తము ప్రత్యర్థి. కావున స్థిరచిత్త సంపాదనకై ప్రాణాయామాది నియమాలను పాటించాలి. నీవు యమునా తీరంలోని మధువనానికి వెళ్ళి, ఉచితప్రదేశంలో సుఖాసనాసీనుడై భక్తవత్సలుని భజింపుము. సిద్ధి బొందెదవు.

**చ॥ "మనమున నింద్రియంబులును మానుగగట్టి, మనంబుజిత్తమం**
**దునదగనుంచి, చిత్తమును దోదన బుద్ధినిజొన్పి, బుద్ధినా**
**త్మను గనుగొంటకై నిలిపి, తన్ను సమస్తమునన్, సమస్తమున్**
**గని తనయందు, సంతసముగాంచెడు నాతడు ధన్యుడౌ మహిన్"**

అని చెప్పి, ద్వాదశాక్షరీ మంత్రాన్ని ఉపదేశించి, ధ్రువుని వీడ్కొలిపి, ఉత్తానపాదుని దగ్గరకెళ్ళి పుత్ర ప్రేమచే పశ్చాత్తాపుడైన ఆ నరపాలునితో –

**క॥ "నీ కీర్తియు జగములయం**
**దాకల్పము నొందజేయు నంచితగుణ ర**
**త్నాకరుడిట కేతెంచును**
**శోకింపకు మతని గూర్చి సుభగ చరిత్రా!"**

అని ధైర్య వాక్కులు వ్రాక్కచ్చి యథేచ్ఛగా వెళ్ళినాడు.

నారదుడు చెప్పినట్లుగా ధ్రువుడు మధువనానికి వెళ్ళి యమునా నదిలో మునిగి శుచియై, ఉచితప్రదేశంలో, దర్భాసనంపై కూర్చుండి ఏకాగ్ర చిత్తుడై, మూడు రాత్రుల కొకసారి మాత్రం బదరీఫలాన్ని తింటూ ఒక్క నెల రోజు హరిని పూజించినాడు. అటు తర్వాత ఆరేసి దినాలు కొకసారి గడ్డిని మాత్రం ఆహారంగా తపస్సు సాగించినాడు. అటునుండి తొమ్మిది రోజుల కొకసారి నీటిని మాత్రం భక్షించుచు, ఆపై పంద్రెండు రోజుల కొకమారు వాయుభక్షణం చేయుచు, అటు తర్వాత జితశ్వాసుడై ఏకపాదముపై నిలిచి, చలనం లేని స్థాణువువలె పుండరీకాక్షుని భజించుచున్నాడు. ధ్రువుని తపోనలము తాకిడికి దేవతలు శ్రీపతికి విన్నవించినారు. శ్రీమహావిష్ణువు వారిని భయపడకుడని పల్కి గరుడవాహనారూఢుడై ధ్రువునికి తపస్సుకు మెచ్చి సాక్షాత్కరించినాడు.

లోపల కనిపించే దివ్యస్వరూపము వెలుపలను కనిపించుటచేత, తపస్సు చాలించి పులకిత శరీరుడై, ఆనందాశ్రుధారలతో, ముకుళితహస్తుడై శ్రీహరిని మృదమధుర వాక్కులచే నుతించాలని ప్రయత్నించి, స్తుతిక్రియాకరణ సమర్థుడు కానందున ఊరకుండెను. బాలకుని మనోభీష్టము నెరిగి తన శంఖమును ఆ బాలకుని మస్తకముపై పెట్టగా ధ్రువుడు సర్వ విద్యా పారంగతుడైనాడు. వేదవిదుని వేయి విధాలుగా ముద్దులొలుకు పలుకులతో నుతించాడు. ఆ కరుణామయుడు సంతసించి ధ్రువుని గాంచి "వత్సా! నీ దృఢచిత్తానికి, నీ వృత్తానికి మిక్కిలి ఆనందించాను. వరములడుగు – మిచ్చెద" అన్నాడు. ధ్రువుడు సంతోషంతో ఇట్లన్నాడు.

**గీ॥ తండ్రి తొడయెక్కు కోర్కిచే దపమొనర్చి**
**దేవదుర్లభు నిన్ను బొందితిని, గాజు**
**ఖాతికై వెదకగ దివ్యరత్నమబ్బె!**
**స్వామి! నేగృతార్థుడనైతి, వరమికేల?**

అనగా నారాయణుడు చిరునవ్వుతో ఆ బాలకుని గాంచి – "కుమారకా! నీ యుల్లము నాకు తెల్లంబ. నీవడుగ నక్కరలేకయే యేనొసగెద. నీవింటికి బొమ్ము. నీ పినతల్లియు, తండ్రియు నిన్ను గారవింతురు. భవదీయ జనకుడు వనవాస గతుండైన పిదప ఇరువదియారు వేలేండ్లు రాజ్యపాలన పూజ్యంబుగా పాలించి, జితేంద్రియుండవై తదుపరి, గ్రహనక్షత్ర తారాగణ జ్యోతి శ్చక్రంబును, నక్షత్ర రూపంబులైన ధర్మాగ్ని కశ్యప శక్రులును సప్తర్షులును తారకా సమేతులై ప్రదక్షించునట్టి, లోకత్రయ ప్రళయ కాలంబునందును నస్వరంబుగాక ప్రకాశమానంబైన ధ్రువ క్షితయను పదంబు ప్రాప్తింతువు" అని అతని అభిలషితార్థంబు అర్థినిచ్చి పరమపురుషుడు అంతర్ధానమయ్యెను.

ధ్రువుడట నుండి తిరిగి స్వపురమును జేరి జననీజనకులకు ప్రీతిపాత్రుడై పెక్కేండ్లు పాలించి, సప్తర్షిమండలోన్నతమైన ధ్రువం పదవిని అధిష్ఠించెను.

ధ్రువునకు మొదటి నుండిన కోరికలెట్టివి? నారదుని ఉపదేశం తర్వాత, భగవత్ సన్నిధానంలో ఎట్టు పరిణతి చెందినవో గమనించితిరా?

# 74. క్రూరకర్ముడు బాగుపడడు

మనిషి చేసే సర్వకార్యాలు, పుణ్యకార్యాలు, పాపకార్యాలని రెండు రకాలు. తనకు సమ్మతములై, పరులకు అసమ్మతములైనట్టివి, పరహింసను కలిగించేవి పాపకార్యాలు. సర్వజన సమ్మతమైనట్టివి, నిఖిల జనామోదాయక మైనట్టివి పుణ్యకార్యాలుగా చెప్పబడ్డాయి.

శ్లో॥ శ్రూయాతాం ధర్మసర్వస్వం, యదుక్తం శాస్త్రకోటిభిః
పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్ ॥

శ్లో॥ అష్టాదశ పురాణేషు వ్యాసస్యవచన ద్వయమ్
పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్ ॥

సర్వ శాస్త్ర సారాంశమిదియే. పరులకు ఉపకారం చేయడం పుణ్యం కొరకు, పరులను పీడించడం పాప హేతువు.

క॥ ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియముదన మనంబునకగు దా
నొరులకు నవిసేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్

తన దేహాన్ని బోలినట్టివే గదా! అందరి దేహాలు. తన్నొకరు గిచ్చితే నొప్పి కలుగుతుందని తెలిసి, మరొకరిని గిచ్చుట భావ్యమా? తన్నితరులు తూలనాడిన ఎట్లుండునో, మన మొకరిని తూలనాడినా అట్లే యుంటుందని భావించి, మనుజుడు క్రూరకర్మలను త్రికరణశుద్ధిగా మానుకోవాలి.

పూర్వం మగధదేశంలో బృహద్రధుడనే రాజు నీతి మార్గంలో రాజ్యాన్ని ఏలుచుండెను. అతనికి ఇద్దరు భార్యలు, అయినా సంతానం లేదు. సుతులు లేని సంపదలేల? అని నిర్వేదనతో అతడు పత్నీద్వయ సమేతుడై అరణ్యానికి వెళ్ళినారు. అక్కడ నిరంతర నిష్ఠతో, తపస్సు చేసున్న చండకౌశికుడనే మునిని చూచి, ఉజ్జ్వల తేజుడైన ఆ మునిపుంగవునికి నిరంతర సపర్యలు చేస్తూ భక్తితో కొంతకాలం కొలవసాగినారు. ఒకనాడు ఆ ముని తపస్సు చేస్తున్న

మామిడి చెట్టుపై నుండి గాలికి ఒక మామిడి పండు ఆ ముని ఒడిలో పడింది. అతడది గ్రహించి బృదద్రధునికిచ్చి, ఈ ఫలం వల్ల నీకొక్క పుత్రుడు జన్మింతుగాత! యని పల్కినాడు. ఆ రాజు కృతార్థుడనైతినని, తిరిగి పట్టణానికి వచ్చి ఇద్దరు భార్యలకు సమానంగా విభాగించి ఆ చూత ఫలాన్ని ఇచ్చాడు. ఆ ఫలం యొక్క ప్రభావం చేత ఇద్దరు కూడా గర్భవతులైనారు. అంత పదవ మాసంలో ఒక రాత్రి వార్లకు –

క॥ "ఒక్కొక్క కన్నును జెవియును
జెక్కును జనుబొద్దు మూపు జెలువగు చేయున్
బ్రక్కయు బిఱుదును గాలును
నక్కజముగ మనుజ శకలమై యుదయించెన్"

ఆ ముక్కలైన మనిషి శరీర భాగాలను చూచి వారు ఖిన్నులై, దాదుల చేతికిచ్చి, ఎవ్వరికీ తెలియకుండ వెలుపల పారవేసి రండని పంపినారు. ఆ దాదులు ఆ మాని వ్రయ్యలను తీసుకొని పోయి రాజగృహ ద్వార సమీపానగల శృంగాటకము వద్ద పారవైచినారు. అచ్చటనున్న జర అనే ఒక రక్కసి, ఆహారం దొరికిందని ఆ ముక్కలను గ్రహించి వాటిని సంధించి ఒకచోట కూడబెట్టింది. తక్షణం ఆ తునకలొక్కటియై రోదింపసాగింది.

ఆ రోదన ధ్వని విన్న అంతఃపురములోని వారంతా మేల్కొని, వచ్చి ఆ బాలకుని చూశారు. జర మానవ స్త్రీ రూపాన్ని ధరించి, ఆ బాలకుని నిజ వృత్తాంతాన్ని తెల్పి, బృహద్రధునకు అప్పగించింది. అతడు కృతజ్ఞతతో, వజ్రఘన ఘటిత శరీరుండైన అక్కుమారుని ఎత్తుకొని జరను గారవించి, జరచే సంధింపబడినవాడు కావున జరాసంధుడని పేరు పెట్టి అతి ప్రేమతో పెంచసాగిరి.

జరాసంధుడు దినదిన ప్రవర్థమానుడై యుక్తవయోధికుండు కాగా, తండ్రి అతనికి పట్టము గట్టి తపోవనానికి వెళ్ళినాడు. తదనంతరం జరాసంధుడు తన వక్ర పరాక్రంచేత అనేకమంది రాజులను జయించి వారి నుండి కప్పములు గొని, మహావైభవంతో ఉండెను. బలగర్వితుడైన ఆ జరాసంధుడు భూమి మీద గల రాజులను భయపెట్టి బంధించి తెచ్చి, చెరలో పెట్టించి, ఒక్కొక్కనిగా వధించి భైరవ పూజ చేసేవాడు. అతని క్రూర

కృత్యానికి రాజలోకము అదలిపోయింది. అగ్నికి మట్టి తైలము తోడైనట్లుగా, జరాసంధుని ఘోర కార్యాలకు శిశుపాలుడు, భగదత్తుడు, పౌండ్రక వాసుదేవుడు బాసటగా నిలిచినారు. ఇక వాని అకృత్యాలకు ఎదురులేక పోయినవి. ప్రజలు, రాజులు ఒక్కటిగా మొరపెట్టుచు శ్రీకృష్ణ భగవానునికి తమ ఇక్కట్లను విన్నవించుకున్నారు.

ఆ సమయంలో శ్రీకృష్ణమూర్తి పాండవులచే ఆహూతుడై రాజసూయ యజ్ఞానికి విజయము చేసి యున్నాడు. జరాసంధుడు చచ్చినగాని యజ్ఞము సాకల్యంగ జరగదని కృష్ణుడు ధర్మరాజును హెచ్చరించి, వాని దుశ్చర్యలన్నీ వివరించి, భీమార్జునుల నాకైవసం చేసినచో వాని పరిమార్చుటెంత పని? అని నొక్కి వక్కాణించెను. ధర్మరాజు అందులకంగీకరించి, "కృష్ణా! మహాధ్వర క్రియాసిద్ధియే కాకుండా, కారాగారంలో నున్న సకల రాజులకు బంధ విముక్తి కలిగించే ఈ కార్యానికి వెనుదీయము మరియు మీ ఆశ్రయమున్న మాకు శత్రుజయంబు ఒక లెక్కయా! ఇప్పుడే వెళ్ళి విజయసిద్ధింబడసిరండు" అని భీమార్జునులను అతని కప్పగించినాడు.

శ్రీకృష్ణ, భీమార్జునులు స్నాతక వేషధారులై వీరశ్రీ విభాసితముఖులై, వీరయాత్రకు వెడలి పర్వతాలు, నదులు, పట్టణాలు దాటి గిరివ్రజపురాన్ని సమీపించి, చైత్రకాద్రినెక్కి, శతృభేద్యంబైన అప్పురిని విలోకించినారు. కృష్ణుడు భీమ పార్థులను గాంచి ఆ పుర వృత్తాంతాన్ని చెప్పదొడంగినాడు. "గోరథము, ఋషభము, వైహారము, ఋషిగిరి, చైత్యకాద్రి అనే ప్రముఖ కొండలు ఈ నగరాన్ని చుట్టి రక్షణగా నుండుటచే ఈ పట్టణానికి గిరవ్రజమనే పేరు వచ్చింది. మరియు నీ మూడు భేరులను చూడండి. తొల్లింటి మాగధులు మానుషాదంబను ఋషభాన్ని వధించి దాని చర్మం చేత వీటిని నిర్మించినారు. ఇవి అప్పురానికి వింత వారెవ్వరేని ప్రవేశించగానే తమంతతాము మ్రోగు" అన్నాడు.

అంత ఆ ముప్వురు భుజదండంబులతో ఆ మూడు భేరులను పగులగొట్టి, నగరంలోనికి ప్రవేశించి, బలాత్కారంగా మాలాకారుల గృహానికి వెళ్ళి, మాల్యాలంకృత మౌళులై, గంధకర గృహానికి వెళ్ళి, చందన, అగరు రజోభూషిత వక్షులై, విప్రులకు సుప్రవేశమైనట్టి జరాసంధుని మందిర ద్వారాన్ని

ప్రవేశించారు. జరాసంధుడు ఎదురేగి మధుపర్కంబు లీయగా వారు చేకొనరైరి. వారి అభిప్రాయాన్ని గ్రహించి ఇట్లన్నాడు. "మీరు చందన మాల్యాలంకార శోభితులగుటం జేసి స్నాతకులు గారని తోచెడి. మరియు మీరలు చైత్యకాద్రి తటాన గల భేరులు వ్రచ్చి, తద్ద్వారంబున సొచ్చితిరి. మీ వేషంబుల బ్రాహ్మణత్వంబును, మహాసత్త్వ దీర్ఘబాహు పృథుల వక్షో లక్షణముల క్షత్రియత్వంబు ప్రకాశించున్నయవి. మీరెవ్వరు? ఎందుల కేతెంచితిరి? వివరింపు"డన్నాడు. కృష్ణుడు ఈ విధంగా ఉత్తరమిచ్చాడు.

కృష్ణ :– మేము క్షత్రియ స్నాతకులము. మిత్రుని ఇంటికి ద్వారమార్గాన, అమిత్రుని ఇంటికి అద్వారమున ప్రవేశించుట బాహుబల సంపన్నులైన క్షత్రియులకు కర్తవ్యం. గంధమాల్యంబుల లక్ష్మియుండును గాన బలాత్కరంబున గొంటిమి.

జరా :– అపరిచితులైన వారు పరస్పరం అహిత మాచరింపరు గదా! మీకు అమిత్రుండ నెట్లయితిని?

కృష్ణ :– అకారణంగ సాధు హింస చేసే కుజనుడు ఎల్లవారికి అప్రియుడే గదా! నిర్దయగా, నిర్దోషులైన సవర్ణుల వధియించుట కంటే మిక్కిలి పాపం గలదా! నీయట్టి పాపకర్ము నుపేక్షించిన, ధర్మరక్షకులమైన మాకు ఆ పాపము కల్గుతుంది. ఇట్లదారుణ భైరవపూజ చేసిన సద్గతియేని, సత్కీర్తియేని గలదా?

జరా :– పండితమన్యులై, నన్నిట్లాక్షేపింప వచ్చి మీరలెవ్వరు?

కృష్ణ :– నేను కృష్ణుండ. వీరు, వాయు, దేవేంద్ర తనయులు. పాండవులు. నామాట విన్నచో నీకు మేలు కలుగుతుంది. బంధితులైన రాజులందరినీ విడువుము. విడువకున్నచో సమరంలో నీ గర్వమణచి రాజులందరిని విడిపించుట తథ్యము.

జరా :– దేవార్థముగా దెచ్చిన రాజులను మీ ఆటోపానికి భయపడి వదలుదునా? రండు భండనమునకు, మీ కండక్రొవ్వు అణగింతును.

కృష్ణ :– ఒక్కనితో పలువురు యుద్ధం చేయు ధర్మంకాదు. మాలో నొక్కని గోరుకొమ్ము, అతడు నీతో మల్లయుద్ధం చేయగలడు.

జరా :- పదమూడు పర్యాయాలు దండెత్తి వచ్చి, నిలువలేక పారిపోయిన పిరికిపందవు నీవు. ఇక అర్జునుడు పిన్నవాడు. ఈ భీముడే నాకు దగినవాడు. వీనితో మల్లయుద్ధ మొనర్చెదను.

అంతట భీమ, జరాసంధు లిద్దరు సన్నద్ధులై ఒండొరుల ప్రతిఘటించి నిలిచినారు.

కు॥ "కర్షిత రిపులన్యోన్యా
కర్షణ సంకర్షణాప కర్షణముల సా
మర్షులయి పెనగిరాహవ
హర్షంబున చవనసుత బృహద్రధపుత్రుల్"

ఇట్లు కార్తిక మాసం ప్రధమ దినాన ప్రారంభించిన యుద్ధం, ఒండొరులు మహాయుద్ధము చేస్తూ పదుమూడు రోజులు వదలక, మల్లయుద్ధ కౌశల మేర్పడ పెనగుచు పోరాడినారు. చతుర్థశి నాటి రాత్రి జరాసంధుడు విశ్రాంతి నొందుట చూచిన శ్రీకృష్ణుడు - "విరోధి విరహిత సత్త్వుడయ్యె. నిరపరాధులైన రాజుల వధించిన వీనిని వధించి, నీ తండ్రి బలంబును, నీ బలంబును జగము లెరుగు మాకానంద మాపాదింపు"మని ప్రబోధించాడు. అంతేగాక భీముడు చూచునట్లుగా ఒక్క శాఖాగ్రమును రెండుగా చీల్చి విరోధిని ఇలా చీల్చి చంపమని సంజ్ఞ చేసినాడు. భీముడు కూడా ఆ కీలు తెలిసి, విజృంభించి, జరాసంధుని పడద్రోసి, ఒక్క పాదముతో అతని పాదాన్ని త్రొక్కి పట్టుకొని, రెండు చేతులతో రెండవ పాదాన్ని కదలక పట్టుకొని, తలదాకా పెళపెళ చప్పుళ్ళు రాగా తాటిచెట్టును చీరిన విధంగా రెండు ముక్కలుగా చీల్చి పారవైచినాడు. పౌరులు హాహాకారములు చేశారు. భీముని కృష్ణార్జునులు కౌగిలించుకొని కొనియాడినారు. జరాసంధుని పీడ విరగడైంది.

తరువాత శ్రీకృష్ణుడు దయామయుడు కాబట్టి జరాసంధుని సుతుడైన సహదేవునకు మగధ రాజ్యము పట్టము గట్టి, చెరశాలలో మ్రగ్గుచున్న రాజుల నందరిని విడిపించాడు. అటు తర్వాత కొన్ని దినాలకు ఇంద్రప్రస్థ పురాన్ని చేరి జరాసంధుని మరణవార్త ధర్మరాజునకు తెలియజేసి, అతని మన్ననలు, దీవెనలు పొందినారు. క్రూరకర్ముడు బాగుపడడని జరాసంధుని కథ ద్వారా వ్యక్తమైంది.

# 75. పెద్దలను తిరస్కరించరాదు

ఎట్టివారినైనా తిరస్కరించి మాట్లాడరాదు. దానివల్ల మాత్సర్యం పెరుగుతుంది. మాత్సర్యం వల్ల అనేక అనర్థాలు కలుగుతాయి.

ఉ॥ "మచ్చరమున్నచో మదిని మానగమందును లేని రోగమున్
గుచ్చితబుద్ధి, దాన సభకుం గొఱగామియు దూష్యబుద్ధి పె
ద్ర చ్చలిహంబునందున బరమ్మున సౌఖ్యము సున్నయంచు నీ
మచ్చరముం దృజింపగల మానిసి ధన్యుడు భూతలంబునన్"

పెద్దల తిరస్కరించడం వల్ల భవిష్యత్తు అభివృద్ధికి భంగం కల్గుతుంది. బాగుపడదలచిన వాడు మొదటి నుండి ఈ గుణాన్ని మానుకావాలి. పరదోషాలను అన్వేషించడమే తిరస్కృతికి మూలకందము. చెడు మార్గంలో సంచరించేవారి సాహచర్యం వల్ల, వారి గుణసంపర్కం చేతను, దోషాన్వేషణ మతి వృద్ధి చెందుతుంది. దుష్ట సాంగత్యం గల వారికి ఏదీ పట్టువడదు. ప్రయత్నం దేనికి అవసరం? తిరస్కృతి ఎందు అవసరం? అనే ప్రశ్నలకు శంకరాచార్యులు చెప్పిన సమాధానం –

గీ॥ అదకువయు యత్నమును నెందు నదరవలయు?
దానమందౌషధమున, విద్యగఱచునెడ;
నెట్టి కార్యంబుల దిరస్కృతి వలయును?
పరధనాంగనాది భ్రాంతి బాపిమైత్రి;

చేది భూపతియైన తమఘోషుండనే వానికి సాత్వతి యను భార్య యందు (వసుదేవుని చెల్లెలు) శిశుపాలుడనే కుమారుడు జన్మించాడు. అతడు పుట్టగానే చతుర్భుజాలతో, లలాట నేత్రంతో జన్మించి, రాక్షస స్వరంతో గట్టిగా ఏడ్చు చుండుటను గాంచి, పితరులు భయ, విస్మయాధీన మనస్కులైనారు. వారలకు ఆ సమయంలో అశరీరవాణి యిట్లు వచించింది. "ఇబ్బాలకు నెవ్వరెత్తి కొనుడు బాహు చక్షువులడంగు వానిచే వీడు ద్రుంగు".

ఆ మాటలు విని వారు ఆశ్చర్యపడి, కుమారుని చూడడానికి వచ్చిన వారికంతా ఎత్తుకోమని యిచ్చేవారు. మేనత్తకు అతి వికృతి స్వరూపుడైన

కుమారుడు జన్మించినాడని విన్న బలరామ కృష్ణులు చూడడానికి వచ్చారు. యథాలాపంగా తల్లిదండ్రులు ఆ పుత్రకుని తొలుత బలరామునికిచ్చి, తర్వాత దామోదరు చేతికిచ్చారు. ఆశ్చర్యంగా -

**క॥ "అక్కొడుకు నబ్జ నాభుం**
**డక్కజముగ నెత్తికొనుడు నందఱు జూడన్**
**గ్రక్కున నొక్కట నడిగెను**
**మిక్కిలి చేతులును, వాని మిక్కిలి కన్నుల్"**

శ్రీకృష్ణుడు ఎత్తుకోగానే ఎక్కువైన చేతులు, కన్ను మాయమైంది. ఆ విచిత్రాన్ని చూచిన సాత్వతి అశరీర వాక్కు ప్రకారం కుమారునికి మురవైరి వలన మరణమని తెలిసి, జనార్ధనునితో ఇట్లన్నది.

**క॥ "కుపథ ప్రవృత్తుడయి వీ**
**డప నయమున నీ కనిష్ఠుడయినను గరుణా**
**నిపుణుడవై నీమఱదికి**
**నపరాధ శతంబు సైపుమయ్య ముకుందా!"**

అని అర్థించింది. నూరు తప్పులు మన్నించడానికి శ్రీకృష్ణుడు అంగీకరించాడు. కొన్ని దినాలు చేదిపురిలో నుండి బలరామ కృష్ణులు తిరిగి నిజపురికి ప్రయాణమైనారు. శిశుపాలుడు బాల్యము నుండి కంస, కాలయవన, జరాసంధ, దంతవక్ర, సాళ్వరాజుల సహవాసంలో అహంకరించి ఎల్లవేళలా శ్రీకృష్ణుని ద్వేషింపసాగాడు. తల్లి హృషికేశునిపై ద్వేషం వలదని, ఎన్ని విధాలా ఒప్పచెప్పినా వినేవాడుకాదు. ఇట్లుండగా శిశుపాలుడు ప్రేమించిన రుక్మిణిని శ్రీకృష్ణుడు రాక్షస వివాహ మాడుటచేత వారి విరోధం మరింత ప్రబలమయింది. చైద్యుడు కృష్ణుని కార్యాలన్నింటికి అడ్డుపడుతూ, తిరస్కరిస్తూ, ఎగతాళిచేయుచూ, కాలం గడిపేవాడు. శ్రీకృష్ణుడు మేనత్త కిచ్చిన మాట మీరకుండా వారి అపరాధాలను క్షమిస్తుండేవాడు.

జరాసంధుని వధానంతరం ధర్మరాజు చేస్తున్న రాజసూయ యాగానికి రాజులంతా ఆహ్వానింపబడ్డారు. యజ్ఞం నిరభ్యంతరంగా సమాప్తి అయింది. అప్పుడు ధర్మరాజు కురువృద్ధులైన భీష్ముని అగ్రపూజార్హులెవ్వరో సెలవిండని

కోరినాడు. భీష్ముడు - "యజ్ఞపురుషు నచ్యుతు నఖిలలోక పూజ్యు బూజింపుమదియ యజ్ఞఫలం"బన్నాడు. ధర్మరాజు అర్ఘ్యానికి అర్ఘ్యుండైన వాసుదేవునకు శాస్త్రోకంగా ఇచ్చుటను సహించని శిశుపాలుడు దాన్ని ఆపేక్షిస్తూ ఇట్లన్నాడు.

"విశిష్టాచార భాసురులయిన భూసురులు నకుంఠిత విక్రములైన రాజకంఠీరవులు ననేకులుండ, గాంగేయు దుర్వ్యవసాయంబునం జేసి కష్టచరితు, నికృష్టు, కృష్ణు బూహింపదగునే? వీనిని వృద్ధని యెంచితిరేని వసుదేవాదులు లేరా? ఆచార్యుడంటిరేని కృప ద్రోణాదులు గల్గరే? ఋత్విజుడందురేని కృష్ణద్వైపాయనుడు లేదా? రాజని వచింతురేని అవనిలో యాదవులు రాజులగుదురే? పూజనీయులైన పురుషులలో వీడెవ్వడు? ధర్మజా! భీష్ముని యోగంబున బేలవయితివేల? నీ వెఱుగక యిచ్చినను దగుదుని యీ గోవిందుడు లజ్జావిహీనుండై కైకొననొప్పునే? క్లీబునకు కన్యాదానము సేయుట, బధిరునకు శ్రావ్యగీతా శ్రవణము సేయుట, యూషరక్షేత్రంలో బీజావాపంబు సేయుట, కృష్ణున కిట్లు విధి దృష్టవిశిష్ట పూజనంబు సేయుట భూవర ప్రవరులు లెల్ల నగంగ ధర్మరాజు పేరు నిరర్థకమగునట్లు వర్తిల్లితివి. ఇట్టి సదస్సున మాబోటి కుండం బోలునే?" - అని ఎగ్గులాడుతూ, పుత్రమిత్రులతో కలసి సభనుండి వెడలి పోయత్నించాడు.

ధర్మరాజు అతని వెనుకనే వెళ్ళి ప్రియ వచనాలతో అనునయిస్తూ - "అనుజా! భూరి గుణోన్నతులకు, ధీరులకు వాక్పారుష్యంబు మంచిదికాదు. అది విషము కంటె, దహనము కంటె దారుణమైనది. బ్రహ్మోత్పత్తికాస్పద మైనవాడు, వేదాది సమస్త వాఙ్మయములందు ప్రకాశితుడైన వాడు, త్రిలోక పూజ్యుడును నగు కృష్ణుని లోకగురునిగా భీష్ముడెరిగియే చెప్పె. అతని నతనికంటె నెఱిగి పలుక నీకరిది. ఇందు దోసమేమున్నది?" - అని శిశుపాలుని సముదాయిస్తు ధర్మరాజుతో భీష్ముడిట్లన్నాడు - "రాగ కోప పరిభూత హృదయునకు, నల్పరాజ్యరమాంధ బుద్ధికి, అనిమిత్త మహత్పరివాద శీలునకు, బాలునకు, శిశుపాలునకు ధర్మువెఱుగ బోలునే? వాని నేల పట్టు వఱుతువు?" అని చైత్యుని ఉద్దేశించి - "శిశుపాలా! అవినయ బుద్ధివై ఏరకాఱులు కూసెదవు.

కు॥ "వృద్ధులోక లక్షయున్నను
బుద్ధియె యెవ్వరికి, వారి బూజింపంగా
నిద్దరణీశులలో గుణ
వృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్"

"అమ్మహాత్ముని సంతుష్టుని చేస్తే భువనంబులన్నీ పరితృప్తి చెందు" – అనిన, ఆ శిశుపాలుడు "కులగోత్రహీనుని, మాయకాని, జారుని, చోరుని పరమేశ్వరునిగా బుద్ధి చలించిన ఈ వృద్ధుడు కొనియాడడం, ధర్మరాజు ఊకొట్టడం, కృష్ణుడు అందులకు అంగీకరించడం – ఆహా! ఎట్లున్నది? పురోడాశము సృగాలానికి తగునా? అన్యకాంత అంబను అపహరించి తెచ్చి అనపత్యత అను అధర్మం కలవాడైన భీష్ముడాడు పలుకులు ధర్మంబులాయెనా?" అని పరుషోక్తులతో, వాసుదేవుని, శాంతనుని తూలనాడు చుండగా –

చ॥ "ఎడపకయర్ఘ్య మచ్యుతునకిచ్చితి మిచ్చిన దీనికేమొదం
బడమని దుర్జనత్వమున బల్కెడు వీరుని మస్తకంబుపై
నిడి యెదనంచు దాజరణమెత్తె సభన్ సహదేవుడట్టిచో
నుడిగి సభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై"

భీమసేనుడు రౌద్రమూర్తియై శిశుపాలుని నిర్మూలింప సమకట్టినాడు. దుష్టుడై పెద్దల తిరస్కరించే నీచమైన పరుషవాక్కులతో ఎగ్గులాడే వారిని ఎవ్వరు మాత్రం సహించగలరు?

భావికాలజ్ఞుడైన భీష్ముడు భీమ, సహదేవుల కనుసంజ్ఞతో నివారించాడు. శిశుపాలుడు అంతటితో నుండక రాజలోకాన్ని వీక్షించి, "స్త్రీ గోవధంబు లొనరించిన తమ్మున లోకేశ్వరుండవైతివే? మఱదికి మాటయైన బోటిని దాటించుకొని పోవుటచే ఆచార శీలురలో మేటివైతివేమి?" అని శూలమ్ముల వంటి వాక్కులతో పొడచి – "రండు. మీరెల్లరేకమై రణంబున నాకెదురై కడంగుడు. మీ యోగ్యత లించుక చవిచూతుగాక" అని గర్వించి పలికిన చక్రధరుడు రాజులంతా వినేటట్లుగా ఇట్లన్నాడు. "తొల్లి మాయత్త సాత్వతి కిచ్చిన మాట ప్రకారము వీని యపరాధ శతంబు సహించితి. వీని

యపకృతులు హద్దు మీరినవి. ఇక వీని క్షమింపజాల" నని శిశుపాలుని వంక తిరిగి – "మరదీ! నీవే గొప్పవాడవు, రమ్మీ మర్యాద గైకొమ్ము" అని తన చరణముల దగ్గర ధర్మరాజు పెట్టిన పళ్ళెరాన్ని తీసుకొని విసరగా – అది చక్రాకారంగా తిరుగుతూ చక్రమై ఆ శిశుపాలుని శిరస్సును చేదించింది. అంతట ప్రశాంతంగా రాజసూయ మహాయజ్ఞం పరిసమాప్తమైంది. కాబట్టి పెద్దలతో ఎప్పుడు కూడా తిరస్కరించి మాట్లాడరాదు.



# 76. జీవకారుణ్యము

సర్వప్రాణుల యెడ సమబుద్ధి కలిగి ఏ జీవిని గాని హింసింప కూడదని సర్వ దర్మ శాస్త్రాలు ముక్త కంఠంతో వక్కాణించుచున్నవి. ఒకడు తన్ను హింసించిన తన కెంత సంతాపమో, సంకటమో తెలుసుకొని, పరుల కట్లేగదా! యని ఊహించి అహింసామార్గ ప్రవర్తకుడై ఉండాలి. "అహింసా పరమో ధర్మః" అనుట మనకు క్రొత్తకాదు గదా! భగవత్ప్రీతికరాలైన అష్టవిధ పుష్పాలలో "అహింసా ప్రధమ పుష్పం" అహింసయే మొదట పుష్పమని చెప్పబడింది.

మాండవ్యుడు బాల్య చాపల్యం చేత తూనీగల తోకలకు పుల్లలు గ్రుచ్చి అవి విలవిల తన్నుకుంటూ పోతుంటే చూచి, వినోదించడం వల్ల ఆ ఫలితాన్ని అనుభవించడానికే ఆ మునికి కొరత వేయబడిందని అహింసా విషయకమైన పురాణగాథ కలదు.

జీవహింస చేయక మానవులు జీవించలేరు.

**మ॥ "హాలికుండెంతయు నోజదున్నునెడ సీరాగ్రంబునం బొంది ప్రా**
**ణులనేకంబులు సచ్చు హింసయది యానోకాదో వేయేల మ**
**ర్త్యులు నేలం జరియించచో బదములంద్రొక్కంబడు బెక్కు జం**
**తులు హింసావిధి గాదనంగ వశమే దోషజ్ఞ! యూహింపుమా"**

వనములో వసించే మునులకైనా జీవహింస తప్పినది కాదు. కందమూల ఫల పర్ణశాకని పీడనం కూడా హింసయే గదా! ఇంతేల? పంచభూతాలు జంతుమయం కాబట్టి మనుజుని సకల కర్మలలో హింస దాగి వున్నది. హింసకు తొలగిన జీవయాత్ర దుర్లభమౌతుంది.

**తే॥గీ॥ "హింస చేయనివాడు లేడిజ్జగమున**
**నొక్కడైనను దమ తమ యోపినట్లు**
**హింస తెరువున కెడగల్గి యేగవలయు**
**నదియ చూవె యహింస నానతిశయిల్లు"**

దేవుడు ప్రపంచంలో ఒకదానికొకటి ఆహారంగా కల్పించి యున్నాడు. పెద్దచేపలు చిన్న చేపలను తినును. సింహం ఏనుగును, పెద్దపులులు జింకలను ఆహారంగా తీసుకుంటాయి. హరిణములు పచ్చిక మేస్తాయి. మనుష్యులు మాంసాహారాన్ని, శాకాహారాన్ని కూడా తింటారు. ఇట్లొకటి కొకటి ఆహారంగా ఏర్పడినవి. కాబట్టి సమస్త కృత్యాలలో హింస దాగి యున్నది.

భగవంతుని ఉద్దేశం ఇదియేనా? అని ఒక మనుజుని విషయం విచారిద్దాం.

మనుష్యేతర ప్రాణులకు ఆహారం మనుజులకు వలె గాకుండ అప్రయాసంగా లభిస్తుంది. పిపీలికా మూషికాదులు కొన్ని తప్ప, మరొక పూటకని దాచుకొనే గుణం లేదు. ఆ పిపీలికాదులకు సైతం ఆ గుణం మనుష్యులకు సన్నిహితంగా సంచరించుటచేత కలిగింది. పురుషోత్తముడు తొలుత మానవులకు కూడా సునాయాస సాధ్యంగా ఆహారమిచ్చి యుండెను. అనగా తమంత పండిరాలిన ఫలాలను, పరిపక్వ ధాన్యాలను, పచనం చేసే పనిలేకనే అట్లే తినదగిన వానిని మనుజులకు ఒసంగి యుండెను. కార్చిచ్చున కాలిన కందమూలాలను ఒకసారి తిన్న మానవుడు జిహ్వాచాపల్యం చేత రుచిమరగి, భోజ్య వస్తువులకు ఒకటి రెండు మేళవించి తినడం నేర్చుకొని ప్రస్తుత స్థితికి వచ్చినారు. పక్వము మేళనము లేని కాలంలో మనుజుని గుణము శుద్ధ సత్త్వమయమై ఉండెను. పక్వమేళన పరిణామంలో రాజ సాహారానికి అలవాటు పడ్డాడు. ఇది మనుజుని స్వయంకృతాపరాధమే.

దైవనిర్మిత ప్రసాదము ప్రకృతి సహజమైంది. మాంసాహారం మానవుల కుద్దేశించినది ఏ మాత్రం కాదు.

క॥ "కలివుపచేలిమంబులయి కాననలోపల బండ్లుమ్రాకులం
గలవు పవిత్రవాహినుల గమ్మని శీతలవారి పూరముల్
గలవు చివుళ్ల పాన్పులవి గైకొననేరక దీనులై ధనా
ద్యులగవనిన్వసించి నరులోలిసహింతురు తీవ్రతాపమున్"

ఇట్టి పరిశుద్ధ సాత్వికాహారాన్ని భగవంతుడు ప్రసాదించియుండగా, ప్రాణిహింస చేసి, మాంసాహారాన్ని తిని, మనుజులు మదమతులు కానేల? మాంసాహారులైన జంతువులకుండే గుణమేకదా! మాంసాహారం తినే మానవులకు కూడా కలుగుతుంది. మనుజులు మాంసం తినే రాక్షసులు కారని మన అవయవములే తెల్పుచున్నవి. సింహం, పులులకు మాంసాన్ని చీల్చి తినేందుకు అనువైన కోరలు, వాడిగోళ్ళున్నవి. మనకు లేవు. అవి పచ్చి మాంసాన్ని అలానే తింటాయి. మనం పక్వంగా వండుకొని రుచిగా తింటున్నాము. కాబట్టి మనుజునికి మాంసాహారం ప్రకృతి సిద్ధమైనది కానేకాదు. ఒక ప్రాణిని హింసించిన గాని మాంసం లభ్యం కాదుకదా! హింసకు నిలయమైన, దుర్గుణాలను పెంపొందించే మాంసాహారాన్ని మనుజుడు తప్పక విసర్జించాలి.

వరి, వంగ మొదలైన వాటిని మనం పైరు చేస్తున్నాం. వాని పక్వస్థితి కనిపెట్టి కోసి, మరలా పక్వంగా వండి తింటున్నాం. వరి కోతకు వచ్చినపుడు కోయకుండా వదలితే అవిరాలి మరలా మొలిచినా ఒత్తగుటచేత వర్ధిల్లవు. కాబట్టి అట్టివానిని కోసి తిన్నను తప్పులేదు. అవి ఇంద్రియ రహితములు కదా! కాబట్టి శాకపాకములే శ్రేష్ఠం.

రాతి మధ్యలోని కప్పకు సైతం ఆహారమిచ్చే పరమేశ్వరుడు మనుజునకు తగిన ఏర్పాట్లు చేయకుండునా! పరాపేక్ష లేకుండా మనుష్యేతర ప్రాణులు జీవించినట్లే మనుజుడు కూడా జీవింపవచ్చును. సర్వేశ్వరుని ఉద్దేశం కూడా అదియే.

ఇతర ప్రాణుల వల్ల మనకు కలిగే లాభాలు అనేకం. మనవల్ల వాటికి కావలసిన సాహాయము అల్పం. మన సహాయంలేకయే అవి జీవింపగలవు.

పశువులు దధిక్షీర నవనీతాదులొసగి, సేద్యము చేసి పంటలు పండించడానికి తోడ్పడును. మనకు అన్న పానీయాలకు ఉపకరిస్తున్నవి. ఇంకా అవి బండ్లు లాగును. మూటలు మోయును. అవి చచ్చిన పిదప కూడా చర్మరూపంలో ఉపకరిస్తాయి. కావుననే గోవు మాతృసమ మంటారు. అట్టి గోవుల వధించుట ఎంత పాపం? ఎంత కృతఘ్నత? మనకు పెక్కు విధాల ఉపకరించే ప్రాణులనే మనం హింసించి, వధించి భక్షిస్తున్నాం. ఎంత ఘోరం.

మనలాగా మాట్లాడే శక్తి లేని పశువులకు నోరు లేమిచే మనం పెట్టే హింసలను భరిస్తున్నాయి. అట్టి నోరు లేరు జీవులయందు కనికరం చూపాలి. అన్ని మతాలు దయా సత్యాలను ప్రధాన గుణాలుగా చెప్పియున్నారు. భూతదయ లేని బుద్ధి జీవి జీవితం వ్యర్థం.

"దయయు సత్యంబులోనుగా దలపడేని
కలుగ నేటికి దల్లుల కడుపుచేటు" - అని భాగవత ధర్మం. దయావంతులను అందరూ ప్రేమిస్తారు. బుద్ధుని భూతదయ వల్లనేగదా! నేటికిని లోకులంతా ప్రేమిస్తున్నారు. భూతదయకు మించిన ధర్మం లేనేలేదు.

తే॥గీ॥ "అన్ని తపములకును బెద్ద యన్నిదాన
ములకు నెక్కువ యన్ని నోములకు హెచ్చు
అన్ని తీర్థములకును గన్నాకు వినుము
భూతదయకంటె ధర్మంబు భూమిలేదు".



## 77. యత్నము

తే॥గీ॥ పౌరుషంబు దైవంబుతోడ్పాటు లేక
ఫలము బొందంగ నేరదు పార్థివేంద్ర!
విత్తుసహకారిగాకున్న రిత్తనేల
వంధ్యమగుగాక తా ఫలవంతమగునె?

ఏడు పాళ్ళు పురుష ప్రయత్నం, దైవ యత్నం ఒక పాలు కార్య సాఫల్యానికి కావాలని విజ్ఞులంటారు. ప్రయత్నమే లేకుండా దైవాన్ని కోరడం

అజ్ఞుల లక్షణం. సకాలంలో కృషిచేయక ఊరకుండి పంటకాలంలో కొడవలితో పొలానికి పోతే ఫలితం ఉంటుందా! ప్రయత్నం సంపూర్ణంగా ఉన్నా, దైవం తోడు లేకుంటే కార్యం నెరవేరదు.

**శ్లో॥ "జాతం బ్రహ్మకులే ఉగ్రజోధన పతిర్యః కుంభకర్ణానుజః**
**పుత్రశ్చక్రజితా స్వయంద శశిరః పూర్ణద్భుజా వింశతిః**
**కామః పంచశరారథస్తు విజయే మధ్యే సముద్రం గృహం**
**సర్వం నిష్ఫలితం తదేవ విధినా దైవే బలే దుర్బలే"**

పుట్టింది బ్రహ్మవంశాన. అన్న ధనాధిపతి అయిన కుబేరుడు. తమ్ముడు లోకాన్ని మ్రింగే కుంభకర్ణుడు. కుమారుడు ఇంద్రుని జయించినవాడు. తనకు పది తలలు. ఇరవై చేతులు. రథం పుష్పకవిమానం. పట్టణం సముద్రాలచే చుట్టబడిన లంక. ఇంత ఉండినా దైవం తనకు లేనందున సర్వం నిష్ఫలమైంది.

**శ్లో॥ "అప్పుప్లవంతే పాషాణా మానుషాఘ్నంతి రాక్షసాన్**
**కపయః కర్మకుర్వంతి కాలస్య కుటిలాగతిః"**

రాళ్ళు నీటిలో తేలుచున్నాయి. మనుజులు రాక్షసులను చంపుచున్నారు. కోతులు కార్యము లొనర్చుచున్నవి. కాలమెంత వక్రించినది? అని రావణుడు వాపోయినాడు. నీతిమంతులు చేసే కార్యాలు అనేకం చెడుచున్నవి. నీచులు చేసే పెక్కు పనులు సఫలీకృత మగుచున్నవి. కార్యారంభం కూడా చేయకుండ ఊరక ఉన్నవారికి తమంతట ఫలము లభించుచున్నది. కొందరు ఆయాస పడియు విఫలులగుచున్నారు. దానధర్మాలెన్నో చేసినా, నోములెన్ని నోచినా, యాత్రలు చేసి మ్రొక్కులు చెల్లించినా గొప్పగొప్ప వారికి పుత్రులు పుట్టకున్నారు. దైవమా! ఈ పూట కూటికి లేదే? మాకు బిడ్డలేల? వద్దు వద్దంటున్నా నిరుపేదలకు గంపెండు సంతానం కలుగుచున్నారు. ప్రపంచంలో చిరజీవులై ఉండదగినట్టి మహాత్ములు అల్పాయుష్కులై పరమపదించు చున్నారు. పాపులు పూర్ణాయుష్మంతులగు చున్నారు. ధనము చేరదగిన ధర్మాత్ముల యొద్ద చేరక, లోభుల చెంతచేరుచున్నది. అపూజ్యులు పూజ్యులగుచున్నారు. పూజ్యులు నిరసింపబడుచున్నారు. ఇంతకు కారణమేమి?

**తే॥గీ॥ కార్యఫలముల యెడ దాన కర్తననుట**
**కడు నెఱుంగమి జువ్వె తా గర్తయేని**

దగిలి తనదైన కార్య జాతంబునెల్ల
జెడక ఫలియించునట్లుగా జేయరాదె ?

కాబట్టి విధిని నమ్మక తప్పదు.

కళింగ రాజు బృహత్సేనునకు ప్రియపత్ని కనకలత వలన హేమప్రభ అనే పుత్రికారత్నం కలిగింది. ఆ బాలిక మిగుల గారాబంగా పెంచబడి, అన్వర్థ నామమై, పదునాల్గేండ్లు గడవగా నిండు జవ్వనియై అలరారుచుండెను. అక్కన్యకా రూపయౌవన గుణలోభులై రాకుమారులు బృహత్సేనునకు సందేశ మంపేవారు కొందరు, నన్నే పరిణయ మాడుమని పద్యాలతో పత్రిక లంపేవారు మరికొందరు. దైవజ్ఞుల నడుగే వారు, దైవప్రార్థనం చేసేవారు. బృహత్సేనుడు అపుత్రకుండగుటచే భాగినేయునకు పుత్రిక నిచ్చి ఇల్లరిక ముంచుకోదలచినాడు. రాణియగు కనకలత మాత్రం తన యన్న కొడుకున కీయదలచి యుండెను. రాజు ఉద్దేశం రాణికిని, రాణి యుద్దేశం రాజునకు సరిపడదయ్యెను. తుదకు రాణిని మీరి రాజును, రాజునకు తెలియనీయక రాణియు సాహసించి తన కోరిక నెగ్గించుకోడానికి తగు ప్రయత్నాలతో అదనుకోసం వేచియున్నారు.

ఇట్టి తరుణంలో సురలు సుర జ్యేష్ఠుడైన బ్రహ్మదేవునితో – "పితామహా! నీచే ప్రాణుల నొసట వ్రాసిన వ్రాత తప్పదని విన్నాం. కళింగరాజ దంపతుల ఉద్దేశాలలో ఏది నెరవేరుతుందో ఆనతీయండి" అనగా పరమేష్ఠి దేవతలతో నిట్లన్నాడు. "ఆ కళింగ రాజపుత్రిక, ప్రభుని మేనల్లునకుగాని, రాణి సోదర పుత్రునకు గాని భార్యగా ఆమె నుదుట వ్రాయబడలేదు". రాగల శుద్ధ పంచమీ గురువారం ఉదయం పది గంటలకు ఆ పట్టణంలో ఆగ్నేయ మూల ఒక పర్ణకుటీరంలో నివసించే పుట్టుదరిద్రుడైన ఒక కుష్ఠు రోగికి ఆ యువతి జాయ కాగలదు." ఆ మాటలు విని వేలుపులు వికవికా నవ్వుచు "మీ పలుకులెంతయు నమ్మ నర్హములు కావు. రాజు కోరికగాని, రాణి కోరికగాని కావలయుగాక యిట్లగునే? కానిమ్ము ఇందలి సత్యమరయుదము" అని, సత్యలోకాన్ని వదలి, సురలోకానికి వెళ్ళి గరుడుని పిలిచి "వైనతేయా, నీవారోగిని కొనిపోయి ఒక కొండ బిలంలో బెట్టి, పెద్ద శిల నొకదాన్ని ఆ ద్వారానికి అడ్డు పెట్టి రమ్మనిరి." అతడట్లే చేసివచ్చాడు.

తదుపరి బ్రహ్మ పెట్టిన ముహూర్తము సమీపంపగా, దేవతలెల్ల బ్రహ్మను పరిహసిస్తూ "తమ వచనము కొనసాగెనా?" అని అన్నారు. అంత

బ్రహ్మదేవుడు "మీరు పోయి కన్నులార గాంచి వచ్చి నన్నడగండి" అని దేవతలకు ప్రత్యుత్తర మిచ్చాడు. అంత వారంతా గరుడునితో పయనమై ఆ పర్వత గుహచేరి, మనుజులకు అలవిగాన పెద్దరాతిని ఇవతల కీడ్చి లోనికేగి చూశారు. అప్పటి విచిత్ర మేమనవచ్చు! రాకుమారియు, రోగియు దంపతులై పరమానందమున తేలుచున్నారు. ఈ అసంభవమెట్లు సంభవించిందని వారిలో వారు ఆలోచించుకొన సాగిరి. మొదలు తుదితోపలేదు. కడకు గరుత్మంతుని అడిగిరి. అతడిట్లన్నాడు. "నేనీ రోగిని గొనివచ్చి గుహలో దించినపుడు వాడాకలియని పరిదేవనము చేసెను. దిగులపడకుమని రాతి నడ్డుపెట్టి వచ్చుచుండగా ఒక కాంత ఒక పేటికను ఎక్కడికో గొనిపోవుచు నెదురురాగా యిదియేమని అడుగగా మరొక స్త్రీకి ఇది భోజనము పెట్టె అని చెప్పగా విని, ఇది ఆ రోగికిత్తమని పైకెగర తన్నుకొని పోయి ఆ గుహలో పడవైచితిని. ఇంతకన్న నేనెరుగను".

పిదప ఆ దేవతలు ఆ రాకుమారిని వివరాలు అడుగడానికి ప్రయత్నించగా, బ్రహ్మదేవుడు వచ్చి ఇట్లన్నాడు. "రాజునకు తెలియకుండా రాణి తన యభీష్టం నెరవేర్చుకోవాలని ఒక పేటిక యందు తన కుమార్తెను, దానిలో మంగళద్రవ్యాలను, వివాహ ఉపకరణాలు మొదలైన వస్తువులతో ఆ పేటిని రాజ్యం పొలిమేరలు దాటింప ఒక చేటిచే పంపినది. ఆ పెట్టెనే గరుడుడు గొనిపోయినది. ఆపెట్టెను తెరవగా ఆ కన్య బయటకు వచ్చి ఆ స్థలాన్ని, తన స్థితిని తెలిసికొని 'జీవిత పర్యంతం ఈ కుహరంలో ఆహారం లేకుండా కృశింపవలసిన గతి పట్టెనే' అని తన పెట్టెలో నున్న ఆహార పదార్థాలతో తృప్తి చెంది "బ్రతికి యున్నంత దాక నిశ్చింతతో నుండమని మదిని కుదురుపరచుకొని వీనికి భార్యయైనది. ఇది నిజ వృత్తాంతము" బ్రహ్మ పలుకులు విని అమరులు కూడదనుకొన్న మనవల్లనే బ్రహ్మ సంకల్పం సిద్ధించేగదా! మన మారోగిని, గుహను జేర్పకున్న ఎట్లు తటస్థించెడిదో యనుచు –

**క॥ "దీనికి మిక్కిలివగవం**
**గానేల? విధాత వ్రాత, గడవగ శక్యం**
**బౌనే? తా వ్రాసి మరల**
**దానె తుడవ లేడికెంత తదితరులరయన్..."**

అని అనుకుంటూ వారు తమ సదనాలకు వెళ్ళారు.

దైవమంటే ఏమి ?

**శ్లో॥ "స్వమేవ కర్మదైవాఖ్యం! విద్ధ దేహాంతరార్జితం**
**తస్మాత్పౌరుషమేవేహ శ్రేష్ఠమా హుర్మనీషిణః"**

దేహాంతరార్జిత కర్మయే దైవంబనబడును. అనగా పూర్వ జన్మార్జిత పుణ్యంబున కార్య సఫలంబును, పాపంబున కార్య విఫలంబును అగునని భావము. కాబట్టి పౌరుషమే శ్రేష్ఠమని విజ్ఞులచే చెప్పబడింది.

**"ప్రతికూలం తథా దైవం పౌరుషేణ విహన్యతే"**

దైవం ప్రతికూలమైనా ప్రయత్నం చేత దానిని దాటవచ్చును. సావిత్రి దైవగతిచే బడిన పతి ప్రాణాలను స్వప్రయత్నంతో మరలించుకొనలేదా! మార్కండేయుడు విజ్ఞానియై ఈశ్వర ఆరాధనతో మృత్యువును జయింపలేదా! యత్నము చేత కాని కార్యం లేదు.

**శా॥ "ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై**
**ప్రారంభించి పరిత్యజించుదురు విఘ్నాయత్తులై మధ్యముల్**
**ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై**
**ప్రారబ్ధార్థములుజ్జగింపరుగదా ప్రజ్ఞానిధుల్గావునన్"**

అధములు విఘ్నాలు కలుగతాయనే భయంచేత కార్యారంభమే చేయరు. మధ్యములు ప్రారంభించి మధ్య విఘ్నములు వాటిల్లితే వదలివేస్తారు. ఉత్తములు విఘ్నములెన్ని సంభవించినా, నిరుత్సాహ పడకుండా క్రిందబడిన బంతి పైకెగురు రీతిగా ద్విగుణిత ఉత్సాహంతో కార్య సాఫల్యం పొందేవరకు వదలనే వదలరు.

**తే॥గీ॥ "తనిసిరే వేల్పులు దధిరత్నముల చేత**
**వెఱచిరే ఘోర కాకోల విషముచేత**
**విడిచిరే యత్నమమృతంబు వొడముదనుక**
**నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు".**

# 78. బ్రహ్మచర్యము

వేదాది విద్యాభ్యసనార్థం జితేంద్రియత నియమాదులకు 'బ్రహ్మ' మని పేరు. ఆ నియమాలను ఆచరించడాన్ని బ్రహ్మచర్యం అంటారు. సంపూర్ణ ఆయుష్కరమైనది. జరావ్యాధుల నివారణకు కారకమైనది, అకాల మృత్యు నివారణకు హేతువైనది, తేజోవృద్ధికరమైనట్టిది, శరీర పరిరక్షణ సంతతి హృదయానంద సంధాయక మైనట్టిదియు, బల, వీర్య, ప్రజ్ఞా, శ్రీ యశః, పుణ్యాదుల వృద్ధికి సాధనమైనట్టిది, నిహాముత్ర సుఖప్రదాయకమైనట్టి బ్రహ్మచర్యాన్ని అనుష్ఠింపని వాడు వ్యర్థజీవి. "బ్రహ్మచర్యముచే మహర్షులు లోకాలను జయింతురని" మహాభారతంలో చెప్పబడింది.

బ్రహ్మచర్యం గురుశుశ్రూష చేసి విద్యా జ్ఞానముల సంపాదించే కాలం. గురు శుశ్రూష లేనందుననే ఇప్పటి విద్యార్థులకు గురుభక్తి లేకపోయింది.

**క॥ పొందుగ నీగురు వెవడన**
**నెందతొ నెలనెలకు మాతీ యెందోపోగా**
**నందొకరి జెప్ప నెటులగు**
**నందువె మదినొకని నిలుపు మా విద్యార్థీ!**

ఎల్లవేళలా బ్రహ్మచారి ఒంటరిగానే పరుండాలి. తాంబూలాన్ని సేవింప కూడదు. సుగంధ ద్రవ్యాలను వాసన చూడరాదు. పుష్పముల ముడువరాదు. ఇంద్రియాల నుద్రేకింప జేసే గ్రంథాలను చదవరాదు. అట్టి వాక్యాలను పలుకరాదు. వినరాదు. స్త్రీలను కుదృష్టితో చూడరాదు. వీర్యపతనం చేయరాదు. ఒక్కసారి సౌఖ్యమనే తలంపుతో ప్రమాదవశాన వీర్యపతనమైతే వాని బ్రహ్మచర్యం వ్యర్థం. జితేంద్రియుడై, అస్ఖలిత బ్రహ్మచారియైన వాని వీర్యం ఓజస్సుగా మారి ఊర్ధ్వముఖంబై మరలుతుంది. ఓజస్సు ఎంత అధికమైతే అంత మహిమ ఏర్పడుతుంది. మహర్షుల వాక్కులు ఫలించడానికి ఈ ఓజస్సే కారణం. సుమానుషంబులు, అమానుషంబులు అగు కృత్యములు నెరవేరడానికి ఈ ఓజస్సే కారణం. ఓజస్వి చేయలేని కార్యం లేదు. "కోబ్రహ్మచర్యవాంత్స్యా? దృశ్చాస్ఖలితోర్ధ్వరేతస్కః" వడుగెవండను ప్రశ్నకు అస్ఖలిత ఊర్ధ్వరేతస్కుడని శంకరాచార్యుల ప్రత్యుత్తరం.

ఆంజనేయుడు ఈ బ్రహ్మచర్య మహిమను ఎరిగియె స్థిర బ్రహ్మచారి యైనాడు. అతడు చేసిన అమానుష కృత్యాలు అందరికీ విదితమేగదా! కుబుద్ధి వదలి సుబుద్ధి నాశ్రయించినట్లుగా, సుగ్రీవుని ఆశ్రయించి, పరమాత్మను గనుగొన్నట్లుగా ఆ శ్రీరాముని కనుగొని, బ్రహ్మచర్యం నుండి సన్యాసానికి లంఘించె నన్నట్లు అంబుధిని లంఘించెను. సుజ్ఞాన లాభంబు పొందినట్లుగా సీతాదేవి దర్శన లాభాన్ని పొందినాడు. అవిద్యా విచ్ఛేదక మొనరించినట్లుగా అశోకవనాన్ని విధ్వంస మొనర్చెను. దుర్గుణ వినాశం చేసినట్లుగా అక్షయాది అసురుల దుష్టసంహరణ చేశాడు. మనఃప్రబోధ మొనరించి నట్లుగా రావణునకు నీతిని ప్రబోధించినాడు. కామాది శత్రుదహనం చేసినట్లుగా లంకాదహన మొనర్చినాడు. అక్షణ తేజస్వియై పరమాత్మయందు ఐక్యమొందె నన్నట్లుగా, శ్రీరామచంద్ర పరమాత్ముని చరణారవింద సన్నిధిని పొంద గల్గినాడు.

సీ॥ "కదలడీతడు వజ్రకఠిన విగ్రహుడంచు
బోలగామైనాక శైల మెఱుగు
వెఱవడీతడు మహావీరశేఖరుడంచు
శోధింపవచ్చిన సురస యెఱుగు
గలగడీతడు భూరిగాంభీర్య నిధియని
వడిబాయ యిచ్చిన వనధి యెఱుగు
బలిమి నీతడు మహాబలునంతవాడని
కెరలి మార్కొనిన లంకిణి యెఱుంగు.

తే॥గీ॥ జీవదాయకుడితడని సీతయెఱుగు
రాక్షసాంతకుడితడని యక్షుడెఱుగు
నధికుడితడని రావణి యస్త్రమెఱుగు
సిద్ధమిదియని రామ నీ చిత్త మెఱుగు"

బ్రహ్మచర్య ప్రభావం వల్లనే హనుమంతుడు అంతటివీరుడై, రామ భక్తుడై, చిరకీర్తిని పొందినాడు. కాబట్టి విద్యార్థి దశలో తప్పక బ్రహ్మచర్యాన్ని వ్రతంగా పాటించాలి.

# 79. ఆపత్సహనము

కాలచక్రంలో పగలు సగం, రేయి సగం. వెన్నెల కొన్నాళ్ళు. చీకటి కొన్నాళ్ళు. జీవితచక్రంలో సుఖం కొంత. కష్టం కొంత. కష్టాలనే అనుభవించే వారులేరు. సుఖాలనే అనుభవించేవారున్ను లేరు. కష్టాసుఖాలు రెండూ కాలచక్రంలో సహజం. కాబట్టి ప్రతి జీవి కష్టసుఖాలు రెండింటిని కొద్దో, గొప్పో అనుభవించాలి. అయితే మన అనుభవంలో కష్టాలు రావడం ప్రారంభమైతే ఒకటి వెనుక ఒకటి వస్తుంటాయి. సుఖాలు రా మొదలైతే, వరుసగా సుఖాలే ప్రాప్తిస్తుంటాయి. ప్రతిజీవి పూర్వజన్మకృత పుణ్యపాపాల ననుసరించి సుఖదుఃఖాలు అనుభవిస్తుంటారు. 'రానున్నవి రాకమానవు' అనే సామెత ఉండనే ఉందికదా!

మానవుడు చేసే సర్వకర్మములందును భయం దాగి ఉంటుంది. కష్టాలకు భీతిచెందే వానికంటే మించిన భీరువు మరొకడుండడు. కష్టానికి దుఃఖించడం, సుఖానికి ఉప్పొంగడం అల్పుని లక్షణం. సముద్ర జలాన్ని ఆచమనం చేసి నీరము లేకుండా చేసిన మహిమా సంపన్నుడు, వింధ్యాద్రి గర్వదమనుండు, అనేక భాషా ప్రపంచ విరించి అయిన అగస్త్యునకు ఒక దుర్భర రోగముండెనట. ఆ వ్యాధి బాధచేత అతడు నిత్యానుష్ఠానముల సైతము నెరవేర్చుదానికి అశక్తుడైనాడు. అందుచేత అతడు తన యోగ దండాన్ని ఎదుట నిలిపి తన రోగాన్ని దానిలోనికి ప్రవేశింప చేసేవాడు. అప్పుడది ఆ బాధను భరించలేక వణకుచుండేది. తన అనుష్ఠానం, యోగసమాధి పూర్తయిన తర్వాత ఆ రోగాన్ని తన లోనికి రప్పించుకొనేవాడు. ఈ విచిత్రాన్ని చూచిన ఆతని శిష్యులు "మహానుభావా! సర్వశక్తి మంతులైన తాము తమ రోగ బాధను యోగదండమునకు పోనిచ్చువారు పిదపనేల రప్పించుకొన వలయు? రోగముల వలదను వారున్నారుగాని, తమవలె రోగముల నివృత్తి చేయ సమర్థత కలిగియు రమ్మను వారెందును గానరారు. ఇందే దేని గొప్ప కారణము లేకపోదు. విన నర్హులమేని యానతిండు" అని గురువుతో అన్నారు. అగస్త్యుండిట్లన్నాడు. "శిష్యులారా! తొలి జన్మలో నేనొనరించిన దుష్కృత మీరోగరీతి పరిణమించి నన్ను వేధించుచున్నది. ఎంతవరకు వేధింపదగునో

యంతదనుక నది వదలదు. పిదప నిలుమన్నను నిలువదు. అనుభవింప వలసినదాని నిప్పుడు బల సంపాదనంబున దొలంగద్రోసి కొంటిమేని యావల బలహీనులమగు సమయము నది వేచియుండి మనల బాధింపక విడువదు. శక్తిమంతులమై యున్నప్పుడే దేనినైన ననుభవింపగలము. కావుననే మరల రప్పించుకొంటున్నా"నని ప్రత్యుత్తరమిచ్చాడు. పురాకృత కర్మ ఫలితాన్ని అనుభవింపక తప్పదు గదా?

పూర్వం భువన విఖ్యాతులైన [1]షట్చ్రక్రవర్తులలో నాల్గవ వాడైన పురూరవుడు రాజ్యపాలన చేసే కాలంలో, ఒకనాడు శనైశ్చరుడు ఆతని ధర్మ యుక్తికిని, ప్రజానురక్తిని, పరమేశ్వర భక్తికిని మెచ్చి ప్రత్యక్షమై "రాజేంద్రా! నీ యోగ్యతకు మెచ్చి దర్శనమిచ్చిన శనైశ్చరుండను నేను. ప్రపంచంలో పుట్టిన ప్రతి ప్రాణిని పట్టి విడుచుట నా కర్తవ్యం. భోగానుభవ యోగ్యమైన ఈ సమయంలో పట్టుదునా? ముసలివాడవై మూల ముడిగినప్పుడు పట్టుదునా?" అని అడిగాడు.

పురూరవుడు నమస్కరించి, "సూర్యపుత్రా! తరుణ వయస్సులోనే పురుషునకు కష్టసుఖాలను భరించే శక్తి ఉంటుంది. వయస్సు మీరిన తర్వాత ఆ రెండింటిని భరించుటకు పురుషుడు అనర్హుడగుచున్నాడు. కాన నిప్పుడే నన్ను ఒక ఓరగంట చూచి వదలవే" అని ప్రార్థించాడు. దినకరపుత్రుడు సరేనని అంగీకరించాడు.

అనంతరం శని, ఒక ప్రభువుకు, మరొక రాజు వ్రాసినట్లుగా పురూరవునిపై అనేక నిందలు మోపి, అందరేకమై పురూరవుని ముట్టడించి సార్వభౌముని పదభ్రష్టుని చేయాలని, లేఖలు వ్రాశాడు. ఆ ఉత్తరాలు చదువు కొన్న రాజులంతా శనైశ్చరుని ప్రేరితులై చతురంగబలంతో కదలి పురూరవుని ముఖ్య పట్టణమైన ప్రతిష్ఠానపురాన్ని ముట్టడించినారు.

పురూరవ చక్రవర్తి ఆ వృత్తాంతాన్ని వేగుల ద్వారా విన్నవాడై, భృత్యులకు, మంత్రులకు ఆరునెలల వేతనమిచ్చి పంపించి, ఆ రాత్రి శయన గృహానికి

---

1. షట్చక్రవర్తులు : 1) హరిశ్చంద్రుడు, 2) నలమహారాజు, 3) పురుకుత్సుడు, 4) పురూరవుడు, 5) సగరుడు, 6) కార్తవీర్యార్జునుడు.

వచ్చి, తమ పట్టమహిషి అయిన జయప్రభతో, "నారీ శిరోమణీ! నేడు యాబది యాఱు దేశాల సామంతులు నాపై ఒక్కటిగా కత్తిపట్టి యుద్ధానికి వచ్చి పట్టణాన్ని ఆక్రమించుచున్నారు. నాకు లోబడిన వారంతా నన్నెదిరించడానికి కారణం నా గ్రహచారబలం. వారితో రేపు నేను యుద్ధం చేసితినేని దైవాధీనములైన జయాపజయాలలో అదృష్టహీనుండైన నాకు అపజయం కలుగుట నిశ్చయం. దానికై నేను వగవను గాని, నాయొక్క ప్రాణాని కొరకై మన సైనికులెంత మంది ప్రాణాలు కోల్పోతారు. ఏ పాపమెరుగని నిరపరాధులు చనిపోవుటకు నా మనస్సు అంగీకరించడం లేదు. మన మిరువురం, ఇరువురు కుమారుల నెత్తికొని రహస్య మార్గంలో దుర్గమారణ్యానికి వెళ్ళుదము - ఇది నా నిశ్చితాభిప్రాయం." ఇందుకు నీవేమందువన్నాడు. పతివ్రతా తిలకమైన ఆ రాణి "నాథా! తమ ఉద్దేశమే నాకును పరమ సమ్మతము. మీ వాక్యముల కెదురుకలదా?" అన్నది. అంత నాసతీపతులిరువురు పుత్రుల నెత్తికొని రహస్య మార్గం ద్వారా అడవులకు చేరుకున్నారు.

అడవిలో ఆకలిదప్పుల కోర్వలేక చిన్న కుమారుడు శోషిల్లాడు. ఆ రాజదంపతులు కొంత చింతిల్లి, మరలా ధైర్యం తెచ్చుకొని, ఒక తటాకం త్రవ్వుచున్న చోటికెళ్ళారు. అక్కడ పనిచేస్తున్న ఒడ్డెవాడు వీరిని చూచి అనుతాపమొంది పురూరవుని తమ విలేఖకునిగా నియమించుకున్నారు.

ఆవల కొన్నాళ్ళకు తటాకాన్ని నిర్మిస్తున్న ధనికుడు కర్ణాకర్ణిగ పురూరవుని ఇల్లాలు రూపవతి అనివిని ఆమెపై మరులుగొని, ఆనాటి సాయంత్రం పనిచేస్తున్న ఇల్లాండ్రనే వచ్చి నాటి కూలి తీసుకొని పొండని తెలియజేశాడు. మూఢులైన వడ్డె స్త్రీలు "నేముందు నేనుముం"దని త్రొక్కులాడుచు వచ్చి తమకు రావలసిన రొక్కాన్ని తీసుకొని వెళ్ళారు. వెనుకబడిన జయప్రభ ఒంటరిగా మిగిలింది. ధనికుడైన ధనదాసుడు కొన్ని సంగతులు సేవకుని చెవిలో నూది లోనికెళ్ళాడు. ఆ వచ్చిన జయప్రభను గాంచి ద్వారపాలకుడు "అమ్మా యజమాని అత్యవసర కార్యార్థియై పోవలసి తమకు రావలసిన పైకాన్ని లోపలనుంచి పోయిరి. మీరు లోనికి బోయి తీసికొనవచ్చు"నని పలికినాడు. ఆమెకు అనేక సందేహాలు తోచినా దైవమే దిక్కని లోనికెళ్ళింది.

వెంటనే తన వెనుకటి తలుపు దబాలున మూయబడింది. ఆమె తిరిగి చూచింది. ఆమె అనుమానం నిజమైంది. తనకు ఎదురుగా ధనదాసుండు కనిపించాడు. వెంటనే ఆ జయప్రభ తనకు కులదైవంలా గోచరించిన ఒక పాడు పెట్టెలో ప్రవేశించి, పై మూత మూసి,

**తే॥గీ॥ "ఎపుడు నా నాథునకవజ్ఞ నెన్ననేని**
**నే మహాపతివ్రత యౌట నిక్కమేని**
**నాథునకుగాక యితర మానవులకెన్ని**
**విధముల నభేద్యమగుత మీ పేటియింక"**

అని శపథ వాక్యాలు పలికింది. పతివ్రత పలుకులకు మారుండదు గదా! బీగము లేకయే ఆ పెట్టె బిగుసుకొని పోయింది. ధనదాసుడు ఆ పెట్టెను ఎన్నో విధాల తీయడానికి ప్రయత్నించినా లాభం లేకపోయింది. గొడ్డండ్లతో కొట్టించినా, నిప్పు పెట్టి కాల్పించినా ప్రయోజనం శూన్యం. భీతిమెండై, వెంటనే ఆ పెట్టెను సముద్ర తీరంలోని నీటిలో కలిపిరండని ఆజ్ఞాపించినాడు. ఆ పెట్టెను నీటిలో ముంచుచుండగా – "ఓయీ! ఇక ఏడు సంవత్సరాలు ఈ పెట్టెను కాపాడితివేని సుఖము పొందగలవు" అని ఒక అశరీరవాక్కు వినిపించింది. అంత ఆ ధనికుడు ఆ ప్రాంతంలోని ఒక ఊరిలో ఒక భవనాన్ని కొని, అందు ఆ యేడేండ్లు గడప నెంచినాడు.

"ప్రొద్దు గ్రుంకింది. చీకటి పడసాగింది. నేటి కూలి తెచ్చుటకు వెళ్ళిన ఇల్లాలు ఏల రాదయ్యె" అని పురూరవుడు చింతిస్తూ వీధుల వెదుకుచూ కనబడిన వారినెల్ల అడుగసాగినాడు. చేడె జాడ తెలియలేదు. "దైవమా! అనుభవింపవలసిన దింకను కొఱతయున్నదా?" అని ఇంటికి వెళ్ళి, తల్లి కోసం ఎదురుచూస్తున్న తనయుల గాంచి పరితపిస్తూ, ఆ ఊరిలో నుండలేక పిల్లలతో ఎచ్చటకో బయలుదేరాడు.

"మబ్బు లేదు. నేల చెమ్మయు లేదు. ఈ ప్రవాహమెట్లు వచ్చె? దీని దాటుటెట్లు? రొమ్ము బంటి నీరు పారుచున్నదే? కానిమ్మిట్లొనర్చెద" అని రాజు కృతనిశ్చయుడై ఒక పుత్రుని ఈవల ఒక చెట్టునకు గట్టి, ఒకని ఎత్తుకొని ఆ అకారణ ప్రవాహాన్ని దాటి ఆవలి గట్టుచేరి, అటనున్న మరొక

చెట్టుకు కుమారుని కట్టి మరలా ఈవల ఒడ్డునకు రావడానికి నీటిలో దిగినాడు. నట్టేటికి వచ్చేసరికి పై వెల్లువ వెల్లివిరిసింది. నురుగలు గ్రక్కే ఆ ప్రవాహంలో కాలూదలేక ఆ రాజు ప్రవాహంలో కొట్టుకొనిపోయాడు. మరునాడు అరుణోదయాన ఒక గోపాంగన దధి విక్రయించడానికి ఆ దారిలో పోతూ, ఇరువరుల తరువులకు కట్టబడి రోదించి, రోదించి సొమ్మసిల్లిన పిల్లలను చూచి ప్రేమతో ఇంటికి తీసుకొనిపోయి పెంచుచుండెను.

అనుభవించవలసిన కర్మశేషం మిగిలియుండగా చావెవ్వరికిని రాదుగదా! ప్రవాహంలో కొట్టుకొని పోతున్న ఆ రాజును ఆ ప్రవాహం ఒక గట్టుకు చేర్చింది. అంత ఆ రాజు ఒక గొల్లని గొర్రెల మేపుచూ, కొంతకాలం నిశ్చింతుడై యుండెను. అంత అర్ధరాత్రిలో కొందరు చోరులు సమీపాన గల పట్టణంలో రాజకోశాగారంలో ప్రవేశించి ధనంకొల్లగొట్టి బయలుదేరే సమయంలో రక్షకభటులు చూచి ఆ దొంగలను తరుమగా, వారు తెచ్చిన రత్నపేటికి నొకదానిని గొర్రెల మందకాడ నిద్రిస్తున్న పురూరవుని తల దగ్గర పడవైచి పారిపోయారు. వెనుకనే వచ్చిన భటులు ఆ పెట్టెను చూచి "తప్పించుకొనే వెరవులేక, దిట్టరియైన దొంగ ఇట్టి దొంగ నిద్దుర పోవుచున్నాడని" భావించి అతని బంధించి తీసుకొనిపోయారు.

మరునాడు విచారణ జరిగింది. పురూరవుడు మౌనంగా ఉన్నాడు. అతనిపై నేరం మోపబడింది. కలి ప్రభావం చేత కరపద ఖండన శిక్ష విధింపబడింది. తలవరులు పురూరవుని అరణ్యానికి గొంపోయి కాళ్ళు చేతులు ఖండించినారు.

ఖండిత కరచరణుడైన చంద్రవంశ చక్రవర్తి, ధీరమతి కాబట్టి తన మనస్సులో –

**ఉ॥ "కానిటనేను గన్నులును గాళ్ళు గరంబులు జర్మమస్థులున్**
**గాను సమస్త కార్యమున గన్బును, నంటియు నంటకుండ, ను**
**న్నానను నాత్మ గన్గొని మనంబున మిక్కిలి సంతసించుసు**
**జ్ఞానియె లోకమాన్యుడు గుణస్థుడు ధన్యుడు భూతలంబునన్"**

చ॥ ఎరవలి గొన్న బెండ్లి మరులేగిన పిమ్మట సొత్తుకాని కా
భరణములిచ్చి సంతసిలు భాతి సువర్ణ పదార్థ వాహనాం
బర గృహ పుత్రమిత్రతతి ప్రాణము నీగెడు వేళ సొంతకా
పరిగొనె నంచు సంతసిలు ప్రాణియె ధన్యుడు భూతలంబునన్"

అని భావించి, స్థిరమనస్కుడై, ప్రాణం పోవు సమయం కొరకు నిరీక్షించుచున్నాడు.

అంత ఆ చక్రవర్తి దయనీయ స్థితి జూచి బ్రహ్మదేవుడు పంపగా శారదాదేవి వచ్చి ఆ నరపతికి ఉపచర్యలుచేసి, బాధను పోకార్చి తలచినపుడు దర్శన మిస్తానని చెప్పి అంతర్ధానమాయెను. పిదప వ్యాపారార్థియై దూరదేశాలకు వెళ్ళి ఆ దారిన వస్తున్న వైశ్యుడు ఒకడు అతని చూచి జాలితో తన పల్లకిలో తన భవనానికి తీసుకొని పోయాడు.

తదనంతరం ఒకనాడు పండు వెన్నెలలో రాజసౌధంపై విహరిస్తున్న రాకుమారి, రాళ్లను కరిగించే శక్తిగల శ్రావ్యమైన గీతాన్ని విన్నది. ఆమె ఆభరణాలలోని రత్నాలు కూడా చెమ్మగిల్లాయి. ఒడలు పరవశమయ్యింది. కొంత సేపటికి తెలివిరాగా, ఆ మేటిగానం చేయు నీటుగాడెవ్వడో పరికించి రమ్మని తన చెలికత్తెను పంపింది. ఆ గానం వినవచ్చే దిశవైపు నడచి. విచారిస్తూ వెళ్ళి అచ్చటకు చేరి కన్నులార ఆ గాయకుని చూచి ఆ గానాన్ని వీనులార విని, మరలా రాజపుత్రికను చేరి ఇట్లన్నది. "అమ్మాయీ! అమ్మాయీ! ఆ గాయకుడు మొన్న మన అంతఃపురంలో చౌర్య మొనర్చి, కరచరణ ఖండన శిక్ష బొందినవాడు. అతని గానమునకు సమాన మీ జగాన గానము. పరుల పలుకుల నమ్మక నేనే కనివిని వచ్చితి. ఇంత నిజము".

రాకుమారికి ఆ మొండివానిపై మోహం అంకురించింది. అతనినే వివాహమాడాలని దృఢనిశ్చయంతో తల్లికి తెలియజేసింది. తండ్రికి కూడా తెలిసింది. తండ్రికి కోపమతిశయించి స్వయంవరం చాటించాడు. పెక్కుమంది రాకుమారులు విచ్చేసినారు. సభ అలంకరింపబడింది. వచ్చిన రాకుమారు

లెవ్వరు కూడా రాకుమారికి నచ్చలేదు. చేతనున్న హారాన్ని గిరగిర త్రిప్పి పైకెగరవేసి – "ఇది నా ప్రియుని కంఠము నలంకరించుగాక" అన్నది. ఆ పుష్పహారం దైవవశాన ఎచ్చటనో ఒక మూల వేడుక జూడవచ్చిన పురూరవుని కంఠాన బడింది. సభయంతా కలవరమందినది. రాకుమారి మనంబు పల్లవింప మెల్లన పోయి పురూరవుని చెంతన నిలబడింది. అదిగని రాజునకు కుమార్తెపై అసూయ మెండైనది. ఆగ్రహంతో పరుషంగా మాట్లాడెను. తక్షణం ఆ గుణవర్య వైశ్యుని ధర్మగుప్తుని వలన ఒక పల్యంకికమును పొంది అందు తన భర్తను గూర్చుండ బెట్టుకొని అడవులకు నడిచింది.

పతిహితానువర్తియై, పరిచర్యలు చేస్తూ, అతన్ని మోసుకొని తిరుగుచూ భయంకర అడవులలో కొన్నాళ్ళు ఆమె గడిపింది. అనంతరం ఒక రమణీయ మైన సరోవరంలో ఇరువురు స్నానం చేశారు. అద్భుతంబుగ అతనికి చేతులు కాళ్ళు యధాతథంగా మొలచినవి. అమృతమయి కూడా ఆతను పురూరవ చక్రవర్తిగా తెలుసుకొని అమితానందము నొందినది. నారదుని యొక్క ఉపదేశంతో ధనదాసుడు పేటికను దెచ్చి పురూరవుని కిచ్చి క్షమింప ప్రార్థించాడు. ఏటిగట్టున కట్టబడిన బిడ్డలను కూడా ఆ గోపిక నారదుని ప్రబోధంతో రాజు చెంతకు చేర్చింది. సార్వభౌమత్వం కూడా పోయిన తీరుగనే మరలి వచ్చింది. పుత్ర ద్వయంతో, కళత్ర ద్వయంతో పురూరవుడు అమేయ సౌఖ్యాలనుభవించుచుండెను.

**తే॥గీ॥ "క్షమయజనుల కాభరణంబు, క్షమయకీర్తి**
**క్షమయ ధర్మంబు క్షమయ సజ్జనగుణంబు**
**క్షమయ యజ్ఞంబు, క్షమయ మోక్షంబు, క్షమయ**
**సకల దానంబు, క్షమయంద, జగము నిలుచు".**



# 80. సత్యము

**ఆ॥వె॥ వారిజాక్షులందు వైవాహికములందు**
**బ్రాణ విత్తమాన భంగమందు**
**జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు**
**బొంకవచ్చు నఘము పొందదధిప!**

అని శుక్ర నీతి చెపుతుంది.

**చ॥ కులసతి వాసినన్ సుతుడు గూలిన నాపదలెన్ని వచ్చి త**
**న్నలమిన, మానభంగమయినన్, సిరిపోయిన, రాజ్యమూడినన్,**
**జెలులు త్యజించినన్, దుదకసింగొని ప్రాణము తీయవచ్చినన్,**
**బలుకగరాదు చూవె యణుమాత్ర మసత్యము మర్త్యుడెన్నడున్.**

అని గురునీతి చెపుతుంది. వీటిలో మనకు ఆచరణీయం ఏది?

వేయి అశ్వమేధ యాగముల ఫలంబుకంటె సత్యం గొప్పదని తెలుసుకోవాలి. నడవడి అనే కడలిని దాటడానికి ఓడలాగా సత్యం తోడ్పడుతుంది. 'సత్యాన్నాస్తి పరోధర్మః' సత్యం కంటె మించిన ధర్మంలేదు. 'నాన్నృతాత్పాతకం పరం' అన్నృతం కంటె గొప్ప పాపం లేదు.

సత్యం బ్రూయాత్, 'సత్యంవద' సత్యాన్ని పలకండి. 'నాస్తి సత్య సమంతపః' అంటే సత్యం కంటె మించిన తపస్సు లేదు. 'సత్యమేవ జయతే నా నృతం' సత్యమే జయిస్తుంది. అసత్యం జయింపదు.

**'సత్యేన వాయు రావాతి**
**సత్యేనాదిత్యో రోచతే!**
**దివి సత్యం వా ప్రతిష్ఠా**
**సత్యే సర్వం ప్రతిష్ఠితం'॥**

సత్యం చేతనే వాయువు వీస్తున్నది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఆకాశము నిలిచియుంది. ఇంతయేల సర్వం సత్యాన్ని ఆధారంగా చేసుకొని నిలిచి ఉంది.

... త్యం పరమం వదంతి'. అందుకే పెద్దలు సత్యమే ఉత్కృష్ట మని చెపుతారు. ఇవన్నీ ఉపనిషత్తులు చెప్పే వాక్యాలే. శుక్ర నీతిని వినకుండా బలి బాగుపడ్డాడు. బృహస్పతి నీతి హరిశ్చంద్రుడు విని బాగుపడ్డాడు. శుక్ర నీతికి సత్యం అక్కరలేదు. అందుకే (ఇష్టమున్నచో) బొంక వచ్చునని శుక్రుడు తంత్రంగా తప్పించుకొన్నాడు. దీన్నిబట్టి బృహస్పతి నీతియే అనుసరణీయమని తేలింది. కాని అది కలికాల మానవులకు సాధ్యమా? సత్యమన నెట్టిదో విచారిద్దాం.

"సత్యం భూతహితం ప్రోక్తం" ప్రాణ హితమే సత్యం.

**ఉ॥ భూతహితంబుగా బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చు ద**
**ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్ల"**

ధర్మబద్ధమైనది సత్యం. బద్ధముగానిది అసత్యం. ఇటువంటి ధర్మ సూక్ష్మాలనేకం కలవని పెద్దలు చెపుతారు.

"అనృతమయ్యు బాపంబుగా దరయనెచట? అని శిష్యుదు ప్రశ్నించగా, గురువైన శంకరాచార్యులు –

"ధర్మమును నిల్పుకొఱకాడు తప్పునందు", అని ఉత్తరమిచ్చాదు.

ఒక విప్రుడు సంసారంలో సారం లేదని రోసి వైరాగ్యపరుడై, అడవికి చేరి ఒక మనోహరమైన ఆశ్రమాన్ని చూచాడు. అక్కడున్న ఎత్తైన ఫలవృక్షాలు పక్షులనే కాకుండా, బాటసారులకు, ఆశ్రమవాసులకు తృప్తినిచ్చు చుండెను. అక్కడగల పూల తీగలు, పుష్పముల సువాసనలచే రమణీయంగా ఒప్పారినది. అచట శుకశారి కానికరాలు "సత్యంవద, ధర్మంచర" ఇత్యాది స్మృతి వాక్యాలను వల్లించుచుండెను. గండు కోయిలల కుహూ నాదంబులు మాని బాలకులు పాడు పాటలకు ఉపశ్రుతులుగా నున్నాయి. అచటి తేనెటీగల ఝ్రోత అధ్యయనం చేసేవారి స్వర దోషాలను మరుగుపరచు చుండెను. హరిణ శాచికములు పచ్చిక చివుళ్ల మెక్కి చెవుల నిక్కించి బిత్తరపు చూపులు చూ..చుండెను. ఇట్టి మనోజ్ఞమైన ప్రదేశంలో అద్విజుడు ఒక పర్ణ కుటీరాన్ని నిర్మించుకొని ఫలమూలాదులతో నిశ్చింతగా, భగవంతుని మదిలో తలచుకుంటూ శేష జీవితాన్ని సుఖంగా గడపాలని నిశ్చయించాడు. అ

పరిసరమందలి మునుల దగ్గరకు వెళ్లి వారి వలన సత్కథలు వింటూ సందేహాలను నివృత్తి చేసుకుంటూ ఉన్నాడు.

ఇట్లుండ ఒకనాడు కొందరు బాటసారులు ఆ అడవిలో పోవుచుండగా దోపిడికాండ్రు వారి వెంటబడి తరుమసాగిరి. మాన ప్రాణభీతులై బాటసారులు పరుగెత్తి ఆ విప్రుని ఆశ్రమానికి వచ్చి దట్టమైన పొదలు మాటున దాక్కున్నారు. వారి అడుగుల జాడలను బట్టి దోపిడికాండ్రు వచ్చి అక్కడ కూర్చున్న భూసురుని చూచి "మున్నుగ వచ్చిన బాటసారులెట నున్నా"రని అడిగిరి. యమభటుల వంటి వారిని దొంగలని తెలిసియు, తెలియదని చెప్పినచో అసత్య దోషమని భావించి, బాటసారులు దాగిన పొదలను చూపినాడు దొంగలు వారిని బయటకు లాగి పురుషలను హింసించి, స్త్రీల మానముల హరించి హింసించి దోచుకొని పోయారు. ఆ తెరువరుల మాన ప్రాణ ధనంబులు పోవడానికి ఆ విప్రుని సత్య వాక్యమే గదా కారణం. కాబట్టి అట్టి ఆసత్యం దోషంగా పరిణమించి నరకం ప్రాప్తించింది.

**శ్లో॥ 'త్యజ ధర్మ మ ధర్మంచ! ఉభే సత్యానృతే త్యజ**
**ఉభేసత్యానృతే త్యక్త్వా! యేనత్యజసితత్త్యజ'**

సన్యాసులకు దేహాభిమానం ఉండదు. వారు వైరాగ్యంచే పుణ్యపాపాలను, సత్యాసత్యాలను వదలుతారు. అన్నింటిని వదలిన వెనుక యుద్ధాంతంలో కలవాలాన్ని వదిలే శూరునిలాగ ఆ వైరాగ్యాన్ని కూడా వదలుతారు. మన సన్యాసి అట్టి వాడైనచో దొంగలకు ఈ క్రింది రీతిగా ఉత్తరమిచ్చి ఉంటారు. "నీవడిగిన వారెటనున్నారో యోచించే మనసు చలించదు కాన దానికి తెలియదు. తన వారిచే చేయించదు. చూచే కన్నులకు వచించే యోగ్యతలేదు. వచించే వాక్కునకు చూచే సామర్థ్యంలేదు. కాబట్టి నావల్ల మీకు ప్రయోజనం లేదు. మీ దారిని పొండు" అన్నాడు. ఇందు సత్యం చెడకుండా, అసత్యం ఆడకుండా పాప కార్యాన్ని వర్జించడం జరిగింది.

గడ్డితో కప్పబడిన కూపము వలె, కపట ధర్మాలతో కొందరు మోసగిస్తుంటారు. ధర్మతత్వజ్ఞుడు అట్టివాని గ్రహించి జాగ్రత్తగా మెలగాలి. ఒక్కొక్క పుడు మనుజుని యోగ్యతననుసరించి ధర్మసూక్ష్మాలు నిర్ణయించాలి.

ఆ విప్రుడు ఆ దొంగలను చంపే శక్తిలేని వాడు కాబట్టి నిరపరాధులకు అపాయము కలుగ కుండా అనృత మాడినాడు. అట్టి సందర్భమే ఒక మహావీరునకు తటస్థించినచో అతడు అసత్యమాడకుండా ఆ దుర్జనుల నిర్జింపవచ్చుగదా!

కురుక్షేత్ర సంగ్రామంలో ద్రోణుని వధించే ఉపాయాన్ని ఆలోచించి కృష్ణుడు ధర్మజునితో "అశ్వత్థామ చచ్చె"నని చెప్పమని ప్రోత్సహించాడు. అజాతశత్రువు ధర్మమూర్తి కాబట్టి అంగీకరించలేదు. అంత కృష్ణుడు "ధర్మరాజా! ప్రాణరక్షణ సమయంలో బొంకిన సత్యంబయగు. ద్రోణుడు యుద్ధము చేసినచో యిక్కడి యోదులొక్కరు కూడా మిగలరు. ఇందరి ప్రాణాలను రక్షించే కార్యం కాబట్టి ఇది అకృత్యం బెట్లగు? మరొండు ఉపాయము కలదు. మాళవేంద్రుని అశ్వత్థామ అను పేరుగల ఏనుగు మారుతి చేత చచ్చినది నెపంబుగ చెప్పు" మని అనేక విధాల నొక్కి వక్కాణించగా తుదకు సమ్మతించి ధర్మరాజు ద్రోణుని దగ్గరకెళ్ళి ఎలుగెత్తి "అశ్వత్థామ హతః" అని చెప్పి, "కుంజరః" అని మెల్లగా ద్రోణునికి వినరాకుండు నట్లుగా పలికినాడు. ధర్మజుడు సత్యవ్రతుడు కాబట్టి ఆతని మాటలు నిజమని నమ్మి ఆ కుంభసంభవుడు దిగులుతో ఇంక ఈ జన్మవేటికని యెంచి, ధనుర్బాణాలను త్యజించి యోగనిష్ఠలో అసువులను బాసి, జ్యోతి రూపంలో పరమపదానికి చేరినాడు. ఈ అసత్యదోషం చేత యుదిష్ఠిరునకు యమలోక దర్శనం ప్రాప్తించింది. ఇతడు బలవంతుడై కూడా బొంకుటచేత కదా! అనృతదోషం ప్రాప్తించింది.

**శ్లో॥ సత్యం బ్రూయత్ ప్రియంబ్రూయాత్**
**న బ్రూయాత్ సత్యమ ప్రియమ్**
**ప్రియంచ నానృతం బ్రూయాదేష**
**ధర్మ స్సనాతనః"**

సత్యాన్ని పలకండి. ప్రియమైన మాటలు మాట్లాడండి. అప్రియమైన మాటలు సత్యములైనా పలకకండి. అట్లని ప్రియమైన మాటలేగదా! అని అసత్యాన్ని పలకకండి. ఇదియే మన సనాతన ధర్మం.

# 81. మతము

ప్రపంచములో గల మతాలకు లెక్కలేదు. ఒక్కొక్క మతంలో అంతశ్శాఖ లెన్నో ఉన్నాయి. హిందూదేశంలో వైష్ణవం, శైవం, శాక్తం, గణపత్యం, సౌరం, కాపాలికం అనే ఆరు మతాలు ప్రసిద్ధములైనవి. బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాం వగైరా మతము లెన్నో ఉన్నాయి. మతమననేమి? ఇన్ని మతాలు ఉండడానికి కారణమేమిటి? పరిశీలిద్దాం.

మతమనగా అనుష్ఠేయ ధర్మాలు. అనుష్ఠేయ ధర్మాలలో కొన్ని తమకు నచ్చక పోవడంచేత కొందరు వాని విడిచి తమ ఆచరణీయాలకు ఒక క్రొత్త పేరు కల్పించారు. మరికొందరు ఏవో కొన్ని రుచి చూపి తమ సంఘంలో చేర్చుకొని అభివృద్ధి చేస్తుంటారు. శాఖోపశాఖలుగా మతం వృద్ధి చెందడానికి ఇదే ముఖ్యకారణం. ఇట్లెన్ని శాఖలుగా ఏర్పడినా నష్టంలేదు గాని వాని మూలంగా కలిగే మతాంతర ద్వేషం, కలహాలు మొదలైన హేయ, పాప కార్యాలకు హేతుభూతమౌచున్నవి.

మత స్థాపకులు మహాధీమంతులు. భగవత్సాన్నిధ్యానికి సులభ మార్గమని, వారికి అనుభవపూర్వకంగా కలిగిన నమ్మకంచే పలు మార్గాలను సూచించారు. గమ్యస్థానం ఒక్కటే అయినా వారివారి నమ్మకాలను బట్టి వేరువేరు మార్గాలను ఎన్నుకున్నారు.

**శ్లో॥ 'అల్లాదేవో పూజానమాజః**
**ఖాజీ విద్వాన్ పండిత స్త్రముల్లా**
**ఖల్వామంత్రం వేదశాస్త్రం ఖురాణాం**
**భాషా భేదోనైవ శాస్త్రేషుభేదః**

మహమ్మదీయులు, దేవుని అల్లాయని, పూజను నమాజని, విద్వాంసుని ఖాజీయని, పండితుని ముల్లాయని, మంత్రాన్ని ఖల్వాయని, వేదాలను ఖురానని వ్యవహరిస్తారు. భాషా భేదమైనంత మాత్రాన శాస్త్రభేదం పొసగుతుందా? బియ్యాన్ని తండులమని, అరిసి, చావల్, రైస్ అని భాషాంతర పర్యాయపదాలు కలిగినంత మాత్రాన వస్తువుగాని, వస్తుతత్త్వం గాని, మారదు

కదా! అట్లే మతం లెన్నియైనా అందలి ధర్మాలు మాత్రం పవిత్రంగా ఒక్కటిగానే ఉంటాయి. సర్వజన సమ్మతాలు కాని మత ధర్మాలను మతము అని పిలవజాలము. అటువంటివి నామమాత్రములేగదా?

చ॥ దయయును సత్యమున్ మనుజధర్మము సర్వమతంబులందు బెం
పయి విలసిల్లుగావున బ్రపంచమునందు మతంబులన్నియుం
బ్రియమున నాదిదేవుని స్మరించెదు నట్టివె యంచు నందఱన్
నయమున జూచు నాతడె జనంబుల ధన్యుడు భూతలంబునన్

క॥ అన్ని మతంబులు ప్రియమను
చున్నను నొక మతమునందె యుండగవలయున్
గ్రన్నన నొక త్రోవనుబో
కున్నను గమ్యమును జేరనోపునె యెవడేన్.

పాండురంగని దివ్య క్షేత్రంలో శివభక్తపరుడైన ఒక కంసాలి ఉండెను. అతడెల్ల వేళలా విఠలుడు శంకర కింకరుడనియు, పాండురంగని భక్తులు వివేక విహీనులంటూ, నీచులంటూ పనికిమాలిన మాటలు పలికేవాడు.

శ్లో॥ మద్భక్తశ్శంకర ద్వేషీమద్వేషీ శంకరప్రియః
తావుభౌ నరకం యాంతియావచ్చంద్ర దివాకరౌ

అనే భగవంతుని వాక్కును లెక్కపెట్టడు.

చ॥ రసము నెఱుంగు కోకిల తిరంబుగ మావి చివుళ్ళ మెక్కెడిన్
విసువక కాకి రావులను వేములబొడ్డు రసంబెఱుంగమిన్
వసుధగుతర్కవాంఛ గలవారలు దేవునెఱుంగరంచుదు
ర్వ్యసనము దర్కమున్విడెదు నాతడె ధన్యుడు భూతలంబునన్.

అను ఉత్తమ నీతి వాక్యాలను స్మరించేవాడుకాడు.

ఇట్లుండగా ఆ పట్టణంలో కృష్ణ భక్తుడైన ఒక భక్త శిఖామణి, ఆ భక్త వత్సలునికి ఒక మకుటం చేయించి అర్పించాలనే కుతూహలంతో శైవుడైన సొన్నారి దగ్గరకు వచ్చి కావలసిన రత్నాలిచ్చి ఒక రత్నం మకుటాన్ని రంగనాధునకు చేసి యిమ్మని కోరినాడు. కంసాలి కొలత తెచ్చి యిచ్చిన

చేసి యిచ్చెదనని వ్రాక్కుచ్చినాడు. ఆ భాగవతుడు అట్లే కొలత తెచ్చి యిచ్చాడు. రత్నకిరీటం పూర్తయింది. భక్తుడా కిరీటాన్ని భగవంతునికి సమర్పించడానికి, పూజాద్రవ్యాలతో, మంగళవాద్యాలతో తీసుకొని పోయి అలంకరింపగా అది చాలలేదు. మిక్కిలి చింతించి, మరలా ఆ కిరీటాన్ని కంసాలి కిచ్చి "నీవు చేసి యిచ్చిన కిరీటం విఠలునికి ధరింపగా చాలలేదు. నేనిచ్చిన కొలత తగ్గించి నలుగురులో నా మానము తగ్గించితివి. ఇది నీకు ధర్మమే!" అన్నాడు. ఆ కంసాలి "ఇదేమి విచిత్రం. నీవిచ్చిన కొలతే చేశాను. నా దోషంలేదు. పోనిమ్ము మరలా చేసి యివ్వగలను. ఎంత చాలకున్నది" అన్నాడు. రెండగుళాలు చాలకున్నదని ఆ భక్తుడన్నాడు. తరువాత రెండగుళాల వలయం అధికంచేసి ఇచ్చాడు. స్వామికి ధరింపగా రెండంగుళాలు ఎక్కువైనది. తిరిగి వచ్చి, కంసాలితో నీవిచ్చిన కిరీటం బుడుంగున స్వామి తల దూరిపోయింది. వదులని చెప్పగా కంసాలి విసిగి 'నావల్లకాదు. నా వద్దకు రాకు పొమ్మన్నాడు.

కొంతమంది భక్తులచట చేరి, వారి సంభాషణ విని, ఆ కంసాలితో "ఓయీ? నీవే రంగనాథుని ఆలయానికి వెళ్ళి అతని తల కొలత తీసుకోవడం మంచిది" అని చెప్పగా అతడు నా ప్రాణం పోయినా ఆ గుడిలో ప్రవేశించ నన్నాడు. చివరకు పెద్దల మాటను కాదనలేక అంగీకరించి, కన్నులకు గంతలు గట్టుకొని పాండురంగని ఆలయానికి పోయి, స్వామి సన్నిధిలో నించి రుక్మిణీశుని శరీరాన్ని తన చేతితో తడిమినాడు. ఆశ్చర్యం. విచిత్రంగా రంగనాథుడు లింగాకారుడైనట్లు అతని కరస్పర్శకు అగుపించింది. "ఏమిది. నా కుల దైవమైన వామదేవుని వాసుదేవునిగా నెంచి కన్నులు గప్పి ద్రోహం చేసితినే" అని కొలత కోసం కన్నులు తెరచి చూడగా లింగమూర్తి మరలా రంగనాథమూర్తియై కనిపించాడు. అతడు తటాలున కన్నులు మూసుకున్నాడు. పొరబాటున రంగనాథుని చూచి పాపం చేశాను గదా? అని పరితపించాడు. మరలా కన్నులు మూసుకొని కొలత తీసుకోవడానికి ప్రయత్నించగా మరలా మాధవుడు లింగమూర్తిగా హస్తములకు తగిలినాడు. కంసాలి ఇతడు శివుడేనని నమ్మకంతో కన్నులు తెరచినాడు. అంతలో విఠలుడై కనిపించాడు. ఇక నాతడు మరలా కనులు కప్పుకొనలేదు. అతని మదికి ఒక మెరపు మెరసింది.

**కః హరిహరభేదము లెంచక**
**హరిహర నామమ్ము లొకని కైనవయనియా**
**హరిహర నామము మదిలో**
**నిరతము భజియించు సుగుణనిధిగగుబుద్ధీ!**

అని తనను కుబుద్ధీ? అని సంబోధించుకొన్నాడు. హరిహరులు ఒక్కటే నని గుర్తించినాడు. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదని పరిదేవనం చేశాడు. హరిహరతత్త్వం అతనికి సుబోధకమైంది.

కబీరుదాసు మహమ్మదీయుడైనా శ్రీరామచంద్రుని పాదసేవలో, రామనామ సంకీర్తనలో తరించినాడు. ఒకనాడు రామనామ సంకీర్తనా పరవశుడై కబీరు గోల్కొండలో సంచరిస్తుండగా నవాబు విన్నాడు. మన మతానికి వ్యతిరేకమైన దైవ స్మరణ చేస్తున్న నామమాత్ర తురుష్కుడైన కబీరును కారాగారంలో బంధించండని నవాబు ఆజ్ఞాపించాడు. భటులు చెరసాలలో పెట్టి కాపలా కాస్తున్నారు. మరుసటి రోజు ప్రాతఃకాలం కబీరు తంబుర వాయిస్తూ రామనామ సంకీర్తన చేస్తూ యథారీతిగా వీధుల వెంట సంచరిస్తున్నాడు. అది నవాబు చూసి, కారాగారానికి వెళ్ళి చూడగా పారావాంద్రు అప్రమత్తులై యున్నారు. శాలకు వేసిన ముద్రలు అట్లే ఉన్నవి. అనుమానంతో తెరచిచూడగా అందు కబీరు మాత్రం లేడు. అద్భుత ఆశ్చర్యాలకు లోనై నవాబు కబీరు చెంతకు పరుగెత్తి, అతని శిష్యవర్గంలో చేరినాడు. మతమేదైనా భగవంతుని సన్నిధికి చేర్చే మార్గాన్ని తెలుపుతుంది. దేవుడు ఒక్కడే వివిధ రూపాలలో నున్నాడు.

**చః ఇలను వసించునప్పుడెయ నేక నృపాలురరాజ్యముల్మహిం**
**గలవని నమ్మి పైకిజని కాంచిన నంతయు నొక్కభూమిగా**
**దెలిసినయట్లు, కొంచెము మతింబరికింప మతంబు లన్నియుం**
**దెలియు నభేదలీలనసుధీరుడు ధన్యుడు భూతలంబునన్.**

# సుజ్ఞాన బోధిని (నాల్గవ భాగము)

## 82. దేవుడు

దేవుడు మనకు విచిత్ర దేహాన్ని ఇచ్చియున్నాడు. ఈ దేహ యంత్రాన్ని పెక్కు సాధనలచే నిర్మించి, కొన్నింటిని మన అధికారానికి లోబరచియున్నాడు. మరికొన్నింటిని తన అధీనంలోనే ఉంచుకున్నాడు. ఇంకొన్నింటిని మనం విజ్ఞానయుక్తులయ్యే కొద్దీ క్రమక్రమంగా మన స్వాధీనం చేయుచున్నాడు.

**ఉ॥ "ఇచ్చిన గీదు లేమియును; నీయమిగష్టముగల్గు వానిపై**
**నిచ్చెను గొంత యేలుబడి; యిచ్చిన గీడె దొసంగు వానినిన్**
**మచ్చికదానె నద్భుతము మానుగ రక్షణసేయు టెంచుచున్**
**హెచ్చగు భక్తితోడ జగదీశుని గొల్చెదువాడు ధన్యుడౌ"**

ఈ దేహ యంత్ర కారకుని బుద్ధిబలాన్ని వర్ణింప ఎవరితరం గాదు. ప్రపంచంలోని సర్వవస్తువులు పాంచ భౌతికాలు. ఈ భూత సమ్మేళనంతో రకరకాల క్రొత్త వస్తువులను మానవులు సృష్టిస్తారు. కాని వాటికి ఎఱుక, జ్ఞప్తి, ఇంగితజ్ఞానం మొ॥ వానిని కలిగించలేరు. మనుజునిచే సృష్టింపబడిన వస్తువుకు కార్యమొక్కటే; అది చేసిన దానినే మరల మరల చేస్తుంటుంది. భగవంతుడు కల్పించిన వస్తువులకు ఒక్కొక్క దానికి పలు కార్యాలు, పలు విధములు; పెక్కులు; సర్వశక్తిమంతుడైన భగవంతుడు ఒక్కడే;

**చ॥ "కనబడు పంచభూతములు కార్య మొనర్చుటయందుఁదత్క్రమం**
**బును బొరపాటులేక వడిబూనికగా నొనరించుచుండవే**
**మనుజుని యంత్రకర్మములు మానవుడుండియుఁ దప్పునొక్కచో**
**గనుక సమస్త భూతతతి కర్తను నమ్మినవాడు ధన్యుడౌ"**

ఒక వస్తువు యొక్క తత్త్వాన్ని, దాని ప్రయోజనాన్ని పరిపూర్ణంగా తెలుసుకోలేము. ఒక వస్తువును పలు విభాగాలుగ విభజించి అందు ఒక్కొక్క తత్త్వాన్ని గూర్చి యోచించే శక్తి కూడా మనకు లేదు. ఇక ప్రపంచ కర్తయైన దేవుని తెలుసుకోవడం సుసాధ్యమా?

ఈ దేహంలో ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు ఉన్నాయి. వీటిపై మనస్సు, దానిపై విజ్ఞానం (బుద్ధి) అధికారం కలిగి వుంటుంది. శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు జ్ఞానేంద్రియాలచే తెలుసుకోబడతాయి. కోరేది మనస్సు. మంచి చెడులను తెల్పేది విజ్ఞానం. మనస్సును విజ్ఞానవశం చేసి మానవుడు పరమాత్మ స్వరూపుండైన భగవంతుని తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. అతడు ఇంద్రియాదులకు అగోచరుడు. మనస్సునకందదు. విజ్ఞానము చేతనే తెలుసుకోగలము. కావున ఎల్లరకు విజ్ఞానసంపాదనం ఆవశ్యకం.

అట్టి విజ్ఞాన సముపార్జనకై విద్యాలయాల్లో విద్య నభ్యసించాలి.

**చ॥ "భువనమె పాఠశాల; యట బొల్చెడు జీవులె బాలు; రాజగ**
**త్రృవరుడె యొజ్జ; యీ ప్రకృతి గ్రంథము; జన్మములెత్తు టెల్లనం**
**దు వెలయు భావ్యమౌ తరగతుల్; పఠనీయము నీతివిద్య; యిం**
**దెవడు కృతార్థుడౌ నతడె హృష్టుడు ధన్యుడు భూతలంబునన్"**

ప్రపంచమనే పాఠశాలలో జీవులే విద్యార్థులు. దేవుడే గురువు. ప్రకృతియే పుస్తకం. ఒక ఉన్నత పాఠశాలలో చదివే వెంకటేశు అనే విద్యార్థి ఉదయాన్నే లేచి దైవ ప్రార్థన చేసుకొని ప్రకృతి శాస్త్రాన్ని పఠిస్తున్నాడు. అచటికి పద్మనాభుడనే మరొక విద్యార్థి వచ్చి తదేక ధ్యానంతో చదువుచున్న వెంకటేశుని చూచి ఇట్లన్నాడు.

పద్మ :- ఏమది? నిశ్చల చిత్తంతో చదువుచున్నావు?

వెంక :- ప్రకృతి శాస్త్రము

పద్మ :- పరవశంతో చదువుచున్నావు. అందులో ఏముంది?

వెంక :- ఇంతకంటె ఉత్కృష్టమైనది లేనేలేదు. ఇందు భగవంతుని గుణగణాలు, అలౌకిక శక్తి విమర్శనీయము. అందువల్ల పరవశంతో చదువుచున్నాడను.

పద్మ :- ప్రకృతిశాస్త్రం సర్వం స్వాభావికంగా కలుగుతుందని, కర్త అనవసరమని బోధిస్తుంది కదా! సర్వము అందరు చూస్తున్నారు గాని

భగవంతుని ఎవ్వరు చూశారు? అనుమాన ప్రమాణాలతో దేవుడున్నాడని చెప్పినంతలో ఏమి ప్రయోజనం?

వెంక :- సెబాసు! ఇంత చదువు చదివి నీవు గ్రహించినది ఇంతేనా? నీకు విమర్శక జ్ఞానమే లేదని నాకు తోస్తున్నది. లోకేశ్వరుడు విజ్ఞానంతో మాత్రమే దర్శనీయుడు.

పద్మ :- లోకంలో ఎందరు విజ్ఞానులు లేరు?

వెంక :- నేను గొప్పవాడని గర్వింపలేదు కాని నీ నాస్తిక వాదానికి చింతిస్తున్నాను.

పద్మ :- చేయదగిన పనులెన్నో యుండగా వాటిని వదలి నిష్ప్రయోజక మైన పనిలో తగుల్గొన్న నీ విషయంకన్నా శోచనీయం కలదా!

వెంక :- చాలు, చాలు నీ మాటలు. జగత్కర్త లేకుంటే ప్రొద్దు పుట్టునా? తెల్లవారునా ?

పద్మ :- నీ మాటలలాగే నీ దేవుడు కూడ. ప్రొద్దు పుట్టిన పిదప తెలవారక ఎలా ఉంటుంది.

వెంక :- భాషా సాంప్రదాయాలు తెలుసుకోలేని వారు ఇక భగవంతుని ఎలా తెలుసుకోగలరు? సూర్యుడు ఏ శక్తిచేత ప్రకాశిస్తున్నాడు? ఎవని ఆజ్ఞ మేరచే వేళ తప్పక ఉదయిస్తున్నాడు?

పద్మ :- స్వభావసిద్ధముగా!

వెంక :- స్వభావమననేమి?

పద్మ :- పుట్టుకతో వచ్చిన గుణం.

వెంక :- సూర్యుడు ప్రకాశింపకున్నచో నీవేమి చేస్తావు?

పద్మ :- ఈ చొప్పదంటు ప్రశ్నలేల? ప్రకాశింపక ఉండడానికి ఏమి కారణముంది?

వెంక :- ప్రకాశించుటకున్న కారణమే? అదటుండనీ! మానవ నిర్మిత యంత్రం చెడిపోతే ఏమిచేస్తాం.

పద్మ :- మరమ్మతు.

వెంక :- అట్లాగే ప్రకాశయంత్రం తప్పినచో మరమ్మతు చేసేదెవరు?

పద్మ :- అది చెడదు.

వెంక :- ఏల?

పద్మ :- (నిరుత్తరుడైనాడు)

వెంక :- మిత్రమా! కర్త లేకుండా ఏదీ కలుగదు. నీవు బడికి వేళ తప్పకుండ వెళ్ళుటకు కారణమేమి? ప్రధానోపాధ్యాయుని దండన భయమేకదా? సూర్యుడు ఎవ్వని ఆజ్ఞచేత వెలుగుచున్నాడు? వాయువు ఎవ్వని ఆనతితో వీస్తున్నాడు? పృథివి ఎవని ఉత్తరువు అతిక్రమించక సర్వప్రాణులను భరిస్తున్నది? అగ్ని ఏ భయంచేత జ్వలిస్తున్నది? మేఘములు ఎవ్వని శాసనంతో వర్షిస్తాయి? కర్త లేక సక్రమంగా జరుగు కార్య మొక్కటి చూపగలవా?

పద్మ :- సరేలే! తెలిసి తెలిసి ఇంకేల వ్యర్థవాదం. నీవు దేనిని దైవమను చున్నావో దాన్నే నేను స్వాభావిక మనుచున్నాను.

వెంక :- అది నేనొప్పుకోను. భగవంతుని శాసనం చండశాసనం. ఆ శాసనాన్ని నీవిప్పుడు స్వాభావిక మనుచున్నావు. వృశ్చికానికి (తేలు) కుట్టడం స్వాభావికం. అది దైవ మెట్లవుతుంది? ఒక్కొక్క వస్తువుకు ఒక్కొక్క నైజగుణ ముంటుంది. దాన్నిబట్టి కర్తలు అనంతములని అంటే కార్య కారణ సంబంధమైత్రి అంగీకరింప వీలుపడదు.

**చ॥ కనబడు భూత పంచకము కర్మములెల్ల దలంప బూర్ణధీ**
**ఖనియగు యంత్రకారకుడొకండు గలండని వేయి నోళ్ళతో**
**బొనుపడ జాటవేయని, కుబోధల పొంతను బోకయీ జగ**
**జ్జనకుని మానసంబున బొసంగ నుతించెడువాడు ధన్యుడౌ.**

**ఉ॥ బంధురబుద్ధి నారసిన వస్తు పరస్పరమైత్రి, వాని సం**
**బంధము నేర్చి చేసిన సమంచిత కార్యముగాగ, వీన నే**
**సంధిని నెట్టి కార్యము పొసంగుటెఱింగిన ఫక్కిదోచ నా**
**పంథ యెఱింగి యవ్విభుని భక్తిని గొల్చిన వాడు ధన్యుడౌ.**

సర్వం నైసర్గికమని అన్నచో, సత్య శమ, దమ, అహింసాది సద్గుణాలు అనవసరములు. నరుడు చేసే దురితాలకు విధించే రాజదండనాన్ని, అమిత ధన వ్యయంతోనో, లేదా దొంగ సాక్షులతోనో తప్పించుకొన్నచో వానికి పాపభయం లేదు కదా! ఇంతేల! త్రాడు తెగిన గాలిపటం లాగా, పెద్దలకు లొంగని పుత్రుని లాగా, ఇష్టానుసారంగా నాస్తికుడు వర్థిల్లు. అస్తికుడు ముకుత్రాడు గట్టిన గోవువలె, పాపభీతితో ధర్మబద్ధుడై పెద్దలు చెప్పినట్లు నడచుకుంటాడు. ఇందులో నీకు ఏది సమ్మతము?

పద్మ :-

**చ॥ "తెలివి యొకింత లేనియెడ దృప్తుడనై కరిభంగి సర్వమున్**
**దెలిసితినంచు గర్వితమతిన్ విహరించితి దొల్లి, యిప్పుడు**
**జ్ఞుల మతులైన పండితుల సన్నిధి నించుకబోధశాలినై**
**తెలియని వాడనై మెలగితిన్ గతమయ్యె నితాంత గర్వమున్"**

ఏది నాకు సుజ్ఞాన బోధిని యగు?

వెంక :- సుజ్ఞాన బోధినియే అగు. నీ తల్లిదండ్రులు నీకు పద్మనాభుడను పేరు ఎందుకు పెట్టినారో తెలియునా? భగవన్నామోచ్చరణ కొరకే!

**ఆ॥వె॥ "బిడ్డ పేరు పెట్టి పిలుచుట విశ్రామ**
**కేళినైన మిగుల గేలినైన**
**బద్య గద్య గీత భావార్థములనైన**
**గమలనయను దలప గలుషహరము"**

మనకు బడికి వేళవుచున్నది. కర్తవ్యములు నిర్వర్తించుకొని వెడలుదము.

(ఇద్దరు నిష్క్రమించిరి)



# 83. నీచులు కీర్తిని ఆశించినా రాదు

**శ్లో॥ దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వముచితజ్ఞతా ।**
**అభ్యాసేన నలభ్యంతే చత్వార స్సహజాగుణాః ॥**

మనిషికి పుట్టుకతో వచ్చే గుణాలు కొన్ని, సముపార్జనతో పొందే గుణాలు మరికొన్ని ఉంటాయి. మనో నిశ్చయం, బుద్ధి వికాసం మొదలైనవి సముపార్జనతో వచ్చేవి. దాతృత్వం, మృదుభాషణ, ధీరత్వం, ఉచితజ్ఞత అనే నాలుగు పూర్వజన్మ పుణ్యంతో లభ్యమయ్యే గుణాలు. ఈ కారున పెట్టిన పైరు, మరు కారున అనుభవించునట్లుగా, ఇప్పుడే చేసే పుణ్యపాపాలు, రేపటి జన్మకు అనుభవానికి వస్తాయి. మునుజన్మలో చేసినవి ఈ జన్మలో అనుభవిస్తున్నాము. అకారణ కష్టాలు, సుఖాలు పూర్వజన్మార్జిత పాప పుణ్యాలను బట్టి వస్తాయి. "పూర్వజన్మ కృతం పాపం వ్యాధి రూపేణ బాధతే" అనే శాస్త్రోక్తి ఉందికదా! కాబట్టి మానవుడు భావి సుఖాన్ని గోరి ప్రస్తుతం పాటుపడడం కర్తవ్యం. తాత్కాలిక స్వల్ప సుఖానికై దుష్కార్యాలు చేయడం, ప్రాజ్ఞ లక్షణం కాదు.

జన్మతోనే రాదగిన గుణాలు సత్సాంగత్యం వల్ల కొంత అలవడతాయి. కాని పరిపూర్ణత చెందవు. అట్లని సత్కార్యాన్ని మానరాదు. కార్యారంభమే లేనివానికి ఏ కార్యము కాగలదు?

కర్ణుడు మహాదాత అని విఖ్యాతి పొందినాడు. దుర్యోధనుడది విని అసూయాగ్రస్తుడై "నా మిత్రునకు, సామంతునకు నిట్టి కీర్తి వచ్చుటయు, రారాజునై, ఇంద్రసదృశ విభవుండైన నాకు రాకుండుటయునా? నేనేల యట్టి ప్రఖ్యాతి నార్జింపరాదు? కానిమ్ము! నేడు మొదలుగ నేను దానమున కర్ణుని మించెద" అని నిశ్చయించి – "యే దానము చేసిన తరుగకుండు. ఇచ్చు చుండిన కొదువ వాటిల్లకుండు? లేదనకుండుట చెల్లుచుండు?" అని ఆలోచించి నగరి మొగసాల ఒక పెద్ద పలకపై పెద్ద అక్షరాలతో "దుర్యోధన మహారాజు గారిచే నెందరికైన నెంతయైన లేదనక కాష్ఠ దానము చేయబడును. వలయువారు నిస్సంశయముగ నడిగి ఫలంబు పొందవచ్చును" అని వ్రాయించి కట్టించినాడు.

దుర్యోధనుడేమిటి? దానము చేయడమేమిటి? అన్నదమ్ముల భాగము పంచి ఈయక కపట కృత్యాలతో వారిని పలు ఇడుముల పాలుచేసిన పెను లోభి ఇతరుల కిచ్చుటెక్కడ? ఆరంభ శూరత్వమని జనులనుకున్నారు. కొందరు

మాత్రం కావలసిన కట్టెలు దుర్యోధనుని అడిగి తెచ్చుకున్నారు. అతడు అడవులకు పెక్కుమంది కూలివాండ్రను పంపించి కట్టెలు కొట్టించి తెప్పించి అడిగిన వారికి ఇస్తున్నాడు. కొన్నాళ్ళు అలా జరిగింది. సుయోధనుని పేరు కొంతవరకు వ్యాపించింది.

అనంతరం ఒకనాడు సర్వజ్ఞుడైన శ్రీకృష్ణ పరమాత్మ ఈ వార్తను విని నవ్వెను. "దుర్యోధనుడా? లేదనకిచ్చువాడా? ఇచ్చునది కట్టెలా? మరేవియు గావా? ఇతరములేవీ అడుగకూడదా? మహాదాతయే! మెచ్చుకొనవలసినదే" అని ఒక పెద్ద జడివాన కురిపించాడు. ఉరుములు, మెరుపులతో జనం బయట రాలేక బాధ పడ్డారు. అలా పదునేను దినాలు వర్షించింది. దుర్యోధనుని కాష్ఠదానము పూర్తిగ నిలిచిపోయింది. కట్టెలు నిల్వలేవు.

అట్టి తరుణంలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి సుయోధనుని గంధ, పుష్ప, అక్షతలతో దీవించి "రాజరాజా! నీవు మహాదాతవని మూడు లోకాల్లో నీపేరు వినిపిస్తున్నది. మేఘములురిమిన పండ్రెండు ఆమడలు వినిపించును. దాత దాతృత్వం సచరా చరాత్మకమైన మూడు లోకాల్లో వినిపిస్తాయి.

తే॥గీ॥ "పుణ్యకార్యముల్సేతచే బొడము శబ్ద
మది యిహంబును దివమును నాక్రమించు
నట్టి శబ్దమెంతకు మ్రోగు నంతదాక
దాను బురుషవాచ్యుండుగా దలపబడును"

ఈ ప్రపంచంలో తన పేరున్నంత కాలం అతడు (దాత) స్వర్గభోగా లనుభవిస్తాడు. సార్వభౌమా! నా కుమారునకు వివాహం చేయ తలపెట్టాము. సర్వం సిద్ధమైంది. కట్టెలు మాత్రం కొరవడ్డాయి. తెప్పించేందుకు వర్షం అడ్డంకిగా ఉంది. మీరు కాష్ఠ దాతవని విని వచ్చాను. నాలుగు శకటాల కాష్ఠ దానం మాత్రం చేసి, వివాహ ప్రయోజన పుణ్యాన్ని పొందండి" అనగా విన్న దుర్యోధనుడు కొంత తడవు ఆలోచించి ఇట్లన్నాడు.

దుర్యో :– విప్రవర్యా! పరిగృహీతృ పాత్రతత దాత ఎరిగి దానమీవలసి నట్టులే, యాచకుండును దేశకాల పాత్రంబు లెరిగి గాత నడగాలి.

విప్రు :– ఈ చట్టము ఏ ధర్మశాస్త్రంలో చెప్పబడింది? విప్రుడను, వేద విదుడను. కొమరుని పెండ్లికై యాచించితిని.

దుర్యో :– పదునేను దినాలుగా ఎడతెగకుండా కుంభవృష్టి కురుస్తున్నది. ఆయము నిలిచెను, వ్యయ మెక్కువయ్యెను. వంటచెరకులు కరవయ్యెను. ఇట్టి సమయంలో నీవడుగుచున్నావు. కొంచెం ఓర్చినచో వర్షం తగ్గగానే

కావలసినన్ని తెప్పించి యిచ్చెదను.

విప్రు :- రాత్రికే ముహూర్తం. నిలుప వీలులేదు. ఎట్టులైనా ఇచ్చి పుణ్యం కట్టుకోండి.

దుర్యో :- పిచ్చి బాపడవుగా నున్నావు. వర్షము నిలువక కట్టెలెట్టు వచ్చు?

విప్రు :- దాతవు. నీవు కోరిన లోటేది? నిన్ను నమ్ముకొని వచ్చాను. వ్యర్థపరచకుము.

దుర్యో :- ఏమిటి ఇట్లు మాట్లాడుచున్నావు? కష్టసుఖాలు, సమయా సమయములు ఎరుగవా?

విప్రు :- పెండ్లి సమయము. వర్షము నిలిచినచో నేనే తెప్పించుకోగలను. కొందరు దంభులై దాత్రమ్మన్యులై విర్రవీగుచు, తెగబారెడు బిరుదములను దగిల్చికొని, ఎవరైనా అవసరానికి వచ్చినపుడు మెత్తని మాటలతో "ఓయీ! దౌర్భాగ్యుడా! గడియకు ముందు రాకపోయితివే! ఏమి నీ దురదృష్టము! మించినది! రేపు రమ్ము" అని తళుకు మాటలాడి సాగనంపుచుంటారు. అట్టి వట్టి వాగ్దాతలలో చేరకుము. ఇష్టమున్న నిమ్ము. లేకున్న లేదనుము. ఎటకేని పోయెద. లోకంలో దాతలు గొడ్డుపోలేదు.

దుర్యో :- (ఇంచుక కోపంతో) అట్టి మాటలాడవద్దు. యుక్తాయుక్తము లెరుగక అరచువారు ఫలమును పొందలేరు.

విప్రు :- (స్వగతము) ఇతడు మిక్కిలి దురభిమాని. అప్పుడే కోపం వచ్చింది. కానిమ్ము. ఇంతలో విడువను.

(ప్రకాశముగ)

**తే॥ ఒక్కడు చర్మంబు గొంకక యొలిచియిచ్చె;**
**వెన్నెముక నొక్కడిచ్చెను; వేఱొకండు**
**మాంసమిచ్చెను; దేహమ్ము మఱొకడిచ్చె**
**బేరుగోరియెకాదొకో వారి యీవి**

దుర్యో :- ముహూర్తం మార్చుకొన్నచో ఏమి పుట్టి మునుగును?

విప్రు :- దాతల నోట రాదగిన మాటలా యివి?

దుర్యో :- గ్రహీతల లక్షణమా ఇది?

విప్రు :- అయ్యో! మీతో నాకు వాగ్వాదమేల? టక్కరిదాతల నెందరినో చూచియున్నాను. ఇచ్చెదరా? లేదందురా?

దుర్యో :- పిచ్చి బాపడా! తాళిన ఇచ్చెదను.

విప్రు :- తాళ వీలులేదు. ఇప్పుడే.

దుర్యో :- ఏల ఓర్చుకొనరాదు?

విప్రు :- మీరేల ఈయరాదు?

దుర్యో :- వీలులేక.

విప్రు :- నాకు నదియే. సమయమునకు లేనిదేల? ఇకనే వెళ్ళవచ్చునా?

దుర్యో :- మూర్ఖపు పట్టుదల వదలకున్నావే?

విప్రు :- జాగుచేసి మరింత నా కార్యాన్ని చెరపకుము.

దుర్యో :- నీవంటి వానికి లేదన్న ఏమి దోషము?

విప్రు :- మంచిది. ఆ పటమును దీసి వేయుము. నే పోయెద.

దుర్యో :- దానితో నీకేమి పని?

విప్రు :- దానివల్లనే నీతో నాకు పని కల్గినది. నీ బిరుదమును నిలిపికొన చూచితివా! నాలుగు బండ్ల కట్టెలిమ్ము. లేదా దానిని తుడిచివేయుము.

దుర్యోధనుడు గుటకలు మ్రింగుచు చేయునది లేక "నేటితో నా దాన కీర్తి మాసె గదా"? అని చింతిస్తూ ఆ బిరుద ఫలకాన్ని తీయించెను.

అటనుండి ఆ వృద్ధ విప్రుడు కర్ణుని గృహానికి వెళ్ళినాడు. కర్ణుడు ఆ భూసురుని కెదురేగి తోడితెచ్చి ఉచితాసనమిచ్చి, అతిథి సత్కారాదులు జేసి అతని రాకకు కారణమడిగినాడు. అతడు తన ఉదంతాన్ని సవిస్తరంగా వక్కాణించినాడు. కర్ణుడు సంతసించి పెండ్లికి కావలసిన నాలుగు బండ్ల కట్టెలను గజ, అశ్వశాలల భవనాలను గొట్టించి బండ్లు నింపించి సంతోషంతో సాగనంపినాడు.

ఆ బ్రాహ్మణుడు ఆ బండ్లు తోలుకొని దుర్యోధనుని నగరి వాకిట త్రోవలో వచ్చాడు. సుయోధనుడది చూచి విస్మయంతో ఎవరిచ్చారని అడిగినాడు. దానకర్ణుడు ఇచ్చినాడని వృద్ధ విప్రుడు ప్రత్యుత్తరమిచ్చినాడు. ఇట్టి తరుణంలో అతడెట్లు ఇవ్వగలిగాడని దుర్యోధనుడు మరలా ప్రశ్నింప గజ అశ్వశాలలు కొట్టించి అందలి ఎండు కట్టెలు చీల్పించి యిచ్చెనని ఆ విప్రుడు బదులిచ్చి బయలుదేరినాడు.

"నాకట్టి సాలలు లేవా? ఆ తెంపు నాకేల పుట్టదయ్యె? దాతృ శబ్దము కర్ణునకే చెల్లును". అని సుయోధనుడు విషణ్ణచిత్తుడై, మ్లానవదనుడై మాళిగలోనికి వెళ్ళినాడు. కాబట్టి నీచులు కీర్తిని ఆశించినా రాదు.

# 84. కృతజ్ఞత

పరులు చేసిన మేలును మరచిపోకుండా ఉండటాన్ని కృతజ్ఞత అంటాం. ఇది సజ్జనుల లక్షణం. పరోపకారం కీర్తిని ఆలవాలం. కృతజ్ఞత సత్ప్రవర్తనకు పట్టుగొమ్మ.

**శ్లో॥ ప్రథమవయసి పీతం తోయమల్పం స్మరంతః**
**శిరసిని హితభారా నారికేళా నరాణాం**
**సలిల మమృతకల్పం దద్యురా, జీవితాంతం**
**న హి కృత ముపకారం సాధవో విస్మరంతి**

నారికేళ వృక్షాలు తమకు చిన్ననాట పోసిన కొద్దిపాటి నీటిని స్మరించుచు, శిరస్సుపై బరువు మోస్తూ, తమ జీవిత పర్యంతం పెంచిన వారికి అమృత తుల్యమైన కొబ్బరి నీటిని అందిస్తున్నది. సాధువులు తమకు చేసిన ఉపాకారాన్ని ఎన్నటికీ మరువనే మరువరు.

తమ పని పూర్తయ్యేవరకు నక్క వినయాలు చూపించి, తమ కార్యం పూర్తికాగానే వదలిపెట్టడం, మరచిపోవడం ధూర్తుల లక్షణం. అది కృతఘ్నత అనబడుతుంది.

**క॥ గురువును వైద్యుని నావికుఁ**
**బరిణయమగు పిదప జననిఁ బాపులు గలకన్**
**దెరలింతురు పని ముగియుదు**
**జరపకు మీవట్టులెపుడు సద్విద్యార్థీ!**

**గీ॥ కల్పలత యేది యరయ లోకంబునందు?**
**మంచి శిష్యుని జూచి నేర్పించు విద్య.**

కావుననే గురుధర్మమున –

**శ్లో॥ సంవత్సరం తదర్థంవా మాసత్రయ మథాపివా ।**
**పరీక్ష్య వివిధోపాయైస్తేన శిష్యం పరిగ్రహేత్ ॥**

ఒక సంవత్సరం కాని, లేదా ఆరు మాసాలైనా, తుదకు మూడు మాసాలైనా విద్యార్థిని పలురకాలుగా పరీక్షించి ఆపైన శిష్యునిగా పరిగ్రహించాలని చెప్పబడింది.

కన్నతండ్రి ఒక్కడే తండ్రికాదు. సమయానికి అప్పిచ్చి ఆదుకున్నవాడు, ఉపనయం చేసినవాడు, విద్యాభ్యాసం చేయించినవాడు, కరువులో అన్న వస్త్రాదులిచ్చి పోషించినవాడు, ఆపదలలో భయాన్ని పోగొట్టినవాడు పితృ సమానులు. రాజు భార్య, గురు భార్య, అన్న భార్య, మిత్రుని భార్య, భార్య తల్లి, ఈ ఐదుగురు మాతృ సమానులు. వీరిని మరచినవాడు కృతఘ్నుడని, జీవచ్ఛవమని పిలువబడతాడు.

కర్ణుడు కుంతీపుత్రుడైనా తల్లిచే విడువబడి, సూతునింటిలో పెరిగి, క్షాత్ర విద్యలన్నీ నేర్చి, అస్త్ర విద్యలో అసమానుడైనాడు. దుర్యోధనుడు అర్జునునకు సమఉద్దీగా కర్ణుడు ఉండగలడని అతన్ని చేరదీసి, అంగరాజ్య మిచ్చి, తనయంత వానిగా చేసి, అత్యంత మైత్రితో మెలగినాడు.

కపట ద్యూతంలో పాండవులు ఓడి, ధర్మానికి కట్టుబడి పదియు రెండేడులు వనవాసం, ఒక ఏడు అజ్ఞాతవాసం పూర్తిచేసి, న్యాయంగా తమకు రావలసిన సగ రాజ్య భాగాన్ని అడగటానికి శ్రీకృష్ణుని రాయబారిగా దార్త రాష్ట్రుల చెంతకు పంపినారు. శ్రీకృష్ణుడు ఎంత చెప్పినా, భీష్మాదులు నొక్కి చెప్పినా వినక దుర్యోధనుడు కర్ణుని బలాన్ని నమ్మి కౌంతేయులతో యుద్ధానికి సిద్ధపడ్డాడు. అంత కృష్ణుడు మరలి వచ్చేటప్పుడు రహస్యంగా కర్ణుని కలసి ఇట్లన్నాడు.

"కర్ణా! నీవు కుంతీ పుత్రుండవు. సూత పుత్రుండవు కావు. పాండవులు నీ తమ్ములు అతి ధర్మాత్ములు. దుర్యోధనుడు దుశ్చరితుడు. వానిని వదలి నీ తమ్ములను కలుసుకొనుము. నిన్ను సామ్రాజ్యానికి అభిషిక్తుని చేయగలరు. ధర్మరాజు యువరాజై నీకు ధవళ చామరము వీచగలడు. భీముడు ఛత్రము పట్టగలడు. సవ్యసాచి సారధ్యము చేయగలడు. ఇది సమస్త బంధుమిత్రులకు ప్రియంబగు. కాదనక అంగీకరించి నాతో రమ్మనెను". అంతట రాధేయుడు మాధవునితో ఇట్లన్నాడు.

"కృష్ణా! కుంతిమాత నన్ను నిర్దయతో పుట్టిననాడే వదలి పెట్టగా, సూతుడు పెంచినాడు. ఆ సూత దంపతులు నన్ను ఎంతో గారాబంగా పెంచి పెద్ద చేశారు. అట్టివారిని వదలుట ధర్మమా! అంతేగాక -

ఉ॥ "సూతసుతుండు వీడనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతియొనర్చి తేజమును బెంపును నాటికి నాటి క గ్గలం
బైతనరార నన్ను దనయంతటి మానిసి జేసియుండ నే
నే తగవూదియా కురుకులేశ్వరు బాయుదు ముట్టవచ్చినన్"

అర్జునునికి పెన్నుద్ది అని నమ్మి దుర్యోధనుడు నన్ను అంగరాజును చేశాడు. ఆ రారాజు నమ్మికను వమ్ము చేయుట కంటే వేరొక పాతకము గలదా! నేను యుద్ధములో అర్జునుని ఎదిరింపకున్న భూజనులు నవ్వరా! నేను పాండవపక్షము చేరిన అర్జునకును, నాకును అపకీర్తి కలుగు. స్వామి ద్రోహము చేసి, తమ్ముల పక్షము రాజాలను. నన్ను మన్నింపుము. నా జన్మ రహస్యాన్ని అతి గుప్తముగ రక్షింపుము.

తే॥గీ॥ ధర్మ తనయుండు తాను నా తమ్ముడగుట
యెఱిగె నేనియు సామ్రాజ్య మేలపూను?
నట్టి దార్మికుదాధిపత్యంబు సేయ
వలవదే శాశ్వతంబుగ వసుధ యెల్ల

పుణ్యభూమియైన కురుక్షేత్రంలో మావంటి వారెల్ల సద్గతి పొందుదురు గాక! పాండవుల క్షేమాన్ని, రాజద్రోహాన్ని తలంచి రానంటున్నాను. నమ్ముము" అని కర్ణుడు పలుకగా, కృష్ణుడు కర్ణుని వీడ్కొలిపి తిరిగి ఉపప్లావ్యమునకు చేరినాడు.

తదనంతరం కౌరవ పాండవులకు భయంకర యుద్ధం జరిగింది. పాండవులు తమ సోదరులని తెలిసినా, పాండువులు గెలుతురని భావించినా, దుర్యోధనుడు చేసిన మేలు మరువక కర్ణుడు రణములో ధైర్యంగా అర్జునునితో పోరాడి లోకులు తన కృతజ్ఞతను ప్రశంసించేటట్లు వీరస్వర్గమలంకరించాడు.

ఆహా! చూచితిరా! కర్ణుని కృతజ్ఞత! అతని రాజభక్తి! ధర్మానురక్తి! ఇట్టివారే భరతమాతకు సుపుత్రులు. కావున చేసిన మేలు మరువక కృతజ్ఞత కలిగి యుండాలి.



# 85. ఆంధ్రబాష

చ॥ "చదువది తొల్లి శాంతిపర సంతతి వంతల బాచుచుండె దా
బదపడి గామలోల జనపాళి సుఖంబులు గూర్పజొచ్చెన
య్యది మతిశాస్త్ర దూరమతుతౌ పతులిప్పుడుపేక్షసేయగా
బొందుపతినాడు నాటికిని బ్రుంగుచు గ్రుంగుచు నున్నదక్కటా"

"దేశ భాషలందు తెలుగు లెస్స" అని కీర్తింపబడిన మన ఆంధ్రభాష వేదకాలము నుండి ఉంది. ఇది తేనె వంటి మధురభాష (తేనె+అగు) గాన తెనుగని, త్రిలింగ మధ్యదేశాన ప్రాచుర్యంలోనున్న భాష కాబట్టి త్రిలింగ భాషయి, తత్ శబ్ద వికృతి తెలుగుభాషయని పిలువబడుచున్నది. తెలుగు భాష సంస్కృత జన్యము కాదు. ద్రావిడ భాషా కుటుంబానికి చెందినది. పలు భాషాపదాలతో విస్తరిల్లినది.

మ॥ 'మహిమున్ వాగమ శాసనుండు సృజియింప గుండ లీంద్రుండు త
న్మహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున దత్ప్రాగల్భ్య మూహించెదన్'

అని శ్లేషోక్తిగా రామరాజభూషణుని చేతను, "Itation of the East"అని ఆంగ్లేయుల చేత, కొనియాడబడిన గొప్పభాష మన ఆంధ్రభాష. "శిరీషకుసుమ పేశలమై, పుట్టతేనె రుచులుట్టిపడె, స్వచ్ఛమై, సరళమై, సకలఫల చంపకము వలె సరస సౌంగధ్య సన్నిపాత సముద్గారిణియై, అశేష జన శిరఃకంప కారణధోరణీ విరాజయైనది మన తెలుగు భాష" అని ఆంధ్రభాషాభిమానులు వక్కానించారు.

ఈ ఆంధ్రభాషకు ఇంత గౌరవం రావడాని కారణం అందలి వర్ణక్రమ ఉచ్చారణా సౌలభ్యమే.

అరవమందు (తమిళం) ఇతర భాషలలోని ఴ అక్షరమొకటి ఉంది[1]. ఇక వర్గాక్షరాలలో వర్గప్రథమాక్షరాలు, పంచమాక్షరాలు (అనునాసికం)

---

1. అది మన తెలుగులోని 'ఱ' కారమును పోలిన అక్షరం. ప్రాచీన తమిళంలో ఉండేది.

మాత్రమే ఉన్నాయి. కావున ఉచ్చారణ కష్టతరమైంది. బేబరని రాసిన బాలుడే మరలా అద్దానిని పేపరని చదువును. పక్కం, పగ్గం, చంకర, శంకర, సంగర మొదలైన పదములలో అనుభవజ్ఞులకే ఒక్కొక్కసారి ఉచ్చారణ దోషము సంక్రమిస్తుంటుంది.

ఇక రాజభాష[1] ఆంగ్లమును గూర్చి చెప్పనవసరం లేదు. వ్రాత ఒక రీతి. వర్ణధ్వని మరొక రీతి. ఉచ్చారణ వేరొక రీతి. ఒకే అక్షరము పలురకాలుగా ఉచ్చరింపబడుతుంది. అందు అచ్చులు ఐదు మాత్రమే. వాక్య భాగములు (Phrases) పెక్కులు. ఆంగ్లేయుల పాలనలో వ్యావహారిక భాష కాబట్టి ఎల్లరకు అవశ్యపఠనీయము.

మన విద్యార్థులు ఆంగ్లేయపదాలను, మన భాషలో సంక్రమింపజేసి, ఆంధ్రభాషను సంకరపరచుచున్నారు. "అమ్మా! school కు Bell అయింది. Teacher punish చేస్తాడు. నీ Father call చేస్తున్నాడు. నేను Monday నాటికి వస్తాను. ఆ పూలగుత్తి Rainbow colours display చేస్తున్నది. Half yearly లెక్కల paper చాలా tough గా వుంది. ఇత్యాదులు శ్రవణ సంకటకాలు. అపహాస్య భాజములు.

ఈ సందర్భంగా విద్యార్థులకు మరొక హెచ్చరిక చేయవలసి వస్తున్నది. ఆంగ్లేయులు మన భరతఖండమందలి పట్టణనామాలను, వారికి నోరు తిరగక కాబోలు వికృతిగావించుయున్నారు. పుణ్య నగరము 'పూనా' అయినది. లక్ష్మణపురి 'లోక్నో'గా మారింది. కాళీఘట్టము' కలకట్టా'గా పరిణమిల్లినది. పాటలీపుత్రం 'పాట్నా'గా మారింది. కడప 'కుడ్డప'గా రూపాంతరమొందింది. ఇట్టి ఆంగ్లేయ వైకృత పదములను ఆంధ్రమున కలిపి కర్ణకఠోరము చేయవలదు.

**కం॥ భాషలలోన, ననుత్తమ**
**భాష తెనుగుగాన, నట్టి భాషామణికిన్**
**వేషము మాఱిచి సంకర**
**యోషగ జేయకుము సుగుణయుత విద్యార్థీ.**

---

1. ఈ వ్యాసం 1931లో వ్రాయబడింది. అప్పటి రాజభాష ఆంగ్లము.

కం॥ ఆ దేశస్థులు నవ్వగ
నీ దేశస్థులను నవ్వ నింపుసెడగ భా
షాదైన్యము వొరయుట యే
లాదోపదు భాషపై జలమ విద్యార్థీ.

మన ఆంధ్రభాష విషయంలో ఇంకొక ఇక్కట్టు కలదు. ఉన్నత పాఠశాల విద్యార్థులకు సైతం ఒక్కొక్క అక్షరము తెలియకున్నది. కారణమేమనగా ఇప్పుడు అనుసరించే నూతన పద్ధతి. అచ్చులు, హల్లులు, సంశ్లేషాక్షరాలు క్రమంగా నేర్పించకుండ, పదముల ద్వారా అక్షరాలను నేర్పడం వల్ల కొంత సౌలభ్యమున్నా, బాలుర శంకలకు మాత్రం కొదవ వుండదు. ఆధునికులు మార్పులు చేయునపుడు తరువాతి సంకటాలను కూడా ఆలోచించాలి.

మన పూర్వులు ఈ వర్ణక్రమాన్ని ఏల ఏర్పరచిరో ఆలోచిద్దాం. ప్రాణి కోటి నోరు తెరవగానే మొదట "అ" పుట్టుచున్నది. ఆ శబ్ద దీర్ఘము 'ఆ' అగుచున్నది. అడ్డముగ వదన గహ్వరము తెరచిన 'ఇ' పుట్టుచున్నది. దాని దీర్ఘము 'ఈ' అయింది. పెదవులను కూచిచేసి శబ్దింపగా 'ఉ ఊ' లుత్పన్న మౌతాయి. కొననాలుక కొంచెం అణచిన 'ఋ, ౠ' శబ్దనులగుచున్నవి. మరల నాలుకను ఎక్కువగా పై కదిమిన 'ఌ,ౡ'[1] లు ఏర్పడ్డాయి. ఆపై ప్రాణాక్షరాలు పుట్టుటకు వీలు లేనందున మొదటి అక్షరం, మూడవ అక్షరం (అ+ఇ) కలిపి ఎత్వంబును కల్పించారు. ఇదే క్రమంలో అ + ఈ = ఏ, అ+ఉ=ఒ, అ+ఊ=ఓ, మొదలైనవి ఏర్పడ్డాయి. ఇట్లు ప్రాణవర్ణములు (అచ్చులు) ప్రకృతిసిద్ధంగా ప్రాణి నోటినుండి పుట్టుచున్నది. ఈ క్రమమును చెరపరాదు.

జిహ్వాగ్రాన్ని, మూర్థమును అదిమిన 'ఋ, ౠ' ఏర్పడినట్లుగానే, నాలుక మొదటిభాగాన్ని అదిమిన 'క' ఏర్పుడును. ఆ ధ్వని నొత్తిన 'ఖ' అవుతుంది. 'క' కారమును సరళంగా ఉచ్చరిస్తే 'గ' కారమౌతుంది. దాన్ని ఒత్తి పలికితే 'ఘ' కారమౌతుంది. ఇట్లే సర్వవర్ణములు స్వభావ సిద్ధంగా ఉత్పన్నమౌచుండగా, ఆ వర్ణక్రమాన్ని మార్చి, వర్ణక్రమ వ్యత్యయము చేసి

1. నేడు ఈ అచ్చులు వాడుకలో లేవు.

పదములు నేర్పుట ప్రకృతి విరుద్ధం. బాలురకు కష్టతరము. ప్రకృతి సిద్ధములే కదా! బాలురకు శ్రేష్ఠం.

**శ్లో॥ 'నాదేన వ్యజ్యతే వర్ణం పదం వర్ణాత్పదాద్వచ**
**వచసో వ్యవహారేయం నాదాధీనమతో జగత్'.**

భాష అంటే మనుజులు పరస్పరం తమ భావాలను వ్యక్త పరచడానికి నిర్ణయించిన శబ్దసముదాయం. ఒక్కొక్క శబ్దం అక్షర రూపాన్ని పొంది వర్ధిలుతున్నది. అక్షరములు పదములై, పదములు వాక్యములై, మనోభావాలను వెల్లడిస్తున్నవి. ప్రకాశవంతమైనదని భాషా శబ్దార్థము. కులకాంతవలె సహాయకారిణి కాబట్టి భాషా శబ్దం స్త్రీ లింగ పరంగా వాడబడుచున్నది. చక్కని భాషాజ్ఞానం గల పురుషుడు పండితుడనబడుచున్నాడు. పండితుడై లలిత మృదుమధుర పదజాలముతో, తనభావాలను వ్యక్తపరచే వ్యక్తి కవిగా పరిఢవిల్లుచున్నాడు.

సరస్వతి విద్యారూపిణి, విద్యాధి దేవత. ఆ చదువుల తల్లికి –

**సీ॥ "అ స్వరమవుదల యా ఫాల మిద్వయి**
**శ్రవణ యుగ్మంబు కారములు రెండు**
**గన్నులు ఋత్వయుగంబు చెక్కులు ఌ వ**
**ర్ణ ద్వంద్వముభయ దంతచ్ఛదములు**
**వక్రము ల్భుజములు వక్రతమాక్షరం**
**బులు కక్షములు సున్నలలిత గళము**
**పటునిసర్గములురో భవ సూచకంబులు**
**కచవర్గములు పాణి కరరుహములు**

**తే॥గీ॥ టాదులైదును గూడ బృష్ఠము చతుర్థ**
**వర్గము దరంబు పంచమ వర్గజములు**
**జఘన మంతస్థలిపులు నూష్మములు నంఘ్రు**
**లేవదూమణికట్టి వాగ్దేవి గొలుతు"**

ఉత్తమ భాషాజ్ఞానాన్ని పొందగోరు విద్యార్థులు పాఠశాలలలోని పఠనీయ గ్రంథాలతోనే పాండిత్యాన్ని పొందలేరు. పాఠశాలలో భాషాజ్ఞానము అలవడే మార్గాన్ని మాత్రమే నేర్చుకోగలరు. మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవ పాండవీయుము, పాండురంగ మహాత్మ్యము, శృంగార నైషధము అను ఆంధ్ర పంచకావ్యాలను క్రమంగా చదవాలి. వీనితోపాటు వ్యాకరణ శాస్త్రము, ఛందశ్శాస్త్రము, అలంకారశాస్త్రం, కావ్యలక్షణాలు అభ్యసించాలి. పదపడి భారత, భాగవత, రామాయణాది మహాగ్రంథాలను చదవాలి. సుప్రద్ధ కవులచే రచింపబడిన నాటకాలు కూడా చదవాలి. నీతిదాయకమైన వచనకావ్యాలు కూడా చదవవచ్చు.

ఆంధ్రభాషలో అమితంగా సంస్కృత శబ్దాలు చేరియుండుట చేత సంస్కృత భాషాజ్ఞానము కూడా మనకు ఆవశ్యకమై ఉంది. ఒక భాషయందు జ్ఞానము లభించిన మరొక భాషలో జ్ఞానాన్ని పొందడం సులభం.

**తే॥గీ॥ ఆంధ్రుడను నేను నాయది యాంధ్రభూమి**
**యనుచు నుప్పొంగి తనబాస నభ్యసింప**
**కలసుడైమను పీనుగు లలినుపేక్ష**
**సేయు వాదాలి విడిలంజె జేరువాడు.**



# 86. కాలప్రభావము

చ॥ కాలమ జనుల సృజించును
గాలమ రక్షించు ద్రుంచు గాలమ చూడన్
మూలము ముమ్మూర్తులకును
గాలము సుఖదుఃఖ కారకము విద్యార్థీ!

రక్షకుని నమ్మి వానిననుసరించి వానిచేతనే మృతి చెందునట్లుగా, ప్రాణులు కాలమును నమ్మి దాని వాతను పడుచున్నారు. పాము నోటిలోని కప్ప తన దురవస్థను ఎఱుగక తన్ను సమీపించే పురుగులను పట్టడానికి ప్రయత్నించే రీతిగా, భయంకర సర్పం వంటి కాలం జీవులందరిని మ్రింగుచున్నది. నాకు ఇరవైయేండ్లు, నాకు ఇరవై ఐదు వత్సరాలు గడిచినాయని మురుస్తున్నాము. గాని మృత్యువుచే పాతిక మ్రింగబడితియనే విషయాన్ని మరుస్తున్నాము. మన కళ్లముందే ఎందరో మృత్యువాత పడుతున్నా, మనం మాత్రం శాశ్వతంగా ఉంటామనే భ్రాంతిని వదలలేకున్నాం. అదే మాయ. మానవుని ఆయువు వంద సంవత్సరాల పరిమితి కలది. అందు సగం రాత్రి నిద్రకు సరిపోవుచున్నది. మిగిలిన యాభై వత్సరాలలో, యుక్తాయుక్త విచారజ్ఞాన శూన్యమైన బాల్యం, మరియు వ్యర్థమైన వార్ధక్యంతో పాతిక వత్సరాలు గడిచిపోతాయి. ఆ మిగిలిన పాతిక సంవత్సరాలు ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక తాపత్రాయాల చేతను, సంసారమాయలో, సుఖ దుఃఖాలచే పరిభ్రమిస్తూ, నిష్ప్రయోజనంగా గడిచిపోతున్నది. జనన మరణచక్రం నుండి గట్టెక్కి శాశ్వత సుఖాన్ని అనుభవించే దెప్పుడు? ఈ అయువు మనలను కీలుబొమ్మలుగ చేసి ఆడిస్తున్నది. కాలచక్రం నిలిపినా నిలువదు. నిర్దయగలది. తిరిగిరానిది.

క॥ భుక్తికి గల చదువులనే
రక్తిజదివి కొలువు గొలువ రాణచెలగునే?
భుక్తికి గుక్కలు గొలువవె
ముక్తిచదువె చదువు ముఖ్యముగ విద్యార్థీ!

కు॥ చదువున్ననేమి? నేర్వగు
గద! నేననువస్తువు మనకాయంబునను
న్నది యెచ్చటనో నేరని
చదువు చదవ సార్థకంచె? సద్విద్యార్థీ!

ఉశీనర దేశాన్ని పరిపాలించే ఉయజ్ఞుని రాజ్యాన్ని ప్రత్యర్థులు దండెత్తి వచ్చి ఆక్రమించారు. శత్రువులతో పోరాడి ఆ రాజు వీరస్వర్గం అలంకరించాడు. ఆతని సతులు ఆరాజు శవాన్ని చూచి దుఃఖంతో "నాథా! మాకిక దిక్కెవ్వరు? ఉశీనర ప్రజలకిక ప్రభువెవ్వరు? నీ పుత్రుల పరిరక్షించే వారెవ్వరు? నిన్ను విడిచి నిమిషమైనా జీవించలేము. అగ్ని జొచ్చి నీవెంట వచ్చెదము" అని బహుప్రకారములు విలపిస్తున్నారు. ఆ రాణుల చెంతకు యముడు బాలుని రూపంలో వచ్చి ఇట్లన్నాడు.

ఉ॥ మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము దేహి పుట్టుచున్
జచ్చుచునుండ జూచెదరు చావక మానెదు వారి భంగినీ
చచ్చిన వారికేడ్చెదరు చావున కొల్లక డాగవచ్చునే
యెచ్చటబుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణి కోటికిన్'

మాకిక దిక్కెవ్వరంటున్నారు. మును మాతృగర్భంలో నున్నప్పుడెవ్వడు పోషించెనో వాడే ఎల్లప్పుడు మిమ్ముల రక్షింపగలడు.

ఆ॥ వె॥ ధనము వీధిబడిన దైవ వశంబున
నుండు బోవుమూల నున్న నైన
నడవి రక్షలేని యబలుండు వర్థిల్లు
రక్షకుండు మందిరమున జచ్చు.

ఒక చెట్టుపై ఒకరాత్రి పక్షులన్నీ గుమిగూడి మరునాడు వేకువనే స్వేచ్ఛగా పలుదిక్కులకు పరుగెత్తునట్లుగా, మనుజులు పాంచభౌతిక దేహాన పూర్వకర్మవశాన వర్తించి కాలంతీరగానే వెళ్ళిపోతారు. కర్మానుబంధంతో భార్యాపుత్రులు, మిత్రులు, ధనధాన్యాదులు వస్తుంటాయి. కర్మతీరగానే ఆ సంబంధాన్ని వదలి వెళ్ళిపోతారు. తత్వజ్ఞులు ఈ విషయాన్ని ఎరిగి వగవరు.

పూర్వం ఒక మహా అరణ్యంలో పక్షులను వేటాడే బోయవాడు ఉదయాన్నే లేచి వేటకు కావలసిన వలలు, ఉరులు, విల్లునమ్ములు మొదలైన పరికరాలన్నీ తీసుకొని పక్షులవేటకై వెళ్ళి పలు రకాల పక్షులను పట్టి విహరిస్తూ ఒక అడవి పిచ్చుకల జంటను చూశాడు. వలపన్నాడు. అందులో ఆడపిచ్చుక చిక్కింది. మగ పక్షి చూచి ఈ విధంగా దుఃఖించింది. "కట కటా! అడవులలో దొరికే మేత తింటూ, అన్యుల కెగ్గుచేయక, ఇట విహరించుచున్న నిన్ను ఆ క్రూరుడైన బ్రహ్మ కిరాతుని చేతిలో బడేటట్లు వ్రాసెనే! దైవానికి నీ బ్రతుకు ఇంత బరువయ్యెనే! ఒకసారిగ మనలందరిని తీసుకొని పోరాదా!"

ఉ॥ తెక్కలు రావు పిల్లలకు తేపటి నుండియు మేత గానమిన్
బొక్కుచు గూటిలో నెగసిపోవగ నేరవుమున్ను దల్లియీ
దిక్కున నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కినిక్కిన
ల్దిక్కులు చూచుచున్న వతిదీనత నెట్లు భరింతునక్కటా!

అని కుంఠితనాదంతో కంఠము శోషిల్ల దుఃఖిస్తున్న ఆ పక్షిని కూడా ఆ లుబ్ధకుడు ఒక్క బాణం వేసి నేలకూల్చినాడు. కాబట్టి కాలము సమీపించి నపుడు నేలకూలక తప్పించుకొనుట ఎవరితరము గాదు.

అని ప్రబోధించిన కపటబాలకుని పలుకులు సుయజ్ఞని బంధువులంతా విని సర్వప్రపంచం నిత్యంగాదని భావించి, శోకం మాని రాజు శవానికి ఉత్తరక్రియలు చేశారు. బాలుని రూపంలో నున్న యముడు అంతర్ధాన మైనాడు.

క॥ పగిలిన మృద్భాండంబును
బొగులక వర్జింపవలయు బోయిన దానిన్
దిగవిడిచి యవల నేడ్చుట
నగుబాటగు గాదె చూడనయ విద్యార్థీ!

క॥ మొదటున కొయ్యలు రెండొక
నదిగట్టున గలిసియుండు నదిలో బడగా
వదలుచు గలియుచు దొరలును
నిదిగని చింతింపనేల, హిత విద్యార్థీ!

# 87. దత్తాపహారము కూడదు

ఒకరికొక అక్కరకు ఏదేని యిస్తామని చెప్పి, అడినమాట తప్పరాదు. అది పాతకంలో గొప్పపాతకం. మనం సమయానికి ఇస్తామని నమ్మి, వారు దానికి తగిన కార్యముల సరిచేసుకుంటారు. లేదా మన మాటను నమ్మి మరొకరికి మాట ఇచ్చి ఉంటారు. మన చెప్పి తప్పితే వారు చేయవలసిన కార్యాలు చెడిపోతాయి గదా! మనవల్ల వారు ఇచ్చిన మాట తప్పిన వారౌతారు. తాజెడ్డకోతి వనమెల్ల జెఱచు' అన్నట్లుగా తాను అనృతవాది కావడమే కాకుండా, ఇతరులకు కూడా అనృతదోషం సిద్ధిస్తుంది. కావున సాధారణ అనత్యం కంటె దత్తాపహారం (అడి తప్పుట) ఎక్కువ పాపాన్ని సమకూర్చుతుంది.

గోవు వలన పెక్కు ఉపయోగాలున్నవని బాలురకు తెలుసు. గోహత్య మహాపాతకమని కూడా ఎరిగియుంటారు. "నా పుస్తకమెవరైన అపహరించినచో కాశిలో గోవును జంపిన పాపమున బోవుదురు గాక" అని కొందరిప్పటికి తమ పుస్తకాలపై వ్రాసుకుంటారు. గోహత్య మహా పాతకమని నొక్కిచెప్పడానికై పై వాక్య ఉదహరించాను. అట్టి గో హత్యలు నూరైతే ఒక బ్రహ్మహత్య అవుతుంది. బ్రహ్మహత్యలు నూరైన ఒక స్త్రీ హత్యకు సమమవుతుంది. అట్టి స్త్రీ హత్యలు నూరైన ఒక శిశుహత్యతో సమానమౌతుంది. అట్టి శిశు హత్యలు నూరింటికి ఎంత పాపమో అంత పాపం ఆడినమాట తప్పుట వల్ల కలుగుతుందని ఆర్యులు అంటారు. ఎట్టి పాపినైనా నేను భరిస్తాను గాని ఆడి తప్పిన వానిని మాత్రం నేను భరించలేనని భూదేవి బ్రహ్మతో చెప్పినదట! రావణ సంహారం తర్వాత శ్రీరామ చంద్రమూర్తి లంకాపురం రామణీయకమును - చూస్తూ, ప్రాకార గోపుర ద్వారం ముందట పఱచిన మరకత శిలావేదిక చూశాడు. "దీన నయోధ్యకు గొనిపోయిన బాగుండు" అని లక్ష్మణునితో అన్నాడట. ఆ తరుణంలో సమీపంలోనున్న బుద్ధిమంతుడైన జాంబవంతుడు శ్రీరాములవారికి ఈ క్రింది శ్లోకం చెప్పాడు.

**'ఇంద్రంద్వ్యక్షమ మంథపూర్వ ముదధాం పంచాననం పద్మజం**
**సింధ్రు శుద్ధజలం శివం సితగళం లక్ష్మీపతిం పింగళం**

శైలాన్ పక్షధరాన్ హయానపితథాకా మంచసద్విగ్రహం
జానే సర్వమిదం శ్రుతం రఘుపతే దత్తాపహారం వినా.'

సహస్రాక్షుడు కాకయుండినప్పటి ఇంద్రుని, దేవదానవులచే మధింపబడని పాలవెల్లని, శుద్ధజల సహితమైన సముద్రాన్ని, నీలకంఠుడు కాకముందటి శివుని, పింగళ దేహుడైయుండిన విష్ణువును[1], రెక్కలు కలిగియుండిన కొండలను, గుఱ్ఱాలను నేనెఱుగుదుగాని, దత్తాపహారమును మాత్రం ఇంతవరకు కనివిని ఎరుగలేదన్నాడు.

శ్రీరాములవారు అతని మాటలను ఆదరించి వెనుకకు మరలెనట!

పూర్వం హరిశ్చంద్రుడు ఆలుబిడ్డలను గోల్పోయి కాటికాపరికావడం, బలచక్రవర్తి వామనునికి చెప్పిన మాటకు కట్టుబడి తన సర్వస్వాన్ని కోల్పోవడం, శిబిచక్రవర్తి తన శరీరంలోని కండలు కోసి డేగకివ్వడం, ధర్మరాజు భార్యాతమ్ములతో పదియురెండేళ్ళు అడవులలో ఇడుములు పడడం, ఆడితప్పరాదనియే కదా!

ఇక్ష్వాకు మహారాజు కుమారుడైన నృగుండు మహాదాత. తారకావళిని లెక్కపెట్టవచ్చు గాని అతడు చేసిన గోదానాలను లెక్కపెట్టలేము. తొలిచూలు ఆవుల గిట్టలను, కొమ్ములను స్వర్ణమయం గావించి, వేదవిహితకర్మలొనరించే పేద బ్రాహ్మణులకతడు సదక్షిణ గోదానమిచ్చేవాడు. మరియు బహువిద దానాలను బీదసాదలకు చేసేవాడు.

ఒకనాడు కశ్యపుడను బ్రాహ్మణుడు ఆ రాజుదగ్గరకు వచ్చి తాను కొన్ని లక్షణాలు చెప్పి అట్టి లక్షణాలు గల గోవును కోరినాడు. అతడు చెప్పినట్టి ఆవును ఏరి తెప్పించి నృగుడు కశ్యపునకు యిచ్చాడు. అతడా గోవును ప్రీతితో పెంచుచు ఉదయాన్నే ప్రతిదినం పూజించేవాడు. ఇట్లుండగా ఒకనాడు ఆగోవు తప్పించుకొని తిరిగి రాజు మందలో చేరిపోయింది. రాజుకు ఆ

---

1. విష్ణు భగవానుడు కృతయుగంలో తెల్లనివాడని, త్రేతాయుగంలో కాంచన వర్ణుడని, ద్వాపరంలో రక్తవర్ణుడని, కలియుగంలో నీలమేఘ స్వరూపుడని ప్రమాణము.

విషయం తెలియక మరొక విప్రునకు ఆ గోవును దానమిచ్చాడు. అతడు దానిని ఇంటికి తీసుకొని పోవుచున్నాడు.

సాయంకాలానికి తన గోవు ఇంటికి రాలేదనే బెంగతో కశ్యపుడు గుట్టలు, మిట్టలు, కొండలు, చుట్టుప్రక్కల పల్లెలు వెతికి వేసారి ఇంటికి తిరికి వస్తూ, వీధిలో తోలుకొనిపోతున్న తన గోవును చూచి రోషంతో –"ఓరీ! పచ్చెకాడా! నాయావును దొంగలికొని యెటకేగెదవు? నిలునిలు" అని అదలిస్తూ అడ్డువచ్చి నిలబడ్డాడు. ఆ విప్రుడు కొంత శాంతంతో 'ఓయీ! నిలు నిలుము. తొందరపడి కాఱులు కూయకుము. నేను నృగరాజు వద్ద పరిగ్రహించి నా గృహమునకు గొనిపోవుచున్నాడను. ఇది నీదిగాదు. గౌరవబుద్ధితో తొలగిపో"మ్మన్నాడు. అంత కశ్యపుడు మరింత రోషంతో "నీ దొంగతనమునకు రాజు సాక్ష్యమీయవలయునా? గురుత్వముతో గోవును వదలెదవా? లేక తగిన శాస్తి కావలయునా" అని ఆవును వదలింప బెనుగులాడెను. ఇరువురు హెచ్చుతగ్గులు లేక కలహిస్తున్నారు. ప్రేక్షకులు కొందరు వారిని రాజు దగ్గరకు పొమ్మన్నారు. వారు రాజుకు తమ వివాదాలను విన్నవించారు. ఇది తనవల్ల జరిగిన పొరబాటే అని రాజు అప్పుడు తెలుసుకున్నాడు. ఇరువర్లకు ఒక్కొక్క లక్ష గోధనం ఇస్తానని అనునయింప చూశాడు. ఇద్దరూ ఆ గోవే కావాలని పట్టుపట్టారు. ఆ గోవు తప్ప రాజ్యమిచ్చినా వద్దన్నారు. కశ్యపుని ఆ రాజు ఎన్ని రకాల ప్రార్థించినా వినలేదు. కోపంతో మరలి తన నివాసానికి వెళ్ళిపోయాడు. రెండవవాడు ఆ ఆవును తోలుకొని పోయాడు.

తదనంతరం కొంతకాలానికి ఆరాజు మరణించాడు. యమకింకరులు నృగుని కొనిపోయి తమ ఏలికకు అప్పగించారు. దండధరుడు ఆ రాజును చూచి –

క॥ ఎఱుగమినైనను భూసుర
వరుల ధనంబపహరింప వలవదు పతికిన్
మ ఱుపున ననలము ముట్టిన
దరికొని వెసగాల్పకున్నె తను వెరియంగన్.

నీవు ఎంతో పావనుడై, ఘనదాతగా ధర్మప్రభువుగా పేరుపొందినా, దత్తాపహారము చేశావు కాబట్టి ఆ పాపఫలితంగా ఊసరవెల్లివై కొంతకాలమ నుభవించి పుణ్యలోకానికి చేరు"మని ఆజ్ఞాపించాడు. ప్రాణులు తమ పుణ్యపాపాలను అనుభవింపక తప్పవుగదా!

నృగుడు ఊసరవెల్లియై పెద్దకాలంకడు దురవస్థలను పొంది తుదకు ఒకపాడు బావిలోపడి గట్టెక్కలేక దురసిల్లుచుండెను. ఒకనాడు ప్రద్యుమ్నాదులు యాదవులు ఉద్యానవనంలో క్రీడించి, సలిలములన్వేషిస్తూ, ఆ ఊసరవెల్లి పడియుండే కూపాన్ని చూశారు. అందలి ఊసరవెళ్ళిని చూచి విస్మయ మందినారు. శ్రీకృష్ణునకు విన్నవించినారు.

**చ॥ పరువిడిపోయి తెచ్చి ఘన పాశచయంబుల నంటగట్టి య**
**గ్గురు భుజలందఱుం గదిసికోయని యార్చుచు దాని నెమ్మెయిం**
**దరలగ దీయలేక దగదట్టముగా మదిదొట్టగిల్ల నొం**
**డొరు గడవంగ వేచని పయోరుహనాభున కంతజెప్పినన్.**

అది విన్న శ్రీకృష్ణుడు వెంటనే వచ్చి అవలీలగా ఆ కూపము నుండి ఆ ఊసరివెల్లిని వెలికితీసాడు. శ్రీకృష్ణుని కరస్పర్శచే నృగుండు తన పూర్వరూపాన్ని పొందాడు. ఆ స్వామిని అనేక విధాల కీర్తించి, తన చరిత్రను, యదు కుమారులకు తెలిపి, వారందరి అనుమతితో దివ్యవిమానం రాగా స్వర్గానికి చేరినాడు. కాబట్టి ఆడి తప్పరాదు.



# 88. పంచాంగము

తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు అనబడే ఐదు కాలవిభాగాలకు పంచాంగమని పేరు. తిథి అనునది చంద్రకళల యొక్క వృద్ధిక్షయాలను తెలుపడమే కాకుండా సూర్య చంద్రులకు గల దూరాన్ని సూచిస్తుంది. అమావాస్యనాడు ఇరువురు ఒకే రాశిలో ఉంటారు. పౌర్ణమి రోజు సూటిగా ఎదురై ఉంటారు. ఇక వారము ఆనాటి గ్రహాధిపత్యాన్ని తెలుపుతుంది. నక్షత్రమనేది చంద్ర సూర్యులుండే స్థలాన్ని తెలుపుతుంది. సూర్యుడొక నక్షత్రాన ఉండే కాలానికి 'కార్తె' అని పేరు. సూర్యుడొక రాశిని (21 నక్షత్రాలు) దాటే కాలానికి మాసమని పేరు. మాసంలో చంద్రుడు దినానికి ఒక్కటి చొప్పున ఇరవైయేడు నక్షత్రాలను, మరి రెంటిని దాటుచున్నాడు.

చంద్రుని గతినిబట్టి కాలాన్ని గణించడాన్ని చాంద్రమాస మంటారు. సూర్యుని గతినిబట్టి గణించడాన్ని సౌరమాసమంటారు. బృహస్పతి సంవత్సరానికొక రాశిని దాటుచున్నాడు. ఆ కాలమానాన్ని బార్హస్పత్య మంటారు.

మన ఆంధ్రదేశంలో చాంద్రమాసాన్ని లెక్కిస్తారు. కాబట్టి మనకు తిథులు, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠాది మాసాలు గణనీయములు. చాంద్రమాసం ప్రకారం మాసానికి ఇరవై తొమ్మిది చిల్లరదినాలు. సంవత్సరానికి ఇంచుమించు మున్నూటయాభై నాలుగు దినాలు.

సౌరమానం అరవదేశ వ్యవహార సిద్ధము. సూర్యుడు రాశిలో ప్రవేశించు కాలమే వారి మాసారంభ దినం. మనకు అమావాస్య పోయిన మరుసటి రోజు నుండి మాసారంభం. చైత్ర, వైశాఖాది మాసనామాలు వికృతులైన చిత్రి, వైయాశి మొదలైన నామాలు వారికి సిద్ధములు. ఏ రాశిలో సూర్యుడు ప్రవేశిస్తాడో ఆ రాశిపేరుతో ఆ మాసం వ్యవహరింపబడుతుంది. అవి మేష వృషభాది మాసాలు. సౌరమాసంలో నెలకు ఇరవై యెనిమిది నుండి ముప్పది రెండు దినాలు సూర్యచలనాన్ని బట్టి దినములు స్థిరీకరింపబడతాయి. ఇందు సంవత్సరానికి రమారమి మున్నూట అరవై అయిదు దినాలు. సౌరమాసానికి, చంద్రమాసానికి సంవత్సరానికి పదుకొండు దినాలు హెచ్చుతగ్గులు

ఉంటాయి. ఈ భేదం వల్లనే మూడు సంవత్సరాలకొకసారి అధికమాసం ఏర్పడుతుంది.

ఒక్కొక్కరాశిలో సూర్య శుక్ర బుధులు ఒకమాసం, అంగారకుడు ఒకటిన్నర నెల, బృహస్పతి ఒక సంవత్సరం, శనైశ్చరుడు రెండున్నర సంవత్సరాలు, చంద్రుడు రెండున్నర దినాలు, ప్రదక్షిణంగా సంచరిస్తాయి. రాహుకేతువులు ఒక్కొక్క రాశిలో పదునెనిమిది మాసాలు ప్రదక్షిణంగా సంచరిస్తారు. రాశి అంటే రెండుంపాతిక నక్షత్ర సమూహం. ఇరవైయేడు నక్షత్రాలు పంద్రెండు రాసులుగా విభజింపబడ్డాయి.

సూర్యుడు భూమికి ఉత్తరమార్గంలో సంచరించే కాలానికి ఉత్తరాయణం అని పేరు. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించిన నాటి నుండి కటకరాశిలో ప్రవేశించేవరకు గల కాలాన్ని ఉత్తరాయణం అంటారు. కటకరాశిలో ప్రవేశించినప్పటి నుండి, మకరరాశిలో ప్రవేశించే వరకు గల కాలాన్ని దక్షిణాయనం అంటారు. ఉత్తరాయనం పుష్యమాసంలో (తైనెల మొదటి తేదిలో)ను, దక్షిణాయనం ఆషాడమాసం (ఆడినెల మొదటి తేది)లోను వస్తుంది.

యోగమయిన సంధుల నుండి సూర్యచంద్రులుండే దూరాన్ని తెలుసుకోవచ్చు. విష్కంభాది యోగములు ఇరువదియేడు. ఈ యోగములు నక్షత్ర సంఖ్యనే పొందినందు వల్ల దీని నుండి మరొక సంగతిని మనం గ్రహింపవచ్చు. యోగములు దినమునకొక్కటి వంతుననే వస్తాయి. ఉత్తరాయన సంధిలోని రాశిలో శ్రవణ నక్షత్రం పూర్ణంగా ఉంటుంది. దక్షిణాయన సంధిరాశిలో పుష్యనక్షత్రం ఉంటుంది. ఈ రెండు నక్షత్రాలు నుండే యోగము లెక్క పెట్టబడుతుంది. ఈ నక్షత్రముల నుండి సూర్య చంద్రులున్న నక్షత్రాలను లెక్కించి సంకలనం చేస్తే యోగం తెలుసుకోవచ్చును.

సూర్యగమనానికంటె నక్షత్రగమన వేగం ఎక్కువ. నక్షత్రగతికంటె యోగగమన వేగం ఎక్కువ. సంవత్సరంలో చంద్రుడు పండెంద్రు మారులు చుట్టును. నక్షత్రాలు పదమూడు తడవలు పరిభ్రమిస్తాయి. యోగములు పదునాలుగు మారులు వస్తాయి. ఒక్కొక్క యోగానికి ఇంచుమించు 56-14 గడియలవుతాయి.

క్రాంతి పాదముల నుండి సూర్యచంద్ర నక్షత్రాలను లెక్కించి కూర్చి వారి దూరాన్ని యోగము తెలియజేసినట్లుగా, భూమధ్యం నుండి సూర్య చంద్రులుండే దూరాన్ని లెక్కించి ఆ రెండు స్థలాలకు గల వ్యత్యాసాన్ని కరణము తెలుపుతుంది. భూమధ్యం మేషరాశి. అక్కడ నుండి లెక్కపెట్టి కరణమును తెలుసుకోవాలి. బవబాలవాది కరణములు పదునొకండు, కరణము ప్రమాణం ఇంచుమించు ముప్పది గడియలు కాబట్టి దినానికి రెండేసి వస్తాయి. కరణములు చరములు, స్థిరములు అని రెండు విధాలు. బవ, బాలవ, కౌలవ,తైతుల, గరజ, వణజి, భద్ర అనబడే ఏడును చరకరణములు. ఇవి ఒకటి వెనుక ఒకటిగా మాసంలో బహుళచతుర్దశి వరకు ప్రవర్తిస్తాయి. శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము అనే నాలుగు స్థిరకరణములు. కాన నివి మాసానికి ఒకసారియే బహుళ చతుర్దశి నుండి క్రమంగా వస్తాయి.

పంచాంగంలో ఒకదినంలో గల విశేషాలను వివరంగా తెలుసుకుందాం.

శ్రీ అక్షయనామ సంవత్సర భాద్రపద మాస బహుశపక్షం. (తమిల నెల - పెరటాసి, కన్యా 11వ తేది.) పూర్వాభాద్ర లేక ఉత్తరాభాద్రలో పూర్ణిమనాదు చంద్రుదుండే నెలకు భాద్రపదమని పేరు. సంవత్సర మందు ఇది ఆరవ నెల.

బహుళ షష్ఠి - బహుళ పక్షము చీకటి కాలము, చంద్రునికి క్షీణదశ. పున్నము నుండి నాటికి ఆరు దినములు. చంద్రునికి పదునారు కళలు. అందాలు తగ్గి, ఆనాడు చంద్రుడు 10 కళలతో ప్రకాశిస్తాడు. భాద్రపద మాసం శుక్లపక్షం 15, బహుళ 6 చేరగా ఆ మాసంలో ఇరవై ఒకటవ దినమయ్యింది. పెరటాసి (కన్యా) 11వతేది. సౌరమాసం ఆరవనెల 11వ తేది. సూర్యుడు కన్యారాశిలో ప్రవేశించి 11వ దినం జరుగుచున్నది. సోమ నాడు సూర్యోదయం మొదటి హోర (గంట)కు, చంద్రుడధిపతి కాబట్టి ఆ దినము సోమవారం.

షష్ఠి 23-37 నాడు 23 గడియలు 37 విగడియలు వరకే షష్ఠి. తర్వాత సప్తమి ప్రారంభమౌతుంది.

రో 28-9, సూర్యోదయం నుండి 27 గడియలు, 9 విగడియలు వరకు చంద్రుడు రోహిణీ నక్షత్రంలో ఉంటాడు. పదపడి మృగశిరలో ప్రవేశిస్తుంది. చంద్రుడానాడు వృషభరాశిలో వుంటాడు.

ఆ॥వె॥ చనిన మాసములను జయ్యన రెట్టించి
గత దినంబులందు గలియ గూర్చి
యశ్విని మొదలుగను-నవి లెక్కచేసిన
నిత్య తారవచ్చు నిజముగాను.

జరిగిన నెలల రెట్టించి దానితో జరిగిన దినాలను లెక్కించి దిన నక్షత్రాన్ని కనుక్కోవచ్చును. జరిగిన నెలలు అధికమాసముతో 6. అవి రెట్టింపగా 12. జరిగిన దినములు 20. మొత్తం 32. అందు ఇరువది యేడు తీసివేయగా మిగిలింది 5. ఐదవ నక్షత్రం మృగశిర. రోహిణి 27–9 గడియలపై మృగశిర ఆనాడు వస్తుంది.

సిద్ధి 26–27. సూర్యోదయం నుండి 26 గడియలు, 27 విగడియలు వరకు సిద్ధియోగం. ఆపై వ్యతీపాతం వస్తుంది. 23–37 వణజికరణం. 23 గడియలు. 37 విగడియలు వరకుండును. ఆ మీద భద్ర వస్తుంది.

ది. 8–7. అనగా దివి (పగలు సూర్యోదయమైన తర్వాత) 8–7 గడియలకు రోహిణి యందు ద్యాజ్యకాలం ఆరంభమౌతుంది. రా. 12–30. సూర్యాసమయమైన తర్వాత రాత్రి 12–30 గడియలకు మృగశిర యందు త్యాజ్యకాలం ఆరంభమౌతుంది. త్యాజ్యమనగా విడువదగింది. త్యాజ్యకాలంలో కార్యారంభం చేయరాదు. హ1 అర్కః 3–22 అనగా హస్తానక్షత్ర ప్రథమ పాదం సూర్యుడు 3–22 గడియలకు ప్రవేశించుచున్నాడని అర్థం.

ఉప 1 శు 35. ఉత్తరానక్షత్ర ప్రథమపాదమున శుక్రుడానాడు 35 గడియలకు ప్రవేశిస్తాడు.

భుక్తి 1–44. అనగా సూర్యోదయానికి ముందా 1–44 గడియలు (కన్యా) లగ్నంలో గడచినదని భావం.

చ. 19 చంద్రుడు మనకు గనబడు నాటి నుండి 12 దినములైనవి. ఇది మహమ్మదీయుల మాసం. ప్రతి మాసం శుద్ధ తృతీయ నుండి వారికి మాసారంభము.

పై విధంగా తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములు పంచాంగము నందుండును.

# 89. విధి కంటె మతియెక్కువ

వంగదేశాన్ని బ్రహ్మమిత్రుడనే రాజు పరిపాలించేవాడు. అతనికి చాలాకాలం పుత్రులు లేనందున కులదేవతలకు మ్రొక్కి, మునుల సేవించి, దానములెన్నో చేయగా తుదకు చక్కని కుమారుడు కల్గినాడు. పుత్రోదయంతో ఆ రాజు అమితానందంతో ఉత్సవం చేయించి, బీదసాదలకు పెక్కు దానాలిచ్చి పురోహితుల పిలిపించి నామకరణం చేయించి, దైవజ్ఞులచే జాతకం వ్రాయించాడు. "పదునొకండవ యేట పదవ నెల, పదహారవ దినమున రాత్రి పదునాలుగు గడియల కీజాతకుడు దొంగతన మొనరింపగలడు" అని జ్యోతిష్కులచే వ్రాయబడింది. అది చూచిన రాజదంపతులు మిగుల దుఃఖించి - ఆ విప్రులతో ఇట్లన్నాడు. "దైవజ్ఞుల పల్కులు పొల్లు కాజాలదు. నాకు కుమారుడై యుండి చోరత్వము చేయ వీనికి అవసరమేమి కలదు? వీని దౌర్మార్గ్యము వల్ల వీడు చోరుడు కావలయునే గాని దొంగతనం చేయ వేరొక హేతువున్నదే? వీడు దుష్టుడగుట జూచి యేనెట్లు సహింపనేర్తు? వీని దౌష్ట్యం వల్ల పౌరులు బాధితులగుచుండగా ఎట్లు చూడగలను? ఏమి చేయగలను? చెట్టు తొర్రలో పుట్టిన అగ్ని చెట్టును మాత్రమే దహిస్తుంది గాని కడుపున పుట్టినవాడు కుపుత్రుడైతే కొంపను, కులాన్ని కూడా నాశనం చేస్తాడు.

**శ్లో॥ 'త్యజే దేకం కుల స్యార్థే గ్రామ స్యార్థే కులం త్యజేత్**
**గ్రామం జనపద స్యార్థే ఆత్మార్థే పృథివీంత్యజేత్'**

"కులము కొరకు ఒకనిని, గ్రామము కొఱకు కులాన్ని, లోకానికై గ్రామాన్ని, తన కొరకు పృథివిని వదలాలని పెద్దలంటారు." అని ఇంకా ఏమో చెప్పడానికి ప్రయత్నిస్తుండగా సభలోనున్న ఒక పండితుడు లేచి రాజేంద్రా!

**తే॥గీ॥ జాతకము చూచి చూడక చనుటలెస్స**
**కాంచి మంచి యటన్న జనించునగవు**
**చెడ్డయని చెప్పినపుడె చెందుభయము**
**గాన జాతకంబుల వ్రాత మానుటొప్పు**

అంతేగాక ఎప్పుడో జరగగలదన్న దానికి ఇప్పుడు ఇంత విచారించుట మీబోటి ధీరులకు పాడిగాదు. భీరుడు మాటిమాటికి చావు చావని చింతించి మరణావస్థను పొందుచుండు. ధీరుడు రానున్నవి రాకమానవని నిశ్చల చిత్తంతో వచ్చిన దాన్ని అనుభవిస్తాడు. నరుని బుద్ధి పూర్వకర్మ ననుసరించి ఉంటుంది. ధీరుడు వివేకముతో దానిని త్రిప్పుకోగలడు. సావిత్రి దైవగతిని, తన పతి ప్రాణాలను స్వవివేకంతో మరల్చుకోలేదా! మార్కండేయుడు విజ్ఞానంతో, ఈశ్వరారాధనతో మృత్యువును జయింపలేదా! మూర్ఖులు, నీచులు సైతం గురుబోధచే పాపవర్జితులై యశఃకాయులు కాలేదా! వివేకము మనుజునకు అవశ్య సంపాదనీయము. వివేకము సద్విద్యవల్ల పొందవచ్చు" అనిన రాజుకు చిత్తశాంతి కల్గి సంతసించాడు. "నీవే ఈ బాలకునికి విద్యాబుద్ధులు గఱపి నీతిమంతుని చేయవే" అని ప్రార్థించి, ఆతన్ని సన్మానించి పంపించాడు. కొడుకును మిక్కిలి గారాబంగా పెంచి ఐదవయేటనే ఆ పండితుని రావించి పూజించి అక్షరాభ్యాసం చేయించి ఆ గురువుతోడ గురుకులమునకు రాజు తన కొడుకును పంపించాడు.

ఆ రాకుమారుడు కుశాగ్రబుద్ధి కాబట్టి గురువు చెప్పిన ఉపదేశాన్ని అతి శీఘ్రంగా గ్రహించేవాడు. పదవ సంవత్సరం పూర్తయ్యేసరికి ఆ బాలకుడు సద్విద్యాపారంగతుడైనాడు. ధర్మ శాస్త్రాలన్నీ అతనికి కంఠస్థములై కరతలామలకములైనాయి. పదకొండో ఏడు వచ్చింది. క్రమంగా తొమ్మిది నెలలు కూడా గడిచినవి. రాజు మదిలో కలవరం హెచ్చెను. పదకొండవ రోజు రాకుమారుని వెంటబెట్టుకొని సభకు వచ్చాడు. రాజు ఎదురేగి గురువును గౌరవించి ఉచితాసీనుని చేశాడు. కుమారుని కౌగిలించుకొని అంకపీఠంపై నిడుకొని దువ్వుచు – "తండ్రీ! గురువుల వద్ద ఏమేమి చదివితివి? గ్రంథార్థములు చక్కగా గ్రహించితివా! నీనేర్చిన విద్యా నైపుణ్యాన్ని ప్రసంగింప విందు? అని ఉవ్విళులూరుచుండు. ఏదీ చూతము. నీ కత్యంత ప్రియమైన ఒక పద్యాన్ని వినిపింపుము" అనిన తండ్రిని చూచి ఆ తనయుడు –

**క॥ ఆడుదము మనము హరిరతి**
**బాడుదమే ప్రొద్దు విష్ణు భద్రయశంబుల్**
**వీడుదము దుష్ట సంగతి**
**గూడుదము ముకుంద భక్తకోటిన్ సూటిన్**

అని భాగవతంలోని ప్రహ్లాదుని పద్యాన్ని చదివాడు. జనకుడు ఆనందించి కుమారుని చేత గురువుకు దక్షిణ యిప్పించి, తనయుని నగరికి అంపినాడు. గురువుతో ఏకాంతంగా కొంతసేపు మాట్లాడి నాటి కొలువు చాలించాడు.

రాజకుమారుడు నగరిలో నిరభ్యంతరంగా తిరగడానికి కావలసినది యధేష్ఠముగ చేతికి దొరకేటట్లు ఏర్పాట్లు చేయబడింది. పేరుకు మాత్రమే కోశాగారం బీగములున్నవి గాని ఈ బాలకుడు ఏది చూచినా తెరవబడు చుండెను. పదునైదవ దినం రానే వచ్చింది. కొంత ధనాన్ని తీసుకొని ఎచ్చటికైనా పోవాలనే బుద్ధి అతనికి పుట్టింది. తన దేశ సంచార విషయం తండ్రికి తెలిసినచో పోనీయడని, ధనమీయడని ఆ బాలుడు తలచినాడు. తండ్రికి తెలియకుండా ధనాన్ని తీసుకొని పోవాలని నిశ్చయించాడు. అది రాత్రియందే సాధ్యమని తలపోశాడు. పగలు సైతం అడ్డు లేనపుడు రాత్రి పూట తీసుకొని పోవాలనే ఆలోచన కలగడానికి కారణం ఆతని ప్రారబ్ధమేకదా!

పూర్వజన్మ వాసనచే అతడా రాత్రి సరిగ్గా జ్యోతిష్కులు చెప్పిన లగ్నానికే బయలుదేరి కోశాగారంలో ప్రవేశించాడు. రాజాజ్ఞచే కాబోలు, కావలి వారంతా గాఢముగ నిద్రించు వారివలె నటించారు. ఇదే మంచి సమయమని రాకుమారుడు ద్వారము సమీపించి కవాటాన్ని త్రోచి చూశాడు. గడిలు, తాళాలు వేయబడలేదు. అతని కది చిత్రము, ఆనందప్రదము అయినది. మెల్లమెల్లగా లోనికేగి అన్నింటిని పరీక్షించాడు. అన్నియు ఊరకనే మూయబడి ఉండెను. రత్న పేటికను తెరువ ప్రయత్నించగా తాళపు చెవుల గుత్తి అచ్చటనే బడియుండెను. బయలుదేరిన లగ్నం మంచిదని ఉప్పొంగి రత్నపేటికను తెరచి కొన్ని గ్రహించాడు. 'మణి దొంగలించిన వాడు మరుజన్మమున పులిపిరి యొడలి వాడై పుట్టును' అని తాను చదివినది జ్ఞప్తికి రాగానే వాని నచ్చటనే పెట్టి, మరొక పెట్టె తెరచి కొన్ని బంగారు టంకములు తీసుకున్నాడు. "స్వర్ణమును అపహరించినవాడు పుచ్చిన గోళ్ళను, కుష్ఠరోగము గలవాడై పుట్టు"నని గుర్తుకు వచ్చి వానిని కూడా వదలి వేశాడు. ఇట్లే ఒక్కొక్కటి తీసుకొని దాని నపహరించుట వల్ల కలుగు పాప ఫలితాన్ని స్మరిస్తూ వాటి

అచ్చటనే వదలివైచి, తుదకిట్లని తలపోశాడు. "నేనెందులకింత వెఱ్ఱినైతిని"? ఇందు నా యత్నమే చేయరానిదైనపుడు తత్కర్మ ఫలితాన్ని గూర్చి చింతింపనేల? నా తల్లిదండ్రులను విడిచిపోవుట తగిన పనియా? వృద్ధులైన జననీ జనకులు నాకై పరితపిస్తూ అన్నపానీయాలను వదలి క్రుంగి కృశింప, నేను పొందే భాగ్యమేమున్నది? తల్లిదండ్రులను విడిచి తపమాచరించిన కౌశికుని తపము వ్యర్థం కాలేదా! పుత్రులు మనలను ఆనందవార్థిలో తేల్చి సంసారసాగరం నుండి ఉద్ధరిస్తారని పితరుల అభిలాష. మాతాపితరులను చిత్తహింసకు గురిచేసేవాడు కుపుత్రుడు కాకుండా సుపుత్రుడెట్లవుతాడు. నాకిది తగనే తగదు. నా ప్రయత్నాన్ని వదలి నా విద్యా వివేకాలతో నా జన్మను పవిత్రము గావించుకొనియెద గాక!" అని తన బుద్ధిని మార్చుకొని తిరిగి తన శయనాగారానికి వెళ్ళి సుఖంగా నిద్రించాడు.

ఉదయాన్నే రాజు మేల్కొని, నిదురిస్తున్న కుమారుని చూచి సంతసించాడు. కోశాగారానికి వెళ్ళి వదలబడిన మణులను, స్వర్ణమును చూచి కుమారుని, గురువును రప్పించి, గురు సమక్షంలో రాత్రి జరిగిన చర్య యేమని కుమారుని ప్రశ్నించాడు. ధర్మశాస్త్రాలు చదివిన వివేకి కాబట్టి సత్యపాశబద్ధుడై జరిగిన వృత్తాంతాన్ని పూసగ్రుచ్చినట్లు విన్నవించాడు. రాకుమారునిలో వచ్చిన మార్పుకు తండ్రియు, గురువును బ్రహ్మానందం చెందారు. కాబట్టి విధి కంటె మతి గొప్పది.



# 90. మితము

మితము సర్వకార్యములందు, ఆలోచనలందు, భాషణములందు, ప్రవర్తనమందు తప్పక అవసరం, ఆచరణీయం. 'అతి' అనే శబ్దం ఎచ్చటా పనికిరాదని ఆర్యుల మతం.

**క॥ అతి మూర్ఖుడైన రావణు**
**డతి రూపిణియైన సీత, యలజడి వడరే**
**యతికామి పంక్తిరథుడును**
**నతి యెందును విడిచి నడవ నగు విద్యార్థీ!**

అతిమాత్ర కారణంగా సుయోధనుడు చెడినాడు. హరిశ్చంద్రుడు అవస్థల పాలైనాడు. బలిచక్రవర్తి పదవిని కోల్పోయాడు. కాబట్టి అతి అనేది మనిషికి ఒక శత్రువుగా తోస్తున్నది.'అతి సర్వత్ర వర్జయేత్ అని ఆర్య వాక్కు'.

**ఆ॥వె॥ క్షమయ తాల్చియుండ జనదెల్ల ప్రొద్దుఁదే**
**జంబ తాల్చియుండఁ జనదుపతికి**
**సంతతక్షముండు సంతత తేజుండు**
**నగుట దోషమందు రనఘమతులు.**

సూర్యవరంవల్ల కుంతికి సూర్యుని అంశతో జన్మించిన కర్ణుడు అతి దాని. దానం ఉత్తమ కృత్యమైనా, అతియగుటచేత దానివల్ల చెడు వాటిల్లింది. లోకాపవాదానికి భయపడి కుంతి కర్ణుని ఒక పెట్టెలో పెట్టి నీటిలో విడువగా, సూతుడు గొనిపోయి పెంచి పెద్దవానిని చేశాడు. దుర్యోధనుడు అతని అస్త్రవిద్యా నైపుణ్యానికి మెచ్చి, అంగరాజ్య మిచ్చి మిత్రునిగా చేసుకొని, అర్జునుని భయం నుండి నిశ్చింతంగా ఉన్నాడు. పాండవులు మాయా జూదంలో సర్వస్వాన్ని కోల్పోయి, అరణ్యవాసం చేసే కాలంలో దేవేంద్రుడు "కౌరవ పాండవులకెట్లైన యుద్ధం తప్పదు. అర్జునకు సరియుద్ధి కర్ణుడు. అతడు సహజ కవచకుండలుడు. వానిని పరిమార్చుట సవ్యసాచికి అసాధ్యం" అని నిశ్చయించి, పుత్రుని హితవుకోరి దానరూపంలో రాధేయుని కవచకుండలాలను అపహరింప బూనినాడు.

సూర్యుడు అది గ్రహించి తన పుత్రుని మేలుకోరి విప్రుని రూపంలో వచ్చి కర్ణునితో ఏకాంతంగా "పాకశాసనుడు పాండవ హితార్థియై కపట విప్రుని రూపంలో వచ్చి అమృతమయమైన నీ సహజ కవచకుండలాలను అడుగనున్నాడు. మోసపోకుము. వాని నీయకుము" అని ప్రబోధించాడు. పుత్రునిపై మక్కువతో వచ్చిన సూర్యభగవానునికి అభివాదం చేసి కర్ణుడు ఇట్లన్నాడు. "తండ్రీ! నీవు నా కత్యంత హితవుకోరి వచ్చుటవల్ల కృతార్థుడనైతిని. ఐనను ఒక్క విన్నపాని వినండి.

**ఉ॥ భూసురకోటి వేడుటయు బోడిగ బ్రాణములైననీగినా**
**బాస, దినేశ! లోకమునఁ బ్రస్ఫుట మింతయు నట్లుగావునన్**
**వాసవుడట్టె నన్నడుగవచ్చుఁ బ్రియంపడినాకు నొక్క బ్రా**
**తే? సురలోకవందిత! మదిం గవచంబును గుండలంబులన్.**

క్షణభంగురమైన శరీర రక్షణ కోసం, నా దానవ్రతమును గంగలో కలుపుదునే? కీర్తి కంటె ఆశ్రయింపదగినది ఈ భువనత్రయంలో వేరొందు కలదా? విప్రులకు దానమిచ్చుట, శత్రువుల పరిమార్చుట, శరణన్నవారిని రక్షించుట, స్త్రీ, వృద్ధ, బాలుర, ద్విజుల బాధలను పోగొట్టుట నా ముఖ్యవ్రతములు. కీర్తి కొరకు చావు వచ్చిన చత్తుగాక! వ్రత భంగం చేయజాలను. అంత -

సూర్యుడు :- కుమారా! హితవచనాలను పెడచెవిని పెట్టుట ప్రాజ్ఞ లక్షణం కాదు. చచ్చి ఎవ్వరిని ఉద్ధరించాలి? ప్రాణముండిన అన్నింటిని సంపాదింప సాధ్యమౌతుంది.

**క॥ మృతుడైన నరుడు వెస భ**
**స్మితుడై చనుగాక కీర్తి మేలిమిగనునే?**
**మృత దేహంబునకు నలం**
**కృత సేసిన యట్లు మృతుని కీర్తియు బిదపన్**

కర్ణుడు :- దేవా! మృత్యువుకు భయపడను. అసత్యమాడను. నాపై కరుణించి నా దాన వ్రతాన్ని మాన్పడానికి ప్రయత్నించకుము.

సూర్యుడు :- నీవు సహజ కవచకుండల మండితుడైతే అర్జునుడు నిన్ను జయింపలేడు. ఊరక వానిని కోల్పోయి ఆపదను కొని తెచ్చుకోకు.

కర్ణుడు :- జగద్బంధూ! వేయి మాటలేల? మృతికి భయపడు వాడగానని ముందే వక్కాణించితిగదా!

సూర్యుడు :- ఎల్ల భంగుల హితవు బోధించేవారు దొరకడం దుర్లభం. అట్టివారు చెప్పిన వినకుండ ఆపద తెచ్చుకొను నీవంటి వానికి ఏమి చెప్పి ఏమి ప్రయోజనం. అయినా విను. నీ పుట్టు తొడవుల దేవేంద్రుని కిచ్చునపుడు అతనియొద్ద అమోఘమైన శక్తి ఆయుధమున్నది. దాని అడిగి గ్రహింపుము.

కర్ణుడు :- పెద్దలు మన్నించాలి. బదులు గ్రహించుట ధార్మికుల లక్షణం కాదు. అయినా పెద్దల మాట కాదనలేక అట్లే చేయగలను.

సూర్యుడంత అంతర్ధానమైనాడు. మరునాడు మధ్యాహ్నం ఇంద్రుడు మాయావిప్రుని రూపంలో కర్ణుడు సూర్యోపాసన పూర్తిచేసి బ్రాహ్మణులు కోరిన కోరికలు తీర్చువేళ, సమయం చూచి – 'భిక్షాం దేహి' అన్నాడు. కర్ణుడు "విప్రోత్తమా! మీ అభిమత మేమిటో, ఏమి కావాలో కోరుకొమ్మ"న్నాడు. అంత కపట బ్రాహ్మణుడు "దానశిఖామణీ! నాకు గో,భూ,సువర్ణ దానాదు లక్కరలేదు. నీవు యివ్వదలచినచో నీ కవచకుండలాలనిమ్ము. తృప్తిగా గైకొందును" అన్నాడు. రాధేయుడంత చిరునవ్వు నవ్వి ఆ కపట విప్రుని చూచి "నీవు దేవేంద్రుడని నేనెఱుంగుదు. దేవేశ్వరా! మూడు లోకాలు నీ రక్షణచే ప్రకాశించు. అట్టి నీవు నన్ను వేడుట పాడియే"? అన్నాడు.

అంతట దేవేంద్రుడు "సూర్యుడు నీకింత చెప్పుట నేనెఱుగుదు. మాకు ప్రియమైన దానమిమ్ము" అనగానే రాధేయుడు "మహేంద్రా! అఖిల శత్రు ఘాతిని యగు నీ అమోఘశక్తిని కృపసేసి, మత్కవచకుండలములు గొనుము" అని పలికిన మహేంద్రుడు –

ఉ॥ ఇచ్చెద శక్తి నీకు వినుమేర్పడ నాజి మదీయ శత్రులం
గ్రచ్చట జంపి చంపి యది క్రమ్మతీ చేతికి వచ్చుచుండు నీ
కిచ్చుట యట్లుగాదు భువినెందును దుర్జయుడైన నీరిపుం
జెచ్చెర దున్మ నొక్కరుని జేకొని నన్ను భజించు గ్రమ్మఱున్

శక్తి ఆయుధాన్ని పరిగ్రహింపుమని ఇంద్రుడు కర్ణున కిచ్చి, "దీని ఆపత్కాలమున దక్క తక్కిన సమయాలలో ప్రయోగించిన నీకు అపాయంబు చేకూర్చు"నని పలికి కర్ణుని సహజ కవచకుండలాలను దానంగా గ్రహించి దేవలోకాని కరిగినాడు.

కౌరవ పాండవులకు సంధి కుదరలేదు. యుద్ధంలో కర్ణార్జునులకు ద్వంద్వయుద్ధం సంప్రాప్తించింది. కర్ణునకు విప్రశాపము, గురుశాపము, కవచకుండల హీనము, కుంతికిచ్చిన వరం, శల్యసారధ్యం వల్ల అతని కన్నివిధాలా నిరూత్సాహం కలిగింది. అర్జుననకని సంపాదించిన ఇంద్ర దత్తమైన అమోఘన శక్తి ఘటోత్కచునికై వినియోగించవలసి వచ్చింది. నాగాస్త్రాన్ని ప్రయోగింపగా పార్ధసారధి రథాన్ని అణగద్రొక్కి ఆపదను నివారించినాడు.

యుద్ధరంగంలో శాపవశాత్తు కర్ణుని రథం పృథివిలోకి క్రుంగింది. అదను చూచి అర్జునుడు కర్ణునిపై మహాస్త్రాన్ని ప్రయోగించి అవలీలగా నేల కూల్చినాడు. అడిగినది లేదనక దానమిచ్చి, కర్ణుడు ఆపదలను కొని తెచ్చుకున్నాడు. అయినా దాన కర్ణుడుగా నేటికిని కీర్తి వహించాడు. అతి యను శబ్దం ఎచ్చటను పనికిరాదు.



# 91. శీలము

మంచి నడవడిని శీలమంటారు. వర్ణాశ్రమ ధర్మాలను పాటించడం శ్రేష్టమైన ప్రవర్తనగా పేర్కొనబడింది. సత్యము, శమము, దమము, తపము, శౌచము, విజ్ఞానము, ఓర్పు, దయ, ధ్యానం ఇత్యాదులు సనాతన ధర్మాలు. భూత హితాన్ని సత్యమంటారు. చిత్తశాంతిని శమమంటారు. మనోనిగ్రహాన్ని దమమని, స్వధర్మాన్ని నిర్వహించడాన్ని తపస్సని, సంకర వర్జనాన్ని శౌచమని, తత్వార్థ సంగ్రహాన్ని జ్ఞానమని, ద్వంద్వ సహనాన్ని ఓర్పు అని అంటారు. అదేవిధంగా సర్వభూత సమబుద్ధిని దయయని, మనో నిశ్చలనాన్ని ధ్యానమని ఆర్యులంటారు. ఈ సద్గుణాలన్నింటి సమ్మేళనాన్ని శీలమని పిలుస్తారు. శీలికి కాని కార్యము లేదు.

**సీ॥ బలిచక్రవర్తి కమలనాభు ద్వార పా**
**లకునిగా నిలిపినే లలితమహిమ**
**పరమదుర్లభమైన పాశుపతంబును**
**బార్థుండు దేనిచే బడయగలిగెఁ**
**జేరెడకులఁగుచేలుం డొసగి యష్ట**
**భోగంబులను దేన బొదల గలిగె**
**దమయంతి దేనదగ్ధము సేసెను గిరాతు**
**బృందయెద్దానిచే నెతిగె మాయ**

**తే॥గీ॥ నారదుని దేన ననసూయ నాతిజేసి**
**ధాత్ర విష్ణు మహేశుల దర్పమడచె**
**సుమతి యెద్దాన ధృతిసేసి సూర్యునిలిపె**
**నామహద్వస్తువును శీలమంద్రు బుధులు.**

"కిం స్వి దేక పదం సుఖ"మ్మని ఒక రూపాన్ని ధరించిన ధర్మదేవత ప్రశ్నింపగా ధర్మరాజు "శీలమేక పదం సుఖ"మ్మని ప్రత్యుత్తర మిచ్చినాడు.

**శ్లో॥ ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమో**
**జ్ఞానస్యోపశమః శ్రుతస్య వినయోవిత్తస్య పాత్రేవ్యయ**

అక్రోధస్తపసః క్షమాప్రభవితుర్ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషామపి సర్వకారణ మిదం శీలంపరం భూషణం

ఐశ్వర్యానికి సౌజన్యం, శౌర్యానికి మితభాషిత్వం, జ్ఞానానికి శాంతం, కులానికి వినయం, ధనానికి సత్పాత్ర దానం, తపానికి అక్రోధం, బలానికి, కలిమికి క్షమ, అన్నింటికి అన్ని కారణాలకు శీలమే సుభూషణం. శీలాన్ని విడిచినవాడు అన్ని విధాలా చెడుట తథ్యం.

సుగుణశీల గరిష్ఠుడు, పరమ భాగవతశ్రేష్ఠుడు, నిరంతర నారాయణ చరణ ధ్యాన నిమగ్నుడైన ప్రహ్లాదుడు, తండ్రి తదనంతరం మూడు లోకాలను జయించి మహావైభవోపేతుడై ధర్మపాలన చేస్తున్నాడు. ఇంద్రుడు అసూయా గ్రస్థుండై, ప్రహ్లాదుని వైభవాన్ని హరించాలని ఒక భూసురుని వేషంలో ఆతని చెంతకు చేరాడు. సమయానుసారంగా పుణ్యకథలు పెక్కు వక్కాణిస్తూ ఆ రాజును ప్రసన్నుని చేసుకున్నాడు.

ఒకనాడు ప్రహ్లాదుడు సుముఖుడై ఉన్న తరుణంలో ఆ కపట విప్రుడు "దానవనాయకా! నీవు భూతదయాపరుడవు. అహింసావ్రత పరాయణుండవు. సకల సద్గుణ సమన్వితుండవు. రజస్తమోదూరుండవు. నిర్జిత షడ్వర్గుండవు. నీవెట్లు మూడు లోకముల జయింపగల్గితివి? నాయెడ కరుణించి ఆనతీయవే?" అని వినయంగా పలికినాడు. ఆ ద్విజుని పలుకులకు ఆహ్లాదం చెందిన ప్రహ్లాదుడు ఇట్లన్నాడు. "భూసురోత్తమా! బుద్ధిమంతునకు సామంబున జక్కంబడని దొక్కటి కలదే? సర్వ ధర్మములకు, సకల సద్గుణములకు మూలము శీలము అట్టి శీల మహాత్మ్యంబున త్రిజగంబుల లోబఱచుకొన గలిగితిని" అనిన ఆ బ్రాహ్మణుడు – "రాక్షసేంద్రా! బొగ్గుల గనిలో రత్న ముద్భవించినట్లుగా, ఈ రక్షో వంశంబున నీవుదయించితివి. ముజ్జగముల నీకీర్తి వ్యాపింపజేసితివి. మాతృ గర్భమునందే నీ చిత్తమును శ్రీహరి యందు జేర్చితివి. సర్వాంతర్యామియగు భగవంతుని అన్ని యెడల చూడగల జ్ఞాన నేత్రుండవు. నిన్నాశ్రయించి యిన్నాళ్ళుగ నున్నాడను. మహాత్ముల సేవ వ్యర్థముగ బోవునది కాదు. నిరుపేదను, నీ పుణ్యమున బ్రతికెదను. నీ శీలమును నా కిమ్మా" అని దైన్యంగా వేడినాడు. ప్రహ్లాదుడు నిత్య సత్యవ్రతుడు,

మహాదాత కాబట్టి కాదనక అతనికి తన శీలాన్ని ధారా పూర్వకంగా దానమిచ్చినాడు. ఆ మాయా విప్రుడు దానం గ్రహించి అంతర్ధానమైనాడు.

తదనంతరం కొంతసేపటికి ఆ ప్రహ్లాదుని·దేహం నుండి దిక్కుల వెలిగించే తేజస్వియైన ఒక పురుషుడు వెలువడినాడు. అతని చూచి ప్రహ్లాదుడు నీవెవ్వడని అడిగినాడు. ఆ దివ్య పురుషుడు – "నేను శీల స్వరూపుడను. నన్ను నీవు దానము చేసిన కతమున నన్ను గ్రహించిన బ్రాహ్మణునొద్ద కేగెదను" అని వెళ్ళిపోయాడు. అనంతరం మరొక తేజోరూపం ప్రహ్లాదుని దేహం నుండి వెలువడింది. నీవెవ్వడని అడుగగా "నేను ధర్మస్వరూపుడను. శీలమున్న చోట నేనుందును" అని అటకే పోయినాడు. తర్వాత ఒకటి వెనుక ఒకటిగ సత్య శమ దమ బలాదులు పై రీతిగానే పలుకుచూ ఆతని నుండి వెళ్ళిపోయాయి.

కట్టకడపట కన్నులు మిరుమిట్లు గొలిపే మెరపు తీగ వంటి దేహకాంతి గల ఒక స్త్రీ వ్యక్తి ఆతని నుండి బయటకు వచ్చింది. "అమ్మా! నీవెవ్వతవు? ఇన్నాళ్ళు నాయందుండి యిప్పుడెట కేగుచున్నావు" అని ప్రహ్లాదుడు ఆమె నడిగినాడు. ఆమె "ప్రహ్లాదా! నేను లక్ష్మిని. బలము పోయినచోటికి బోవుదు" అని అన్నాడు. "తల్లీ నీకు నేను ఏమి అపరాధం చేశాను? నీవు కూడ నన్నేల వదలి పోయెదవు" అని ప్రహ్లాదుడు మరల ప్రశ్నింపగా ఆమె ఇట్లన్నది. "కుమారా నీ శీలమును గొన్నవాడు దేవేంద్రుడు –

**తే॥గీ॥ శీలమున్నెడ ధర్మంబు చేరి వెలయు**
**ధర్మమున్నెడ సత్యంబు తనరుచుండు**
**సత్యమున్నెడ వృత్తంబు సరవినుండు**
**నన్నియున్నెడ నేనుందు నింపు మీఱ**

"నిన్ను శీలము వదలుటతో అన్నియు వదలెను" అని సిరియు ఆతని వదలి పోయింది. అన్నిటికి శీలమే మూలము.



# 92. గర్వి చెడును

కులము, ఆచారము, ధనము, రూపము, యౌవనం, తపస్సు, విద్య, రాజ్యము అనే ఈ ఎనిమిది గర్వాన్ని కలగచేసే స్వభావం కలవి. మనుజుడు వీటి విషయంలో జాగరూకుడై ఉండాలి.

**కII పరువంబు కలిమి దొరతన**
**మరయమి యనునట్టి వీని యందొకటొకటే**
**పొరయించు ననర్థము నా**
**బరగినచో నాల్గు చెప్పవలయునె చెపుమా!**

వీనికి తోడు బలం కొంత అధికంగా లభిస్తే వాని చేష్టలు చెప్పతరం కాదు. రొమ్ము విరుచుకొని పోవుట, తన బలిమికి తానే ఉప్పొంగుట, ఏనుగు తొండంలాగా చేతులను ఆడించుట, మదపుటేనుగును తిరస్కరించేటట్లు నడచుట, ప్రసన్నవదనంతో కాకుండా బుద్ధమూతితో వుండుట, ఇటువంటి చేష్టలు పరులకు ఆహ్లాదాన్ని కలిగించవు. చేష్టలిట్లుంటే చేతలెట్లుండునో యోచించండి. ఎటువంటి వారైనా తనకు సాటిగారని గర్వించుట, తిరస్కారభావంతో ఇతరులను చూచుట వలన పాపం పెరుగుతుంది.

పూర్వం దుందుభి అనే రాక్షసుడు బ్రహ్మదేవునిచే వరాలు పొంది, గర్వితుడై దేవతలను సంగరానికి పిలిచాడు. వారు ఆతనికి జడిసి వినమ్రతతో – "మయకుమారా! నీవు సుప్రసిద్ధ నైజబలుండవు. విధాతచే పెక్కు వరములు పొందిన వాడవు. నీతో పోర మేమెంతవారము. మమ్ము నీ వారినిగా జేకొని కావుండు" అని పలుకగా దుందుభి ఇట్లన్నాడు. "దేవతలారా! మిము హింసించుట నా యభిమతం కాదు. నా భుజముల తీట పోవడానికి నాతో ఎదిరించి పోరాడే ధీరుని అన్వేషించుచుంటిని. మీరు భీత చిత్తులగుటటే నాకు ఓడినవారుగా తలంచి మన్నించితి. నాతో పోరాడడానికి అర్హుడైన వాని ఒక్కని తెల్పండి అంతేచాలు". ఆ మాటలు విన్న దేవతలు దుందుభితో ఇట్లన్నారు. "నీతో పోరాడడానికి ఈ లోకంలో ఎవ్వరును సరిలేరు. కాని అతి గంభీరుడైన సాగరుడు మాత్రం కొంత మీతో పోరాడగలడని

తోచుచున్నది. నీ వచ్చుటికేగుము". అనగానే ఆ రాక్షసుడు సంతోషంతో గంతులేస్తూ సముద్రుని చెంతకేగి యుద్ధానికి కాలు ద్రువ్వి పిలిచినాడు. సముద్రుడు కలతచెంది అనేక రత్నాలను కానుకగా ఇచ్చి ఇట్లన్నాడు.

"నేను జడ స్వరూపుడను. నీతో యుద్ధము చేయ నేనెంతవాడను. నాపై విరోధాన్ని వదలిపెట్టు. నీతో యుద్ధానికి తలపడే జోడును తెలుపగలను. పర్వతరాజైన హిమవంతుడు నీకుం తగిన యోధుడు. వానితోడ కడగు"మన్నాడు. అంతట ఆ అసురుడు హిమవంతమునకు వెళ్లి యుద్ధానికి పిలిచిన దుందుభి ఆటోపానికి భయపడి మానవాకృతి దాల్చి సౌమ్యంగా, మృదు స్వరంతో ఇట్లన్నాడు.

"దానవేశ్వరా! పలువురు మునులకు పెక్కు ఓషధులకు ఆశ్రయుడను. అచలుడను, పాషాణ స్వరూపుడను. నన్నేల యిట్లు తలంచుచున్నావు? నన్ను కదనమునకు రమ్మనుట నీకు తగదు" అని పల్కగా అపార బల గర్వితుండైన ఆ రాక్షసుడు "అట్లేని నాకు కయ్యం బొసంగునంత మేటి పోటరి నొక్కని జూపుము. నిన్ను విడిచి పుత్తును" అని పల్కగా విని హిమవంతుడు.

చ॥ "అలఘు పరాక్రముండు దివజాధిప పుత్త్రుడు వానరుండు దో
ర్బల విభవాధికుండు రిపుభంజనుదావహాశీలివాలినాఁ
గల డొకఁడమ్మహాబలుని గానగ నేగు మతండు దక్కన
న్యులకు దరంబె రాక్షస కులోత్తమ! నిన్నెదిరించి పోరగన్"

వాలి నీకు తగ్గ బలుడని పలికి నయమున అతని సాగనంపినాడు.

అటనుండి దుందుభి వాయువేగంతో కిష్కిందకు వెళ్ళి, ఆ పురమును అల్లకల్లోలం చేశాడు. ఆ రక్కసుని భయంకర గర్జన విని వాలి అంతః పురము నుండి వెలుపలకు వచ్చి రాక్షసుని గాంచి ఇట్లన్నాడు.

ఉ॥ "ఓరి నిశాట! వానరకులోత్తముదంచిత శౌర్యశాలిజం
భారి సమాన వీర్యుడు మహాబలవంతుడు వాలి, తత్పుర
ద్వారము నడ్డగించి భయదక్రియ ఘోష మొనర్చెదేల? నీ
కీరస జీవితాశగలదేని తొలంగి యథేచ్ఛ నేగుమీ"

ఆ మాటలు విన్న రక్కసుడు కనులెఱ్ఱ చేసి – "నీచవానరా! నీకొక పోటుబంటువలె బీరంబులు పల్కెదవేల? నీలావు నాలావు సమర తలమున బట్టబయలు కాగలదు. నీతో ఎప్పుడెప్పుడు యుద్ధంలో పాల్గొందునా! అని చాలాకాలము వేచియున్నాను. నేటికది అదృష్టవశమున సంభవించినది. ఐనను సుదతుల గూడి మదమోహితుడై యున్నందున నిన్నిపుడు దునుముట న్యాయము కాదు. మత్తు, సుప్త, ఆయుధహీను, ప్రమత్తునితో యుద్ధం చేయుట భ్రూణ హత్యతో సమానమని పెద్దలంటారు. నీవీనాడు నీకుగల సర్వాభీష్టాలను నెరవేర్చుకొని తృప్తుండవై, నీపట్టికి పట్టము గట్టి రేపు అనికి రమ్ము".

అని పరిహాసంగా పల్కిన వాలి ఆ పలుకులకు ఉలిక్కిపడి చెలువల బంపి, "ఓరి రాక్షసాధమా! నన్ను మత్తుండవని పల్కితివి. ధైర్యము గలదేని రేపేల? ఇప్పుడే సంగ్రామమున నన్ను ఎదుర్కొని చూడు"మని జంభాంతక సుతుడు (వాలి) విజృంభించి, పితృదత్తమైన కాంచనమాల నిడికొని, వానిపై గలిసి వానిని వెల్లికిల బడద్రోసి, సింహనాదము చేయగా, ఆ దుందుభియు వెంటనే లేచి యుద్ధానికి తలపడ్డాడు. వారిరువురకు భయంకర యుద్ధం జరిగింది.

కొంతసేపటికి రాక్షసవీరుని శక్తి క్షీణించింది. వాలికి బలోత్సాహాలు ఇనుమడించాయి. అట్లు హీన విక్రముడైన దుందుభిని గని, వాలి ద్విగుణీకృత పరాక్రమంతో విజృంభించి, రక్తధారలు వెడలునట్లు మర్దించి, సంగరించి, అతని కళేబరం యోజన దూరంలో బడునట్లు విసరివైచినాడు. దుందుభి గర్వం అణగారింది. బలగర్వితుడు ఎట్లు బాగుపడును.

**చ॥ ముదమున దుష్టవర్తనము, మాన్యులతోఁబగ యోర్వలేని స**
**మ్మదమును దూరమౌట, కడుమోహ మసహ్యచయంబుమీద నె**
**య్యదియు నలక్ష్యమౌట, తుదకన్ని ప్రయత్నములౌట నిష్ఫలం**
**బెదదల పోసి దాని విడు నెవ్వడతండగు ధన్యుడిమ్మహిన్.**



# 93. దుష్టులకు మేలు చేయరాదు

**శ్లో॥ కర్తాకార యితాచైవ ప్రేరకశ్చాను మోదకః**
**సుకృతం దుష్కృంచైవ చత్వార స్సమభాగినః**

కర్త, కారకుకడు, అనుమోదకుడు, ప్రేరకుడు ఈ నలుగురు ఒక కార్యము వల్ల సిద్ధించు పుణ్య పాపాలకు సమభాగస్థులై ఉంటారు.

**శ్లో॥ లావుకశ్చ వరాహశ్చ మహిషః కుంజర స్తథా**
**అమాత్యశ్చ మహీపశ్చ షడైతే సమభాగినః**

లావుకమనే పక్షి ఒకటి తన దేహానికి కలిగిన దురదను పోగొట్టుకోడానికి ప్రతి దినం ఒకచోట పొరలుతూ వుండగా, అచ్చోట ఒక చిన్న గుంత ఏర్పడింది. వర్షాకాలంలో ఆ పల్లంలో కొన్ని నీళ్ళు నిలిచాయి. వరాహ మొక్కటి నీటి పల్లాన్ని చూచి ఎండతాపం తీర్చుకోడానికి ఆ గుంటను గోరాడి, పొరలి మరింత పెద్దదాన్ని చేసింది. ఆ మరుసటిరోజు ఒక ఎనుబోతు ఆ గుంతలో దొర్లి దొర్లి మరింత విశాలం చేసింది. ఆ తర్వాత ఒక ఏనుగు ఆ గోతిని చూచి క్రీడించడానికి ఇంకా పెద్ద గొయ్యి చేసింది.

తదనంతరం ఒక రాజు మృగయా వినోదియై వేటకు వచ్చి, అరణ్యంలో తిరిగి తిరిగి బడలికతో నీటి దప్పికతో జలాన్వేషణ చేస్తూ ఆ గుంట వద్దకు వచ్చాడు. వర్షానికి నిండిన ఆ గుంటలోని నీరు తేటపడి పన్నీటిలాగా ఉండెను. ఆ తేట నీటిని రాజు త్రాగి తృప్తిచెంది, మంత్రితో – 'ఈ వనమందెచ్చటను నీటి కుంటలు లేవు. ఇందొక్క చోట మాత్రం శుద్ధజలం కనిపిస్తున్నది. దీని నింకా విశాలంగా, లోతుగా త్రవ్వించి మరలా శిథిలం కాకుండా సోపానపంక్తులు కట్టించిన ఎంతో బాగుండును గదా!' అని అన్నాడు. ఆ మాటలు విన్న మంత్రి శేఖరుడు సంతోషించి "ప్రభూ! ఇందు జలాశయమతి ఆవశ్యకము. వనమందలి తిర్యక్కులకు, మృగ సమూహానికి, తెరువరులకు, మృగయా విహారానికై డస్సి వచ్చిన మనబోటి వార్లకు మిగుల యనుకూలమై యొప్పు" అనగానే రాజు సమ్మతించి, దాన్ని గొప్ప సరోవరంగ నిర్మించారు. ఆ సరోవరం పెక్కు జీవులకు, జీవనాధారమై ఒప్పారినది.

ఈ సరోవర నిర్మాణ కారకులైన లావుకపక్షి, వరాహము, దున్నపోతు, ఏనుగు, రాజు, మంత్రి ఆరుగురును పుణ్యమందు సమభాగస్థులై దివ్య సుఖాల ననుభవించారు.

సత్కార్యాలలో భాగస్వాములకు పుణ్యం కలిగిన విధంగానే, దుష్కార్యాలలో పాపమునందు భాగస్థులౌతారు. కావున ఏ కార్యానైనా చక్కగా ఆలోచించి చేయాలి. సత్పురుషులకు చేసిన మేలు జలతైల న్యాయాన త్వరితగతిని వ్యాప్తి చెందుతుంది. దుష్టులకు చేసిన ఉపకారం పగిలిన కుండలోని నీటివలె వ్యర్థమవ్వడమేగాక పాపహేతువు కూడా అవుతుంది.

**"ఉష్ణోదహతిచాం గార. శ్శతః కృష్ణాయతేకరః"**

నిప్పు కణిక వేడిగా నున్నపుడు తాకితే చేతిని కాలుస్తుంది. చల్లబడిన తర్వాత తాకితే చేతిని మలినం చేస్తుంది గదా! అదేవిధంగా –

**క॥ పాలసుదు తన్ను వేడిన**
**జాలింబడి మేలు గూర్ప జనదెవ్వరికిన్**
**దేలగ్నిబడక పట్టిన**
**మేలెఱుగక మీటుగాదె! మేదిని సుమతీ!**

దుష్టులకు జాలిపడి మేలు చేయరాదు. తేలు అగ్నిలో పడకుండా పట్టుకుంటె, రక్షించినాదని కూడా చూడకుండా కుట్టుతుంది గదా!

పూర్వం శుకుడనే దైత్యుని కుమారుడు వృకుడనే వాడు పరమశివుని గూర్చి ఘోర తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి శంకరు ప్రత్యక్షమై నీకేమి వరం కావాలో కోరుకో ఇచ్చెదనన్నాడు. నేను ఎవ్వరి శిరస్సు మీద చేతి పెట్టిన వారి తల నూరు ముక్కలై భస్మం కావాలని వరం కోరినాడు. దుష్టులకు మేలు చేయరాదని తెలిసియు శివుడు చెప్పిన మాట కాదనలేక అట్లే వరమిచ్చాడు.

అంతట ఆ వృకుడు శంకరుని చూచి నీవిచ్చిన వరం సత్యమో, అసత్యమో నీతలపైననే నా చేయి పెట్టి తెలుసుకుంటానని చేయి పైకెత్తినాడు. శివుడు దిక్కుతోచక బిక్కమొగంతో పరుగెత్త సాగినాడు. వృకుడును శూలి

వెంటబడి తరుముకొని పోయాడు. ఎంతదూరం వెళ్ళినా ఆ రాక్షసుడు వదలలేదు. శివునికి దిక్కేది? నారాయణా! నాకిక దిక్కేది? అని మొరపెట్టు కుంటూ పరుగెత్తి, పరుగెత్తి శివుడు అలసిపోయాడు. భూతనాథుని దైత్యుడు సమీపిస్తున్నాడు. 'నా బ్రతుకు నేటితో జెల్లెరా నారాయణా! దీనబంధూ'! అని ఆయాసంతో ఇష్టమొచ్చిన రీతిగా పరుగెత్తుచున్నాడు. ఆ సమయంలో శ్రీ మహావిష్ణువు త్రిజగన్మోహిని రూపంలో ఆ రాక్షసుని ముందు ప్రత్యక్షమైనాడు. వాడు కామాంధుడై శివుని మాట మరచి ఆ సుందరిని చూచి ఆ మనోహరి అందాన్ని వీక్షిస్తూ – "చెలీ! యెవ్వరిదానవు? ఎందులకీ ఘోరారణ్యంలో సంచరిస్తున్నావు? నీవు గంధర్వకాంతవో, యక్ష, కిన్నెర నారివో, జగన్మోహినివై నేడు నా మనంబును చూరగొన్నావు. నేను వృక నామక దైత్యుడను. నన్ను చేపట్టి సౌఖ్యములనుభవింపుము" అని ఆమెను బ్రతిమాలినాడు. ఆ మాయాసుందరి తళుకుబెళుకు కులుకులచే వాన్ని మోహాంధుని చేసి "నేను నిర్జరకాంతను. నా చెలులు నన్నేమరించుటటే నేనొంటరినై నీచే జిక్కితి. నీయందును నాకధిక ప్రేమ జనించుచున్నది. వైళంబ స్నాన మాచరించి శుచియై వచ్చి నన్ను పరిగ్రహింపుము" అని మధురోక్తులు పలికింది. మంచిదని వృకుడు నీటికై పరిసర ప్రదేశాలు అన్వేషించి, ఒక కుంటను చూశాడు. కామాంధుడైన ఆ నిశాచరుడు వెంటనే ఆ గుంటలో దిగి మునిగి యథాతథంగా రెండు చేతులను శిరముపై పెట్టుకొన్నాడు. ఇక వాని గతి నేమనగలం. తక్షణం వరప్రభావం చేత వాని తల నూరు వ్రక్కలై భస్మీభూతమైంది. అంత నారాయణుడు నారీ రూపాన్ని చాలించి శంభువును చూశాడు. గంగాధరుడు భయమును వీడి గజవరదునికి కృతజ్ఞతలు తెల్పినాడు. అంత ఆ మహావిష్ణువు ఇట్లన్నాడు.

"దుష్టులకు మేలు చేయరాదను నీతివాక్యం తెలిసియు ఇట్లు చేశావు. తత్ఫలిత మనుభవించావు. గోట పోవుదానికి గొడ్డలి కావలసి వచ్చింది. పాములకు అమృతము పోసి పోషించుట, దుర్జనులకు ఉపకృతి గావించుట సమంబులు. తేలునకు పెత్తనమిచ్చిన తెల్లవారుదాక తెగ గుట్టెనన్న సామెత మన మెరిగినదే గదా" అని పల్కి వీడ్కొలిపినాడు. కావున దుష్టులకు మేలు చేయరాదు.

# 94. సుపుత్రుడొక్కడే చాలు

సుపుత్రుని వలన కులము ప్రకాశిస్తుంది. తన వారికి బంధువులకు అధిక గౌరవం కలుగుతుంది. కుపుత్రుడు జన్మిస్తే తాను చెడడమే కాకుండా తన వారిని, కులాన్ని కూడా చెరుస్తాడు.

**ఆ॥వె॥ 'కడుపు బదరగాగ గొడుకుల గనుకంటెఁ**
**దల్లికొకడె చాలు బల్లిదుండు'**

నక్షత్రాలెన్నియున్నా చంద్రునితో సరిగావు. ఆకాశంలో ఒక్క చంద్రుడుంటే చాలు భూమండలమంతా ప్రకాశవంత మౌతుంది. అట్లే వంశదీపకుడు ఒక్కడుంటే చాలు. కుపుత్రులెందరున్న ప్రయోజనమేమి? దృతరాష్ట్రునకు నూరుగురు పుత్రులుండినా ఏమి ప్రయోజనం. అట్టి కుపుత్రులు గల వారికంటె లేనివారే ఉత్తములు. భీష్ముడు, శుకుడు, హనుమంతుడు మొ॥వారు లోక విఖ్యాత చరిత్రులు కాలేదా!

ఒక సన్యాసిని మీరేల సకాలంలో సంధ్యావందనం చేయరని ప్రశ్నింపగా, ఆతడు –

**'మృతామోహమయీమాతా జాతో బోధమయస్సుతః**
**సూతక ద్వయ సంప్రాప్తౌ కథం సంధ్యాముపాస్మహే!**

అజ్ఞానమనే తల్లి గతించింది. సుజ్ఞానమనే కుమారుడు కలిగాడు. సూతకము, పురుడు రెండూ ప్రాప్తించితే సంధ్యావందనం ఎట్లు చేయగలను? అన్నాడు. దీనివల్ల మహాత్ములకు జ్ఞానమే పుత్రుడని తెలుస్తున్నది.

మాళవదేశాన్ని పాలించే శూరసింహ భూపాలునికి, మాధవుడనే తలారి ఒకడున్నాడు. ఆ తలవరి, స్వామిభక్తి పరాయణుడు. వినయ విధేయతలు గలవాడు. ఆ మాధవున్ని బిడ్డలు లేని చింత పెద్దగా పీడిస్తుండేది. వ్రేలెడు బిడ్డ కలిగిన చాలునని, వేయి దేవతలకు మ్రొక్కేవాడు. శూరసింహునికి, ఆతని దేవేరికి మాధవునిపై మక్కువ ఎక్కువ. అందుకు కారణం వాని యోగ్యతయే, యోగ్యుడు ఎచ్చటనైనా గౌరవింపబడును గదా!

ఒకనాడు దేవేరి మాధవుని అంతఃపురానికి పిలిపించి ఇట్లన్నది. "మాధవా! మేము నిన్నింతగా ప్రేమిస్తున్నా, నీవు ఏదో దిగులుతో వుంటున్నావు. నీకు ఏ కొఱత లేకుండా చూడమని అప్పుడప్పుడు రాజును హెచ్చరిస్తుంటాను. పుత్రులు లేకుండుటే నీ దిగులుకు కారణమని నాకు తెలియవచ్చింది. మన పట్టణానికి పశ్చిమంగా అరణ్యంలో ఒక సిద్ధుడున్నాడు. జనులచటికి పోయి వస్తున్నారు. కాని అతడెవ్వరితోను మాట్లాడక, మౌనియై పాలు పండ్లు కూడా గ్రహింపక నిరశన వ్రతాన్ని పాటిస్తున్నాడట. నీవు జత పాదుకలను చంకలో పెట్టుకొని అచ్చటికేగి తగిన సమయం కోసం వేచివుండు. అతడు ఎచ్చటకైనా నడుచునప్పుడు, పాదాలకు మట్టి అంటే తరుణంలో ఆ పాదుకలను ఆతని పదముల సన్నిధి పెట్టి నమస్కరించి మారు మాటాడక రమ్ము. నీ కోరికయు, యత్నమును సఫలమౌతాయి".

రాణిగారి మాటలు విన్న మాధవుడు సంతసించి 'చిత్తమట్లే' అని ఆమె అంగీకారాన్ని పొంది రాజుగారి వద్ద సెలవు తీసుకొని సిద్ధుని సేవించడానికి వెళ్ళాడు.

రెండు మాసాలు గడిచింది. సిద్ధుడు యోగసమాధి వదలకున్నాడు. మాధవుడును అతనిని వదలలేదు. సమాధి చాలించి సిద్ధుడు కనులు తెరచేటప్పటికి మాధవుడు కనిపించాడు. కాని అతడు మాట్లాడలేదు. మరి కొన్నాళ్ళ వరకు తలవరికి రాణి చెప్పిన తరుణం తటస్థపడదయ్యె. సిద్ధుడు ఒకనాడు "ఇట జన సమ్మర్దము మెండయ్యె, మరొక చోటికి పోవుద"మను ఉద్దేశంతో అర్ధరాత్రి లేచి పోవుచున్నాడు. దారిలో ఒక బలుస ముల్లు కాలికి గ్రుచ్చుకుంది. వంగి ముల్లు ఊడదీసి తలయెత్తే సరికి కాళ్ళ ధగ్గర పాదుకలున్నాయి. ఉంచిన వారు కనబడలేదు. దైవేచ్ఛగ పాదాలకు రక్షణ లభించిందని పాదరక్షలు తొడుగుకొని సిద్ధుడు పయనమైనాడు. తలవరి కృతకృత్యుడైనాని మహానందపడి ఇల్లు చేరాడు.

మహర్షికి చేసిన మహోపకార పుణ్య వశాన కొన్నాళ్ళకు మాధవుని భార్య గర్భవతి అయింది. ఒక శుభ లగ్నాన ఆమెకు ఒక కుమారుడు జన్మించాడు. ఆ తలారి దంపతులు పరమానంద భరితులై పుత్రునకు సుశీలుడని నామకరణం చేశారు. శుక్లపక్ష చంద్రునిలా ఆ బాలకుడు దినదిన

ప్రవర్ధమానుడై, శీఘ్రగ్రహణ బుద్ధితో, అన్ని విద్యలలో తన ఈడు బాలురలో మేటియై, చుక్కలలోని చంద్రునిలాగా అలరారుచున్నాడు. అప్పటికి ఆ బాలుని వయస్సు ఏడేండ్లు.

ఒకనాటి రాత్రి ప్రాకారం లోపలి వీధిలో గస్తు తిరగవలసిన వంతు మాధవునకు వచ్చింది. ఆనాటి సాయంకాలం ఆతడు అత్యవసరంగా వేరొక గ్రామానికి విధిగా పోవలసి వచ్చింది. రాజు దగ్గర సెలవు తీసుకోవడానికి సమయం లేదు, చెప్పకుండా పోవడం దోషం. ఎటూ తేల్చుకోలేక మిణకరిస్తుండగా, కుమారుడక్కడకు వచ్చి విషయం గ్రహించి – "తండ్రీ! నిశ్చింతతో వెళ్ళిరండి. నీ కార్యము నేనెరవేర్తు" అన్నాడు. వాని పలుకులకు ఉలికిపడి ఆతడు కుమారునితో – "నాయనా! చీకటి వేళ ఒంటరిగా ఊర దిరిగి, కాపు కాయుట యన్న పిన్నాటగాదు. దొంగల యుపద్రవం ఎక్కువగా నున్న ఈ కాలంలో బాలుడైన నీవు ఇల్లు వెడలరాదు. నా మిత్రుల కెవరికైనా చెప్పి పోగలను. నీవంత పనికి ఇప్పుడే సాహసింపకుము" అన్నాడు. కొడుకు తండ్రిని నిర్బందిస్తూ – "నాయనా! నాకా భయంలేదు. నేడు చూడు. నాత్రాణ! ఉదయాన్నే నీవు మెచ్చుకోగలవు. నీ కడుపున బుట్టి నీకపకీర్తి తెత్తునా!" అని ప్రార్థించి తండ్రిని ఒప్పించినాడు. తండ్రి పొరుగూరు వెళ్ళాడు.

బాలుడు గస్తీ తిరుగుచుండగా తొలిజాము ముగియవచ్చింది. తుడుము మీద దెబ్బ ముమ్మారు మ్రోగింది. వెంటనే ఈ క్రింది వాక్యం (శ్లోకం) వినబడింది.

**శ్లో॥ ఆశయా బద్ధతే లోకః కర్మణా బహు చింతయా ।**
**ఆయుక్షీణం నజానాతి తస్మాజ్జాగృత జాగృత ॥**

ఆశాపాశముచే లోకం కట్టబడింది. ఆశ పెరిగే కొద్దీ కార్యచింత కూడా హెచ్చుతుంది. ఆయువు క్షీణిస్తున్నది. అది తెలియక అందరూ నిద్రిస్తున్నారు. ఏల ఇంకా మేల్కొనరు. మేలుకొనుడు. మేలుకొనుడు.

ఎన్నడు వినని ఇట్టి అద్భుత వార్త రాజు చెవిలో బడింది. తటాలున లేచి కూర్చుండి రాణిని లేపి ఆ వార్త వినిపించాడు. దానిని గూర్చి ఇరువురూ దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. అంతలో రెండవ జాము రాగా రెండవసారి ఘోషణముతో ఈ క్రింది వాక్యం వినిపించింది.

శ్లో॥ 'క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవిత మావయోః
యమస్య కరుణా నాస్తి తస్మాజ్జాగృత జాగృత'

అందరూ మేలుకొంటిరా! వినండి. మనస్సు, ధనం, జీవితం, వయస్సు ఏవీ శాశ్వితాలు కావు, క్షణభంగురాలు. యముడు నిర్దయుడు. రేపు వస్తానన్నా, ఇక తప్పులు చేయనన్నా మన్నించి వదలేవాడు కాదు. "ఇది నాది, ఇది నాది" అంటూ ఏల మెడగట్టుకొని అజ్ఞానం (నిద్ర)లో ఉన్నారు. మరలా మేలుకొనండి. మేలుకొనండి.

రాజదంపతులు మొదటి వాక్యం గూర్చిన చర్చ ముగియక మునుపే, రెండవ వాక్యం వారి చెవిలో పడింది. వారి ఒడలు గగుర్పాటు చెందింది. వారి విచారణ కొనసాగింది. మూడవ జాము వచ్చింది. మూడు గంటలు కొట్టగానే, మూడవ వాక్యం ఈ రీతిగా వినవచ్చింది.

శ్లో॥ మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధు సహోదరాః ।
అర్థం నాస్తి గృహం నాస్తి తస్మాజ్జాగృత జాగృత ॥

తల్లిలేదు. తండ్రిలేదు. బంధువులు లేరు. సహోదరులు లేరు, ధనము లేదు, ఇల్లు వాకిలి లేదు. నాది, నాదనే భ్రాంతితో దేన్ని నాదనుకుంటున్నారో అది మిమ్ములను విడిచిపోతుంది. ఈ భ్రమ (నిద్ర) నుండి మేలుకొనుడు. మేలుకొనుడు.

ఈ వార్త విన్న ఆ రాజదంపతులకు కల్గిన భక్తి పారవశ్యం ఆనందం వర్ణనాతీతం. దేవుడే మనల్ని పునీతుల చేయడానికి ఈ పలుకులు వ్రాక్కుచ్చు చున్నాడని భావించారు. నాల్గవ జామున మరలా ఈ పవిత్ర వాక్యాలు వినిపించాయి.

శ్లో॥ కామ క్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః ।
జ్ఞాన రత్నాపహారాయ తస్మాజ్జాగృత జాగృత ॥

నిన్ను మోసపుచ్చి నీలోని జ్ఞానరత్నాలను హరించే అంతఃశత్రువులు నీలోనే వున్నారు. కామము, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనే పేర్లుగల ఆరుగురు దొంగలు నీలోనున్న జ్ఞాన రత్నాలను అపహరించి

మోసం చేయడానికి అదనుకోసం వేచియున్నారు. అది యెరుగక నిద్రిస్తున్నారు. మేలుకొనుడు. మేలుకొని ఆ అంతఃశ్శత్రువులను పారద్రోలండి. ధనము దొంగలించు వారికంటె వీరు మిక్కిలి క్రూరులు. కాబట్టి మేలుకాంచుడు.

జాము, జామున విన్న ఆణిముత్యాలు' రాజదంపతుల హృదయాలు పవిత్ర భావాలతో నిండేలా చేశాయి. వారి మేను పులకరించింది. వారి పద్మముల వంటి కన్నుల నుండి ఆనందాశ్రువులు కారచొచ్చినవి. ఆ సాకార దేవుని కనులారా దర్శించాలనే తత్తరపాటు హెచ్చింది. వెంటనే కంచుకిని పిలిచి ఆ పారా తిరుగు పుణ్యపురుషుడెవ్వడో కనుగొని రమ్మని పంపించాడు. ఆతడు పోయివచ్చి "దేవా! అతడెవరో క్రొత్త బాలకుడు. ఆజ్ఞ యిచ్చిన పిలుచుకొని వత్తును" అని విన్నవించాడు. రాజు వలదని వారించాడు. తామే కాలినడకతో పయనించి ఆ బాలకునికి నమస్కరించి, అతని నగరికి తోడ్కొని వచ్చి షోడశోపచార విధుల పూజించి రత్న పీఠంపై కూర్చోబెట్టి అతని యెడల భయభక్తులుట్టిపడ నిలుచున్నారు. రాజు ఆనతితో కొందరు సేవకులు వెళ్ళి మాధవుని శీఘ్రంగా రాజు వద్దకు రమ్మని పిలిచారు. అప్పుడే ఇల్లు చేరిన అతని కావార్త వినగానే, నోట తడి యారి వణకు పుట్టింది. కుమారుని వలన తనకు దండన తప్పదనుకున్నాడు. విధిలేక ఆ తలారి రాజు వద్దకు వచ్చాడు. కుమారుని ఉన్నత స్థితి చూచి ఆశ్చర్యంతో నిలబడ్డాడు. రాజు మాధవుని చేయిబట్టి "ఈ కుమార రత్న జననంబు వలన మీరును, మేమును తరించాము. మీ వంశము, మా వంశము పావనమైనది. ఇతడు సామాన్య మానవమాత్రునిగా తలంచవద్దు. మిమ్ము, మమ్ము ఉద్ధరింప అవతరించిన సద్గురువరేణ్యుడు" అని ఆ రాత్రి జరిగిన వృత్తాంతాన్ని తెల్పినాడు. అప్పటి మాధవుని ఆనందానికి హద్దుల్లేవు. పూర్ణచంద్రుని చూచిన సముద్రుని వలె ఉప్పొంగినాడు. తన పుత్రుడు శ్రీకృష్ణభగవానుడే యని ఎరిగిన వసుదేవుని వలె ఆనందాతిశయంతో గర్వించాడు.

అంత ఆ బాలకుని పేరు సుశీలుడని తెలుసుకొని, ఆనందపారవశ్యంతో మహారాణి ఇట్లు ప్రశ్నించింది.

శ్లో॥ కస్త్వం బాలక? (బాలకా! నీవెవ్వడవు?)
బాలికే! యతిరహమ్ (నేను యతిని)
కస్మాదిదం జన్మతే (ఏల నీకిట్టి జన్మము కలిగింది)
వక్ష్యే పూర్వము పానహౌ విధివశాత్ ప్రాప్రోస్మి గృహ్ణాన్మతం
ప్రాప్తో స్మీతిమతిం విధాయ నితరాం సంత్యక్త దేహోస్మియ
చ్చండాలస్య సుతోస్మ్యహం తదబలే! యాంతేమతిస్సాగతిః

అబలా! చెప్పెద వినుము. పూర్వజన్మలో విధివశాత్తు పాదుకలు తీసుకొని ఒకనికి రుణపడ్డాను. అదే చింతతో దేహాన్ని త్యజించి, ఈతనికి పుత్రునిగా జన్మించాను. అవసాన దశలో ఎట్టి మతియో అట్టిగతి ప్రాప్తిస్తుంది కదా!

తర్వాత అందరికీ విశదమయ్యే విధంగా ఇట్లన్నాడు.

సాధ్వి అయిన ఈ రాణిగారు చెప్పినట్లు పుత్రకాంక్షతో మా తండ్రి అరణ్యంలోని సిద్ధుని సేవింపబోయి, యోగ సమాధి, స్థితిలో నున్న యతికి శుశ్రూష చేశాడు. ఇతని సేవను ఆ యతి యెఱిగియు సమాధికి భంగమని వలదనక ఊరకున్నాడు. తదుపరి సిద్ధుడు అచ్చోటు వదలి వేరొక చోటుకు వెళ్ళుచుండగా దారిలో ములు గ్రుచ్చుకొనగా తీసివైచి. అట ఇతనిచే ఉంచబడిన పాదుకలు తొడిగికొని వెళ్ళాడు. పుత్రార్థియై అతడు ఉపచరించి నందువల్ల, తపస్సిద్ధుడైనా దేహాభిమానంతో ఆతని ఉపచర్యలను, పావుకోళ్ళను అంగీకరించుటచేత, ఆ జన్మలో తనకు తెలిసినది ఇతరులకు ఉపదేశింపక పోవుటచేత, తన అవసానమున తలవరికి ఋణపడ్డాను కదా! అనే చింతతో అతడు మరలా జన్మింపవలసి వచ్చింది. అట్లు జన్మించుటలో ఈ తలారికి పుత్రుడై ఆతని ఋణము తీర్చి, పాత్రులకు ఉపదేశించాలనే అభిలాషతో ఈ జన్మ ఎత్తవలసి వచ్చింది. ఆ సిద్ధుడే ఈ బాలకుడు.

అని తన వృత్తాంతాన్ని వివరించి, తపోభూమికి వెళ్ళినాడు. సుపుత్రుని పొందుటచే ఆ తలారి జన్మ తరించింది. కాబట్టి సుపుత్రుడొక్కడే చాలును.



# 95. శుకుఁడు

వేదవ్యాసుని పుత్రుడైన శుకమహర్షి బ్రహ్మచర్యమందే విరాగియై సన్యసించాడు. అవధూతగా పేరు నిర్వికల్ప ఆత్మ స్థితిలో, తండ్రికి మించిన తనయుడనిపించుకున్నాడు. సందేహ నివృత్తికై రాజర్షి అయిన జనక మహారాజు దగ్గరకు వెళ్ళాడు. ఆ వృత్తాంతాన్ని చదవండి.

క॥ వేదవ్యాసుఁడు పుత్రా
మోద మహాభాగ్యలబ్ధిఁ బొందుమదిని గం
గాదయితుఁ గూర్చి తపము మ
హోదంచితరీతిఁ జలిపె నురునైష్ఠికుఁడై

క॥ ఆ తప తాపంబునకును
శీతలబాధకును నోర్చి స్థిరచిత్తుఁడుగా
నా తపము మెచ్చి భర్గుఁడు
బ్రాతిం బ్రత్యక్షమయ్యె వ్యాసుని మ్రోలన్

తే॥గీ॥ అట్లు నిల్చిన పరమేశు నధికభక్తిఁ
గీర్తనముచేసి పూజించి కేలుమోడ్చి
శ్వసనజలవహ్ని గగన భూ సదృశవీర్యుఁ
డగు సుపుత్త్రుఁ బారాశర్యుఁ డర్థివేఁడె.

తే॥గీ॥ దుష్టులకు మేలొనర్చిన దొడరుఁజెడుగు
కాని నీ యెడ శంకింపఁ గతములేదు
నీవుకోరిన కోరిక నెగడుఁగాత
మనుచు హరుఁడు తిరోధాన మయినయంత...

చ॥ రమణచెలంగ శంభుని వరంబునఁ గొన్ని దినంబు లేగుడున్
సముదితుఁడయ్యెఁ బుత్త్రకుదు జన్మముతోడన జ్ఞానియౌచుఁ దాఁ
బ్రముదితుఁడయ్యె మిక్కిలి పరాశరపుత్త్రుఁడు రాముఁగన్న యా
జి ముదము నందినట్ల తలఁచెన్ గృతకృత్యుఁడనంచెడందలోన్.

తే॥గీ॥ ప్రియఘృతాచి శుకంబును బ్రేమఁబెంచి
తాశుకీరూపమొందఁ బ రాశరాత్మ
జుండు శుకనామధేయంబు సుతునకుని చెఁ
బ్రియవిశిష్ట పదార్థ సం స్మృతినిజేసి.

క॥ శుకునిన్ సముచిత హితవా
క్యకునిన్ వీతాంశుకుని విశుద్ధాత్మకు నిన్
సుకరంబుగ జదివించెను
బ్రకట శ్రుతి స్మృతి పురాణ వర్గముఁ బెలుచన్.

తే॥గీ॥ సకలవిద్యల నేర్చి యా శుకుఁడు బ్రహ్మ
చర్యముననె విరాగియై సన్న్యసించి
యవల నవధూతచర్యఁ దా నాశ్రయించి
యాశ్రమము వీడి యెచటికో యరుగుచుండె.

క॥ ఆదారిని వలువలు విడి
పైదలు లొక కొలఁకునందు వాదాడుచుఁ బై
నీఁదాడి, చల్లులాడుచుఁ,
బైదరికిఁ, దటాకమునకుఁ బాఱుచుఁ గడఁకన్.

క॥ అరుదెంచు నగ్ను, యువకుని,
దరుణులు గని లజ్జవడక తమ తమ పనులన్
విరమింపక శుకునొరయుచుఁ
బరుగులిడుచ నుండి రతని పాటింపకటన్.

ఉ॥ వ్యాసుఁడు వృద్ధుఁడా కొమరు వారని ప్రేమ నొహో కుమార! వై
యాసికి! రమ్ము రమ్మనుచు నంతట భూతములైదు మాతెలుం
గీయఁగ నామతించుచు మొగిన్ జనుదేరఁగఁ జూచి చెల్వలున్
దోయములాట మాని తమ తొడ్గులఁ దొడ్గిరి సిగ్గుపెంపునన్.

తే॥గీ॥ తరుణు, సుందరు, నగ్నుని, దరుణులార!
సిగ్గుపడకుండఁ జూచి, స చేలు, వృద్ధుఁ
గాంచి యింతసిగ్గేల వహించితిరన
వ్యాసునకు నుత్తరంబిచ్చి రతివలిట్లు.

ఉ॥ నిత్యము నిర్వికారమును నిర్గుణము న్నిరపాయ సంస్థితిన్
స్తుత్యము సుప్రకాశము విశుద్ధమయంబయి చెల్లుబ్రహ్మమున్
సత్యమటంచు నమ్మి సుగుణంబుల కిమ్మయి నిర్వికల్పుఁడై
నిత్యము నుండునట్టి యతనిం గొన సాటియె బాదరాయణా!

తే॥గీ॥ అతనికిని నీకుఁజూడ మహాంతరంబు
గలదు లింగభేదంబటఁ గానరాదు
గాననగునది నీయందుఁగాన నిట్టు
లైతిమని చెప్పి యరిగి రయ్యలరుఁబోండ్లు.

క॥ మనమును వాక్కును గరములుఁ
గనులును గుహ్యంబు శుద్ధి గాఁగలమనుజుల్
ధనకాంతలయెడ నున్నను
గనుఁగొన భయమేమిలేదు గద విద్యార్థీ.

క॥ సూనుని సౌశీల్యమున క
నూనామోదాత్ముఁడగుచు నురుతరగతిమైఁ
గానఁగ నేగెను బుత్త్రుని
గానలలో నతనిజాడఁ గన్చు ధరణిపై.

ఆ॥వె॥ ఇట్లు పోయిపోయి యొకకొంతదూరాన
గాంచి సుతునిఁ గనుల కఱవుదీఱఁ
గౌఁగిలించి తమిని గాటంబుగా మేనఁ
బులకలెగయఁ దేనె లొలుకఁ బలికె.

ఆ॥వె॥ "ఓకుమార! యిట్టు లొంటిమై నాశ్రమ
స్థలిని విడిచి పర్ణశాల విడిచి
వనము వెంటఁ జనఁగ మనసేలయొప్పెను
వలదు వలదు నాదు వార్త వినుము.

తే॥గీ॥ శిష్యులెవరేని నినునొవ్వఁ జేసినారె?
యచటఁ గొఱఁత లింకేవైన నావహిలెనె?
నన్ను విడనాడి యిటుపోవ నాయమగునె?
అన్న! రమ్మిఁక సుగుణ సంపన్న! మరలి".

తే॥గీ॥ అతని పలుకుల నాత్మజుఁ డాలకించి
యిట్టులనియె "నా కెట్టి యిక్కట్టు లచటఁ
గూరవెందును నాకగు కొఱంతలేద
యైన నావచ్చు కారణం బదియువినుము.

మ॥ జనకా! విద్యలనెల్ల నేర్చితి భవత్సాన్నిధ్యమందేఁ గ్రమం
బున సర్వంబును సంశయాస్పదములై మూఢాత్మునిం జేసె న
న్ననఘా! యెవ్వరు నాకు సందియము వాయంజేయువా రేయెడన్
వినవౌవారి? నటంచుఁ జింతిలుచు నన్వేషింపఁగా వచ్చితిన్.

తే॥గీ॥ నీవలన సంశయనివృత్తి నేరదయ్య
తగిన మాన్యుని వెదకంగఁ దగునునాకు
నీవెఱిఁగితేని తెల్పు మేనేగి యటకు
సందియముఁ బాపికొందును డెందమందు

తే॥గీ॥ సత్యవత్యాత్మజుం డాత్మ జన్మున కనుఁ
"బుత్త్ర! యటులైన మిథిలకుఁ బోయి జనక
భూమిపుని నాశ్రయింపుము పూన్కి మెయిని
నతఁడె నీసంశయముఁ బాప నర్హుఁ"దనిన.

తే॥గీ॥ బాదరాయణి యను "భూమి పతియె నాకు
సంశయముఁదీర్ప మేదినిఁ జాలినతఁడు?
రాజులేద? సరాగులై క్రాలువారు!
మహివిరాగుల శంకల మాన్పువారె?

క॥ నావుడు వ్యాసుండనుఁ "దన
యా! విలసత్కీర్తిమంతుఁ డంచిత మహిముం
డావిభుని శిష్యులందఱు
భూవలయమునన్మహర్షి పుంగవులగుటన్.

క॥ లోకేశుఁడు రాముఁడు సు
శ్లోకుని జామాతయయ్యె సుభగచరిత్రా!
పోకార్పుము నీశంకను
బోకార్చును నీదుశంకఁ బుణ్యుఁడతండే.

చ॥ అని నయమారఁ బల్కుటయు నాతఁడు సంతసమంది, తోన వం
దన మొనరించి తండ్రికిఁ బదంపడి పైనముసేసి వేగతాఁ
జని మిథిలాపురీ నికట సైకత వేదికపైఁ బరుండి దా
నిన తలదిండుగా నిడికొనెన్ మదినెద్దియొ చింతసేయుచున్.

క॥ అట కిరువురు వెలకాంతలు
ఘటములఁ గటినిడి జలంబు గైకొని పోవన్
నటదంచన్నూపురములు
తటస్థపురుషుల మనంబు తబ్బిబ్బువడన్.

క॥ వ్రచ్చుచు దృఢహృదయంబుల
వచ్చి యచటఁ బండియున్న వైయాసికిఁ దా
మచ్చుపడఁ గాంచి తమలో
నచ్చెరువడి యంత నిట్టు లాడిరి వారల్...

ఉ॥ అక్కరో! చూడు మీతఁడు మహాత్ముఁడు వాసనలేనివాఁడు పెం
పెక్కిన యౌవనంబునఁ ద్యజించినవాఁడు ప్రపంచబంధమున్
మక్కువ మేనిపై దురభిమానము నీఁగినవాఁడు చూడవే
యెక్కడనుండి యిక్కడకు నేలరుదెంచె నెఱుంగమేకదా!

తే॥గీ॥ చెల్లెలా! నిక్కమేనీవు చెప్పియుంటి
వైన నవధూతయయ్యు దేహాభిమాన
మితని వదలకుండెడిఁ జూడు మెత్తుఁ జదను
విడువకాసించినవి వీని మెదయునొదలు.

క॥ అనుచు జలముఁ గొనిపోయిన
వనజాక్షుల నుడులు విని సెబాసు! బలీ! యీ
ధనకాంతలు నా దోషముఁ
గనిపెట్టిరి కాదె సూక్ష్మగతి లజ్జింపన్.

తే॥గీ॥ అనుచు నాయుపధానంబు నవలఁ ద్రోసి
యెప్పటట్ల శుకుండుండ నింతులంత
జలముఁగొనిపోవ రెండవసారి వచ్చి
యతనిఁ గని యిట్లు మాట్లాడి రెలమిగులుక.

తే॥గీ॥ అక్కరో! చూడు తలగడ నవలఁద్రోసి
పండియుండె వైరాగ్యభావమున నితఁడు
చెల్లెలా! మాటపడలేక తల్లడిలుట
చే నహంకృతి గూడ నెచ్చిలుట దెలిసె.

తే॥గీ॥ ఈతఁడేపాటివాఁడు రావే యటంచుఁ
బొలఁతు లంబువులం గొనిపోవునంత
"నౌర! యీకాంత లెంతవారైరి? వీరె
యిట్టులుండ భూపాలుఁ డిఁకెంతవాఁడొ?"

క॥ అని మది లజ్జయు వింతయుఁ
బెనగొన నాశుకుఁడు కదలి పృథివీశ్వరునిన్
గని వందన మొనరించిన
జనకుండు జోరారుచేసి సంతసమొప్పన్.

క॥ ఉచితవిధులఁ బూజనములు
పచరించి మృదూక్తులను శుభంబులడిగి తా
నచటికరుదెంచు కతమున్
విచారణముసేయ శుకుఁడు పృథ్విపు ననియెన్.

తే॥గీ॥ "మనుజనాథుఁడవై నీవు మహిత ధర్మ
వేత్తవైతెట్లు సందియం బొత్తె మనము
సందియంబులఁ బొంది యిచ్చటికిరాక
సర్వసందేహములఁ బాపఁ జాలుదీవ".

క॥ అని శుకుఁడాడిన పలుకులు
విని జనకుఁడు మోదమంది విజ్ఞానులకున్
బొనుపడునే శంకలు? వినుఁ
దని యిట్లనె యెల్లసందియంబులు వాయన్.

చ॥ శిరమునఁ గుంభముంచుకొని చెక్కు చెదర్పక గానపక్కిఁ దా
శరహితాలంకఁగాఁ జలుపు లాసకునాట్యము నట్టు లాత్మపై
స్థిర మనమూని యాసలను జెందక తామరపాకుపై జలం
బు రహిని గర్మలందవులు పుణ్యుఁడె ధన్యుఁడు భూతలంబునన్.

'శుభం భూయాత్'

శ్రీరామార్పణమస్తు

గద్య రచనలు :

సుజ్ఞానబోధిని

సురాభాండేశ్వరము

విశ్వామిత్ర చరిత్రము

బాలవిబోధిని

కలిగిరి వేంకటేశ్వర

రామాయణము (3 భాగాలు)

భారతము (5 భాగాలు)

శీలావతి

లక్షణ గ్రంథములు :

ఆంధ్రభాషా లక్షణ - శిక్షణము

తెనుగు లక్షణము

విద్యార్థి కల్పకము (3 భాగాలు)

విద్యార్థి కౌముది

అముద్రితములు :

పెద్ద పురాణం

సుభాషిత రత్న భాండారము

# కవి ప్రశస్తి

శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు శ్రీరామనవమి నాడు 1892 న చిత్తూరు జిల్లా, పూతలపట్టు గ్రామములో జన్మించినారు. తల్లి లక్ష్మాంబ, తండ్రి పెద్దబుచ్చి రెడ్డిగారు. శ్రీ బుచ్చిరెడ్డి గారు హరికథలు చెప్పేవారు. ఆ పుణ్యదంపతులకు జ్యేష్ఠ పుత్రుడుగా కవిగారు జన్మించినారు.

వీరు ప్రాథమిక పాఠశాల వరకు చదివినను స్వయంకృషితో ఆంధ్ర, తమిళ సంస్కృత సాహిత్యములను ఒడిసి పట్టుకున్నారు. వీరు మద్రాసు విశ్వ విద్యాలయ విద్వత్ పరీక్షలో ఉత్తీర్ణులై ఆంధ్ర పండిత పదవిని పొంది బోధనలో ఉన్నత ప్రమాణాలు నెలకొల్పారు. తండ్రి హరికథలు చెప్పడం వల్ల వీరికి చిన్నప్పటి నుండి ప్రాచీన గ్రంథ పఠనంపై ఆసక్తి పెరిగింది. ఒకవైపు విద్యాబోధన మరోవైపు గ్రంథ రచనలను తపస్సుగా సాగించారు. విద్యార్థి వర్గములకు ఆంధ్ర భాషా సాహిత్యముల పట్ల అధికాసక్తి కల్గించుటయే కాక, అధ్యాపకుల యెడ గూడా అపార భక్తి తత్పరతలు కలిగించిన పండిత శేఖరులు వీరు. వారి సారస్వత వ్యవసాయం ఆత్మ సంతృప్తికోసమే. వారి రచనలలోని సద్విషయ ప్రస్తావన, ప్రవచనాల ప్రస్తారాలకు నిదర్శనంగా సౌశీల్యంలో రామ భక్తులైన పోతన్న, గోపన్నలను తలపించినారు. వీరు కొంతకాలం తాళ్ళూరి ఆర్ముగం పిళ్ళై గారితో కలసి తెలుగుతల్లి సాహిత్య మాస పత్రికకు సంపాదకత్వం వహించారు.

శ్రీరాములు రెడ్డిగారి విగ్రహము వలెనే వారి పాండిత్యము గంభీరమైనది. వారి హృదయము వలెనే కవిత్వము రసార్ద్రమైనది. వారి వర్తనము వలెనే రచనము సరళమైనది. తమిళ సారస్వత సాగరము నందలి రత్నములను సేకరించి సోదరాంధ్రులకు చవిచూపిన ఉభయ సంస్కృతుల వారధులు వారు. వారెంతకవులో అంత శిష్యవత్సలులు. ఎంతసహృదయులో అంత రసజ్ఞులు, భాషావేత్తలు, సంస్కార పరాయణులు, సర్వాంధ్ర కవి సరస్వతి పాత్రులు, వారిని శ్రీరామచంద్రుని ఆస్థానకవియని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

ఈ మహా కవి 08-11-1971 వ తేదిన పరమ పదించారు.

Students Offset, Tirupati.